పాంచాలి రచన...

# నందిని

[మహోజ్వల చారిత్రక నవల]

ఎం.వి.యస్. పబ్లికేషన్స్,
(ఎం.వి.యస్ ప్రెస్)
66. కోడంబాకం హైరోడ్.
మద్రాసు-24

అది క్రీస్తుశకం 505 - 510 ప్రాంతం. అప్పటికి గుప్తుల స్వర్ణయుగాన్ని కాలం తన గర్భంలో గుప్తపరచింది. పరాయి రాజులు పైశాచిక దృష్టితో చూచి వారి కబంధ హస్తాలు చాచి, భారతాన్ని బంధించారు. సరిగ్గా ఆనాడే భారతీయ సంస్కృతి, సభ్యత, సమిష్టి, సర్వ నాశనం కావడానికి పునాదులు వేయడం జరిగింది. ఈ రోజు విచారించి లాభం లేదు. ఏన్నో ఏళ్ళు గడిస్తేగాని, తిరిగి మనిషి మానవత్వాన్ని సమకూర్చుకొని తను నీతిగా నిల్వలేడు. పరితాపం - పరివర్తనా లేని ఈ జాతికి పరమార్థం ఏమర్థమౌతుంది? ఐతే ఆ నాటినుండి ఈ నాటి వరకు ఒకటి జరుగుతూంది. తాత్కాలికంగా, ఆవేశం కలిగి, ఆ ఆవేశంలో ఏదో కొంత చైతన్యం కలిగేది. అలా కలిగిన రాజులనేకులున్నారు. వారిలో అంతా బౌద్ధం స్వీకరించారు. బహుశా అది ఆనాటి వారందరినీ ఆకర్షించిందనాలి.

నర్మదా నదీ తీరం నిర్మలంగా ఉంది. సంజ కెంజాయ కాంతులకు ఇసుక తిన్నెలు పసిడి కాంతులాడుస్తున్నాయ్. దాపులో ఉన్న రాజ నగరు భవనాలు అపురూప శిల్ప సంపత్తితో కనులు మిరుమిట్లు గొలుపుతూ వాటి అందాన్ని నర్మదానదీ నీరంలో చూచుకొంటున్నాయి.

ఆదే తీరంలో ఊరుకు దూరంగా చిన్న తోట. ఆ తోట మధ్యలో ఒక చిన్న పర్ణశాల. ఆ పర్ణశాల చాలా పరిశుభ్రంగా, ఉన్నంతలో అందంగా చూపరుల దృష్టి నాకర్షిస్తుంది. దాని చుట్టూ అందంగా విరబూసిన రకరకాల పూల మొక్కలు. వాటి పరిమళం మంద మలయానిల సాయంతో నగరంలోని జనాళి నాశికల కందుతుంటుంది.

పర్ణశాల పంచలో పండి పోయిన కాయంతో నిండిన తృప్తితో, ఈ లోకం చూడని ఉన్నత పథాన్ని తిలకిస్తున్న అంధ భిక్షువు కూర్చుని ఆలోచిస్తుంటాడు ఆవేళప్పుడు. పూల మొక్కలకు పాదులు చేస్తూ, నీరు పోస్తూ, పూలు కోస్తూ ఆనందంగా చూపరులకు తృప్తినిస్తు గౌరవింప బడుతూ కైమార్గంగుకొంటూ ఉంటుందొక యౌవ్వని. ఆమె అందాన్ని చూచి అప్సరసలు దివినుండి దిగి రానున్నారు. ఆమె నడుం చూచి సిగ్గుపడి, సింహరాజు అడవుల్లో తల దాచుకున్నాడు.

ఆమె కన్నుగవకు బెదరి మీనాలు సముద్రంలో ఈదుతున్నాయి. ఆమె ముఖం చూడలేక చందమామ అమావాస్యనాడు మొహంపూర్తిగా తప్పిస్తున్నాడు. ఉన్నవాళ్ళు క్షీణిస్తూనో, అభివృద్ధి చెందుతూనో. ఆమె మేనికాంతికి బెదరి బంగారం నేలలో ఎక్కడో దాక్కుంది. అవయవాని కొకటి బెదరి దరికి రావడం మానుకున్నాయి. ఆమె హంసలకు, నెమళ్ళకు నడక నేర్పుతుందని అవి నేర్చుకుంటాయని ఆ వూరువారనుకుంటారు. ఆమె ఆ సంధ్యకు వన్నె దెస్తూ, మొక్కల పాదుల్లో నీరుపోస్తూ వుంది.

ఆ పంచలో కూర్చున్న అంధవృద్ధుడు కంటికి కనిపించక

పోయినా సవ్వడినిబట్టి 'అమ్మా రజనీ! ఇంకా నీళ్ళు పోయడం కాలేదా?' అన్నాడు.

'మరో నాలుగు పాదులున్నాయి తాతా! వస్తున్నా' అన్నదామె. ఖాళీచేసిన మట్టిబుంగను, ప్రక్కనున్న కొలనులో నీటిని ముంచుతూ:

'ప్రొద్దు వాలిపోయిందమ్మా!'

'లేదు తాతయ్యా! ఇంకా అరిజాముంది.' అన్నదామె.

'త్వరగా ముగించుకొని రామ్మా! భగవానుడి దగ్గరకు వెళ్ళి రావాలికదూ?'

'వస్తున్నా తాతయ్యా! అన్నిపనులు అయిపోయాయి. నేను కాళ్ళూ చేతులు కడుక్కొని రావడమే.' అంటూ ఆమె త్వరత్వరగా మిగిలిన పాదుల్లోకి నీరుపోసి కొలను లోనికి దిగి కాళ్ళూ ముఖం కడుక్కొని బయలుదేరింది. ఆమె కట్టిన నూలుపుట్టం ఆమె అందాన్ని దాచలేక పోయింది. ఆమె వృద్ధుని దాపుకువచ్చి, 'వెళదాము తాతయ్యా!' అంది. వృద్ధుడు మెల్లగా లేచాడు. ఆమె అతని చేతిని బుజంమీద వేసుకొంది. నడక సాగించారిద్దరూ. పర్ణశాల దాటి మెల్లగా ఆమె అడుగుల్లో అడుగులు వేసు కుంటూ వస్తున్న వృద్ధుడు తోటవాకిలిలో:

'ఏమో తల్లీ! నాకు ఏ ఆశా మమతా లేకుండా ఉందని అనుకుంటాను. అంతలో నీవు తలుపులో మెదులుతావు. నేనింకా బ్రతకాలని. నీ వేం సుఖపడుతుండగా చూడా లని అనిపిస్తూంది.' అన్నాడు.

'తాతయ్యా! కోరిక లుండరాదని నీవే కదా అన్నావు?' అనడిగింది ఆమె.

'ఆఁ! ఔనమ్మా! కాంక్షలు తెంచుకున్నానసే అను

కుంటున్నాను. కాని, నిజానికి నేను ఏ వాంఛనూ తెంచుకో లేదేమో అనిపిస్తుంది. అంతా 'కౌపీన సంరక్షణార్థ అయం పటాటోపః.' అంటారు చూడు అలాఉంది.' అని నసిగాడు ముసలాయన.

'ఇదంతా ఎందువల్లనంటావు తాతా!' అనడిగిందా అమ్మాయి.

'ఎందువల్ల నేమున్నదమ్మా! చాలా వరకు అన్నీ తెలిసే! నేనువ్వాననుకో! కళ్ళులేవా? జవసత్వాలు లేవా? సరిగా కళ్ళు పూతలేనిదే అడుగు వేయలేనా? మడులూ-మాన్యాలూ-నా సికదా? ఏలవలసిన రాజ్యాలేమున్నాయి? పైగా ఏ క్షణానికో ఇట్టే వెళ్ళిపోవాలి. ఐనా నా కేమిటో మమత. వాడినాకు నేనుండాలి. అన్నది గుండెల్లో ఎక్కడో ఉండి ఉరకలు వేస్తుంటుంది.'

'మృత్యువు దాపవుతున్నది. అని తెలిసిన కొద్ది ఏదో భయం, ఏదో తెలియని ఆవేదన - అధికమౌతుంది. ఇదెందుకో అర్థం కాదు. పూర్వం ఒకప్పుడు చావంటే నాకు జీవితానికి ఎంతో హాయని, విముక్తని అనిపించేది. ఈనాడు నాకలా లేదు.' అని ఇంకా ఏదో అనబోతుండగా మధ్యలో రజని—

'వచ్చేశాం తాతయ్యా! ప్రభుని సన్నిధికి.' అన్నది.

'వచ్చేశామా! ఏవీ! ప్రభుని పాదాలు. నా చేతులిలా పాదాలముందు ఉంచమ్మా!' అన్నాడు వృద్ధుడు. ఆమె అతని ఎముకల మీద చర్మం కప్పినట్టుగా ఉన్న ఆ కరద్వయాన్ని, ఆ తెల్లరాతి బుద్ధ భగవానుని పాదాలు తాకకి అందించింది. ఆ పాదాలందుకొని ఎలుగు రాసిన స్వరంతో ఆ ముదుసలి,

'ప్రభూ! ఏమిటీ నీ విలాసం. శాంతులను తెంచుకోమని ఎంతగానో ప్రబోధించావుకదా! నా కెందుకీ కోరికలు కలిగిస్తావు? ఈ రేకెత్తిన కోరికలు చిగురించరని, పుష్పించరని నీకు తెలియదా? నేను బిచ్చగాణ్ణికదా? నా వాంఛలు తీరవుకదా? నా కెందుకు కలిగిస్తావు? ఎవరో అనాథ, ఎరికి పుట్టిన బిడ్డనో నా పాల పారవేశావు. నిరంతరం ఆమెను గూర్చి ఆలోచింపుతూ, ఆమె మీద ఎందుకీ ఆశలు మోసులెత్తిస్తావు? తీరని తీరవని తెలియని కోరికలతో దూరమారాల కెందుకు ఆరాలోచన చేయిస్తావు? ఎంత కాలం ఈ అంతు తెలియని చింతన. ఈ చింతనయే చింతగా వంతగా ఆవంతైనా స్వాంతమంటూ లేని నన్ను గెంతిస్తావు? ఒద్దు. ఈ హద్దూ పద్దూ లేని సరిహద్దు తెలియని పద్ధతిలో నేను ప్రయాణించలేను. ఈ మచ్చికతో మచ్చలేని నీ సచ్చరతను నమ్మి ఈ ఐహికాలు తుచ్ఛంగా ఎంచి మచ్చరంలేని నాలో చిచ్చు రగిల్చావెందుకు? పచ్చగా ఏపుగా పెరిగి పది కాలాలు ఉండాలి. నా బిడ్డ ఏ అడ్డంకీ లేకుండా ఏపుగా ఎదగాలి, ఏమిటీ కోరిక? ఏమిటీ ఆలోచన? ఎందుకీ దిగులు? దానితో నే నెందుకు పొగిలి పోవాలి? ఎందుకిలా రగుల చేస్తావు? ని పవిత్ర పాదాల దాపున కొంచం చోటు నీ[illegible]రాదా? ఆ పాద ఘోటిక నేను తగనా? నేనంత పాపం ఏం చేశాను? చేసిన పాపానికి కనులు పరిహరించబడినాయి కదా. ప్రభూ! ఇంకా శిక్ష దేనికి నాకు? నిష్కృతిలేని పాపాలు చేశానా? దిన దినానికీ నిలువునా దహించి వేస్తావెందుకయ్యా!'

ఆ ముగుసలి గొంతులోనుండి మాట రావడంలేదు. కళ్ళె వెంట నీళ్ళు కారి జారుతున్నాయి. ఆ మాటలన్నీ వింటూ ఆమె ఏమీ అనలేదు. ఆమె కేమీ తోచలేదు. ఏకాగ్రతతో

అలాగే నిలచి ఉన్నదామె అతని వెనుకగా. ఎదురుగా ఆరు ధనువుల ఎత్తున ఉన్నతంగా తెల్లరాతి భోధసత్త్వుని శిల్పం చిరునవ్వు లొలకపోస్తుంది. చేతులెత్తినప్పుడు దాని పాదాలవరకూ వస్త్రాగంత దీర్ఘకాయుడైన మనుష్యుడైనా. అక్కడ నిలచి తలనెత్తి తిలకించిన వారికి భగవంతుని మోము కనిపించదు. పాదాలుమాత్రమే కనిపిస్తాయి.

ఆ శిల్పాన్ని గుప్తులకు ముందున్న చక్రవర్తులు నిర్మించడం జరిగింది. తర్వాత గుప్తులకాలంలో హైందవమతీయులు దానినేదో చేయాలని సంకల్పించి ఆ శిల్ప చాతుర్యం చూచి చూస్తూ చూస్తూ దానిని నాశనం చేయలేక వదలివేశారు. ఒకో రాజు పాలనకు వచ్చినప్పుడు ఒకో మతం విజృంభించి, పరమతాన్ని పాతాళానికి త్రొక్కాలని ఎంతగానో ప్రయత్నించి, అవకాశం చూచుకొని అనుకున్న కార్యాన్ని చక్కదిద్దుకుండేది. కానీ అందులో ఏ కొందరో కళాభిమానులుండి కొన్నింటిని కాపాడేవారు. కళకోసమే వారి అభిప్రాయం ఐనా ఏ చిన్న ఆధారంతోనే తిరిగి మరో మతం. ఇలాగే చరిత్రంతా పర్యాత పర్యాయం ఐపోయింది. మార్పులేదు. నూతనత్వంలేదు. అలాగే ఆనాటి లోకీడికి ఎదురు నిలచి మాళవంలో ఆ బోధసత్త్వుని పెద్ద రాతి విగ్రహం నిలువగలిగింది. నిలచి ఉంది ఒకనాటి బౌద్ధమత ఔన్నత్యాన్ని చూపడానికి.

ప్రతిరోజూ ఆ అంధవృద్ధుడు ఆమె వెంట వచ్చి భగవానుని పాదాలు తాకి, తన్ను కృతార్థుణ్ణి చేయమని వేడుకుంటాడు. అతనికి ఒకప్పుడు పూర్ణజిత్తు అనే బౌద్ధ భిక్షువు దీక్షనిచ్చి భిక్షు సంఘంలో చేర్చాడు. ఆనాటి నుండి యీనాటివరకు ఆ వృద్ధుడు భిక్షువుగానే బ్రతుకు

తున్నాడు. కానీ, ఆ మధ్య దాదాపు ఒక పది పన్నెండు వత్సరాలవాడు. మామూలుగా అతడు వీధులవెంట భిక్షుకు వెళ్ళాడు. నగరంలో నాలుగైదు కంఠాలు గంభీరంగా 'ఎవరు నువ్వు? ఏ వూరు నీది? ఎక్కడ పుట్టావు? నీ తల్లి పేరు? నీ తండ్రి పేరు?' అంటూ అడుగుతున్నారు. ఆ ప్రశ్నలకు వేటికీ సమాధానం వచ్చినట్లు, ఆ అంథభిక్షువు చెవుల పడలేదు. వారి దాపుకు చేరి—

'ఎవరినీ మీరా ప్రశ్నలడుగుతున్నది?' అని ప్రశ్నించాడు.

'ఎవరో! ఏడుస్తుంటేను!' అన్నారెవరో.

'ఎక్కడా' అంటూ తన చేయి చాపాడు. ఏడెనిమిదేళ్ళ ఈడు ఆడపిల్ల ఏడుస్తూ అతని చేతులు తాకింది. హృదయానికి హత్తుకున్నాడు. ఆప్యాయంగా 'రామ్మా! నాతో రా! నీవాళ్ళు వచ్చేంతవరకూ నాతో ఉండు!' అన్నాడు.

అంతే. ఆనాడే అతని చక్కని ప్రాలి ఏదో తెలియని ఆనందంలో ముంచి తేల్చింది ఆ పసికందు. ఆమెను వెంట పెట్టుకుని తన కుటీరం చేరాడు. వసంతాలు తిరిగిపోయాయి. అతని జవసత్వాలు ఉడిగిపోయాయి. కాలం తిరిగిపోతుంది. కాలంతోపాటు అంధభిక్షువు అంతఃకరణంలో తన పెంచిన మమకారం కాంక్షలు పెంచుకుంది. ఏనాడూ లేని భయం ఆవరించింది. తనకొరకు. తన తనువుకొరకు, తన స్వార్థం కొరకు కాదు - ఆమె కొరకు. ఆమెను బాగుచేయాలని, ఆమె ఉన్నత పథంలో ఉండాలని ఆమె అందరికన్నా మిన్నగా ఆనందంగా ఆడుకోవాలని, వీనులలో విన్న రాగాలన్నీ కన్నులకు కనిపించడంకన్నా మిన్నగా ఊహించుకొని ఏవేవో మనోఫలకంలో అంకితమైన గత జన్మ భోగాలు విలాసాలు ఆమె కందించాలని ఆశ. అది పేరాశ కాదా? అవి తీరవని అతనికి తెలుసు. తీర్చుకోలేనన్న నిరాశ అతనిని

క్షణం క్షణం క్రుంగదీసింది. అతని యెదదను నమిలింది. మనస్సు మెలికలు తిరిగిపోయింది. వాటినామెకు చెప్పలేదు. వివరించలేదు. ఏర్పరచలేదు. ఆ బాధతోనే సగమైపోయాడు. అతనికి తెలుసు. అన్నీ అశాశ్వతాలని విన్నాడు. తన గురువు బోధించాడు. అప్పటికి అది నిజం అనుకున్నాడు. కానీ, ఈనాడు వాటిని మరచి ఆమెకేదో చేయాలనుకుంటాడు. ఆ తీరని కాంక్ష కలిగించిన భగవానునిముందు చెప్పుకున్నాడు. రోజూ చెప్పుకుంటాడు.

'తాతయ్యా! వెళ్దామా?' అంది ఆమె.

'వెళ్దాం పదమ్మా!' అని బయలుదేరాడు. ఆమె భుజమ్మీద చేయి వేశాడు. ఆమె ముందూ అతడు వెనుకా ఆమె అడుగుల్లో అడుగులు వేసుకుంటూ బయలుదేరారు. కొంతదూరం నడిచాక ఆమె 'తాతయ్యా!' అంది ఏదో చెప్పాలని ఉన్నా చెప్పలేకపోయింది. ఆమె మోము కొంచం దిగులుగా ఉంది. ఆ అంధ భిక్షువు చూడలేదు కాబట్టి సరిపోయింది. అతను చూడగలిగితే అతనిగుండె చెరువవుతుంది.

'ఏమిటమ్మా?' అన్నాడు.

'ఏం లేదు తాతయ్యా.'

'చెప్పమ్మా! ఆగుతావెందుకు?' అన్నాడు.

'ఏం లేదు. నా వలన నీకు అసంతృప్తి కలుగుతుందా? నేను నిన్ను తృప్తికరంగా చూస్తున్నానా తాతయ్యా!' ఆఖరి మాట అంటుండగా ఆమె గొంతులోని మాట వెలికి స్పష్టంగా రాలేదు.

'అమ్మా! రజనీ! ఏమన్నావు?' అని ఆగిపోయాడు. ముందుకు వేసే అడుగు పడలేదు.

'అదే తాతయ్యా నా వలన కోరికలను లోనయ్యావా?... అనడిగింది రజని.

ముసలి నిట్టూర్చాడు. 'నీకా విషయాన్ని తర్వాత చెపుతాను.' అన్నాడు కొంచంబాధగా!

'నన్నుగూర్చి నీవు బాధపడకు తాతయ్యా! నీ బాధను నేను చూడలేను. నీవు సంతృప్తిగా ఉంటే నాకదిచాలు. అందుకు నన్నేంచేయమన్నా చేస్తాను.' అన్నదామె.

'నాకు ఏనాడూ ఏ బాధా లేదమ్మా. ఇంక నిన్ను గూర్చి అంటావా. నిజంగానే నీ గూర్చి నాకు చాలా బాధగా ఉంది. ఒకనాడు నీవు లేకుంటే నాకు బాధ ఉండేదికాదు అని. ఈ నాడు నీవు లేకున్నా, నీవేమైనా నేను భరించలేను. నీ గొంతు వినిపించని క్షణం నాకు భయం. నీ అడుగుల సవ్వడి వినని క్షణం నేను నరకంలో ఉన్నట్టుగా భావిస్తాను. నీవు ఎలా ఉంటావో ఎలా ఉన్నావో నాకు తెలియదు. నీ రంగుతో నాకు పనిలేదు. నాకు ఏంకావాలో నాకు తెలియదు. కానీ నీ గొంతు నీ అడుగుల సవ్వడి. నీ ఉచ్ఛ్వాస నిశ్వాసలు నాకు వినిపించని మరుక్షణం నా ప్రాణాలీ [illegible]లోనుండి విడిపోతాయమ్మా!' అన్నాడు ముసలి భిక్షువు ఆగి ఆమె చేతులమీదుగా అతని చేతులు ఆమె తలమీదికి తడుముకుంటూ వెళ్ళి గోముగా నిమిరాయి. ఆ ముసలి చేతులను మోమునకద్దుకొని 'తాతయ్యా!' అని వెక్కి వెక్కి ఏడ్చింది రజని. ముసలాయన, 'అమ్మా రజనీ! ఎందుకమ్మా! ఏడుస్తావు? ఊరుకో! ఊరుకో తల్లి! ఇంత అమాయికురాలివి! ఈ లోకంలో ఎలా బ్రతుకుతావో! నా తర్వాత' అన్నాడు.

'అది కాదు తాతయ్యా!...'అని ఏదో అనబోతుంది రజని. మధ్యలోనే ముసలాయన 'ఏది ఐనా కాక పోయినా, ఈ

ముసలికి తల్లివి, తండ్రివి, బిడ్డవు, దేవతవు సర్వస్వం నీవే నమ్మా! నీవు లేక నేను లేను. నా కళ్ళు నా మనస్సు అంతా నీ వేతల్లీ! నిజంగా నాకు కళ్ళుంటేనా! ఈ లోకాన్ని నీ చుట్టూ తిప్పేస్తాను. నీకు లేనిది ఏమీ లేదని, లోకంలో నీ వేనని అనిపించేవాణ్ణి! కానీ! కానీ! ఏం చేసేది నేను గుడ్డ వాణ్ణి. చేతగాని వాణ్ణి. పైగా ముసలివాణ్ణి! ఏం చేసేది?' అని విచారించాడు.

వారిద్దరూ అలాగే మాటాడుకుంటూ విచారపడుతూ వారుంటున్న తోటలో పర్ణశాలకు చేరారు. పశ్చిమాన నెలవంక ఆకసంలో ముచ్చట్లాడుకొంటూంది. ఆ ముచ్చట్లు కీచురాళ్ళు చెమ్మట్లు ప్రతిధ్వనించాయి. ఆ ధ్వనితో నర్మదా నదీ జలం లయ కలిపింది.

* * *

అంధభిక్షువు రజనీ తావరం చేరేప్పటికి నందిని పర్ణశాల పంచలో పచారు చేస్తూ ఉంది. ఆమెను చూడగానే, రజని 'అక్కా! ఎంతసేపయింది వచ్చి?' అనడిదింది.

'ఇప్పుడేనమ్మా, వచ్చి, అటూ యిటూ మాస్తున్నాను. అంతలో మీరు వచ్చారు,' అంది నందిని.

'ఎవరూ? నందినీ!' అన్నాడు అంధ భిక్షువు.

'ఆఁ, అవును తాతయ్యా! ఆరోగ్యం బావుందా?'

'ఏదో యిలా ఉన్నాను. రామ్మా! ఎక్కడా?' అంటూ చేతులు చాపాడు. నందిని దగ్గరకు జరిగింది. చేతులతో తలను, ఒడలిని తడుముతూ, 'నందా! చిక్కినట్టున్నావు. ఆరోగ్యం బాగులేదామ్మా?' అన్నాడు చెక్కిళ్ళ మీద మృదువుగా రాస్తూ.

భిక్షువు చేతు లలాగే రాస్తూ, ఆ రెండు చేతులు తన చేతుల్లోకి తీసుకుంటూ 'తాతయ్యా! ఈ శరీరం ఏమైతే యేం? మనస్సును కోరికలకు చిక్కకుండా జాగ్రత్త పడుతున్నాను,' అంది. అంతలో రజని లోనికి వెళ్ళి ప్రమిద వెలిగించి ద్వారానికి ప్రక్కగా గాలి తగులని ప్రదేశంలో ఉంచింది. ద్వారం అంటే దానికి కమ్ములు గాని, వాసం గాని లేవు. వెదురు తడికలతో అల్లిన కవాట బంధన. బంక మన్ను మండల కలికినదే గోడ. గోడ అడ్డుగా ఉన్నంత మేరా బతి గీసినట్టు నిడువుగా చీకటి పడుతూనే ఉంది. మిగిలిన భాగం కొంచెం మసక మసగ్గా వెలుగు. ఆ దివ్వె చేగు వాసన ఒడుస్తూంది. ఉన్న వాళ్ళు చమురు, గంధం తైలం దివ్వెలకూ, కాగడాలకూ వాడతారు. లేనివాళ్ళు వేప చమురు, గానుగ నూనె వాడుకుంటారు. గానుగ నూనె ఏదు వాసన కొడుతుంది. పీల్చడానికి అలివాటు పడితే తర్వాత హాయిగానే ఉంటుంది. వేప చమురు చేదూ, ఏదూ కలసినట్టుగా ఊంటుంది. అందువల్ల ఎక్కువగా వేపచమురు వాడతారు ఎక్కువమంది. ప్రమిద నక్కడ ఉంచి 'అక్కా! ఎక్కడనుండి వస్తున్నావు? అసలు మాళవంలో ఉంటున్నావా? ఎన్నాళ్ళయింది?' అనడిగింది రజని.

'లేదు, రజా! నిన్నే వచ్చాను మాళవం. మాళవం వదలి చాలాకాలమైంది. గత గ్రీష్మానికి ముందు. గ్రీష్మంలో ఆంధ్ర వాటికి వెళ్ళాను. తర్వాత సార్థవాహులతో కలసి వసంతానికి మగధ మీదుగా పాంచాల, కాంభోజ, గాంధారాలు చూచుకున్నాను. తర్వాత సరాసరి వర్షఋతువుకంతా ఉజ్జయని చేరి, ఒక మండలం అక్కడే గడిపి, బయలుదేరి వచ్చాను. వారం క్రితం వత్సలో బయలుదేరి నిన్నటికి చేరుకున్నాను. సార్థవాహులు వైశాలీ వెళ్ళారు. నేను నిల్వబడిపోయాను,' అని తన కార్యక్రమమంతా చెప్పింది,

'అబ్బా, చాలా దూరం తిరగావక్కా!' అంది రజని.

'ఏం దూరం రజా! ఇంకా చాలా పుణ్యక్షేత్రాలు విహారాలు చూడనే లేదు. ఏమో? ప్రభుని అనుగ్రహం ఎలా ఉందో! ఓపిక ఉండగానే వెళ్ళాలని ఉంది.'

'నందా! గాంధారం వెళ్ళావు కదా-తక్షశిలకు వెళ్ళావా?' అని అడిగాడు అంధభిక్షువు.

'లేదు తాతా! తక్షశిల వేద మతానికి ప్రాముఖ్యమైంది. బౌద్ధులకు సుఖశాంతులు తక్కువ. భిక్షు కూడా ఈయరని సార్థవాహనులన్నారు. అందుకని వెళ్ళలేదు.'

'బౌద్ధులెవరూ తక్షశిలలో లేరా?' అనడిగాడు.

'దాదాపుగా లేనట్లే తాతా! ఐనా నేను వెళ్ళలేదుగా, ఎలా చెప్పేది? జనవాక్కు అలానే ఉంది. అదేకాక, తక్ష శిల ఏక సత్తాక పాలనలో ఉంది. ఆ రాజు ఏ మతాభిమానో తెలియదు. అందువల్ల భయం వేసి సగం పోలేకపోయాను,' అన్నది నందిని.

'మొన్న మొన్నటి వరకూ మగధ కూడా ఏక సత్తాకమే కదా? ఆ తర్వాత మహాసత్తాకమైంది. తిరిగి గణ సత్తాకమై పోయింది కదమ్మా!'

'ఏమైనా ఏక సత్తాకంలో నాకంత నమ్మకం లేదు. రాజే నియంతగా సంచరిస్తే తనకు తోచింది చేసేస్తాడు. ఏమీ తెలియానిదాన్ని నన్ననుమానించి కొరత వేసినా, మనకు దిక్కు దివాణం లేదు. అందుకనే ఆంధ్రలో కూడా నిల్వ కుండా వచ్చేశాను...' మాట మధ్యలోనే అంధ భిక్షువు—

'అదేమిటమ్మా! అక్కడ ఆర్య నాగార్జునుడు మహా యాన పంథాను బాగా వ్యాపింపచేశాడుకదా? ఆయన కాలంలో మన మగధ సింహాసనం కూడా దాదాపు

ఆనాటి శాతవాహనుల క్రిందికి మళ్ళిందికదా? అప్పుడే తెలుగులు భగవానుని నిరశించగలిగారా?' అనడిగాడు.

'అదెప్పుడో ఐపోయింది తాతా! గాంగులు వచ్చాక అంతా మారిపోయింది. ఈనాడాంధ్రంలో చాలావరకు శైవం ప్రబలింది. దాని ధాటికి ఈనాడెవరూ నిల్వలేరు. నాగార్జునుని పునాదులింకా పెకలించలేదు. అంతే!' అన్నది నందిని విచారంగా మోము పెట్టి.

'ఏది ఏమైనా తెలుగునాట బౌద్ధం నశించదు!'

'ఏమో ఎవరు చూచారు. ఎవరో ఒకరు పుట్టి నాశనం చేయవచ్చు. లేదా ఎవరో తిరిగి నాగార్జునునిలాగా ఉద్ధరించి అమరపురిని, శ్రీపర్వతాన్ని హిమాలయోత్తుంగ శృంగంలా ఉన్నతికి తీసుకొని రావచ్చు. కాలం తాతయ్యా! దానికి తగిన చక్రవర్తులు. వారిమీద ఆధారపడి ఉంది. వారేది తలిస్తే అది చేయగలరు. పరమత సహనం భారతంలో నీ లేదు!' అన్నది నందిని.

'కానీ! ఆర్య నాగార్జునుడు మధ్యమవాదం ప్రవేశపరచాడు కదా?'

'ఐతే, అది బౌద్ధం కాదా? వేదమతీయులు కొందరు దాదాపు బుద్ధభగవానుని కూడా వారి అవతార పంక్తిలో చేర్చారు. మరికొందరు కాదని వాదాడుతున్నారు.'

'అక్కా! నీవు ఏం తీసుకుంటావిప్పుడు?'

'రజా! ఏమిటీ ప్రశ్న? దేనినిగూర్చి?' అనడిగింది హాటాత్తుగా రజని అడిగేటప్పటికి నందిని—

'ఆహారం నందా?' అన్నాడు అంధభిక్షువు.

'ఆహారమా! నేను నగరులోనికి వెళ్ళాను!' అంది నందిని.

'నీవు శ్రమణివా? భిక్షుణివా?'

'ఇంకా భిక్షుణిని కాలేదు తాతా! శ్రమణంలోనే ఉన్నాను. ఔనౌను త్వరలోనే. పూర్తిగా భిక్షుణి నయ్యానంటే బంధనలో ఇరుక్కుంటాను. నాకు నా స్వాతంత్ర్యం పోతుందన్న భయం ఇంకా పోలేదు తాతయ్యా!' అంది నందిని నవ్వుతూ.

'ఆఁ. ఏమోలే...' అని నసిగాడు వృద్ధుడు.

'అదేమిటి తాతా! చెప్పబోయి ఆపావు?' అనడిగింది నందిని తెల్లబోయి.

'ఏంలేదు నందా! నేను భిక్షువునయ్యానా? ఏం లాభం? తృష్ణ తృష్ణగానే మిగిలి ఉంది.'

'ఉండని తాతయ్యా! ఉంటేనేం. ఈనాటికి కాకుంటే మరో నాటికి నీవు దానిని జయించి తీర్తావు. ఐనా ప్రభువు తృష్ణను తప్పనలేదు. దానికి దూరంగా ఉండమన్నారు. అది కలగడం కూడా ఒక విధంగా మంచిదేలే!' అంది నందిని.

'ఏఁమంచిదో! ఊఁ!' అని మూలిగాడు నిరాశగా ముసలి.

'నిరాశపడకు తాతయ్యా! మొదలు ఉంటేనే తుది ఉంటుంది. తృష్ణ కలిగితేకదా దానిని జయించిన ఫలం అందుకోగలుగుతాం! కనీసం అందుకైనా తృష్ణ కలగాలి!' అంది నందిని.

'అక్కా! ఈ రాత్రికింక ఊళ్ళోకేం వెళతావుగాని, ఇక్కడే ఏం తింటావో చెప్పు?' అనడగింది రజని. మరి బొద్దాం లోపలికెళ్ళి ఏక [illegible] రొట్టె [illegible]చుకువస్తూ [illegible]ని.

'ఆఁ ఎందుకు రజనీ! ఇంతసేపు వెళ్ళాలిక! [illegible] తాలే!'

'ఒద్దులెద్దూ ఇక్కడే ఉండు రాత్రికి. ఉదయం వెళుదువు గాని!' అని బామాలింది రజని.

ముసలాయన కూడా 'ఉండు, నందా!' అన్నాడు.

'సరే, ఉంటాను,' అంది నందిని.

'ఏం తీసుకుంటావు?' అనడిగింది రజని.

'బావుంది ఏం తీసుకుంటా? నేను తీసుకున్నన్ని నాళ్ళా రారాజులు అందించలేకపోయారు. నీవేం అందించగలవు రజా!' అంది నందిని నవ్వుతూ.

'ఏదో ఉన్నంతలోనే సౌకర్యం కలిగిస్తానక్కా!' అంది రజని.

'పిచ్చి తల్లీ!' అంటూ తలలోనికి చేయి పోనిచ్చి దాపుకు తీసుకొని గోముగా రజని తల నిమిరింది నందిని. రజనికన్న నందిని చాలా పెద్దది, అయినా ఆమె పెద్దదిగా ఉన్నట్లని పించదు. అంత లావూ, అంత పొడుగూ ఉండకుండా, పొడగరి కాకపోవడం వలన ఎంతకాలం చూచినా అలాగే ఉన్నట్టనిపిస్తుందామె. ఆమె శూరసేనలో పుట్టింది. అవంతిలో పెరిగింది. దాదాపు ఆనాటి పంచాయితీ రాజ్యాలన్నింటినీ తన అదుపు ఆజ్ఞలలో నిలిపింది. సేనాను లందరూ ఆమె అడుగులకు మడుగులొత్తారు. ఆమె మాటలకు తిరుగు లేదు. ఆమె చూపులో దాదాపూ ఏకసత్తాక పాలనలో ఉన్న రాజులందరిని యుద్ధంమాన్పి అవంతిలోని ప్రజాపాలన్ను నిలిపింది. ఈ నాడు నందినిని చూస్తూ ఆ నాటి నందాదేవి ఈమెయేనా?! అని ఆశ్చర్య పోతారు. ఆమె ఈ నాడు సంచారం చేస్తున్న కొన్ని కొన్ని ఊళ్ళల్లో ఆమే నందాదేవని తెలియక, అక్కడి రాజులూ, సేనాపతులూ 'మీ అవంతిలో నందాదేవని ఒకామె ఉండాలి. ఈ మధ్య ఆమె పేరు వినిపించడం

లేదు. ఏమైంది? లేదా? ఎక్కడుంటుంది?' అని అడుగుతారు. నందిని చిరునవ్వు నవ్వి ఊరుకుంటుంది. దానికి వారు ఒక వేశ్యను గూర్చి బౌద్ధసన్యాసినిని అడిగామే అని అడిగాక చింతిస్తారు. లేదా, అంత చిన్న విషయాన్ని ఆమె నడిగామని, ఆమె చిరునవ్వు నవ్వుతుందని భావించి తిరిగి ఆ ప్రశ్న అడగడం మానేసే వాళ్ళు.

అసలు నందిని జీవితం ఒక చిత్రమైంది.

* * *

సూరసేనంలో ఒక వేశ్య ఉండేది. ఆ నాడు అది కొందరి వృత్తి. ఆ వృత్తికి మూలం ఎటునుండి ఎలావచ్చి, వెఱ్ఱితలలు వేసి, తిరిగి ఆ వృత్తిలో ఉన్నవాళ్ళకు గౌరవం పోయిందో అందరు. వారిని హీనంగాచూచే వాళ్ళు. అదైనా పగలు. గౌరవనీయులంతా ప్రొద్దువాటూరాక వారి అధ్యంతర మందిరాల్లో అగరుధూపాలుపీలుస్తూ ఉక్కిరిబిక్కిరాతో, వాకిలి వెలుపలఉన్న పంకా లాగేవారిని 'ఒడుపుగా లాగ వేం?' అని గదమాయించేవాళ్ళు. కులమూ, మతమూ, మర్యాదా, గొప్పా,బీదా రాజూ,సేవకుడూ అనే తారతమ్యం ఆ యిళ్ళల్లో ఉండేదికాదు. నిజానికి వారు దేవుని పాదాలు తాకి సేవచేసే కులం వాళ్ళు కాబట్టి, దేవునికి కులమతాలమీద లేనట్టు వీరుకూడా వాటి ప్రసక్తి తెచ్చేవాళ్ళుకాదు. అలాటి పవిత్రురాలింట్లో పుట్టింది నందిని.

ఆమెకు యౌవ్వనం అంకురించిన రోజుల్లో సూరసేనం పంచాయితీకి కట్టుబడి ప్రజాపాలనలో ఉంది. అందువల్ల, ఆ దేశవాసులంతా ఒడలు వంచి కష్టించాలసిందే. ఎంత ధనవంతులైనా గోధుమ పొలాల్లో పని చేయాలి. పాటు పడాలి. గింజలూ, గడ్డీ ఇంటికి తెచ్చుకోవాలసిందే. ద్రాక్ష

తోటల్లో రేయింబవళ్ళూ కాపలా పండుకోవలసిందే. ద్రాక్ష గుత్తులు కోసుకొచ్చి పనలు పనలుగా తాళ్ళకల్లి ఎండకట్టి ఆ ఎండలో వాళ్ళూ ఎండి చాకిరి చేస్తేగాని, పంట మీదా గింజ మీదా వీరికి స్వతంత్రం ఉండేది కాదు. అలా చేసుకొని తినకపోతే వారికి తిన్నట్టుండేది కాదు. ఆడవారు కూడా పొలాల్లో పని చేయాలిసిందే: తప్పదు. సూరసేనంలోని ఆడవాళ్ళ చేతులు కాయలు కాసి కండెలు కట్టి ఉంటాయి. వాళ్ళల్లో చాలా మందికి అస్త్ర విద్య కూడా తెలిసి ఉండేది. నందినిలాంటి వారు అదనంగా నాట్యం, సంగీతం జంత్ర వాద్యాలు కూడా నేర్చుకొనుంటారు. అక్కడ పుట్టి పెరిగిన కాంతలను, అబలలని అనడం ఆ దేశ వాసులేనాడో మరచి పోయారు. ప్రజా తంత్ర పాలన కావడంవల్ల అందరికీ సమాన హక్కులుండేవి. ఆడా మగా అనే తేడా ఉండేది కాదు.

నందిని తనువు వికసించి నట్టుగా సూరసేన, అవంతి కలసి పోయాయి కొన్నాళ్ళకు. దానికి తగినట్టుగా ఈ రాజ్యాలు గణతంత్రం కావడంలో మరీ లాభ సాటిగా తోచి ఏక పతాక రాజులు పోరాడి, పోరాడి ఎలాగైతే ఏం, సూరసేనాన్ని, అవంతిని, కౌశాంబిని, వత్సని, ఉజ్జయినిని ఐదూ విడి విడిగా ఉన్న వాటిని ఏకం చేశారు. ఏక ఛత్రం క్రిందికి లాగేశారు. ఎన్ని చేసినా ఎంత జరిగినా మహా పతాక క్రిందనే పాలనలన్నీ జరిగాయి. పంచాయితీ పాలనే ప్రబలింది కాని ఎకమైనా ఏక ఛత్రాధి పతికి అధికారాలున్నా స్వేచ్ఛానియంతృత్వం ప్రబలింది గాదు. ఆ ప్రజానీకం అంతా రాజ్యం తమదిగా భావించి, తమ తమ కర్తవ్యాన్ని గుర్తెరిగి బాధ్యతగా ప్రవర్తించారు. ప్రతి వారికి తమ పంచాయితీ మీద నమ్మకం ఉండేది. భయం

లేదు. భక్తి ఉండేది. అందువల్ల పై తరగతుల్లో ఎంత మార్పు వచ్చినా మామూలు వారికి తెలిసిందిగాదు. తెలిసినా వారి స్వేచ్ఛ కంతరాయం కలిగించే చట్టాలు, సూత్రాలు అప్పటికి అమలులోకి రాలేదు. రానంత కాలం గుర్తించడం జరగలేదు. అదంతా నందినికి యౌవ్వనం రాక పూర్వం. బాల్యంలో జరిగిన మార్పులు. ఆ జరిగిన మార్పుల ఛాయలన్నీ నందిని జీవిత ధృవంలోపడి మెరిశాయిగాని, తల్లిచాటు పిల్ల కావడంతో ఆ నీడలన్నీ నీడలుగానే ఉండిపోయాయి. ఆమెకు యౌవ్వనం వచ్చాక రోజుల్లోని సంఘటనలనేకం ఉన్నాయి. ఆమె అందానికి సూరసేన అవంతుల యౌవ్వనులంతా మురిసిపోయి, ఆమె తల్లిని తలచి 'అంతా అందుబాటులోనే ఉంటుందిలే' అని ధైర్యం వహించి మనసులు విప్పకొని, ఆశలు పెంచుకొని సంచరించారు-ఎంతగానో ఆమె చేత ఆకర్షింపబడాలని. ఆమె మాత్రం తల ఒగ్గింది కాదు. చూపు కదప లేదు. పెదవి మెదపలేదు. నిరాశతో నిల్వలేక ఆమె తల్లికి సొమ్ము ఎఱ చూపారు. ఆమె సొమ్ముకు లొంగింది. చాలా మంది వేశ్యమాతల్లానే ఆమె కూడా ఆమె పాత్ర నిర్వహించింది. మామూలు నాయకిగానే నందిని ఎదురు తిరిగింది. అంతా సహజంగా నేజరిగింది. కానీ మరొకటి అతీతంగా జరిగింది వారి విషయంలో. ఈ విటుల ఒత్తిడిని భరించలేక పోయింది వేశ్యమాత. వేశ్యమాత ఆశయాన్ని మన్నించలేక పోయింది నందిని. వీరిద్దరి మధ్య ఒక ఒప్పందం కుదిరింది. అందరి దగ్గరా అందుకున్న రత్నాల కానుకలు చూస్తూ చూస్తూ తిరిగి యీయలేకపోయింది మాత. ఆ మాట కూతురుతో అన్నది కూడాను. ఏ కొందరో 'తిరిగి మీ కానుకలను పుచ్చుకొని మీ కాంక్షలను తెంచుకొండని' అన్నప్పుడు

వేశ్య మాతను మన్నించలేక పోయారు. ఆగ్రహానికిగురై అనరాని మాటలని, గడువు విధించారు. ఇదంతా విన్న నందిని తల్లిని ఏమీ అనలేక జరిగిన దానికి విచారించి, మంచి రోజు చూచుకొని, శూరసేనం వదలి అవంతికి పారిపోయి వచ్చేసారు. వారి ప్రయాణం చాలా కష్టాలతో కూడి పోయింది. ఏది ఏమైనా అవంతి పంచాయితీలో పలుకుబడి గలిగిన ఒక వ్యక్తి దారిలో కలసి, తన పంచ తల దాచుకో నిచ్చాడు. అవంతిలో వారికన్నీ సక్రమంగా అమరడానికి దాదాపు ఆరు మాసాల కాలం పట్టింది. అవంతిలో వారు పాతుకు పోయాక శూరసేనం వారికి వీరవంతికి చేరి తల దాచుకున్నట్టు తెలసి, అక్కడివారు గొడవ చేశారు. అవంతికి, శూరసేనకు అధ్యక్షుడొకడే అవడంవలన తెచ్చిన వాదంబల పడక పోవడం, నందిని అందం అధ్యక్షుని మనస్సును నందిని ప్రక్కకే న్యాయం చేకూర్చింది. తిరిగి నందిని కొత్త జీవితం ఆరంభించింది అవంతిలో.

గోధుమా ద్రాక్షా పంటలు పండించుకోడం, తినడం, అవంతి విద్యా వేత్తల గోష్టులు వినడం, నాట్యాచార్యుల వద్ద నాట్య విద్య నేర్వడం, తీరికలేని వ్యాయామంతో ఆమె అందం ఇనుమడించి అవయవాలు పొందిక సమకూరి చూపరుల ఆకర్షణకు లోనయ్యింది.

ఇలా వత్సరం తిరిగేటప్పటికి, వేశ్యమాత నందినిని ఒంటరిచేసి వెళ్ళిపోయింది. దిక్కులేని నందినిని పంచాయితీ ఓదార్చింది. అధ్యక్షుడు అండ నిలిచాడు చాలావరకు. ఆమె తల్లి జాగ్రత్తపరచిన ధనం, ఆమె గౌరవాన్ని కాపాడింది. ధనం ఎంతపని చేయగలుగుతుందో అంతపనీ ఆమెకు జరుగుతుంది. చేసింది. ఆ ధనం లేకుంటే ఆమె ఏమయ్యిందేదో! అందుకే ఎలా సంపాదించినా ధనం ఉన్నవారికి ఉన్న

గౌరవం లోకంలో లేనివారికి ఉండదు. కొన్నాళ్ళు గడచి పోయాయి. నందిని ద్రాక్షతోటను, గోధుమ చేలను సాగుచేస్తూ తనదగ్గరున్న ధనాన్ని కొంత వడ్డీలకిస్తూ కాలక్షేపం చేస్తూంది. ఇది జీవనమార్గంలోనిది. ఇంక ఆమె మనస్సు కోరికలలో జరిగిన విపరీతాలు - ఒకనాడు, ఆమె తోటలో ఉండగా, అవంతి సేనాపతి జయదేవుడు అటుగా వచ్చి ఆమెను చూచాడు. జయదేవునికి పాతికేళ్ళుంటాయి. మంచి బలశాలి. రూపసి కూడాను. అతన్ని నందిని బాగా ఆకర్షించింది. నందిని కొన్న తోటకూడా సేనాపతి వారి తోట ప్రక్కదే. అందువల్ల నందినిని జయదేవుడు. జయదేవునిని నందిని చూచుకోక తప్పదు. ఇద్దరికీ ఏదో ఆలోచన లోలోన కలిగింది. కాని దానిని అణచుకొని సంచరించటం మొదలెట్టారు. ఎవరూ బైటపడలేదు. ఈ బయటపడి వెర్రివేషాలు వేయకపోవడంతో నందిని హృదయంలో కోరిక పెరిగింది. చాలామంది మొగజీవాలు చేయలేని పనే అది. లోపలున్న ఉద్దేశాలు ఎదటివారి దగ్గర దాచుకోలేరు. ఆ దాచుకోలేకపోవడంతో చేతికందే వాటిమీద మోజాత్రగుణం మనుష్యులందరికీ ఉంటుంది కాబట్టి లెక్కచేయరు. జయదేవుడు బెట్టుగా ఉండడంవల్ల, నందిని డెందం లొంగిపోయింది. ఒకనాటిమధ్యాహ్నం ఇద్దరికీ బాగా కలసివచ్చింది. చుట్టుపట్ల ఉన్నవారంతా ఇళ్ళకు వెళ్ళారు. ఆ విషయం నందినికీ తెలుసు - జయదేవునికీ తెలుసు. కానీ, ఒకరికి తెలిసింది ఒకరికి తెలియనీయకుండా, ఇద్దరూ ఏదో కారణంతో తోటల్లో ఉండిపోయినట్లు అభినయించారు. ఈ అభినయం ఒకరికిమించి ఒకరు చేయుడం జరిగింది. కాలువలో స్నానం చేసి గట్టుకెక్కుతున్న జయదేవుడు హఠాత్తుగా నందినిని చూచినట్లు—

'మీరు కూడా చాలా సేపున్నారులా ఉందే!' అన్నాడు నందినికి కావలసిందే అది.

'ఆఁ ఆలస్యమైంది. అంతా వెళ్ళేవరకూ మీరు.
అని ఆగిపోయింది. ప్రక్క నడవలో కాళ్ళూ చేతులూ కడుక్కోవచ్చు కానీ, చాలా రోజులనుండి ఇవతల రేవు లోనే ఆమె కాళ్ళూ ముఖం కడుక్కుందేది. కారణం ఆ మార్గంగా వస్తూ జయదేవుని తోటలో ఎవరున్నదీ, ఏం చేస్తున్నదీ చూడవచ్చు ఆమె. చూస్తూనే ఉందేది! వాండ డానికీ ఈ ఏర్పాటు ముందు రోజుల్లో చేసుకుంది. అది క్రమేపీ అలవాటైపోయింది. ఈనాడు ప్రక్క రేవులో కాళ్ళు కడగాలని పొరపాటున వెళ్ళడం జరిగితే, ఏదో క్రొత్తగా ఉంటుందామె మనసుకే!

'కొంచం పనుండి ఉన్నాను!' అంటూ ముందుకు సాగి పోయాడు.

ఆదేవిఁటీ వెళ్ళిపోతాడనుకుంది. జయదేవునికి వెళ్ళాలని లేదు. కానీ, కావాలనే ముందుకు సాగిపోయాడు. ఆమె కోసం ఆగినట్టుగా ఉంటే లోకువైపోతాననుకున్నాడు. లోపల ఎంత పీకుతున్నా, ఆ మమతను కాదని సాగి పోయాడు. వెళ్ళే జయదేవుని అలాగే చూస్తూ నిలబడింది నందిని. కను చూపువరకూ చూచి తను రేవులో దిగి కాళ్ళూ చేతులూ కడుక్కుంటూ జయదేవుని గూర్చే ఆలోచించింది.

గట్టుకు వచ్చి పై చెరగుతో ముఖం తుడుచుకుంటూ నడక సాగించింది. జయదేవుని తోట కావలివద్దకు వచ్చి అనుకోకుండా అడ్డుగా ఉన్న వెదురు కఱ్ఱల మధ్యనుండి లోనికి చూచింది. నడవ వంకకే చూస్తున్న జయదేవుని చూపులు ఆమె చూపులూ కలిశాయి. నందిని గుండె ఝులు

మంది. బెదిరింది. ఆ బెరుకును కప్పిపుచ్చుకోడానికి చాలా ప్రయత్నించింది. ఆ ప్రయత్నంగా 'నేను... నేను.' అంది.

జయదేవుడు 'ఏమిటి?' అన్నట్టు చూచాడు.

'లోనికివచ్చి మీ తోట చూడవచ్చా!' అంది తల వంచుకొని.

'రండి. అంతకన్నా నా!' అన్నాడు జయదేవుడు.

ఆనాటికి ముందే గోధుమపంట తా యింటికి చేరింది. ద్రాక్షగుత్తులు ఎండగట్టారు. ఆ యెండగట్టిన వాటిని నందిని చూస్తూ, 'మీరు బాగా శ్రమిస్తారనుకుంటాను.' అంది.

'ఎవరు మాత్రం శ్రమించరు? ఐనా మీరెందు కడుగుతున్నారిలా?' అన్నాడు జయదేవుడు.

'మీ శ్రమ మీ పంట చెపుతూంది. మేమీ ఊరు వచ్చిన వత్సరం ఇలా పండింది...' అని సనిగింది.

'అదేమిటి లెండి. ఒకోసారి మనం ఎంత కష్టపడ్డా సరిగా పండదు. దానికేంగాని అలా నిలబడి పోయారేం ఒక్క చోటనే! రండి, మామిడితోటకూడా చూద్దురుగాని. మా తాతగారెప్పుడో ఎక్కడనుండో తెచ్చి నాటారుట. చాలా మేలుజాతి రకం. ఈసారి పంటలో మీకు వాటినందిస్తాను,' అన్నాడు జయదేవుడు ముందుకడుగు వేస్తూ. నందిని లోపలను కుంది-'ఇతడింత మంచిగా మాట్లాడతాడా?' అని అతన్ను పరిస్తూ!

'నేనుకూడా విన్నాను. రసాలానికి, నిమ్మకూ - మీ తోటను మించేది ఈ అవంతిలోనే లేదని విన్నాను. అవంతిలో లేదంటే పంచాయితీలో ఉన్న పంచ రాజ్యాలలో లేదన్నమాటేగదా?' అంది నందిని.

'ఏదో మా మీద గౌరవం కొద్ది అంటారు గాని, మాదే ముంది?' అన్నాడు.

'మా అమ్మతో ఒకసారి సంతకు వెళ్ళాను. సంతలో వారుకూడా అవంతి మామిడి అని రాసిపోశారు. అక్కడ వాళ్ళనడిగాం. అవంతిలో మీ నాన్నగారి తోట కాయలని వాటినిగురించి చాలా మిన్నగా చెప్పారు.'

'ఆఁ అవన్నీ సంతమాటలులెండి. ఇదిగో ఈ చెట్టే మా తాతగారు తెచ్చి, నాటింది. తర్వాత అంట్లతో మా నాన్న గారు చాలా శ్రమించారు, తర్వాత ఈ మధ్య నేనూ కొంత కొంత కష్టించాను. మొత్తానికి తోటను పోకుండా పట్టుకు రాగలుగుతున్నాను. అంతే! అంతా తాతల నేతుల రకంగా, ఇంగువకట్టిన గుడ్డలెండి. అంతకన్నా ఏంలేదదనంగా!' అంటూ మామిడితోటనంతా త్రిప్పి చూపించాడామెకు. తర్వాత —

'మీరు వెంటనే వెళ్ళాలా?' అనడిగాడు.

'ఏం అలా అడిగారు!' అంది. ఎంతసేపైనా ఆమె ఆ తోటలో అతని వెంట తిరగడానికి కుతూహలపడుతూంది.

'మరేంలేదు. మీరు ఒక క్షణం ఆ పొగడచెట్టుక్రింద కూచుంటే.........'

'మీకేమేనా పనుందా?' అంది అతడనీ అనకముందే.

'అబ్బే, అదేంకాదు. మా పాకలోనికి వెళ్ళివస్తాను.' అన్నాడు.

'దానికేముంది వెళ్ళిరండి!' అందామె. అతను పొగడ చెట్టు కావలనున్న పాకలోనికివెళ్ళి రెండు క్షణాలవరకూ రాలేదు, అంతలో నందిని తోటనంతా కలయచూచింది.

ఎంతో జాగ్రత్తగా ఎంతో ఆక్కరగా చూడకుంటే ఈ తోట ఇంత బాగా ఏపుగా వుండదని ఆమె తెలుసుకుంది. అన్ని చెట్లకూ చక్కగా పాదులు, పాదుల్లో తడారకుండా నీరు. చెట్లక్రింది ఆకులన్నీ పాదుల్లో ఎండి నిండి ఉన్నాయి మరో ఎరువు అవసరం లేకుండా. చెట్లమీద ఏవో పిట్టలు ఆడుకుంటున్నాయి. చల్లని గాలికి లేత మొక్కలు తలలూపుతున్నాయి. దూరాన ఎవరో ఎవర్నో పిలుస్తున్న 'ఓ' అన్న కూత. అది విని తోటలోని కోయిల జవాబు చెప్పింది 'కో' అంటూ. తోటంతా తీయని వాసన. మత్తు గలిగిస్తూంది. ఆ ప్రకృతి ఆమెలో ఏదో తెలియని శక్తిని కలిగించిందో లేక లోపలున్న బలాన్ని కదిలించిందో - ఏదో తీయని కోరిక కదిలి, జయదేవుని గుండెల్లోనుండి వెలికివచ్చి ఎదురుగా నిలబడి ఏదో అంటునట్టుగా అనిపించి సిగ్గుపడింది. ఆ సిగ్గులో ఆమెకేదో భయంకలిగింది. ఆ భీతితో అటూయిటూ బిత్తరగా చూచింది. సరిగ్గా ఆ చూస్తున్నప్పుడు రెండు చేతులతో రెండు పాత్రలు పట్టుకొని వచ్చాడు జయదేవుడు. వచ్చినవాడు ఆమె చూపులు చూచి,' ఏం? అలా ఉన్నారు. ఏదేనా పురుగు కనిపించిందా?' అన్నాడు ఆదుర్దాగా.

'మీ తోటలో పురుగులు కూడా ఉన్నాయా?' అంది నందిని.

'తోట ఏపుగా ఉంటే ఎందుకు చేరవు? చేరినా అవి పగలు బైటికి రావే! మీకేమీ కనుపించలేదుగదా?' అన్నాడు.

'లేదు లేదు!' అంది నందిని. చేతిలో పాత్రలు చూస్తూ, 'ఆతిథ్యమా ఏమిటి?' అంది నవ్వుతూ.

'ఆతిథ్యమేముందిందులో? ఏదో కాస్త ద్రాక్ష రసం!' అన్నాడు.

'ఇప్పుడు వాకోసం పిండి తీసుకొస్తున్నారా? బలే వారే! మీకు శ్రమిచ్చానన్నమాట!'

'శ్రమేముందిలెండిందులో? ఇంతలో కందలేం కరిగి పోవు!' అన్నాడు ఆమె ముందుకు ఒక పాత్ర చాచుతూ. ఆమె దాన్నందుకొని 'ఇన్ని నేను త్రాగలేను!' అంది.

'బావుంటాయి తీసుకోండి!' అన్నాడు అతని పాత్ర నోట పెట్టుకుంటూ.

'ఇన్ని త్రాగలేను. కొంచం మీ పాత్రలో...' అని నవ్వుతూ చూచింది. జయదేవుడు తనకు తెలియకుండానే తన చేతిలోని పాత్రను ఆమె ముందుకు చాచాడు. ఆమె సగం ద్రాక్ష రసాన్ని అతని పాత్రలోనికి వంచింది. అత నామెనే చూడ్డంలో ఎంత పోసూందీ గమనించ లేదు. లేకుంటే వారించేవాడే! తర్వాత 'అదేమిటి అంతా......' అన్నాడు.

ఆమె చిరునవ్వు నవ్వింది కళ్ళల్లోకి చూస్తూ. ఆ చూపు లోని భావాలు అయోమయంగా ఉన్నా వయసులో ఉన్న ఆమె కాబట్టి ఆశయం అతనికర్థమైంది. తర్వాత యిద్దరూ తోటంతా తిరిగి ఇళ్ళకు చేరారు.

ఆ తర్వాత యిద్దరి నేస్తం ఎక్కువయింది. ఆమెకు మగ సాయం కావాలన్నప్పుడు జయదేవుని అడిగేది. జయదేవుడు కాదనేవాడుకాదు. ఒక్క జయదేవుడుమాత్రం కాదు. ఆ వయసులో అంత అందంగా అలా నవ్వుతూ ఏ ఆడదడిగినా కాదనేపాటి మగరాయుళ్లు లోకంలో ఏవాడూ ఉండరు. చరిత్ర మడతల్లో అందుకనే అందమైన ఆడాళ్ళు అంతలేసి

ఘనకార్యాలు సాధించగలిగారు. పైగా అడక్కుండానే రాజ్యాలు రాజ్యాలు దోచి యిచ్చారు. కనుచూపుకు కాంచనమణిమయ వేదికలు సృష్టించారు. నవ్వుతూ ప్రాణాలిచ్చిన సంఘటనలెన్ని లేవు? ఎంత ఘటనా ఘటన సమర్థులైనా ఆ చూపు, ఆ నవ్వూ ఒలికించినప్పుడో, జాలిగా చూచినప్పుడో నీరై పోయేవాళ్లు. బుద్ధభగవానుడైనా యశోధర నిద్రలో ఉంది కాబట్టి, అర్ధరాత్రి సర్దయగా అర్థంగాని పదార్థాన్ని ఆశించి వెళ్ళగలిగాడు. ఆమె కన్ను విచ్చి నవ్వుతోనో లేక జాలిగానో చూస్తూ ఎదటనిలచి నట్లైతే అడుగు ముందుకు పడేదికాదేమో! ఏది ఏమైనా అలా జరిగిపోయింది. జయదేవుడు నందినికి కావలసిన సహాయాలు కూరుస్తున్నాడు. జయదేవునిలాగా ఆ వయసు వారంతా ఆమె కనుచూపుకు కార్య నిర్వహణకోసం తహతహలాడిపోతూనే ఉన్నారు. కానీ, ఆమె వారికా అవకాశం ఈయలేదు. వారికా ఆశయం నెరవేరలేదు. ఆమెకా కోరిక కలగలేదు. వారి కోరికలు తీరలేదు. ఆమెకవసరం రాలేదు. వారికానందం లేదు. నందిని అందించి ఉంటే సద్వినియోగం చేసుకునే ఉండేవారు.

తనమీద ఆమెకు మోజున్నట్లుగా జయదేవుడు గ్రహించాడు. గ్రహించడం కాకపోయినా ఈర్ష్యతో కళ్ళు కాళ్ళు కాయలు కాచిన వాళ్ళనే మాటలు పూల బాణాల్లా జయదేవుని గుండెల్లో గ్రుచ్చుకున్నాయి. స్నేహితంగా, సన్నిహితత్వాన్నందించిన నందినిని ఆ విషయం ధైర్యంచేసి అడుగలేకపోతున్నాడు. హితునిలా దాపుకు చేరిన వానితో వలపు మనసు ఎలా బయటపెట్టాలో తెలియక నందిని అవస్థపడుతూంది. ఇంతకూ అసలైన వేళ వారి జీవితాల్లో ఆసన్నం కాలేదంతకుముందు.

ఉన్నట్టుండి ఒకరోజున సాయంత్రం నందిని తన దాసీ మనిషితో జయదేవుని ఆ సాయంత్రం అతని తోటలో ఉండ మని కబురు పెట్టింది.

అది విన్న జయదేవుడు తన చెవులను నమ్మలేక పోయాడు. ఇలా చాలాసార్లు దాసీది రావడం ఏదో చెప్పడం వెళ్ళడం ఉందిగాని అసలు 'సంధ్యలో తోటలో ఉండమని - నేను కలుసుకుంటానని' ఆ విధంగా ఏనాడూ ఆమె వార్త పంపేదికాదు. అది కొత్తగాతోచి మధ్యాహ్నం ప్రొద్దునాలిన దగ్గరనుండే తోటలో పొగడచెట్టుక్రింద తపసు మొదలెట్టాడు. ఆ రోజెందుకనో ప్రొద్దు ఎంతసేపటికీ పోదు. ఎంతసేపు చూచినా సూర్యుడు అలాగే ఉన్నచోట ఆగిపోయినట్లనిపించింది జయదేవునికి. విసుగు పుట్టలేదతనికి- ఆ నిరీక్షణలో ఏదో తెలియని ఆనందం, ఉత్సాహం ఉంది. ఎంతకాలమైనా అలాగే నిరీక్షిస్తూ ఆమెను గూర్చి ఆలో చిస్తూ కాలాన్ని వెచ్చపెట్టగలడు. కానీ కాలం దొర్లిపోదేమా అవేదే అతని చింత. అతని మనస్సు వెళ్ళే వేగంలో సూర్యుడు వెళ్ళగలిగితే దాదాపూ చాలా సంధ్యలు దొర్లి పోవాలిసిందే. అది మాత్రం అతని ఊహకూ ఆలోచనకూ రాలేదు. ఎంతసేపూ ప్రొద్దుపోదేమా? అని మాత్రమే అతని ఆరాటం.

అప్పటికి నాలుగుసార్లు తోటంతా పచారు చేసివచ్చాడు. వీలుపడలేదు గాని లేకుంటే ఆ చుట్టుపట్ల ఉన్న చెట్లన్నిటికీ పూలుపూయించేవాడే! తీయని వాసనతో మంచిగాలితో తోటంతా అందంగా - ఏంచిటో? ఏదో అనుకుంటాడు, ఆమెకోసం చెట్లకు రత్నాలు పుట్టించి ప్రకాశింప చేసే వీలేదనా ఉందేమోనని. వీలుకాదని ఊరుకున్నాడు. తనే తన స్వహస్తాలతో చెత్తచెత్తగా రాలి వున్న ఆకులన్నింటినీ

మండతో ఊడ్చి పొదుల్లోనికి త్రోశాడు. తోట శుభ్రంగా ఉండేట్లు చూచాడు. ఆమె వస్తే కూర్చోడాని కనువుగా ఉండేందుకు పొగడచెట్టు అరుగును బాగుచేశాడు. అరుగు బాగుచేస్తూ, ఇక్కడ కూర్చుంటే బాటనే వెళ్ళేవాళ్ళకు కనిపిస్తాంకదా? అనుకున్నాడు. పోనీ ఆ మామిడి చెట్టుక్రింద కూర్చుంటే ఆ డొంకనవెళ్ళే వాళ్ళందరికీ కనిపిస్తాం. పైపెచ్చు సంధ్యలో అటు వెళ్ళేజనం ఎక్కువ. పల్లెలకు వెళ్ళే జనమంతా అటే వెళతారు కాబట్టి మామిడిచెట్టుక్రింద బావుండదు! మరో చోటు ఎక్కడుందబ్బా! అలా వెళ్ళి ఆ కంచెప్రక్కన గచ్చపొదల చాటుగా కూర్చోవచ్చు! ప్రొద్దుపోతే పురుగు పుట్రా తారటలాడతాయి. అక్కడ బావుండదు. అసలామె వచ్చాక జాగా చూడడం మంచిది-ఆమెకు వచ్చాలికదా?

'అసలు నందిని రాగానే ఏమని మాటాడాలి? ఆమె కేరకంగా మాటాడితే బావుంటుందో! ఏమని పిలవాలి? నందా! అంటే బావుంది. కానీ, ఆమె తన పేరును మధ్యకు ముక్కచేసి త్రుంచి పిలుస్తున్నాననుకోదు కదా? పోనీ, నందినీ! అంటేనే బావుంటుంది. నందిని. నందా! నందా! నందిని. పిల్వడానికేది బావుందో! నందా అంటేనే బావుంటుంది. నందా అనే పిలుస్తాను. ఏమనుకుంటుంది? ఏమీ అనుకోదు. ఐనా ముందు పిలిచిచూస్తాను! పేరు నెలాపిలిచినా ప్రసంగించడం ఎలా ఉండాలి? అసలామాటలు ఎలా మాటాడాలో, ఏ మాటలు ఎలా మాటాడతానో! ఎలా లాలించాలి? మాట్లాడ్డం చేతకాకుండా మాటాడితే నందిని నవ్వుతుందేమో!' ఎందుకో అతని గుండెలు కొట్టుకుంటున్నాయి. మొట్టమొదటసారి ఇదివరకు తనుయుద్ధానికి సన్నద్ధమైనప్పుడు ఇలాగే గుండెలు వేగంగా కొట్టుకున్నాయి.

రంగభూమిలో శత్రుసేనావాహినిని చూచినప్పుడు ఎడద ఇలాగే తల్లడిల్లింది. తర్వాత ఒక చేతిని నిలువునా నరికినప్పుడు ఆ మొండి చేతినుండి కారుతున్నరక్తం ఇలా కల వరపాటు కలిగించింది. కలవరంలోనుండి తెప్పరిల్లక ముందే మరో సైనికుడు ఎదురయ్యాడు. తనకు తెలియ కుండానే ఏదో ఆవేశం కలిగి, అతని తలను శరీరాన్నుండి వేరు చేశాడు. ఆ తర్వాత మరొకడు, ఆ తర్వాత మరొకడు ఇలానే ఎన్ని తలలో, ఎన్ని శరీ రాలో తనకు తెలియదు. అలా నాలుగు రోజులు యుద్ధం జరిగింది. ఆ నాలుగు రోజుల్లోనూ మొదటినాటి భయం, భీతీ తర్వాత లేవు. ఆ తర్వాత ఎన్నో యుద్ధాలు చేశాడు. ఎప్పుడూ ఇలా గుండెలు కొట్టుకోలేదు. తిరిగి ఈ నాడు ఆ తొలినాడులా ఆందోళనగా ఉంది. ఏమిటో ఏదో పిచ్చి ఆలోచన. నందిని యుద్ధంలో సేనాధిపతా? విరోధా? ఐనా ఎప్పుడూ లేనిది ఇవాళెందుకిలా ఉంది? నందినితో చాలా సార్లు మాటాడానుకదా ఇంతకు ముందు!

జయదేవుడలా ఆలోచించుకుంటూ అటూ ఇటూ ఆందో ళన పడుతూ తిరిగి ద్వారం వంక చూచాడు. ద్వారం ఎదురుగా సూర్యుడు ఎఱ్ఱగా అందంగా కనిపిస్తున్నాడు. చెట్లచాటునుండి ఆ వస్తున్న కాంతి పుంజాలు చూస్తూ విస్తుపోయాడు. ప్రకృతి ఎంత బావుంది. నందిని వచ్చి వాటిని చూస్తే ఎలా ఉంటుందో అనుకున్నాడు!

మనసిచ్చిన మనుష్యులంతా అంతేనేమో. తనకు నచ్చిన వన్నీ తమకు కావలసిన వారికి నచ్చుతాయని, తీయని తాయాన్ని పిల్లలుదాచి ఊరించాలన్న ఊహాలతో ఉండేట్లు వాళ్ళు కూడా ప్రతిదీ వారి కోసం వారి వారి కోసం సృష్టింప బడినట్లు భావిస్తారు. కష్టం కలిగినా అంతే. మన

కులో మచ్చిక ఉన్నప్పుడు తన కష్టం తనవారి కుండ కూడ దని, తన ఆనందం తనవారికి పంచాలని కోరిక కలుగు తుంది. అదే స్పర్థలు వచ్చినప్పుడు తన కష్టం వారికి, తన సంతసం తనకే మిగిలి పోవాలి. ఏఁవిఁటీ మనుష్యులు? ఏమిటీ కోరికలు? ఈ మనిషి ఎంత కఠినుడు - ఎంత దయార్ద్ర హృదయుడు. ఎంత స్వార్థపరుడో అంత త్యాగి. ఎంత మంచివాడో అంత చెడ్డవాడు. ఎంత మేధావో అంత అవి వేకి. సందర్భాలు అతన్ని మార్చివేస్తాయి. దానికి కట్టుబడ కుండా అతీతంగా ఉండాలనే గొప్పవారి కోరిక. ఆ కోరి కలనే అనంత వ్యాప్తం చేయాలని అనాదినుండీ పోరాడు తున్నారు. ఆ మంచితనం నిలవడం కోసం వారు చెడ్డవారి చేతుల్లో చిక్కి నలిగి, వారి కోసమే నాశనమై, వారి కన్ను తెరవాలని ప్రయత్నించి దాదాపూ విఫలు లయ్యారు. లేకుంటే అంత మంది గొప్పవారి అవసరం ఈ లోకాని కుండేది కాదు. ఏ ఒక్కరితోనో లోకం బాగుపడి అగడ రహితమై, మంచి-నిర్మలత, నీతి-ధర్మం నిల్వక పోయాయా!

జయదేవుడు కూడా అతీతంగా బ్రతుకలేక పోయాడు. ఊహలు మాత్రం ఎలా వస్తాయి? నలుగురులానే ఆమె కోసం ఊహించి, ఆమె జపంలో చాలా సేపు గడిపాడు. ప్రొద్దు వాలిపోయింది. చీకటి ఆవరించింది. సంధ్యకాంత పశ్చిమాన అరకట్టిన కాషాయాంబరాలు విప్పుకొని వెళ్ళి పోయింది. నీలాకాశం కారు నలుపుతో నిండి పోయింది.

జయదేవుడు నిరాశగా నిస్పృహగా 'ఎందుకు రాలేదు నందిని? అంత అనివార్య కారణం ఏఁ ఉంటుందబ్బా! వస్తా నని మాటిచ్చి తప్పవలసినంత అవసర కార్యం ఏముంటుంది? ఎందుకు రాలేదు? రాకపోతే ఏమైనట్టు? ఎక్కడికి వెళ్ళి

నట్టు? మరచి పోయిందా? ఎలా మరచి పోతుంది? తనే కదా నన్ను రమ్మంది. నన్ను రమ్మని తనెందుకు రాలేదు? ఇంక వస్తుందా! చీకట్లో ఎలా వస్తుంది? ఈ రోజు వెన్నెల కూడా లేదు. ఇంక రాదు. తర్వాత కబురు పెట్టి కనుక్కో-వాలి' అనుకుంటూ జయదేవుడు ఇంటి దారి పట్టాడు. ఆలో చనల్లో అతని ఇల్లు చాలా దాపైంది. దూరం తెలియలేదు. ఇల్లు చేరీ చేరక ముందే జయదేవుని తల్లి ఎదురు వచ్చి

'నాయనా! రాత్రికి సభకు రమ్మని అధ్యక్షుడు వార్త పంపాడు. త్వరగా భోజనం చేసి వెళ్ళు. రెండు మూడు సార్లు వాళ్ళు వచ్చి వెళ్ళారు' అన్నది. దాదాపు జయదేవుడు లేనిదే సభ జరగదు. తనకు స్వతహాగా కొంత గౌరవం, తన తాతల నాటినుండి తర తరాలుగా తరలి వచ్చిన గౌరవం వల్ల. అవంతి అధ్యక్షుడు పేరుకు మాత్రమే. అన్ని ఏర్పాట్లు జయదేవుని కుటుంబం వారే చూచేవారు. రాచకార్యా లన్నింటిలోనూ జయదేవునికి వంశ పారం పర్యంగా వస్తున్న ఆధిక్యత ఉండనే ఉంది. అంతేకాక అవంతి సైన్యమంతా జయదేవుని చేతి క్రింద ఉంది. అతని మాటకు తిరుగు లేదు. అతని క్రింది సేనా నాయకులందరికీ అతనంటే గౌరవం కూడా మిక్కుటం. ఒక్క ముక్కలో చెప్పా లన్నప్పుడు జయదేవుడు కిరీటం లేని రాజు. ఆ పంచాయితీ అతనిది. అవంతి అతని ఆజ్ఞను మీరి ఏమీ చేయదు. ఇంత వరకూ చేయలేదు. ఏ చిన్న కార్యానికైనా జయదేవుని అవసరం ఉంది. అందువల్ల జయదేవుడు అంతగా ఆశ్చర్య పడలేదు. కొత్తగా అనుకోలేదు. నిదానంగానే భోజనం ముగించుకొని సమావేశానికి బయలుదేరాడు. సభా భవ

నానికి వెళ్ళే జయదేవునికి నందిని ఎందుకు రాలేదన్న ఆలో చనేగాని, సభ్యు లెందుకు సమావేశ మాతున్నారు? దేనిని గూర్చి ఆలోచిస్తారన్న ఆలోచనే రాలేదతనికి.

* * *

సభనుండి తిరిగి వస్తున్న జయదేవునిలో ఉత్సాహం లేదు. చిరాకుగా ఉన్నాడు. ఏదోదో తెలియని చీకాకు. ఒక వంక బాధ కూడా ఉంది. అతను ఏనాడూ యుద్ధానికి వెరచేవాడు కాదు. యుద్ధం అంటే తనకో ఆటలాడుకుంటే దే రచ్చగా భావించాడు. ఒక్క అతనే కాదు. ఆ నాటి ప్రజ లంతా అంతే. అనవసరంగా పోరుకు పోరు. పోరు తట స్థిస్తే వెనుకడుగు వేయరు. తమ రాజ్యం కొరకు, తమ స్వేచ్ఛకొరకు, తమ స్వాతంత్ర్య సంరక్షణ కొరకూ నవ్వుతూ ప్రాణాల నిస్తారు. పరాయి స్వార్థపరులు ఎన్నడూ తమ అవంతి మీద కాలు మోపకూడదు. మోపిన అడుగు అలానే వరికి పారవేయడమే అవంతి వాసులు నేర్చుకున్నది. ఈ నాటికీ సభలోని వారి మాటలలాగే ఉన్నాయి. అందరి కన్న మిన్నగా ముందుకు దూకే జయదేవుడు ఈసారి సభలో ఎందుకనో యుద్ధం అంటే నిరసన చూపాడు. అయినా తప్పలేదు. అసలు సభలో జరిగిందిది.

హస్తినాపురం చాలా కాలం క్రితం నుండి నియంతల చేతుల్లోనే ఉండేది. వారి క్రింద ఆ చుట్టు పట్ల ఉన్న రాజ్యాలన్నీ వారిలానే, ఒకో దండనాథుని చేతిలోనో లేక వారి క్రిందివారి చేతుల్లోనో ఉంటూ ఉండేవి. ఆ ఇరుగు పొరుగు రాజ్యాలెప్పుడూ ఈ పంచాయతీ రాజ్యాలను కబ ళించాలని ప్రయత్నం చేస్తూనే ఉండేవి. కానీ ఈ పంచా యతీలన్నీ బాగా బలపడి పోవడం వల్ల, ఈ జన సత్తాక

లోని ప్రతి పౌరుడూ స్వేచ్ఛా జీవితాని కలవాటు పడడం
వలన తన స్వంత ఆస్తిని కాపాడుకొంటున్న తీరుగానే పాటు
పడి, పోరాడి హస్తినాపుర సామంతులకు బుద్ధి చెప్పేవి.
వచ్చినవి వచ్చినట్టు శత్రుసేనలు కాలికి బుద్ధి చెప్పేవి.
పంచాయితీ రాజ్యాలంటేనే వాటికి భయంగా ఉండేది.
కానీ, ఆ ఏక సత్తాక రాజ్యాలు పంచాయితీ రాజ్యాలకు
ప్రక్కలో బల్లాలే. వాటి జోలికి పోతే హస్తినాపురం
సాయం వస్తుంది. వారు రాజ్య దాహదంతో జనసత్తా
కాలను నాశనం చేస్తుంటే హస్తిన చూచీ చూడనట్టూర
కుంటుంది. ఇలా ఎన్నాళ్ళనుండో జరుగుతుంది. ఇందులో
ఏ మార్పూ లేదు. ఆ నాడు కూడా మధుర రాజు అవంతి
మీదకు కాలు దువ్వాడు. ఆ సంగతినే ఆ నాటి సభ
చర్చించి, సరిహద్దుల్లో ఉన్న శత్రుసేనలను తరిమి రావల
సిందిగా తీర్మానించింది. దానికి నాయకునిగా జయదేవునే
ఎన్నుకోడం జరిగింది. వెళ్ళడానికి చాలా విచారించాడు
జయదేవుడు. కానీ తప్పనిసరి కావడంతో రెండవనాడు
సకల సపరివారంగా అవంతీ హద్దులకు బయలుదేరాడు.
వెళ్ళిపోయాక నందినికి తెలిసింది జయదేవుడు యుద్ధానికి
వెళ్ళాడని. చాలా విచారించింది. ముందుగా తెలిసి ఉంటే
వెళ్ళి ఒకసారి మాటాడి వచ్చినట్లయితే అంత బాధగా
ఉండేది కాదు. ఆమెకు తెలియలేదు. అంతా అయ్యాక
తెలిసింది.

## 2

జయదేవుడు ఊరు విడచి మూడు పక్షాలు దాటింది. రెండు
పౌర్ణమి వెన్నెలలు ఆమెను ఎంతో తపింప చేశాయి.
అతనికోసం ఆమె తనువు ఎగురు చూచింది. ఎడద తల్ల

డిల్లింది. నీరు బాసిన మీనంలా, కొలనులో తామరాకుమీది మంచు బిందువులా తనువు వాడి మనసు నిల్కడ తప్పింది.

ఆ రోజు అతన్ని రమ్మని, తను వెళ్ళకపోయినందుకు గాను ఎంతగానో తన్ను తాను తిట్టుకొంది. ఏం తిట్టుకొన్నా, మనస్సు ఏం కొట్టుకొన్నా, జయదేవుడు సంగరంలో ఉన్నాడు. ఈమె మారుని సంగ్రామాని కాహుతవుతున్నట్లు బాధ పడింది. నందిని జయదేవునిగూర్చి కలలు గన్నది. అందులో ఎన్నో పీడ కలలు కూడా వచ్చాయి. పీడకలలో కలవరించి లేచి మగత వదలి పరుగున కాళ్లూ ముఖం కడుక్కొని వచ్చి ప్రక్కమీద కూర్చుని 'ఓ భగవంతుడా! ఈ కలను మాత్రం ఎప్పటికీ నిజం చేయకు. నీవు నాకింత కన్నా ఏమీ చేయనక్కరలేదు తండ్రీ! నిన్ను ఏ కోరికా కోరను. అసలీ కలలు రాకుండా చూడు!' అని ఎంతగానో వేడుకొని ప్రక్కమీద దొర్లి దొర్లి ఏడ్చింది. మరువాడు దాసీదానిని అధ్యక్షునింటికి పంపి, వెళ్ళిన సేననుగూర్చి, సేనానినిగూర్చి, యుద్ధం ఎక్కడ జరుగుతుంది - జయాప జయాలెలా ఉన్నాయని అడిగి రమ్మని, విషయం తెలిశాక సంతృప్తిపడేది. ఇంకా వార్త రాలేదు అన్నప్పుడు ఆమె ఆనాడు భోజనం చేసేదికాదు. తనే అధ్యక్షునింటికి వెళ్ళి వచ్చేది. ఆమె ఆత్రుతను చూచి అధ్యక్షుడు ఆమె దేశ భక్తిని, స్వాతంత్ర్యమ్మీద ఉన్న మమకారం, తనవారి యోగ క్షేమాలుకనుక్కొందే దృక్పథం ఎంతగానో సంతసించేవాడు. ఆమెతో అతడు 'మన సైన్యాని కెన్నడూ తిరుగులేదు. మన వారు యోధులు. అందులోనూ యిది నియంతలకూ స్వాతంత్ర్య ప్రియులకూ మధ్య జరిగే పోరాటం. ఇందులో స్వచ్ఛంద సాహసం స్వాతంత్రులకుంటుంది. కాబట్టి స్వాతంత్ర్య ప్రియులు గెలుస్తారు. అసలు మనం పేరాశతో

వారి దేశమ్మీదకు పోలేరు. మన పరిపాలకులకు వారు వచ్చారు. కాబట్టి జయం మనది. వారిది ఆశ. మనది ఆశయం. ఆశ కన్నా ఆశయం మంచిది. మంచికి జయం తప్పదు.' అనే వాడు అభ్యర్థుడు. ఆ మాటలు విని ఆమె సంతృప్తిగా ఉండేది. కాని ఏదో కల, ఏదో ఆరాటం.

ఆ రోజు పున్నమి. నిండు చంద్రుడు చందనం బిళ్ళలా తూరుపు దిశను పైకి వస్తున్నాడు. నగరు సందడి తగ్గలేదు. ఆమె మనసు జయదేవుని కొరకు ఆరాటపడింది. కోరికలు పోరాడాయి. ఆమె నిల్వలేకపోయింది. ఆమెకేమీ తోచ లేదు. ఇంట్లో నిల్వలేకపోయింది. ఉన్నపాటున ఇల్లు విడచి వాడల మేడలన్నింటినీ దాటి ప్రక్క వీధులు దాటి ఉన్మత్తలా అలా అలా నడక సాగించింది. ఊరు దూర మైంది. నర్మదపాయ: దాన్ని సిప్రా అంటారు. సిప్రా ప్రక్కగా నడుస్తూంది. సిప్రాలోని నీళ్లు వెన్నెలకు మెరుస్తు న్నాయి. నీళ్ళల్లో చందమామ ఆడుకుంటున్నాడు. అలాగే చాలా దూరం నడచింది. నడవ వచ్చింది. నడవలో కాళ్ళు తడుపుకొని మెల్లగా తిరిగి ఒడ్డుకెక్కింది. ఎక్కి జయదేవుని తోటవంకకు చూచింది. తోటలో ఎవరో ఉన్నట్లు పొడ కట్టింది. ఎవరా అని ఆలోచించింది. అంతా కంచవేసి ఉంది. కంచలోనుండి మసక మసకగా కనుపిస్తూంది తోట. చెట్లనీడల్లోనుండి వెన్నెల జల్లులా పడుతుంది. ఆ వెలుగుకు లోనివారు కనుపించడంలేదు. నందిని గుండెలు వేగంగా కొట్టుకొన్నాయి. ఆమెకు భయం కలిగింది. ఆ భయం జయ దేవుడు తోటలో ఉన్నాడని. అందులోనే ఆమెకు ఆశ కూడా కలిగింది. ఒక్కసారి తోటలోనికి వెళ్ళి చూచి రావాలనుకుంది. పరుల తోటలోనికి వారు లేకుండా వెళ్ళడం భావ్యంకాదని తోచినా, దానినంతగా పట్టించుకో

కుండా దారితీసింది. కాలిబాటగా తోట ప్రక్కనుండి వెళ్ళింది. ముందు కంచకు రాకపోకలకు ఏర్పాటు చేసిన వెదురు బొంగులమీద చూపునాన్చి లోనికి చూచింది. లోపల యెవరూ లేరు. అంతా తన భ్రమ. తనకు లేనివి ఊహించుకొని ఏదేదో అనుకున్నానే అని కొంచం చింతించింది. వెంటనే ఆమెకు నవ్వు వచ్చింది. ఏఁవిటి భ్రమ! జయదేవుడు వస్తే నాకు కనిపించకుండా కబురు పెట్టకుండా తోటకు వస్తాడా! అందులో నేడు జయదేవుడు వస్తుంటే ఎంత కోలాహలంగా ఉంటుంది అవంతి - ఆనందంతో ఊగిపోదా? జయజయ ధ్వానాలతో ఉరక లేయదా? ఎంత పిచ్చిగా ఊహించాను' అనుకుంటూ ఆమె అడుగు వెనుకకు వేసింది. వెనుకనుండి ఏదో సవ్వడి వినవచ్చింది.

భయంగానే. 'ఎవరది?' అంది నందిని వెనుతిరిగి చూస్తూ.

సవ్వడి ఆగిపోయింది. జవాబురాలేదు. వెనుక ఎవరూ కనిపించలేదు.

తిరిగి ఆమెకు నవ్వు వచ్చింది. తనను భ్రాంతిలోకి లాగాయని. గండడుగులు వేసింది. తిరిగి అడుల సద్దయింది. ఆమె వెనుదిరిగి చూచింది. అంతే! ఒక ఆకారం తనను దాపుకు లాక్కుంది. కేక వేయబోయింది. బలమైన చేయి ఆమె నోటిని అదిమింది. కాళ్ళూ చేతులూ తన్నుకొంది. కొట్టుకుంది. అలసిపోయింది. జయదేవునితోట కంచెకు వేసియున్న కొయ్యలు ఎవ్వరో తీశారు. ఆ ఆకారం తనను మోసుకొని లోనికి తీసుకువెళ్ళడం జరిగింది.

వదలించుకోవాలని పెనగులాడింది. ఒదల్లేదు ఆకారం. తర్వాత తనకు తెలియదు. తనకు స్పృహ వచ్చేప్పటికి ఎదు

రుగా నలుగురు నిలచి ఉన్నారు. ఒకరు తన ముఖంమీద నీళ్ళు చల్లుతూ తల నిమిరి, 'ఇక వెళ్ళు. చాలాకాలం నీ కోసం పడిగాపులు గాశాం. ఫలితం అందించావు. వెళ్ళొస్తాం!' అన్నాడు.

నందిని నోట మాట రాలేదు. ఆ నీరు చల్లినవాడు కూడా లేచి వారిని కలుసుకొని ఒక్కసారే అనుకున్నట్టుగా ఐదు గొంతులూ 'జాగ్రత్తగా యిల్లు చేరుతావుగా?' అన్నారు.

నందిని దీనంగా వారివంక చూచింది. వారు తోటవాకిలి వేపు నడుస్తున్నారు.

అందులో ఒకరు 'వేశ్యగా! తన కులవృత్తి సాగిస్తుంది.' అన్నారు. ఇంకా ఏవేవో అనుకుంటున్నారు. ఆమెకేమీ వినిపించలేదు. చందమామ నడినెత్తిమీద ఉన్నాడు. ఆమె లేచింది. నిల్వలేకపోయింది. తన శరీరాన్ని ఒక్కసారి చూచుకుంది. తన కట్టుపుట్టాలు దూరంగా తనను చూచి వెక్కిరిస్తున్నట్టుగా వెన్నెలకు మెరుస్తున్నాయి. మెల్లగా దేకుతున్నట్టుగా వెళ్ళి వాటిని తన చుట్టూచుట్టుకొని దీనంగా తోట నలువంకలా చూచింది. దూరాన నక్కల కూతలు. కీచురాళ్ళుచేసే గావ్ గావ్ మనే రోదన. పారిపోతున్న సిప్రా నీటి జలజల. గాలికి కదులుతున్న ఆకుల కలకలలు. దూరాన తోట గాలికి హోరుమన్నట్టు సద్దు. నడిరేయి, ప్రకృతి ఆమెను భయపెట్టలేక పోయాయి. ఆమె లేచింది. చాలా బలహీనంగా నిలచి నీరసంగా బట్టలు కట్టుకుంది. తడబడే అడుగులతో నడవలేక, నడకసాగక, తేలిపోయే అడుగులతో తూలుతూ తూలుతూ కంచెదాటి తోటదాటి తన తోటను దీనంగా చూచింది. అలాగే తన కంచెముందు నిలచి, రెప్ప లార్పక అలాగే చాలాసేపు చూచింది. ఎటు వెళ్ళాలో తోచలేదు. ఇంటిదారి పట్టింది. ఒక మలుపు తిరిగి, తిరిగి

ఇంటిబాట వదలి ప్రక్క బాటగా నడక సాగించింది. అలా ఎంతసేపు నడచిందో ఆమెకు తెలియదు. ఆమెకు సిప్రా రెండవ పాయ కనుపించి అక్కడ నడవకోసం చూచి మెల్లగా దిగి కడుపునిండా నీళ్ళు త్రాగింది. ఊరు దూరంగా ఎక్కడో చెట్లచాటున కనిపించింది. ఆ ప్రాంతంలో కూస్తున్న కోళ్ళ గొంతులు సరిగా వినిపించడంలేదు. మరో ప్రక్కనా అంతే. తను ఎటునుండి ఎటువచ్చిందీ కూడా మరచి పోయింది. ఎటూ కదల్లేక ఒడ్డునున్న చెట్టుక్రింద కూలబడి ఆలోచించసాగింది. తనకేం జరిగింది? తనెక్కడుంది? ఎక్కడికి వెళ్ళాలని బయలుదేరింది? అన్నింటినీ ఒక వరుస క్రమంలో ఆలోచించింది. జరిగినదంతా ఏదో కలలాగా తోచింది. తనశరీరం బడలిక, నిస్సత్తువ గుర్తుకు వచ్చాయి. అలాగే నది వంకకు చూస్తూ మేను వాల్చింది.

తనకు తెలియదు. ఏదో ఒక చేయి తగిలి కళ్ళు తెరచి చూచింది. ఎదురుగా ఒక కళ్ళులేని అంధువు - 'ఎవరదీ? ఎవరూ? పలుకరేం?' అన్న మాటలు వినిపించాయి.

'ఎవరూ లేరులే! నీ బాటన నీవు వెళ్ళు,' అంది బలహీనంగా. అప్పటికే బాగా ఎండెక్కింది. తనకు తెలియదంత ఎండ యెక్కినట్టు. రాత్రి జరిగిన దానికి తన శరీరం మీద తనకు అసహ్యంగా ఉంది. పరుగు పరుగున వెళ్ళి సిప్రాలో పడదామా అనిపించింది.

'ఎవరమ్మా నీవు? ఇక్కడిలా పడున్నావు?' అన్నాడు.

ఈ 'అమ్మా!' అనే పదం ఆమెకెంతో ఊరట కలిగించింది. 'నీవెవరు?' అంది.

'నేనా? నేనెవర్నో నీకెలా చెప్పేది? ఏముందని నేను ఫలానా అని చెప్పగలను? నేనొక ముష్టివాణ్ణి. గ్రుడ్డివాణ్ణి. ఇంకేం చెప్పేది తల్లీ!' అన్నాడు.

పూర్వం తను అలిగి ఆహారం మానేస్తే తన తల్లి ఇలాగే 'అమ్మా! తల్లీ!' అని బామాలేది. అచ్చం ఆ ఆదరణ కనిపిస్తుందామెకు ఆ అంధుని గొంతుకలో. తనేమీ మాటాడలేదు.

'నీవెవరో, నీవెందుకిక్కడ పడున్నావో, చెప్పలేదు. నీ గొంతునుబట్టి చూస్తే, నీ వయసు చాలా తక్కువగా ఉన్నట్టనిపిస్తుంది. నీవెవరమ్మా?' అనడిగాడు అంధుడు.

'నా సంగతలా ఉంచుగాని, నీవెక్కడుంటావు? నీదే ఊరు?' అంది నందిని.

'అడుక్కు తినేవాడికరవైయ్యారూళ్ళు. ఏ ఊరని చెప్పేది? ఎక్కడ ప్రొద్దుపోతే అక్కడుంటాను. అదిసరే, ఎంతకూ నీ వైనం చెప్పవూ. నీ వెవరు? ఇంట్లో పోట్లాడి వచ్చావా తల్లీ!' అన్నాడు.

'తర్వాత చెబుతానుగాని, అవంతికి ఎంత దూరంలో ఉన్నాం మనం?' అనడిగింది.

'అంటే అవంతినుండి వస్తున్నావా?' అనడిగాడు అంధుడు.

'ఆఁ!' అంది.

'రాత్రి నేను నిలచిన వ్రజ నివాసానికి రెండు యోజనాలు. దాదాపు నే యోజనం నడచి ఉంటాను. మరో యోజనంలో వుండవచ్చు,' అన్నాడు.

'నీవు అవంతికి బయలుదేరావా?'

'ఆఁ. అవంతికే!'

'సరే వెళ్ళు!'

'నీ సంగతి సందర్భాలేవీ చెప్పలేదు!'

'ఏమీ లేదు. నీ ప్రయాణానికాలశ్యమౌతుంది. ఒకమాట! వ్రజ నివాసం దాటాక పెద్ద ఊరేదేనా ఉందా?' అని అడిగింది నందిని.

అంధుడు గ్రహించి 'ఉంది. నీ చరిత్ర చెప్పమ్మా! నీకే బాధ కలిగి వెళ్ళిపోతున్నావో, నీ మాట తీరునుబట్టి నీవు గొప్పింటి పిల్లవని తెలుస్తుంది. అసలెందుకు ఇల్లు వదలావు? పెద్ద ఊరు దేనికి? అవంతిమీద అంత పగెందుకు కలిగింది? చెప్పకూడనిదా తల్లీ!' అని బొంగురు గొంతుకతో అడిగాడు.

'ఏం లాభం చెప్పకొని? నీవు చేయగలిగిన సాయం ఏముంటుంది?' అంది నందిని నిరాశగా.

'అలాగనకు తల్లీ! చేయలేకపోవచ్చు. కనీసం నీ బాధలో పాలు పంచుకోడానికేమేనా వీలుంటుందేమో చూస్తాను. మనిషికి మనిషి సాయం కన్నా ఏం కావాలమ్మా లోకంలో?' అన్నాడు ఆమెకు దగ్గరకు వచ్చి కూర్చుంటూ.

'నాకు జరిగిన - అన్యాయాన్ని ఎవరూ తీర్చలేరు - ఆర్చలేరు.' అని తనకు జరిగినదంతా క్లుప్తంగా చెప్పింది. అంధుడు అంతా విని, నిట్టూర్పు వదలి—

'ఔతే నీవు ఎక్కడికి వెళ్ళదలచావు?' అన్నాడు.

'ఎక్కడికో నాకేం తెలుసు? దిక్కులేని దానిని. కాని ఈ లోకాన్ని నా పాదాల క్రిందికి తెచ్చుకోకుండా వదలను. అందులో ఈ అవంతిని సర్వనాశనం చేస్తాను!'

'అమ్మా! అలా అనకు, అది మంచి పనిగాదు. దుర్మార్గానికి దుర్మార్గం - అక్రమానికి అక్రమం - నాశనానికి నాశనం గాదు. ప్రతి చెడును మంచితో జయించాలి.

అవినీతిని నీతితో గెలవాలి. అపకారాన్ని ఉపకారంతో ఎదుర్కోవాలి! ఆ నాడే మనుష్యులు మానవత్వంలో ఉన్నట్లు తేట తెల్లమవుతుంది. మంటను మంటతో రెచ్చగొడితే సర్వం బూడిదవుతుంది. నీళ్ళతో చాకచక్యంగా చల్లార్చితే వచ్చే ఫలితం వేరు. నీ కోసం నా ప్రయాణం మానుకుంటాను. మార్గం నిర్ణయించు- ఎటు వెళదామో!' అన్నాడు అంధుడు.

'నా కోసం మీరు మీ ప్రయాణాన్ని!..... ' అని ఆమె అతని వంక చూచింది. అతని మోములో వైవర్ణ్యం రావాలంటే చుట్టు పట్ల ఉన్నవి అతనికి గోచరించాలి. అగోచరం కాబట్టి అతని ముఖంలో ఏవిధమైన కళా కనుపించలేదామెకు. ఎలా కనుపిస్తుంది?'

'నా ప్రయాణం ఏముందమ్మా? నా గమనానికి నిర్ణయం లేదు. ఆలోచన లేదు. ఆశ లేదు. అన్నింటికీ తగినట్లు నాకు చావు లేదు. అందువల్ల నిర్దేశమైన ధ్యేయం లేదు.' అన్నాడు

'అది కాదు తాతా!' అన్నది అనుకోకుండా. అని ఆమె నామె సంబాళించుకొంది. ఎందు కాగిందీ అంధుడు అర్థం చేసుకొని, చిరునవ్వు నవ్వి...

'పరవాలేదు చెప్పమ్మా! నన్నిలా పిలిచినా నాకు సంతోషమే. నీవు నాతో రావడానికి అంగీకరించినట్లేనా? అదేమిటలాగంటాను! నీతో నన్ను వెంటవేసుకొని వెళ్ళడానికి ఇచ్ఛగించినట్టేనా?' అని అడిగాడు.

'నాతో నీ కేంపని తాతయ్యా! నీ దారిన నీవు వెళ్ళరాదూ?' అంది.

'నీకు ఎవరూ లేరన్నావు. అంతేగాక నీవు ప్రస్తుతం బాధలో ఉన్నావు. నన్ను పెద్ద దిక్కు గావించుకో.

కళ్ళు లేక పోవచ్చు. హృదయం ఉందనుకుంటున్నాను. నాకూ ఏ దిక్కూ లేదు. నీవు గొప్పదానివి. నీ అండవల్ల కొన్ని గొప్ప విషయాలు తెలుసుకుంటాను.' అన్నాడు.

'నీ కంటె నా కేమ్కువ తెలుసంటావా?' అంది నందిని.

'ఎవరికి మాత్రం ఈ లోకంలో ఏం తెలుసు? ఏమీ తెలియదు. తెలుసుకున్న వారు లోకంలో లేరు. ఎంత కాలం ఉన్నా తెలుసుకుంటూ ఉండాలిసిందే! తెలుసుకుంటూనే తనువు వదలాలి. ఆఖరి క్షణంలో నేనా ఇది నాకు తెలుసు అని ఇంతకు ముందు ఎవరూ అన్నారు కారు. అందరి దగ్గరా ఏవో తెలిసింది ఉంటుంది. తెలియని వనేకం అందరిలోనూ ఉంటాయి. వాటికీ వీటికీ పోల్చుకొని చూచుకొని తెలియని వారుగా బ్రతకాలిసిందే!' అన్నాడు అంధుడు.

'ఏమిటో తాతయ్యా! నీతో మాటాడుతుంటే నా కేదో తెలియని తృప్తిగా ఉంది. రాత్రి జరిగినదేదీ తల పులో లేదు. ఔతే ఒక మాట. నేను ఏ క్షణానేనా మారిపోయి, నిన్ను మరచిపోతే బాధ పడతావా?' అనడిగింది.

తిరిగి అంధుడు నవ్వి, 'పిచ్చి నానా! ఈ లోకంలో చాలా మంది కలిసి ప్రయాణం చేశారు. ఇప్పటికీ ఎందరో చేస్తున్నారు. విడిపోతున్నారు. ఈ లోక యాత్రలో జీవన యాత్ర ముగిసే లోపల ఎందరో కలుస్తూ విడిపోతూ ఉంటారు. వాళ్ళందరి ఛాయలు హృదయ ఫలకమ్మీద ఉంటాయి. అంతేగాని వాటిని అలా చూస్తూ ఊరుకోరాదని నా ఆశయం. ఆ ఆశయంతో నే జీవనాన్ని లాక్కొస్తున్నాను.

అంత మంచి రోజు వచ్చి నీవు వెళ్ళిపోతే నవ్వుతూ ఆశీర్వదిస్తూ సాగనంపుతాను. ఇంతవరకు సరిగా ఒకరం ఒకరికి తెలియలేదు. కలిసిఉండడం అంటూ మాటాడుతూ, విడిపోవడాన్నాలోచిస్తావెందుకు-వెళదాం పదమ్మా!'

'ఎక్కడికి వెళదాం?' అనడిగింది నందిని.

'అవంతికే వెళదాం! పదమ్మా!'

'అవంతికా?' అన్నదాశ్చర్యంగా.

'ఆఁ!'

'అది కానిపని. రాను!' అన్నది కచ్చితంగా.

'నీ యిష్టం, ఎటైనా సరే! మనకేం తల్లీ! ఎటువెళ్ళినా రెండు పొట్టలు పూడకపోవు.'

'నీ మీద నీ కెంత నమ్మకం తాతయ్యా!' అంది నందిని.

'అందరికీ అది కావాలి. ఎందుకుండదు? ఉండాలమ్మా! వేళ మిగిలిపోతుంది ఎటు వెళదామంటావు?' అనడిగాడు అంధుడు.

'నా కేమీ తెలియదు. నీ యిష్టం-ఏ ప్రక్క ఏ ఊరున్నదో కూడా నాకు తెలియదు. కూరసేనం తర్వాత అవంతి, నా తల్లి చాటునుండి తిరగాను.' అంది నందిని. ఆ అంటున్నప్పుడు ఆమె గొంతులో జీలుగు వినిపించింది అంధునికి.

'భయంలేదు. అంతకన్నా బాధలేదు. మనకు దారి తెన్నులో ప్రమేయంలేదు. ఇటు మధుర వెళదాం - లేదా అటు ఉజ్జయని చేరదాం. కాదంటావా! పాటలీపుత్రానికి వెళదాం. ఆంధ్రప్రాంతానికేనా సరే!ఎటయితే యేం? నాకు కళ్ళు లేకపోవచ్చు, నీకు ఉన్నాయి కదా! నీ కళ్ళతో చూచి నాకందించు. ఆ చిత్రాలన్నీ నా మనసులో నిలచి ఉంటాయి. పదమ్మా! పద! ప్రొద్దెక్కి పోతుంది.'

ఉజ్జయిని సంగతెలా ఉన్నా మధుర మాట వినగానే జయదేవుడు తలపులో మెదలి అటు వెళ్ళకూడదని నిశ్చయించుకుంది.

'తాతా! మనం పాటలీపుత్రం వెళదాం.' అంది.

'అలాగే నీ యిష్టం తల్లీ! బయలుదేరు.' అన్నాడు.

ఆ యిద్దరూ నడక సాగించారు సిప్రా ఒడ్డున. ఆమెకు లోలోన అవంతిమీద కోపం రగులుకుంటూనే ఉంది. ఆ రగిలే సెగ ఎలా అవంతికి చేరుతుందో? ఆమె మాత్రం అంధ భిక్షువు వెంటనంటి ధ్యేయంలేని ప్రయాణం కట్టింది. ఆమె హృదయంలో ప్రకృతి వేడెక్కడం మొదలు పెట్టింది. ఆమెలో ఏదో ఉత్సాహం క్రొత్తగా ఆవరించింది.

జయదేవుడు యుద్ధంలో జయించి శత్రురాజును హత మార్చి అతని సేననంతా బందీగా తీసుకొని అవంతికి చేరాడు. ఈ విజయ వార్తను ముందుగా నందిని కందించాలని, ఆమె గృహ ప్రాంగణంలో నిలచి సేనను కార్య స్థానానికి తరలి పొమ్మన్నాడు. దండంతా వెళ్ళిపోయాక తన హయాన్ని దిగి నందిని ఇంట్లోనికి వెళ్ళి నలువంకలా చూచాడు. అతడు ఆ ఇంటిలోనికి రావడం రెండవసారి. మునుపొకసారి వచ్చి నందినితో మాటాడి వెళ్ళాడు. తిరిగి ఇదేరావడం. జయదేవుని చూడగానే ఒక మనిషి దాపుకు వచ్చి బావురుమని ఏడ్చింది. 'ఏమిటీ? ఏం జరిగింది?' అనడిగాడు ఆత్రంగానే జయదేవుడు. అర ఘడియ ఎక్కిళ్ళు పెట్టి 'ఆమెగారు దాదాపు పక్షం క్రితం ఒక సంధ్యలో ఇల్లు వదలి వెళ్ళారు. అంతే-తిరిగి రాలేదు. అధ్యక్షులవారి

నడిగాను. 'ఎంత సేపు యుద్ధం - యుద్ధ విషయాలు అడుగు తుం దేది. అందులోనూ జయదేవుని గూర్చి అడుగుతుం దేది కాబట్టి అతన్ని కలసుకోడానికి వెళ్ళి ఉంటుందిలే! నీవు మామూలుగా ఉండు' అన్నారు. మీ కోసం, ఆమె కోసం ఎదురు చూస్తున్నాను' అంది ఆమె.

జయదేవుని గుండెలొక్కసారి గుభిల్లు మన్నాయి. పరిపరి విధాల ఆలోచించాడు. అతనికేమీ తోచలేదు. విజయు మొందిన జయోత్సాహం పూర్తిగా పోయింది. ఆమె కేమేమో చెప్పాలని మనసులో వల్లె వేసుకొని వచ్చిన మాటలన్నీ ఎవరికి చెప్పాలి? ఎవరు వింటారు? ఎందుకు యుద్ధంలో బ్రతికానా-అనిపించింది జయదేవునికి. నిరాశగా కాళ్ళీడ్చుకుంటూ తన గృహానికి బయలుదేరాడు.

ఆ మరునాడు కార్యస్థానంలో జయదేవుని కెంతో గౌరవం జరిగింది. ఎంత గౌరవం జరిగినా ఏ బిరుదు నిచ్చినా అతనికి ఉత్సాహం లేదు. ఏదో దిగులుగా ఒక ప్రక్క కూర్చుని, సభలో నాలుగు ముక్కలు ఆ యుద్ధాన్ని గూర్చి మాట్లాడి ఊరుకున్నాడు. తర్వాత అధ్యక్షుని ఏకాంతంగా కలసుకొని 'నందినిని ఆఖరుసారిగా ఎప్పుడు కలుసుకొంది? ఏమ్మాట్లాడింది?' అని అడిగాడు.

'మామూలుగా నే యుద్ధ వార్తలడిగింది. ఆ తర్వాత నీ విషయం అడిగింది' అన్నాడు.'

అది విని జయదేవుడు మారుమాటాడలేదు.

'నాకు తెలుసు జయదేవ్, నీ బాధ. ఒకనాడు ఆ నందినిని చూచి అవంతిలో తావు కల్పించాను. నేనెంతగానో ఆమెకోసం ప్రయత్నించాను. తర్వాత ఆమె నీతో చనువుగా ఉండడం చూచి నా దృక్పథాన్ని మార్చు

కున్నాను. ఆ మార్పుకోడానికంతో బాధపడ్డాను. ఆమె అందం చాలామందిని పిచ్చివాళ్ళను చేస్తుంది. ప్రయత్నిద్దాం. ఎక్కడుందో ఎలా ఉందో ఆరా తీద్దాం. ఊరక వేలపడి పోకు!' అన్నాడు అధ్యక్షుడు. అతను చెప్తున్న ప్రతి మాటనూ జాగ్రత్తగా విని జయదేవుడు—

'మీరు నందినిని......' అని ఆపేశాడు.

'అందాన్ని అనుభవించడానికి ప్రయత్నించడంలో తప్పులేదు - దానికి దాసులై అకార్యాలు చేయడం మంచిది కాదుగాని!' అన్నాడు.

నిజానికి అధ్యక్షుడు ఊరుకుంది చాలావరకు చేతగాక. రెండవది: జయదేవ సేనాపతి నామె వలచిందని చూచాయిగా తెలిసి. ఆదేవా అధ్యక్షునికన్నా జయదేవుని బలం జాస్తి. సిపాయిలంతా అతనివారు. అకంతిలోని పలుకుబడిగల వారిందరిలోకీ పలుకుబడిగలవాడు. తను ఊరక అధ్యక్షుడు మాత్రమే అని, జయదేవునిమీద అధ్యక్షునికి ఈర్ష్య అసూయలు లేవు. నలుగురిలా నందిని అందానికి ముగ్ధుడయ్యాడు. అనుభవిద్దామనుకున్నాడు. అందలేదు. ఊరుకున్నాడు. అతను చెప్పినదానిలో కొంత నిజంకూడా ఉంది. దాని వెనుక ఉన్న చేతగానితనాన్ని మాత్రం అతడొప్పుకోడు. ఎవరు ఒప్పుకున్నారు కనుక? అందరిలాంటివాడే అతనున్నూ.

జయదేవుడాలోచిస్తూ ఇంటిముఖం పట్టాడు.

ఆ మరునాడు హాస్తిన చక్రవర్తి దగ్గరనుండి వార్తాహారుడు వచ్చాడు. అందరినీ అప్పటికప్పుడు సమావేశ పరచారు. ఆ సమావేశంలో ఆ వార్తాహారుని జాబు నీవిధంగా అధ్యక్షుడు చదవడం జరిగింది;

"పంచాయతీ పాలకులైన అవంతీ అధికారులకు హస్తినా పుర సార్వభౌముడు తెలియజేయడం: మాకన్నా అన్నిటా తక్కువవారుగా మీరుంటున్నా, మీరు మాకు దాపులో ఉన్నా, మీ రాజ్యాల జోలికి మేమింతవరకూ రాలేదు. కారణం- రాజ్యాల నణగద్రొక్కి, హింసించి, ప్రజా నాశనం గావించి రాజ్యమేలడం మాకు నచ్చని పని. మా యిచ్ఛకది విరుద్ధం. కానీ, ఈ మధ్య మీ అవంతి పేన మా సామంత రాజ్య మయిన మధుర మీదికి వెడలిందని విన్నాం. వెడలడం కాకుండా మా సామంతుని మీ పరివారం హత మార్చింది. పైగా పనికట్టుకొని మీ సేనాని. రాజును వెన్నంటి దుర్భాష లాడి నరికివేసినట్లు మాకు వార్త అందింది. అది మాకు చాలా ఆగ్రహం కారణం కాబట్టి, మీరు ఆ సేనానిని ఉన్నట్టుగా మా సముఖాన ప్రవేశపెట్టాలని, న్యాయాన్యాయాలు విచా రించాలసిన బాధ్యత మాకున్నదని మీకు తెలియజేస్తున్నాం. మీరెంత గణసత్తాకంగా మీ రాజ్యాన్ని ఏలుకుంటున్నా, మా సామంతుల విషయంలో మేం సహించరాని కార్యం చేశారు. అతనినేకారణంగానైనా ప్రవేశపరచకపోయినట్లయితే, హస్తినా నాధుని కనుచూపుమేర మీ జనసత్తాక రాజ్యాలు స్వతంత్రతను కోలుపోతాయని తెలియజేస్తున్నాం.

ఇట్లు,

—అని హస్తినా నాధుని ముద్ర ఉంది.

సభలోని వారందరికీ ఆగ్రహం వచ్చింది. ఆ ఆగ్రహం లోనే ఆలోచన కలిగింది. ఆలోచన వచ్చిన మరుక్షణం భయం

కలిగింది. అందరూ జయదేవునివంక చూచారు. జయదేవుడు సన్యాసిలాగా, ఏమీ తెలియనివానిలా, దేనికీ చెందని వానిలా అలాగే అందరివంకకూ నవ్వుతూ చూచాడు.

అంతా ఏకగ్రీవంగా అనుకున్నట్టుగా ఒక్కమాటే అన్నారు-'అప్పగించవలసిన అవసరంలేదు. అప్పగించమని రాయండి! ప్రాణాలకు వెరచి జనసత్తాకను ఏకసత్తాకుని కంటకట్టి మన స్వాతంత్ర్యాన్ని బెదరింపులకు లొంగి నాశనం చేయం. తెలియపరచండి!' అన్నారు.

అధ్యక్షుడు వ్రాయసగాని వంకను తిరిగి 'అదే రాయండి. ఇందరంఉండి జయదేవుని అప్పగించడం జరగని కార్యం. మత్తేభాలు, అశ్వాలు అవంతిని నాశనం చేయనీయండి. ప్రతిపౌరుడూ జయదేవుని, తన స్వాతంత్ర్యాన్ని కాపాడు కుంటాడు. లేదా స్వతంత్రంగా పోరాడి మరణిస్తాడు. మన స్వేచ్ఛను తాకట్టు పెట్టలేం. హాస్తిన ప్రభువుకాదు. హాస్తినా, పాటలీపుత్ర సార్వభౌములేకమై వచ్చినా మన రక్షణ మనకున్నది. ఏమీ రాయక్కరలేదు. 'మేమప్ప గించము.' అని రాయండి. అందరం సంతకాలుపెట్టి అతని కిచ్చి పంపుదాం!' అన్నాడధ్యక్షుడు.

నవ్వుతూ జయదేవుడు లేచి, 'అది మంచిపని గాదు. నేను వెడతాను. సార్వభౌముడు న్యాయం చేకూర్చుతాడని నమ్మకంగా ఉంది. ఆయన రాయించిన కమ్మలో మనం మధురమీదకు వెళ్ళినట్టుగా ఉంది. సార్వభౌముని సముఖాని కావార్త అలా చేరి ఉంటుంది. ఇందులో అవంతి మధురా ధీశుని మీదకు వెళ్ళలేదని, మధురనాయకుడు అవంతిని కబళించాలని వచ్చాడని తెలిస్తే న్యాయం మన కనుకూలి స్తుంది. కాబట్టి ఈ వార్త ముందాయనకు అందాలి. అది సమర్థుడైన వానివలన చేరాలి. మరోమాట-హాస్తినా ధీశుని

న్యాయకుశలత చూడండి. పెద్దవాడైఉండి, బలం ఉండి, తగిన సేనఉండి. మామూలు పంచాయితీ రాజ్యమైన మనకు ముందుగా వార్త పంపాడు. అంటే అందులోనే తెలుస్తుందాయన విశాల హృదయం. ఏ క్షణాన 'మీరే తప్పుచేశారు కాబట్టి మేము మీ రాజ్యాన్ని కబళిస్తున్నామని, హఠాత్తుగా వచ్చి మీదపడ్డా మనం చేయగలిగింది లేదు. పైగా ఎదిరించి నిలవలేం! నా ఒక్కడికోసం మీరింతమందీ ధైర్యంగా నిలచి, అప్పగించమని మాటనీయడం నిజంగా నాకు గర్వకారణం! మీ ప్రేమకు, మీ అభిమానానికీ మీ అందరికీ నా కృతజ్ఞతలు.' అన్నాడు.

'అంటే నీవు...' అన్నాడు అధ్యక్షుడు.

'నేనే స్వయంగా వెళ్ళి మాటాడతాను.'

'ఒంటరిగానా!' అనడిగాడాశ్చర్యంగా మరో సభ్యుడు.

'ఏం? తేలిపోతుంది సార్వభౌముని న్యాయశీలత. అన్యాయానికీ అక్రమానికీ ఒడికట్టాడా మీరు పాటలీపుత్రానికి కబురుపెట్టి, 'పాటలీపుత్ర సార్వభౌముని, పంచాయితీ రాజ్యాలకు దెబ్బతగులుతుంది - ఈ అన్యాయాన్ని అరికట్టమని అడగండి. అతనుకూడా కాదన్నాడా యింక మనం చేయగలిగింది లేదు. ఈ లోకంలో స్వేచ్ఛకు తావులేదని పోరు కాడండి ప్రాణాలున్నంతకాలం స్వేచ్ఛకొరకు. అంతేగాని రాజ్యాన్నప్పగించకండి.' అన్నాడు జయదేవుడు.

'నా కెందుకో నీ గమనం నచ్చడం లేద'న్నాడు. అధ్యక్షుడు.

'ఇందులో నచ్చకపోవడానికి ఏముంది?'

'ఏమైనా నీవు వెళ్ళడం...'

'అదే పనికిరాదు. వెళ్ళితీరాలి. ఒక్కసారే ఎదర్పడ మెందుకు? అవతలివారి విషయం తెలియకుండా త్వరపడడం మరీ అకార్యం!'

'ఇంతకూ...' అని నసిగాడొక సభ్యుడు.

'వెళ్ళక తప్పదు. వెళ్ళితీరాలిసిందే!' అన్నాడు జయ దేవుడు.

తర్వాత సభ్యులెవరూ మాటాడలేదు.

'అతని రాయబార కార్యాలయంలో విడిది చేయించండి. రేపు అతనితో పాటు నేనూ వెడతాను - అన్ని సాకర్యాలు చూస్తారు. రేపు కలుసుకుందాం,' అని అతనితో అని జయదేవుడు సభ్యుల దగ్గర సెలవు తీసుకొని వెళ్ళిపోయాడు.

## 4

హస్తినాపుర రాజు నిండు కొలువుతీరి ఉన్నాడు. సామంతరాజులు బారులుతీర్చి కూర్చొనున్నారు. చుట్టూ ప్రజాసమూహం ఇసుకవేస్తే రాలకుండా నిండి ఉంది. అందరున్నా కొలువు చాలా నిశ్శబ్దంగా ఉంది సూది పడినా అలికిడౌతుందా అన్నట్టు. కొన్ని క్షణాలయ్యాక బంధింప బడిన జయదేవుని రాజభటులు వెంటబెట్టుకొని చక్రవర్తి ముందు నిలిపి ప్రక్కకు తప్పుకున్నారు. కాళ్ళకూ చేతులకు సంకిల బంధింపబడి ఉంది. జయదేవ సేనాపతి ఠీవిగా ఆ రాజ కూటాన్నంతా కలయ చూచాడు. అతని మోములో విషాద ఛ్ఛాయలు లేవు. చాలా సంతోషంగా, ఉత్సాహంగా ఉన్నాడు. సభికు లందరినీ అతని వాలకం ఆశ్చర్యంలో ముంచింది. సార్వభౌముడే శిక్ష విధిస్తాడో తెలియదు, మహారాజుల ముందు బంధనంలో ఉన్నా ఇత

డింత ఠీవిగా రాజసంగా ఉన్నాదేమోని గుస గుసలు నలు మూలలా లేచాయి.

జయదేవుని తృప్తి అతనికి మాత్రమే తెలుసు. తన ఒక్కనికీ శిక్ష విధించినా బెంగ లేదు. తన పౌరులకు స్వేచ్ఛ స్వేచ్ఛగా మిగులుతుంది. తన అవంతి జనసత్తాకం లోనే ఉంటుంది. తన కంతకన్న ఇంకేం కావాలి? తన సాధ్యమైనంత వరకూ తన జనసత్తాకాన్ని రక్షించాలి. అంతకన్న కోర దగింది లేదు. ఎంతో ఆశతో, ఎన్నో ఆలోచనలతో వచ్చిన ఉత్సాహం పోయింది. ఇంక తనకేం కోరికలున్నాయి. నందిని ఉండి ఉంటే తను వచ్చేవాడు కాదు. నందిని లేదన్న నిరాశతోనే తనా పనికి ఒడిగట్టాడు. ఆ నిరుత్సాహంలోనే అతనికి ధైర్యం కలిగింది. ఆ ధైర్యం స్థిరత్వాన్ని సాధించింది.

మహామంత్రి తన ఆసనం మీదనుండి లేచి గొంతు సవరించుకొని——

'మీ ముందు బందీగా ఉన్న ఈ జయదేవుడు...' అన్నాడు వెంటనే జయదేవుడు - 'అవంతి - గణసత్తాక సర్వసేనాని' అనడం భావ్యమైన పని.' అన్నాడు.

సభ ఒక్కసారి సముద్ర తరంగాల కల్లోలంలా సందడయింది. సార్వభౌముడు ఓరగా అతని వంక చూచాడు. 'నేను బందీగా ఇక్కడకు రాలేదే. మీరు బందీగా అన్న పదాన్ని కూడా ఉపసంహరించుకోవాలి. కారణం నా అంత నేనుగా మీ వార్తాహరునితో మీ హస్తినాపుర కోట లోనికి వచ్చాక బంధించ కొలువులోనికి తేబడ్డాను.' అన్నాడు.

'సరే! నిన్నేమని పిల్వమంటావు?' అనడిగాడు సార్వ భౌముడు.

'సేనాని అనడం నాకు తెలిసింది.'

'అలాగే పిలవండి మహామంత్రీ!' అన్నాడు సార్వ భౌముడు.

తిరిగి ఒకసారి సభ కోలాహలంగా మారి ఎవరికి వారు 'ఉష్-ఉష్, నిశ్శబ్దం నిశ్శబ్దం' అన్నారు. మాటు మణిగి పోయింది సభ.

'మన సామంత రాజ్యమైన మధుర మీదికి వెళ్ళి అతన్ని సంహరించి, సపరివారంగా ఈ సేనాని ఆక్రమించుకొని తన జనసమూహాలలో మధురను కలుపుకున్నాడన్న నేరంతో మీ ముందుకు తేబడ్డాడు సభవారు విచారించాలని. సార్వ భౌములకు వినతి చేసుకుంటున్నాను.' అన్నాడు. జయ దేవుడు నవ్వాడు. ఆ నవ్వు నిశ్శబ్దంగా ఉన్న సభలో పిడుగులు పడినట్టుగా వినిపించింది.

'ఎందుకూ, నవ్వుతావు?' అన్నాడు సార్వభౌముడు.

'యుద్ధం జరిగింది అవంతి సరిహద్దులో. మణికందర ప్రాంతంలో. మణికందరాన్ని ముందు మీ సామంత రాజయిన మధురనాయకుడు దురాక్రమణ చేయడం జరిగాక వాలవ నాటికి అవంతి సేనలు వెళ్ళి మణికందరం బయల్లో పోరాడాయి. జయాపజయాలు దైవాధీనాలు కాబట్టి మా సేనలు స్వేచ్ఛ కోసం పోరాడాయి. కాబట్టి ధర్మం మా సమక్షం ఉంది కాబట్టి మేమే జయించాం. మధురనాయకుడు నాతో తలపడడం జరిగింది. అప్ప టికి రెండుసార్లు ఓడి వెన్ను చూపాడు. తిరిగి తటస్థ పడ్డాడు. అతని తలను నా కరవాలం ఖండించింది. ఆ

తర్వాత సేనను బందీలుగా - బందీలుగా కాదు. మామూలు పౌరులుగానే వెంటబెట్టుకొని అవంతికి చేర్చాం. అవంతిలో మధుర సేనలోనివారి కేవిధమైన బంధనా లేదు. ఇక్కడి రాజ మర్యాదలక్కడ లేవు. అక్కడ ప్రతి పౌరుడూ స్వాతంత్ర్యంగానే, స్వేచ్ఛగానే చరిస్తాడు. మీ వార్తాహరునితో వారంతా మాటాడారు. వారిని మా రాజ్యంలో బంధించి ఉంచలేరు. వాళ్ళు వాళ్ళ ఇష్టమైన చోటుకు స్వేచ్ఛగా వెళ్ళి రావచ్చు. గాయాలు తగిలినవారికి వైద్య చికిత్స జరుగుతుంది. వారు వైద్యాధీనంలో ఉన్నారు. కాబట్టి ఆరోగ్యం చేకూరేవరకూ వారు వెలికి రావడానికి వైద్యులు నిరాకరించారు. వారిలో మా వాళ్లూ ఉన్నారు. వారికైనా ఆ నిబంధన వర్తిస్తుంది. అందరూ ఒక్కటే అక్కడ.'

'మీరు మధురమీదికి యుద్ధానికి పోలేదా?' అన్నాడు మంత్రి.

'లేదు. అవంతి అలాంటి పని ఎన్నడూ చేయదు. ఒక్క అవంతేకాదు. జనసత్తాకాలేవీ రాజ్య కాంక్షతో ఉండవు. వారికి స్వేచ్ఛను కాపాడుకోవాలని మాత్రమే ఉంటుంది. ఆ అలవాటు ఏకసత్తాక రాజ్యాలకు ఉంటుంది. స్వతంత్రంగా ప్రతికేజాతి పరాయి స్వేచ్ఛను ఏనాడూ అరికట్టకూడదు. కారణం తనకు తానే వారికీ స్వేచ్ఛా స్వాతంత్ర్యాల మమత, స్వచ్ఛందతా ఉంటుందని, ఉండాలని భావం ఉంటుంది కనుక.'

'మాకు అలా ఉండదనేనా, మీ భావన?' అని మధ్యలో ప్రశ్నించాడు మంత్రి.

'ఆ ఆశయం మీకున్నట్లయితే మీ ఏకసత్తాక రాజ్యాలు మాటిమాటికీ పంచాయతీ రాజ్యాల నాక్రమించాలని

ఎందుకు ప్రాకులాడతాయి? మీ సామంత రాజ్యాలు మూరసేనాన్ని, అవంతిని మాటిమాటికి బెదరిస్తాయెందుకు? అవంతి పౌరులకు యుద్ధ భీతెందుకు కలుగుతుంది? మీరే ఆలోచించండి!' అన్నాడు జయదేవుడు.

'మీరింకేమైనా చెప్పవలసింది ఉందా?' అనడిగాడు మంత్రి.

'మీరు మా రాజ్యాలమీద ఆపాదించిన దానినిబట్టి ఉంటుంది నేను చెప్పకోవడం!' అని సమాధానమిచ్చాడు. మంత్రినిగాని, మహారాజునుగాని అతడు నిర్లక్ష్యం చేసి మాటాడినట్టు, మాటాడుతున్నట్టు సభలోనివారికి కొంచం కూడా అనిపించలేదు. అంత సాత్వికంగా అంత నమ్రతగా ఆ అనేనుక్కలన్నాడు. అన్న మాటలన్నీ పరుషాలై నా వారికి అతని మీద చాలా సానుభూతిగా ఉంది. ప్రతి మాటా మహారాజుకు సూదిలా గ్రుచ్చుకుంది. కానీ బాధ కలుగలేదు. బాధ లేకుండా అంత మెత్తగా, అంత నిజాన్ని చెప్పడం ఏ కొందరికో చాతవుతుంది. అందరికీ అబ్బదు.

మహారాజు గొంతు సవరించుకొని 'నీవు చాలా మంచివాడవు. నీ ప్రతి మాటలో నాకు నిజాయితీ కనిపిస్తూంది. నీ మాటలన్నీ నాకు నచ్చాయి. నీవు నాకో మాటనిస్తావా?' అన్నాడు.

సభికులందరూ చాలా ఆశ్చర్య పోయారు. ఏదో ఉంది దీనిలో అంతరార్థం-అన్నారు కొందరు.

'ఎంత మాట సెలవిచ్చారు ప్రభువులు. నేను మాట నీయడం ఏమిటి? మీ రాదేశిస్తే జరిగి పోయేవాటికి నేనెంత వాణ్ని మీకు మాట నీయడానికి?' అన్నాడు జయదేవుడు.

'నిజం కావచ్చు నీవనేది. కానీ, నిజాయితీని బెదిరించడం ధర్మంగాదు. నీతిని, నిజాయితీని గౌరవించాలి. నీ

వ్యక్తిగత విషయాలు - నీ రాజ్యం - నీ పౌరసత్వం - నీ స్వేచ్ఛను ఆదేశించే అధికారం నాకు కాదుగదా - ఈ జగతులో ఎవరికీ లేదు. నీతి గల్గినది - నీతి నాధారం జేసుకొని నడచే రాజ్యాంగం గుణసత్తాకగాని, ఏకసత్తాకగాని-దాన్ని గౌరవించాలిసిందే. మా కందిన వార్త మీరు మధుర మీదికి దండు వెడలారని. అది తప్పుగా అందింది. అందువల్ల మీ రాజ్యానికి వార్త పంపాం. మీకు బలం తక్కువైనా ఆత్మ గౌరవం ఎక్కువ అన్నది మీ రాక తెలియపరచింది. అదరూ బెదరూ లేని స్వేచ్ఛాగౌరవం మమ్మల్ని కదలించింది. మీరు, ఈ నాటినుండి మధురకు నాయకులుగా ఉండండి. కానీ, ఒక్కటే అభ్యంతరం. అది అభ్యంతరం కాదు కానీ మధుర మా క్రింద ఉండాలి. మధుర మాదిగా ఉంచి మీరెలా ఏలినా మా కిష్టమే. అందుకే మీ మాట కావాలని అంటున్నాను.' అన్నాడు సార్వభౌముడు.

వెంటనే మహామంత్రి లేచి 'ప్రభువులు కొంచం ఆలోచించి......' అని ఏదో అనబోయాడు.

'ముందు సేనాపతి సంకెళ్ళు ఊడదీయించండి. తరువాత మీరు చెప్పదలచింది చెప్పండి!' అన్నారు. సార్వభౌములా మాట అనగానే ఇద్దరు భటులు వచ్చి జయదేవుని సంకెళ్ళు విప్పారు. జయదేవుడు బంధరహితుడై ఒక్కసారి ఒళ్ళు విరచుకున్నాడు. అది గూపరులకు బంధించి ఉంచిన సింహాన్ని వదలినప్పుడు అది తృప్తిగా ఒకసారి జూలు దులుపుకున్న రీతిగా గోచరించింది. ఎంత బలిష్ఠుడు! ఎంత అందగాడు! అతని అవయవాలన్నీ వేటికవి విడిగా బ్రహ్మ పోతపోసి అంటించిన రీతిగా ఉంది. కొన్నేళ్ళ నాడు యువకులైన అలెగ్జాండరు సేనలోని దండనాధుల బొమ్మ

లని కంచు విగ్రహాలు నిల్పారు - వారు గెలుచుకున్న దేశాల్లో. వాటిని పోలినట్టున్నాడు, ఈతడని భ్రమలో మునిగి పోయారు సభలోని వారంతా.

అలాగే సార్వభౌముని ఎదురుగా నడుమున చేతులు పెట్టుకొని రాజసంగా నిలబడ్డాడు జయదేవుడు. అతడు ఎలా నిల్వబడినా అందంగా ఉన్నదేగాని, తిరస్కారం, ఎదటి వారిని అగౌరపరచిన విధంగా లేదు. ఆ రాజసంలో ఠీవి, దర్జా - హుందా ఉన్నదిగాని, గర్వం లేదు. ఆ నిల చిన తీరు చూచి మహారాజు మందహాసంగా—

'సేనాపతీ! ఈ నాటినుండీ నీవు రాజువు. ఒక్కటి- సామంతుడవని నీలో నీవేనాడూ అనుకోవలసిన అవసరం లేదు. అందులోని పాలనా విధానాలన్నీ నీ ఇష్టం వచ్చి నట్టు మార్చుకో. నీ రాబడిని బట్టి కొంత సుంకం మా బొక్కసానికి చెల్లించు. నీ మీద మాకు నమ్మకం ఉంది. నీవు ప్రజలను కొల్లగొట్టవు. నీవు పరాయి దేశాల మీదకు వెళ్ళవు. ఉన్న దాన్ని సక్రమంగా ఏలుకో. మాకూ రాజ్య కాంక్ష లేదు. మా కోసం నీవు ఏమీ చేయనక్కర లేదు' అన్నాడు సార్వభౌముడు.

'నన్ను మీ గౌరవంతో, మంచితనంతో బంధిస్తున్నారు ప్రభూ!' అన్నాడు జయదేవుడు.

'మంచి తనానికి కూడా బంధింప బడవా?' అన్నాడు సార్వభౌముడు.

'నేను ప్రత్యుత్తర మీయలేని ప్రశ్న!' అని సమాధాన మిచ్చాడు జయదేవుడు.

'అలా వెళ్ళి పూర్వం మధుర నాయకుడు కూర్చుండే ఆసనమ్మీద కూర్చో!' అన్నాడు సార్వభౌముడు. సభలోని

వారికంతా ఇదేదో గారడీలా అదేదో మంత్రమోగుదే రాజు చేస్తున్నాడని, దీనికి ముందు ఆలోచనేదో ఉంటుందని కొందరూ, ఏమీ లేనిదే సార్వభౌముడు ఎందుకు మధురను జయదేవ సేనాపతికిస్తాడని కొందరు - అనుకున్నారు.

అది గ్రహించిన సార్వభౌముడు తిరిగి—

'దీనిలో ఏదో గూడుపుఠాణి ఉందని, మేమేదో కుతంత్రంగా చేస్తున్నామని మీరనుకోవచ్చు. అదేమీ లేదు. సర్వస్వతంత్రులను నేవాధర్మానికి ఒప్పుకోమని మేము బలవంతం చేయం. స్వేచ్ఛాజీవులను స్వేచ్ఛగానే తిరుగనీయాలి. మనకన్న తెలివిగలవారిని తెల్వికలవారనే ఒప్పుకోవాలి. వారికి గౌరవం చూపాలి. మంచిని మంచిగానే, తీసుకుని పాలించాలి. ఈ సేనాపతి-వారి పంచాయితీ, మనదిగాదు. వారు మనవారు కాదు. కానీ, వారు మనకిచ్చిన గౌరవం మనకు చూపిన నమ్రత చూడండి. భయపడి వారి సేనాపతిని వారు మనకప్పగించలేదు. ధర్మంకొరకు నిజాయితీని తెల్పడానికే జంకూ గొంకూ లేకుండా వార్తాహరుని వెంటనంటి రావడం జరిగింది. అలా స్వేచ్ఛాజీవులను, ఆ భావాలు కలవారిని, మనం కూడా అంగీకరించి మన్నించాలి. అందుకే అతనికి మధురను యిస్తున్నాను. ఈయడం జరిగింది. దీనిలో మాకు చెందేది, మాకు చెందాలసింది ఏమీ లేదు. ఇదంతా హస్తినాపుర గౌరవ మర్యాదల్లో ఉండాలి. మహామంత్రీ! మన మధుర ఏలికకు కావలసిన మర్యాదలన్నీ జరిపించి వారి విడిది వారికి చూపించే ఏర్పాట్లు జరిపించండ'న్నారు.

ఆ తర్వాత సభ ముగిసింది.

సేనాపతిగా హస్తినకు వెళ్ళిన జయదేవుడు రాజుగా, మధుర నాయకుడుగా గౌరవ మర్యాదలందుకొంటూ కొన్నాళ్లు హస్తినలో ఉండి, తదనంతరం అవంతికి చేరాడు.

అవంతీపాలకులకా వార్త అంతకుముందే అందడంవల్ల ఎదురువచ్చి గౌరవంగా అవంతి సేనానిని వాత్సల్య గౌరవ మర్యాదలతో స్వాగతం పలికారు. ఎందరు ఎంత చేస్తున్నా, ఎంతగొప్పగా చెప్పకుంటున్నా జయదేవుడుమాత్రం 'నందిని ఎక్కడేనా కనిపిస్తుందా!' అన్న ఆశతో చూచాడు. కనిపించకపోయేప్పటికి విచారంగా కొన్నాళ్ళు గడిపి, అవంతి వదలి మఘురకు తరలి పోయాడు. వెళ్ళేనాడు ఎందుకు నందిని అవంతిని వదలి వెళ్ళిందో కొన్ని కారణాలు చూచాయగా అతనికి తెలిశాయి. ఆ చేసినవారిపాపం సరిగా పండి అందింది కాదు. అతని హృదయం మండిపోయింది. ఎవరో తెలియదు. ఆ చేసిన నేరం, ఆ చేసిన హత్యాకాండ ఆ దుర్మార్గం, అతని తోటలో పున్నమరేయి అని మాత్రమే తెలిసింది. వ్యక్తులు తెలియనిదే అతనేం చేయగలడు. ఎవరిని దండించగలడు?

అవంతి ఒక గొప్ప సేనానిని కోల్పోయింది. మధుర ఒక మహానాయకుని జనసత్తాకనుండి గుత్తకు తెచ్చుకొంది. మధుర వైభవం దిగ్దంతాలకు ప్రాకుతుంది. కానీ దాని యేలిక ఎప్పుడూ విచారంగా ఉత్సాహ రహితంగా ఉండేవాడని ఉంటాడని ప్రజలనుకుంటూ ఉంటారు. కారణం అవంతి అధ్యక్షునికి, జయదేవునికి మాత్రమే తెలుసు.

## 5

రోజుకొక ఊరు, పూటకో మజిలీగా, నందిని, భిక్షువు కలసి ప్రయాణం సాగించారు. ఉన్న రోజు తింటూ లేనిరోజు పస్తుంటూ, చాలా రోజులకు వారు కౌశాంబీ చేరుకున్నారు. ఆ నాటికి కౌశాంబి పతనావస్థలోనే ఉంది. ఐనా దాని గత వైభవం అలాగే ఉంది. ఉన్నతగా ఉన్న

గోజుల్లో ఉన్న కుళ్ళు కుట్ర; వైభవం హుందా పేరుతో కొట్టుకుపోయింది. ఔన్నత్యం తొలగాక, ఆ మంచి అంతా మాసి కళ్ళకు కుళ్ళు కనిపిస్తూంది. ప్రజలకు సుఖ సౌఖ్యాలంతగా అందుబాటులో లేవు. వారి గౌరవం యీనాడు దర్పంగా, చేతగాని చెయ్యిదలుగా చూపరులకు వెగటు కల్గిస్తున్నాయి. ఉన్ననాడనుభవించిన లాలస భోగాలు ఈనాడు వ్యసనంగా తయారయి వారిని ఉక్కిరి బిక్కిరి చేసున్నాయి.

నందినీ భిక్షువు వీధుల వెంట భిక్షకొరకు తిరుగుతుండగా చూచినవారు 'వీరి మూలానే కౌశాంబీకీగతి పట్టింది. లేకుంటే రసపుత్రులు రసపుత్రులుగా ఉండేవాళ్ళు. ఈ మతాన్ని నెలకొల్పిన సిద్ధార్థుడు మనుష్యుల్లో ఉన్న చేవను తీసివేశాడు. చేవ వచ్చిన పాలకులు, 'శాంతి అహింస' అని కత్తులు వదలి మృణ్మయపాత్రలు పట్టారు. దేశానికీగతి పట్టింది. చేవ చేవగా ఉన్నట్లయితే పరాయి రాజు యింత సులువుగా కౌశాంబీని వశపరచుకుందేవాడు కాదు.' ఇలాగే ఎవరి నోటికి వచ్చినట్లు వాళ్ళు మాటాడారు.

భగవానుడు చెప్పిందొకటి. ప్రజలు చేసిందొకటి. బౌద్ధాన్ని సర్వ నాశనం చేయ తలపెట్టిన వారి తలపుల్లో ఉన్నది, ఆయన గతించాక వందల వత్సరాలకుగాని పునాదులు వేయలేకపోయారు. ఆ పునాదులైనా సక్రమంగా నిలచి యిది - యిందుకు చేస్తున్నాం. మా ధ్యేయం ఇది. అని మాత్రం కాదు. దొడ్డిదోవగా నిజం తెలియకుండా, అక్రమంగా ఆడిపోసుకుంటూ పాడుచేయాలన్న తలంపుతోనే జరిపారు. మొత్తానికి తరాలు మారాయి కాబట్టి వారి తలపులోని ఆలోచనలను ఆచరించడానికి వీలుకలిగింది. ఆ వీలును తెలివిగా వినియోగించుకుంటూ, అడ్డు త్రోవగుండా

వారి ఆగమనం సాగుతోంది. అందువల్ల ఆనాటి ప్రజలలో అసంతృప్తి. అర్థజ్ఞానం నిలచిపోయి అర్థానికే ప్రాముఖ్యత వచ్చింది. ఇచ్చారు - యిచ్చి సంచరిస్తున్నారు.

తెరువులవెంట నందినీ, భిక్షువు ధమ్మపధ సూక్తులు వల్లించుకొంటూ బిచ్చమెత్తుతున్నారు. ఆ తెరవుల్లో బౌద్ధావలంబకులు లేకపోలేదు. సంధికాలం కాబట్టి నిజానిజాల నిజాయితీ తెలుసుకోడం కష్టం. భిక్షులకు ఆతిధ్యమిచ్చేవారూ ఉన్నారు. వెళ్ళమని గసిరేవారూ ఉన్నారు. రాలుగాయిలు కొందరు ముందు వీళ్ళు వెళ్ళిపోతుంటే వెనుకనుండి,

'కూతురేనేమో!'

'అఁ కూతురాపాడా. పోలికలులేవు.'

'కాదులే. బరితెగి తిరిగి, తెలుసుకొని, ముసలాణ్ణి పట్టుకుంది.'

'ఛా! ఛా! యింకా చెడలేదులా ఉంది.'

'ఏమో ఎవడు చూశాడు. ఆమె ఉత్తమురాలు కావచ్చు.'

'తియ్యావయ్యా కబుర్లు. ఎవరికి తెలియొందదీ. పగలంతా సుత్తాలు చెప్పడం సాగుపోయాక......' నవ్వాడు.

'తెలియకుండా మాటలెందుకు. ఏ పుట్టలో ఏ పాము ఉందో!'

'పుట్టాలేదు పామూలేదు. పొట్టకోసం వేషాలు అంతే!'

ఎవరికి తోచినట్టు వారనుకుంటున్నారు. నందినీ భిక్షువూ ఇద్దరూ వింటూ వెళ్ళిపోతున్నారు. అంగడి వీధికి చేరారు. అంగడి వీధులన్నీ అందంగా ఉన్నాయిగాని, వెచ్చాలేమీ ఖర్చు కావడం లేనట్టు పాడకదుతుంది. వీరు దానికి తగి

వట్టు, కాలంగాని కాలంలో చేరారు. అందువల్ల వారికా ఊరు చేర సారాలంతగా తెలియలేదు. ఐనా అది ఒకనాటి మహోన్నత నగరానికి మూలవిరాట్టన్నది అడుగడుగున తెలుస్తూనే ఉన్నది.

వారలా ప్రొద్దు వాలిపోయే వరకూ తిరిగి ఆరామానికి చేరారు. అది చాలా యేళ్ళనాడు వణిక్ ప్రముఖులు కట్టించి బౌద్దులు కియడం జరిగింది. దానికి చాలా వ్యయం చేయడాన్ని బట్టి ఆనగరిలో బౌద్ధం ఎంత ప్రబలంగా ఉండేదో ఊహించవచ్చు. ముగ్గురు వ్యాపారులు ఒకరికన్న మిన్నగా ఒకరి ఆరామాలుండాలని మూడింటిని కట్టించారు. ఒక్కో ఆరామంలో వందలకు పైగా శ్రమణులు ఉండడానికి అనువుగా ఉండేవి. ఆనాటికి ఊరు శోభలాగానే ఆ ఆరామాల శోభ కూడా తగ్గి 'ఒకనాడీ దేశం త్రిశరణ మతానికి చెందింది.' అని చూడడాని కనువుగా ఉంది. ఆ ఆరామాల్లో చాలా గదులను గబ్బిలాలు వాడుకుంటున్నాయి. కొన్నింటిని గుడ్ల గూబలు కూడా కాపరానికి మార్చుకున్నాయి. కొన్నింటిలో మాత్రం ఇంకా ఆ మతం జీవించే ఉంది. 'వైభవంగా వెలుగక పోయినా ఆంతరంగా ఉంది, అదే మీ అంతరాత్మలలోనే' అన్నట్టుగా వెలికి రాకుండా. ఎప్పుడో రోజుకు ఏ రాత్రిపూటో బిచ్చుకు వచ్చి, అందింది తింటూ వారి ఉపాసనలో వారు గడిపే వారున్నారు. అలాంటి ఆరామంలో ఒకదాని లోనికి వెళ్ళారిద్దరున్నూ. అక్కడి ఉపాసకుడు ఒక గది చూపి 'మీరూ, మీ కోమరితా ఇందులో ఉండండి. ఇదే కొంచం గాలీ వెలుతురూ అందించే స్థితిలో ఉంది.' అన్నాడు.

'భిక్షూ! నిన్ను భగవానుడనుగ్రహిస్తాడు. నేను ఎనిమిది

వత్సరాల క్రితం దీక్ష తీసుకున్నాను' అన్నాడు అంధ భిక్షువు.

'మంచిది భంతే! నేను ఐదు వత్సరాలనాడు తక్షశిలలో దీక్ష తీసుకున్నాను' అన్నాను. ఆ మతంలో కులంతో పని లేదు. వయస్సును బట్టిగాదు పెద్దరికం. దీక్ష తీసుకున్న దానిని బట్టి. ఆ విడిది చూపిన భిక్షువు కన్న మూడు వత్సరాలు దీక్షలో అంధ భిక్షువు పెద్దవాడు. అందుకనే 'భంతే' అన్న శబ్దాన్ని ఉపయోగించి గౌరవించాడు. అది బౌద్ధుల ఆలవాటు. ఆలోచిస్తే భగవానుడు వర్ణవ్యవస్థను పైకి రానీయకుండా దీనిలో ప్రమేయం లేకుండా అరికట్టడానికి పెట్టిన నియమం. ఎంత గొప్పదో అర్థమౌతుంది ఎవరికి వారికే. ఐతే కొంచెం ఆలోచించాలి. భగవానుడు నియమించిన నియమాలన్నింటికీ దాదాపు అలాగే కారణాలు, ధ్యేయం ఉన్నాయి. భిక్షువు వెళ్ళిపోయాడు తన విడిదికి.

ఆ ఆరామాని కెదురుగా 'వేప 'రావి' కలసి ఎన్నేళ్ళ వాడో పెనవేసుకొని పెరిగి వదలకండా సఖ్యంగా ఉన్నాయి. అది కౌశాంబీలో హైందవ బౌద్ధ సమ్మేళనను బయలు పరుస్తున్నదన్నట్టుగా ఉంది. రెండు వృక్షాల ఆకులూ దేని వేవో తెలియవు. అలాగే ఆ వూరు వాసులు ఏ మతం వారో ఒకనాడు తెలిసేది కాదు. ఈ నాడు రావి ఆకులన్నీ రాలి మోడుగా ఉండడంవల్ల వేప చిగుళ్ళు మాత్రం కెంపు వర్ణంలో సంధ్య కాంతికి మెరుస్తున్నాయి. కనుచూపు మేరలో గంగానదిలోని పాయ ఎక్కడికో ప్రాకి పోతుంది తెల్ల త్రాచులా. ఆ నీరంతో ఎందరు పవిత్రులయ్యారో! ఆ ఆరామంలో ఉంటూ ఆ నీరంలో స్నానం చేసి ఈ నాడెవరు ఏ కరువు పెట్టగలరు?

నందిని ప్రకృతిని చూస్తూ పులకించిపోయి,

'తాతా! మనం ఇంక ఎక్కడికీ వెళ్ళవద్దు. ఇక్కడే ఉండిపోదాం.' అంది

'అలాగే తల్లీ. ఎక్కడైతేనేం, నీవు హాయిగా బాధా రహితంగా ఉంటే అంతే చాలు. నాకన్ని ఊళ్ళూ ఒకటే. చూడలేనుగదా తారతమ్యాలు తెలియడానికి.' అన్నాడు.

'ఇక్కడ చాలా బావుంది. చాలా ఆనందంగా ఉంది నాకు.' అంది నందిని ఉత్సాహంగా. ఆమె గులాబి వన్నె వాడి, ఎఱ్ఱగా తయారయిన మనికాంతి సంజవెలుగులకు ప్రతిబింబిస్తూంది.

'ఆరామాలావరించిన ప్రతి ప్రదేశం అలాటిదేనమ్మా. మనలో ఉంటుంది మంచి చెడూ. ఆరామాల్లో వాతావరణంలో మార్పేమీ రాదు. ఇంకా ఎంత ప్రొద్దు ఉందమ్మా!' అనడిగాడు అంధభిక్షువు.

'ఎంతో లేదు. ప్రొద్దువాలిపోయింది. అదిగో భాస్కరుడపర దిక్కున ఎఱ్ఱగా చూడ సొంపుగా ఉన్నాడు. పిట్టలు గూళ్ళకు వెళ్ళిపోతున్నాయి. నీలాకాశం చాలా అందంగా ఉంది. చీకటి తూరుపునుండి తరుముకొస్తూంది,' అంది.

'ఎంత బాగా చెప్పావమ్మా! నా కళ్ళతో చూస్తున్నట్టుగా ఉంది నా మనసుకు. నీ కిక్కడ సంతృప్తిగా ఉందా?' అనడిగాడు ఆమె మాటాడిన సవ్వడి వంకకు తల త్రిప్పి.

'ఆ! చాలా బావుంది. నీవు చూడలేవుగాని తాతయ్యా! చూడగలిగితే నీవుకూడా ఎంతో సంబరపడతావు. ఎంతో అందంగా ఉందీ ప్రదేశం. అటు ఒక ఆరామం. ఇటు ఒక ఆరామం. ఎదురుగా గంగ. ఆరామంచుట్టూ చెట్లు.

యింకా యిక్కడ వాడకంలో ఉన్నప్పుడెంత బావుం దేదో! పాడుడిపోయి చెత్తచెదారం ఏవో పొదలు గజిబిజగా పెరిగినవాడే యిలా ఉంది! ముంగుగోజుల్లో ఇంకెలా ఉంటేదో.' అంది నందిని. తనను తాను సంపూర్ణంగా మరచి పోయింది.

'నేను చూడలేకపోతేయేం తల్లీ. చూచి ఆనందించే లోకం చాలా ఉంది. మీరంతా చూస్తున్నారు. అది చాలదా నాకు. చూడడం మొదలుపెట్టి చూడగలిగితే మంచిని చెడును, అందాన్ని-వికారాన్ని వేరు పరచి చూడగలగాలి సిన అవసరం వస్తుంది. దానితోపాటు మంచికి పొంగి పోవడం, చెడ్డకు వంగిపోవడం-అందానికి ఆనందం, వికారానికి ఏవగింపు చూపాలి. నాకీనాడా బాధ లేదు. అన్నీ సమా నమే. అంతా ఒకటే. ఏది ఏదో విడమర్చ లేను. ఏహ్యామూ, ఊహ్యామూలో నాకు సంబంధం లేదు. నిజంగా భగ వానుడు నాకెంత మేలుచేశాడు.' అన్నాడు. భిక్షువు చాలా తాపీగా ఏమీ బాధలేనట్లు నిశ్చింతగా, నిర్మలమైన స్వరంతో.

'నీకు అలా ఉండడం బావుందా తాతయ్యా!' అడిగింది నందిని.

'ఎలా ఉండడం తల్లీ! మొదటినుండీ ఒకేలాగా ఉన్నానుకదా? అలా అని అనడానికి నాకేం ఉంది? మధ్య వచ్చింది. మధ్యపోయిందీ కాదుకదా? ఈ చూపు విషయం.' అన్నాడు భిక్షువు. నందిని మాటాడలేదు. 'ఇది కౌశాంబీ కాదూ మనం ఉన్నది?' అనడిగాడు ఆమె మౌనంగా ఉండడం గమనించి.

'ఆఁ.' అంది నందిని,

'ఇది మొదటినుండీ చాలా ఉన్నతమైన రాజ్యం. దీన్ని

'వంసా' అని, 'వత్స' అని 'కోసాంబి' అని కౌశాంబీ అని పిలుస్తారు. భగవానుని కాలానికి దీనిని 'ఉదయనుడు' అనే రాజు పాలించేవాడు...'

'నీకు తెలుసా?'

'అదేమిటమ్మా! అలా అంటావు. తెలిసేదేముంది? చెప్పు కుంటుంటే విన్నదే! నాకు దీక్షనిచ్చిన భిక్షువు ఇలాటి దేశ చరిత్రలు చాలా హట్టకథల్లోనున్నవి చెప్పాడు.'

'నీకు జ్ఞాపకమున్నవి చెప్పు తాతా!' అంది నందిని.

'చెప్పుతాను వినమ్మా. దానికేం అంతకన్నా నాకు కావలసింది మాత్రమేముంది? ఈ రోజే ఆ రామంలో ఈ దేశకథనే చెప్పుకుందాం.

'ఇది దాదాపు 7-8 వందల సంవత్సరాలనాటి కథ. ఈ కౌశాంబిని ఉదయనుడనే రాజు పాలించేవాడు. మంచి అందగాడు. దానికితగినట్టు వయసులో ఉన్నాడు. అతనికి ఏనుగులను పట్టుకుందే మంత్రం తెలుసు. ఏనుగుల పిచ్చి చాలా యెక్కువతనికి. ఏనుగులున్నాయని తెలిస్తే ఎంత దూరమైనా సరే వెళ్ళి పట్టుకొని తెచ్చుకుందేవాడు.

'సరిగ్గా ఆరోజుల్లోనే, ఉజ్జయినిని ప్రద్యోతనుడనే రాజు పాలిస్తుందేవాడు. అతనికి రాజ్యకాంక్ష చాలా యెక్కువ. ఎలాగైనా ఈ కౌశాంబీని తన పాలనలోకి తెచ్చుకోవాలని చాలా ప్రయత్నించాడు. ఉదయనుడు కూడా సామాన్యుడు కాడు. చాలా నేర్పరి. దానికి తగినట్టు ఈతనికి ఏనుగుల సైన్యం హెచ్చు. ఈ కుంజరయూథాన్ని వెంటబెట్టుకొని ఉదయనుడు మత్తవేదండంలా భండనంలోనికి దిగితే ప్రద్యోతనునిలాంటివారు పారిపోవడానికి కూడా వీలు దొరకదు. అందువల్ల యుద్ధంవలన లాభంలేదని ఏదో కుట్ర పన్ని ఈ కౌశాంభిని కైవశం చేసుకోవాలనుకున్నాడు.

అందుకు ప్రద్యోతనునికి దొరికినదొకటే ఉపాయం. యంత్రాలతో ఏనుగును చేసి ఆ ఏనుగులో బలమైన సైన్యాన్ని కొంత ఉంచి, ఉదయనుడు పట్టుకోడానికి వెంటాడినప్పుడు సరిహద్దులు దాటాక, అతన్ని బంధించి [illegible] వన్నాడు. అనుకున్నట్టు పన్నాగం పన్నాడు. వేదండ విహార వినోదంలో ఉదయనుడు ఒళ్ళు మరచి సరిహద్దులు దాటాడు. ప్రద్యోతనుని సేన అతన్ని బంధించి ఉజ్జయిని చేర్చింది. ఉదయనుడు బందీగా దొరకగానే ప్రద్యోతనునికో ఆలోచన తట్టింది. ఇతనికున్నదంతా దంతావళి బలమే కాబట్టి, ఇతనికి తెలిసిన కరులవరికట్టే మంత్రం మనం నేర్చుకొని అతనిలా గజేంద్ర సేనను పెంపొందించుకుంటే ఆ తర్వాత ఉదయనుని యుద్ధంలోనే పట్టుకోవచ్చు. అదెంతపని అనుకున్నాడు. ఉదయనుని పిలిచి—

'నీకు తెల్సిన వేదండ బంధన పాండిత్యాన్ని నాకు నేర్పు. నిన్ను బంధవిముక్తుని చేస్తాను. నీ యిచ్ఛవచ్చినట్టు తిరిగి కౌశాంబికి వెళ్ళిపోదువుగాని!' అన్నాడు.

దానికి ఉదయనుడు 'సరే. అదెంతపని! అలాగే నేర్పుతాను. కానీ నీవు నాకు శిష్యుడవై నాకు నమస్కరించి శుశ్రూష చేయాలి. అలా చేయగలిగితే రేపటినుండే నేర్చుకుందువుగాని రా!' అన్నాడు.

దానికి ప్రద్యోతనునిలోని అహంకారం దెబ్బతిని, 'నీవు నాకు బందీవి. నన్ను నీకు మ్రొక్కమంటావా? అది నావల్లగాదు!' అన్నాడు.

'అలాగైతే నీకామంత్రం నేర్పను. నేర్పినా అది పని చేయదు. నేను నా గురువుకు శుశ్రూష చేసి మ్రొక్కి కాళ్లు వత్తి నేర్చుకోలేదా? నీ గొప్పేమిటి? అలా చేసినవారికే

ఆ మంత్రం సిద్ధిస్తుంది.' ఉదయనుడీ మాటనగానే ప్రద్యోధనునికో ఆలోచన తట్టి—

'అహా! నన్నెదిరించి మాటాడతావా? నీచేత గూని దానికి మంత్రం నేర్పింప చేస్తాను,' అన్నాడు.

అంతలో కథ మధ్యలో నందిని అందుకొని 'తాతా! గూనివాళ్ళైతే ఏం?' అంది.

'గూనివాళ్ళను ఉదయనుడు చూడడు. ఆ సంగతి ఎక్కడో ఎవరినోటో ప్రద్యోధనుడు విన్నాడు. అలా అని ఊరుకోక, అంతఃపురానికి వెళ్ళి తన కూతురును [illegible]డు. ఆమె కుష్టువాళ్ళను చూడదు. అది తెలిసిన ప్రద్యోధనుడు 'అమ్మా! ఒక సిద్ధుడు వచ్చాడు. అతనికి ఏనుగులు పట్టే మంత్రం వచ్చు! అది నీవు నేర్చుకుంటావా?' అన్నాడు.

'దానిదేముంది! అలాగే నేర్చుకుంటాను. నీకు చాలా విద్యలు వచ్చు. అదీ నేర్చుకుంటాను.' అంది ఆమె.

ప్రద్యోధనుడు నంగుతూ 'ఐతే ఒక చిక్కు వచ్చిందమ్మా! వాడికి కుష్ఠు రోగం ఉంది. వాణ్ని చూస్తూ చూస్తూ నీ వెలా అభ్యసిస్తావు?' అన్నాడు.

దానికామె చాలా సేపు ఆలోచించి 'ఒక పని చెయ్యి నాన్నా! మా ఇద్దరి మధ్య ఒక తెర అడ్డం కట్టు. మంత్రం విని నేర్చుకుందేదేకదా?' అంది. ఈ ఉపాయం నచ్చినట్టు నటించి ప్రద్యోధనుడు 'ఒక గూనిదాన్ని తెరలో ఉంచుతున్నాను. దానికి నీ ఏనుగులను బంధించే మంత్రం నేర్పి నీవు బంధవిముక్తుడవు కావచ్చు.' అని కబురు పంపాడు.

'ఎవరైతే నాకేం నాకు నమస్కరించి శిష్యత్వం స్వీకరించిన వారికి నేను నేర్పుతాను.' అన్నాడు ఉదయనుడు.

మరునాటినుండి విద్య ప్రారంభించాడు.

వింటున్న నందిని 'తాతాయ్యా ఆమె పేరు?' అంది

'ఆమేనమ్మా వాసవదత్త. ఈమెనే వాసవదత్త అని కూడా అంటారు. కొన్ని రోజులు గడచి పోయాయి. ఒక నాడు ఒక మంత్రం చెప్పాడు. దానినామె సరిగా ఉచ్ఛరించ లేదు. మళ్ళీ చెప్పాడు. మళ్ళీ ఆమె తప్పుగానే ఉచ్ఛరించింది. దానితో విసిగి, 'నీవు గూనే కాదు. చెముడూ, నత్తి కూడా ఉందే.' అన్నాడు.

సహజంగా మాటపడని వాసవదత్త అహం దెబ్బతింది. గబాలున 'అవి లేవు సరిగదా, నీకులా నాకు కుష్టు లేదు' అంది.

'నన్ను కుష్టువాడంటావా?' అన్నాడు ఉదయనుడు.

'నన్ను గూనిదాన్నంటావా?' అంది రాజకుమారి వాసవదత్త.

'ఆఁ ఆఁ' అంటే 'ఆఁ ఆఁ!' అని ఇద్దరూ ఒక్కసారి తెరను అడ్డు తొలగించారు. అంతే. వారి కన్నులను వారు నమ్మలేక పోయారు. వాసవదత్త అపురూప లావణ్యానికి ఉదయనుడు ముగ్ధుడయ్యాడు. ఉదయనుని రూప విలాసాలకు వాసవదత్త ఎదద తత్తరించింది. తండ్రి చేసిన మోసం గమనించింది. తండ్రి ఏ భయంతో నైతే ఉదయనుని మీద నియకుండా చేయాలనుకున్నాడో, ఆ కార్యం కాస్తా తీరి పోయింది. ఇద్దరూ ఒకరొన్నకరు ఆకర్షించుకొని తండ్రిని గూర్చి చర్చించుకున్నారు.

ఉదయనుడు 'మీ నాన్న మనని మోసం చేశాడు. కాబట్టి మనం కూడా మీ తండ్రిని మోసం చేయాలి. మనం పారిపోదాం. కౌశాంబిలో నిన్ను పెళ్ళి చేసుకుంటాను' అన్నాడు. దానికామె అంగీకరించింది. కావలసిన పథకమంతా ఉదయనుడు అల్లాడు. దాని ప్రకారం కొన్నా

ళ్ళయ్యాక తండ్రితో వాసవదత్త అంది. నాన్నా మంత్రం పూర్తయింది. ఇంక ఆకులను గూర్చి ఏదో చెప్పాలట. నేను పట్టపు ఏనుగు మీద వెళతాను. అతడు ఘుఘ్ఘుమ్మీద వస్తాడు. అంబారిలో పరదాలు దింపండి.' అంది. ప్రద్యోధనుడు సరే నన్నాడు.

ఆ మరునాడు భద్రవతి అనే పట్టపు దంతావళాన్నెక్కి, తనకు కావలసిన రత్నాలు, సొమ్ములు తీసుకొని అడవికని వంకతో వెళ్ళిపోయింది వాసవదత్త. ఆమె వెనుక ఉదయనుడు వెళ్ళి అడవిలో అతడు కూడా ఏనుగునెక్కి కౌశాంబీ చేరి, 'నీ కూతురును ఫలానా ముహూర్తాన పెళ్ళాడబోతున్నాను. నీవు చేసిన మోసం తెలిసిపోయింది. నేను కూడా మోసం చేయగలను. కాని నా మోసంవలన ఎవరికీ హాని రాదు. ఏ చేతనైనది చేసుకోవలసింది!' అని వార్త పంపాడు. ఆ వార్త విని ప్రద్యోధనుడు చాలా చింతించాడు. చేయగలిగింది లేక బ్రతికినంతకాలం దిగులుతోనే బ్రతికాడు. తర్వాత ఉజ్జయినికీ కౌశాంబికి ఒకే రాజు అయ్యాడు. ఆ తర్వాత అంతా కలసి వొద్ధలయ్యారుట,' అని అంధభిక్షువు కథ ముగించాడు.

ఈ విధంగానే కౌశాంబీలో జరిగిన కథలు రోజుకొకటి చెప్పుకుంటూ భిక్షుతో కాలం గడుపుతున్నారు. తిరిగి పున్నమి వచ్చింది. అలాంటి పున్నములు చాలా వెళ్ళాయి. ప్రతి పున్నమీ నందినిలో సంచలనం కలిగించింది. బాధ కలిగించింది. అవంతిమీద ద్వేషాన్ని రగిల్చింది. ఆ ద్వేషం పున్నమి పున్నమికీ రగిలింది. రాను రాను ఆమె ఆ ద్వేషాన్ని ఇముడ్చుకోలేకపోయింది. ఆమెకు నిద్ర పట్టలేదు. ఎదురుగా తెల్లగా గంగ కనిపిస్తుంది. ఆ నీళ్ళల్లో చంద

మామ వలయాలు తిరుగుతూ ఆమె మనస్సులా కొట్టు కుంటున్నాడు.

వేపాకులు గాలికి కదలుతున్నాయి. రావాకులు రాపిడి వినిపించడంలేదుగాని మోడు చిగురించింది. గుట్టల్లోనుండి గీగీమన్న సద్దు వస్తూంది. ఆరామంలో ఎవరూ మేల్కొని లేరు. ఐనా సందడిలేదు. మనుష్యులు కూడా లేరు. జన సంచారంలేదు. ఊరు దూరంగా ఉన్నట్టు దీపాలు మినుకు మినుకు మంటున్నాయి. అవైనా కాంతిగాలేవు. ఇళ్ళల్లోని కిటికీలలోగుండా వెలుగును ప్రసరించాలి. వెలుపల తెలగా చంద్రుణ్ణి సానపట్టిన పాడిలాగా వెలుగు మెరిసిపోతుంది. సద్దయినపుడు పిట్టలేవో గోల గోలగా అరచి ఊరుకుంటు న్నాయి. అలా వెన్నెలతో వేగిపోతోంది నందిని హృదయం. ఆమె ఆలోచనలో ఉండగానే అంధభిక్షువు 'ఎవరది?' అన్నాడు. నందినికా మాటలు వినపడలేదు.

తిరిగి భిక్షువు 'అమ్మా నందా!' ఎవరో వస్తూంది?' అన్నాడు.

నందిని లోకంలోనికి వచ్చింది. 'ఏమిటి తాతయ్యా?' అంది.

'ఎవరో వచ్చినట్టుంది!' అన్నాడు.

'ఎవరూ లేరే!' అంది నందిని.

'నీవేమేనా కదిలావా?' అనడిగాడు అంధభిక్షువు. కనులు లేనివారు అలికిడమీద ఆధారపడతారు. వారు ఒకోసారి అడుగులనుబట్టే ఎవరైనదీ పోల్చుకుంటారు.

'ఆఁ. నేనే తాతా! అటూ యిటూ తిరగాను.' అంది.

'ఈ రోజు పౌర్ణమా? తల్లీ!' అన్నాడు. అతను తెలుసు కుంటూనే ఉన్నాడు. రోజులూ వారాలూ తెలియక

పోయినా, ఆమెనుబట్టి ఆ పున్నమినిమాత్రం గుర్తు చేసుకో గలడు.

'ఆఁ ఔను తాతా!' అంది నందిని.

'ఈ రాత్రి నీకు నిద్ర ఉండదు కాబోలు. ఐనా నందా! నీలోని ద్వేషాగ్నిని రగుల్చుకోకమ్మా! బాధను రేపుతున్న కొలదీ బరువవుతుంది. ఆ భారంతో చాలా కాలం బ్రతకలేం. బాధను అణచుకునే శక్తిలేనప్పుడు మరచి పోవడం మంచిది. పగను పెంచుకోకూడదు, త్రుంచుకో వాలి. తెంచుకోవాలి. పగ సెగలేచి పొగలాడుతున్నకొద్దీ, ఇరుకైన భారీ ఊహలు రావు. హృదయం విశాలందక్క, ఇరుకై మంచివాటికి చోటులేకుండా పోతుందమ్మా!' అన్నాడు.

'నీవు చెప్పేది నిజంకావచ్చు. కానీ, ఎలా తాతయ్యా! నేను మరువగలిగినదే జరిగిందా? ఆ సంఘటన జరక్కుండా ఉంటే నేను యిక్కడ ఉండేదాన్నా?' అంది నందిని.

'ఔనమ్మా! ఒకో సంఘటన ఒకో జీవితాన్ని తారు మారు చేస్తుంది. నీ జీవితంలోనూ ఆ సంఘటన అలాగే తారు మారు పరచి సర్వనాశనం చేసింది, కాదనను. కానీ, నేను కూడా ఏమీ చెప్పలేనమ్మా! విలువ కలిగింది. విలువ కట్ట రానిది. ఈ లోకం యీ కతుకలిసినా ఆడదానికి ఏది కాదో ఏది కాకూడదో అది జరిగింది. నిజంగా నీవు చాలా బలవంతురాలవు. నిన్ను మించిన ధైర్యశాలులు లేరు. నీవు నిజంగా చాలా నిబ్బరంగలదానవు. అందుకే బ్రతకగలుగు తున్నావు. అదే ఆలోచిస్తూ వుంటాను.' అని ఆవలించాడు. అంధభిక్షువు.

'నిద్రపో తాతయ్యా!' అంది నందిని.

భిక్షువు 'ఆఁ ఆఁ! నీవుకూడా కళ్ళుమూసుకొని పడుకో తల్లీ! ఆలోచనలు మాను.' అన్నాడు. ఆలోచనలు మాను మంటే ఆగిపోతాయా? అలా వీలైతే ఆలోచనలకు విలువ వుంటుందా! వాటిశక్తి వేరు. అవి కలిగేప్పుడు వదలించు కోలేం. వదలించుకోగలిగినవా రెందరుంటారు లోకంలో.

నందిని అలాగే ఆలోచిస్తూ వెన్నెలను చూస్తూ పడుకుంది. ఎంతసేపు నిద్రపోయిందో తెలియదు. హఠాత్తుగా తన ప్రక్క ఏదో సవ్వడైంది. కళ్ళువిప్పింది. కానీ, నోరు విప్ప లేకపోయింది. ఎదురుగా ఎవరో నిలచి ఉన్నారు. వెన్నెలకు ఆ వ్యక్తి చేతిలోనికత్తి మెరసిపోతూంది. ఆ వ్యక్తి నోటి మీద వేలు ఉంచి, 'అరచావా! ఆ ముసలాణ్ణి, నిన్ను కలిపి పాడిచేస్తా'నని సైగచేశాడు. ఆమె కేమీ తోచలేదు. మెల్లగా లెమ్మని సైగచేశాడు. చప్పుడు కాకుండా లేచింది. 'పద' అని ద్వారం చూపాడు. ఆమె సవ్వడికాకుండా నడ చింది. వెలికివచ్చింది. అతడు వెన్నంటి వెళ్ళాడు. ఆ రామం బయలు ప్రదేశం చేరారు. ఇసుకతిన్నెలు వెన్నెలకు మెరసి పోతున్నాయి. రావిఆకులు వెండి నీరద్దిన తీరుగా ఉన్నాయి. కొంత దూరం నడచాక 'ఇదుగో అమ్మాయ్! నీవు నోరెత్తి అరచావా? నిన్ను చంపేస్తాను. తర్వాత ఆ వృద్ధునికూడా పొడిచి వేస్తాను. తెలుసా?' అని చేయిచాపి ఆమెను దాపుకు లాక్కున్నాడు. పెనవేసుకున్న రావి వేపల నీడ ధరాతల మ్మీద పడుతూంది. ఆ నీడలో పూర్వం ఎంత లేని సిద్ధులు కూర్చొని మునకినిగూర్చి చింతించారో! ఆ ముష్మికమైన ఊహల నరికట్టి అనంతశక్తి సన్నిధిమైన అంతరాంతర భావ వీచిలో, ఆనంద లహరిలో మునిగిపోయి, లోకాన్ని మరచి శరీరాన్ని మరచి, తమను తాము మరచి ఏ తెలియని తీరా లకో - బలంలేని సౌఖ్యాలకో వెళ్ళిపోయి సమాధిలో నిలచి

సర్వం సౌఖ్యదాయకం కావాలని ప్రార్థించారో ఎవరికి తెలుసు?

ఆ నీడనే, ఆ నీడలోనే ఎంత దారుణం! ఆ ధర విచ్చిపోదేం? పగిలి బీటలువారి అందులోనుండి అతల జాహ్నవి వెలికివచ్చి కాకాంబిని మంచి క్రూరకార్య నిర్వహణకు పూనుకున్న అతన్ని నాశనం చేయదేం? ఆ పవిత్రమైన సమ్మిళిత తరువులు రెండూ అలాగే అతనిమీద కూలిపోవేం? వేదావేదాంగాలలోని అనంతశక్తి లేచి అతన్ని నాశనం చేయదేం? లోకానికి అహింస బోధించిన ఆ బోధిసత్వుడు, ఆ శుద్ధోధనుడు, ఆ బుద్ధుడు ఇంత హింస జరుగుతుండగా చూస్తూ ఊరుకున్నాడేం? మేకపిల్ల కంటినీటికే కరిగిపోయిన కారుణ్యమూర్తి కరుణారస భరితమైన హృదయం ఎందుకు కరుడుకట్టింది? విహారంముందు వెన్నెల్లో, తరువుల నీడలో, గంగఒడ్డులో; కదంబవృక్షలహరిలో శీతలానిలంలో ఏమిటా రాక్షసత్వం.'

'ఎవరు నీవు?' అంది నందిని. అతని క్రూరకార్యాలకేవిధమైన ఆటంకం కలుగనీయలేదు. కాదూ కూడదూ అనలేదు. కళ్ళనీళ్ళుమాత్రం జారుతున్నాయి. గొంతు కొంచం జీరబారింది. అతను ఆమె పెదవులను విప్పనీయలేదు. ఆమెను లేవనీయలేదు. క్షణాలు గడచిపోయాయి. ఉచ్ఛ్వాస నిశ్వాసలతో అతడు 'మూన్నాళ్ళనుండి ఈ అదనుకొరకు వేచి తిరుగుతున్నాను.' అన్నాడు.

చెక్కిలిమీది చేయినుంచి 'ఊఁహు!' అంది వెన్నెల్లో జాలగా చూస్తూ.

'నీవింకా అల్లరి చేస్తావనుకున్నాను!' అన్నాడు.

'ఊఁహుఁ!' అంది నందిని, అతనివంక చూస్తూ ఆలోచిస్తూ అతి తేలికగా.

'ఎంత అందంగా, ఎంత కోమలంగా, ఈ వెన్నెల్లో ఎంత బావున్నావు!' అన్నాడు.

'ఊఁ కానీ! నలిపివెయ్. అందాన్ని అందానికున్న కోమలాన్ని నీ కర్కశ కరాలతో బంధించి నాశనం చెయ్యి. తృప్తి తీరదా, నీ కరంకన్నా కర్కశమైన ఆ బాకుతో ఈ రొమ్ముల్లో గ్రుచ్చు. కానీ! ఇంతకన్నా చేయ గలిగిందేమేనా ఉందా? ఏది, ఎన్ని 'దీనారాలు' సంపా దించావో ఈ కార్యంవల్ల చూపించు! ఈ పనివల్ల నీకొరిగిన దేమిటో చెప్పు?' అంది నందిని ఏడుపు గొంతుకతో.

'నీ కొరకు నేను ఎంత బాధపడ్డానో నీకేం తెలుసు?' అన్నాడా ఆగంతకుడు.

'ఎందుకూ, బాధ? ఏదీ నీ బాధకు ఫలితం? నీ బాధ లోని సత్యం నిలచిందా? నన్ను బాధించావు! ఈ కార్యం వలన నేను బాధపడాలి. కానీ పడను. నీ కక్కుర్తిలో, నిన్ను నీవు మరచిపోయావు. నన్ను మరపించ ప్రయత్నిం చావు. దానివలన లాభం చూపు? బాకుతో బెదరించావు. హత్య చేస్తానన్నావు. ఎందుకు? ఇందుకేనా? ఇదేమంత ఘనకార్యమని ఈ కార్యంకొరకు మారణం జరుపనెంచావు? ఇందాకటినుండి అడుగుతున్నాను. దీనికి ఫలితం ఏమిటి? ఆ ఫలితం చెప్పు? ఊఁ చెప్పు?' అంది నందిని చాలా బాధగా. రెప్పవాల్చకుండా అతని కళ్ళల్లోకి చూస్తూ.

'ఫలితం... ఫలితం......' అన్నాడు.

'ఊఁ చెప్పు? ఏం సంపాదించావు? తిరిగి అదే కార్యం చేయగలవా? ఈ శరీరాన్ని నీ శరీరంతో కలపి మలిన పరచావు. ఆ మలినపరచడంవలన నీవందుకున్న దేమిటి? ఒక రాజ్యం అందిందా? ఒక విహారంకట్టావా? కనీసం కడుపు నిండిందా? పోని దాహం తీరిందా? తృష్ణ చల్లారిందంటావు!

అంతేనా? నీ తృష్ణముందు ఆ భిక్షువు ప్రాణం నా ప్రాణం కూడా తేలికయ్యాయి. అంతేనా?' అంది.

'నీవ నేది నాకర్థం కావడంలేదు!' అన్నాడు తెప్పరిల్లలేక.

'నీవు చేసిన పనికి అర్థం అడుగుతున్నాను. అంతేగాని, నేనేమీ అడగడంలేదు!' అంది వదిని.

'దేనికి?' అన్నాడు.

'ఇప్పుడు బలవంతంగా నన్ను చెరచావే దానికర్థమేమిటి? దాని ఫలితమేమిటి? అని అంతే!'

'నాకు తెలియడంలేదు.' అన్నాడు.

'ఔను. తెలియదు. తెలియని కార్యం చేస్తావు. అర్థరహితమైనవి చేస్తావు!'

ఆరామంలో అంధభిక్షువు 'నందా! నందా!' అని అరుస్తున్నాడు. ఆమెకు వినిపించింది. అతడూ విన్నాడు. 'అదుగో! గృడ్డి లేచాడు. వస్తాడేమో!' అన్నాడు.

'రానీ! వస్తేయేం? అంత భయం కలిగే పని ఎందుకు చేశావు?' అనడిగింది.

'నాకేం భయం! నిలువునా నరికి వేస్తాను!' అంటూ లేచాడు.

'అదే కానీ! ఇది చేసినవాడికదో లెక్క! వెళ్ళిపోతావేం? ఆగు!' అంటుండగా, అంధుడు అక్కడికి వచ్చాడు. తడుముకుంటూ నందా! 'నందా! యింకా నిద్ర పోలేదా?' అన్నాడు.

అంతలో అతడు నడక సాగించాడు. 'ఎవరా వెళ్ళేది?' అన్నాడు అంధభిక్షువు.

'కళ్ళున్న గ్రుడ్డివాడు.' అంది నందిని.

'ఎవరూ!' అన్నాడు భిక్షువు.

'కత్తిపట్టిన పిరికిపంద!' అంది నందిని.

'నీవనేదేమిటి? ఎవర్ని గూర్చి నందా!' అనడిగాడు అంధుడైన భిక్షువు.

'కామ దాహంతో కళ్ళు తెలియక, నిద్రపోయే నన్ను తట్టి లేపాడు తాతా! నేను నిద్ర మేల్కొన్నాను. ఇంక నిద్ర పోను. వాడి దాహంతో నాకు దాహం కలిగించాడు.'

ఇంకా ఏదో అనబోతుండగా 'నందా ఏమిటమ్మా నీవనేది?' అన్నాడు భిక్షువు.

'ఏముంది తాతా! తిరిగి ఆ పున్నమి వెన్నెల రేయీ ఈ రేయీ ఒకటయ్యాయి.'

'ఎవరమ్మా అతడు?'

'నాకు మాత్రం ఏం తెలుసు? కళ్ళు మూసుకొని వచ్చి నా కళ్ళు తెరచి వెళ్ళాడు.'

'ఏమిటో నీ భావం నా కర్థం కావడం లేదు తల్లీ! సరిగా చెప్పు? అలా లోనికి వెళదాం పద. ఈదురుగాలి కొడుతూంది.' అన్నాడు.

'ఈ ఈదురు గాలి నన్నిక ఏమీ చేయిలేదు సరికదా నా కెదురు లేదు తాతా! నా కెదురు లేదు. నందిని చుట్టూ ఈ లోకం తొందరలోనే తిరగాలి. తప్పదు. త్రిప్పుతాను. నన్ను రెచ్చగొట్టింది లోకం. నాశనం చేస్తాను. సర్వ నాశనమై పోతాను.' అంది నందిని ఆవేశంతో. ఆ వస్తున్న స్వరాన్ని బట్టి ఆమె చాలా ఉద్రేకంలో ఉన్నట్టు ఆ ఆగ్రహాన్నిప్పుడు ఎదుర్కోలేనని అంధ భిక్షువు తెలుసు

'లోపలకు వెళదాం రామ్మా!' అన్నాడు.

'ఇంక లోపలున్నా వెలుపలున్నా నా తృష్ణ చల్లారదు. నేను ఏది కాదనుకున్నానో, ఏది చేయకూడదనుకున్నానో, ఈ లోకానికదే కావలసి వచ్చింది. ఇచ్చి నాక్కావలసింది నేను తీసుకుంటాను తాతా!' అంది.

'అమ్మా! నందా! నీవు...' మధ్యలో అందుకుంది. 'ఇక ప్రయోజనం లేదు. నీ శాంతి వచనాలు నా దగ్గర పని చేయవు. భగవానుడు చెప్పినట్టు ప్రస్తుతం కట్టెకు నిప్పంటుకుంటే ఆ కట్టె కాలిపోతుంది. మనిషికి తృష్ణ ఉంటే అ తృష్ణ వారిని సర్వ నాశనం చేస్తోంది. అంతే కాదు, మరో మెట్టు పైకెక్కుతాను. ఆ కట్టెతో పోదు. దానికందు బాటులో ఉన్న కట్టెలను కూడా కాలుస్తుంది. ఇంక నేనీ సూత్రంమీద నడుస్తాను. వాంఛల నరికట్టడం కాదు. వాంఛలను రెచ్చగొడతాను. నా వాంఛలను తీర్చుకుంటాను. తాతా! మనం రేపు వెళ్ళిపోవాలి. నాతో నే రా తాతయ్యా!' అన్నది నందిని.

'అలా నేనమ్మా! వస్తాను. నా కెక్కడైతేయేం!' అన్నాడు అంధభిక్షువు.

'ఒద్దు తాతయ్యా! నీవు నాతో వద్దు. నీవు పవిత్రుడవు. నేనింక పాపాల తీరాలకు పోతున్నాను. నా అవినీతి కార్యాలు నీ వలన కొన్ని ఆగిపోతాయి. ఎంత అట్టడుగుకు జారి పోతానో నాకు తెలియదు. అలాంటి చోట నీ లాటి వారుండ కూడదు. అ మలినం మీ కంట పడకూడదు. మీరు పవిత్రంగా ఉండాలి. నా కార్యాలవల్ల మీ మనస్సు నొవ్వ కూడదు. అందువల్ల మీరు నాతో ఉండకూడదు.' అన్నది

'నందా నన్ను ......' ముసలి మాటాడలేక పోయాడు.

'తాతయ్యా! నీలోనూ నాదీ అన్నది ఉందా: ఎంత ఆశ్చర్యం! నీ కావలసింది వారెడు గింజలు. ఆ గింజల గంజికి నీకు ఎక్కడా లోపం రాదు. నాకు తెలుసు. కాని ఒక్కటి గుర్తుంచుకో. ఈ జీవితంలో ఎంత అతలంలోపడి ఉన్నా నిన్ను తలచుకోని రోజు ఉండదు. తప్పకుండా నీ దాపుకు చేరతాను. నా అంత్య దినాలు నీ పంచనే దొర్లుతాయి. ఈ రణంలో నేను నిల్వలేను. ఆ రణ ఋణం వదలించుకోవాలి! తప్పదు.' అంది నందిని.

'నందా! లోకంతో ఆడుకోవాలని చూస్తున్నావా? ఓడిపోతావమ్మా!' అన్నాడు.

'ఓటమీ గెలుపులు కావు. తాతయ్యా! లోకంతో నే వాడుకోను. ఈ లోకాన్ని ఆడిస్తాను. నా యిచ్ఛ వచ్చిన రీతిలో ఈ ఏనుగులను, ఒంటెలను, బంట్లను, రాజులనూ, మంత్రులనూ, ఆడిస్తాను. ఆడించి చూస్తాను. వాడవాడల్లోని మేడలన్నీ నందిని మయమే. నందిని ఉన్నచోట నందనవనం ఉంటుంది. చందనవీచి వీస్తుంది. సౌందర్యం ఉంటుంది. సౌందర్యలహరిలో విహరిస్తారు విటాళి. ఆ విటాళికి మకరందం అందదు. కాని, మత్తు ఉంటుంది. పుప్పొడి అంటిన పాదాలతో ఒప్పులకుప్పగా గొప్పగా చెప్పుకుంటారు. సంచలనం తప్పదు. నిద్రిస్తున్న వన్నెంగుకు తట్టి లేపాలి? నేను జాగ్రదావస్థ రాకుండానే ఉండాలి. మేల్కొని ఒడలు విరుచుకున్నాను. ధర్మంతో న్యాయంతో పనిలేదు. సంఘాన్ని నమ్మను. నమ్మినట్టు నటిస్తాను. ఇన్నాళ్ళూ మౌనంగా ఉండి ఆలోచించిన దాని సారాంశం యిది తాతా!' అంది గంభీరంగా లోకంమీద యూష్టనంతా కాలికక్కుతూ.

ఆ వాగ్ధాటికి అంధభిక్షువు ఆశ్చర్యపోయాడు. ఒకనాడు సిప్రానది ఒడ్డున ఒడలు తెలియకుండా పడిఉన్న వందినియేనా ఈమె? అని ఆమె ముఖాన్ని, ఆమె అందాన్ని, ఆమె సోయగాన్ని మనోనేత్రంతో హృదయ ఫలకమ్మీద ముద్రించి చూచుకుంటున్నాడు. పోలికలు కుదరక అలమటించి పోతున్నాడు.

'నందా! నీవు చేయదలచిన కార్యాన్ని తిరిగి ఆలోచించమ్మా!' అన్నాడు నిదానంగా.

ఆమె పకపక నవ్వింది. ఆ నవ్వులో స్వచ్ఛత లేదు. ఉత్త గలగల. అది కూడా రాళ్ళమీద నీళ్ళుగుమ్మరించిన రీతిగా ఉంది. గాని, గంభీరంగా ఉత్తుంగ తరంగ చంగళితమైన నినదం కాదు. గాలి ఆకుల గలగలలా ఉంది. కాని, రాళ్ళు రాళ్ళు కొట్టుకున్న గట్టిశబ్దం కాదది.

'తాతయ్యా! ఇంకా ఆలోచన దేనికి? నేను ఏ మహత్తరకార్యం చేయపోతున్నానని ఆలోచన. లోకానికి సందేశం ఈయబోతున్నానా? లోకులను రక్షించబోతున్నానా? మహాప్రవక్తగా మంచిచేయమని బోధించబోతున్నానా? కాదే. రక్ష కాదు తాతా శిక్ష! నా కక్ష. ధర్మాన్ని భక్షించ దలచాను. బంతి మెత్తగా ఉందికదా- దాన్ని విసరికొడితే అది ఎంత ఎత్తుకు లేస్తుందో, అందకుండా ఎంత దూరానికి పోతుందో, దానికొరకు విసరినవారెంత ఆయాసపడాలో చూపాలని చూపే ప్రయత్నాని కాలోచన యెందుకు? అందమైన పూవును చెట్టునుండి వేరుచేసి, ఆహారం అందకుండా వాడబెట్టి, ఎండగట్టి వాడాక విసరి కొట్టే ఈజాతికి, వాటివిలువ దొరక్కుండా తప్పుకుంటే

వారు చేయగలిగింది చేసేది ఏమిటన్న ఆలోచన అందని దానికోసం ప్రయత్నిస్తే జరిగేదేమిటో చేసి చూపుతాను. అంతే! దానితోపాటు నా కని తీర్చుకుంటాను...' అంది నందిని.

'నా కళ్ళు పోతున్నాయి తల్లీ!' అన్నాడు బాధగా. ఏ మాట కేమాట అంటున్నాడో మాటకు మాట ఎలా అతికి చెప్పాలో తెలియ లేదు.

'అదేమిటి తాతా అలా అంటావు?' అంది.

'ఇన్నాళ్ళూ నిన్ను నా కళ్ళని నమ్మాను. నీవు వెళ్ళి పోతున్నావంటే నా కళ్ళు పోవడం కాదా?' అన్నాడు.

'నేను మామూలు నేత్రాన్నే కాని, జ్ఞానం నేత్రం కాదు తాతా! ఈ నేత్రంవల్ల నీవు తప్పుదారిన ప్రయాణించ వచ్చు. అందుకే తప్పుకుంటున్నాను.' అంది నందిని.

ముసలాయన మాటాడ లేక పోయాడు. కొన్ని క్షణాలిద్దరి మధ్యా నిశ్శబ్దం ఆవరించింది. చెట్టునీడ ఆమె మీదినుండి తప్పుకుంది. అది ధర్మం తప్పుకుంటున్నట్లో, చీకటి కాబట్టి అధర్మం తప్పుకుంటున్నట్లో తెలియ లేదు. ఆమె వెలుగులోనికి వచ్చింది. కాబట్టి మంచిలోనికని అనుకోవాలి. లేదా వెలుగు లోకులకు కల్పిస్తుందో మనకు తెలియదు. తెలియని దానిని గూర్చి ఆలోచించడం మంచిది కాదు. ఆమెను లోకంలోకి వదలక తప్పదనుకున్నాడు అంధభిక్షువు.

# 6

ఒక మాసంనాటికి నందిని అవంతి చేరింది. ఆమెలో పూర్వపు తనూకాంతి కొంచం కోలుకుంది. నాగిరంగు మాయమై పసిమి వన్నెకు మారుతూ ఉంది. చిక్కిపోయిన శరీరానికి కొంచం కండ పడుతూ ఉంది. ఈ మాసం

లోనూ ఏ రెండు మూడు రోజులో ఎండ తగిలింది. మిగిలిన కాలమంతా బండిలోనే గడిపింది. ఆమె ఒకప్పుడు భిక్షువులో కౌశాంబికి నడచి వెళ్ళింది. ఈనాడు మహా రాణిలా అవంతికి బండిమీద వచ్చింది. ఆమె చూపులో ఏది చెపితేఅది ఎదటివారు ఆజ్ఞగా పాలించారు. ఆమె చూపుకూ, ఆమె వాక్కుకూ తేడా లేదు. సరాసరి అవంతి అధ్యక్షుని గేహంముందు శకటం దిగింది. పరిచారిక అధ్యక్షునకు 'ఎవరో రాణీవారు తమకోసం వచ్చా'రని చెప్పింది. ఆమెను చూస్తూ ఆ పనిమనిషలా అనుకోడంలో ఆశ్చర్యంలేదు. అది చాలా విలువైన వస్తువులందజేసే వ్యాపార శకటం. అందులోనుండి నందిని దిగింది. తన కళ్ళలో తను దాన్ని చూచిన దాసీది అంతకన్న మిన్నగా ఊహించలేదు.

అధ్యక్షుడు వెలికి వచ్చి నందినిని చూచి ఆశ్చర్యంతో 'ఎవరూ!' అన్నాడు.

నందిని అభివాదం చేసింది. 'రా,రా! కూర్చో!'అన్నాడు అధ్యక్షుడు.

నందిని లోపల గదిలోనికి వెళ్ళి ఒక ఆసనమ్మీద కూర్చుంది. 'సార్థవాహక' వర్గపెద్ద 'తిరిగి కలుసుకుంటాం కలవిస్తారా?' అన్నాడు.

ఠీవిగా తల వూపింది నందిని. అతడు వెళ్ళిపోయాడు. ఆ ఠీవి, ఆ దర్పం ఆమెకెక్కడలేని గౌరవం సంపాదించి పెట్టింది. ఏ దారితప్పిన రాజకుమారో ఇలా తారసపడిందని అనుకున్నారానాడు కౌశాంబి ఊరు బైట కనిపించిన నందినిని చూచి. ఆమె కూడా ఏమీ చెప్పకుండా ముభా వంగా ఊరుకోవడంతో ఆమెమీది గౌరవం మరీ పెరిగింది. ఆమె హుందాగా ఉండడం చూచి సార్థవాహకులంతా

తమ ఆలోచనను బలపరచుకున్నారు. తర్వాత 'మీరు అవంతిలో ఎక్కడ దిగుతారు?' అన్నప్పుడు—

'అధ్యక్షుని యింటిలో' అన్నది. దానితో వారిలో భయ భక్తులు చెలరేగాయి. అవంతి అధ్యక్షుడు సామాన్యుడా! అతనందరికీ తెలుసు. జనపత్రాక తలమానికం అవంతి. అందులోనూ మధుర నాయకుని త్రుంచి, హస్తిన సార్వ భౌముని ఒప్పించి అవంతి సేనాపతి రాజయ్యాడు. ఆ సంగ తంతా ఆ నోట ఆ నోట ప్రాకి, ఆసేతు హిమాచల పర్యంతం తెలిసిపోయింది అవంతి అంటే ఏమిటో.

ఎదురుగా వున్న ఆసనమ్మీద కూర్చుంటూ అధ్యక్షుడు 'ఎక్కడకు వెళ్ళినట్టు? ఎందుకు వెళ్ళినట్టూ? ఇన్నాళ్ళూ ఏం చేసినట్టూ?' అని ప్రశ్నత్రయాన్ని ఆమెను చూస్తూ ప్రశ్నించాడు.

'కాశాంబికి.' అన్నది ముక్తసరిగా.

'కాశాంబికా?' ఆశ్చర్యంగా అడిగాడు. 'ఏమంత తెలియ పరచని హఠాత్ ప్రయాణం?' అన్నాడు.

ఆమె తల ఊపింది ముభావంగా. ఈ ముభావానికి భావం తెలియదు. దానిని ఎదటివారు ఎలాగైనా అర్థం సమన్వయించుకోవచ్చు. వారి వారి తెలివిని బట్టి ఆలో చించుకుంటారు.

'ఏదేనా రహస్యమా?' అనడిగాడు అధ్యక్షుడు.

ఆమె చిరునవ్వు నవ్వింది. దీనికీ అర్థం అంతే. అలాగే అన్వయించుకోవాలి.

**'అవంతి విషయాలు మీకు తెలియజేసుకుంటాను!' అన్నాడు.**

'కొంత తెలుసు.' అంది. అనటంలో అబద్ధాలు చెప్ప డానికా ఎదటి వ్యక్తికిక ఆస్కారం లేకండా చేయడం జరుగుతుంది. తెలిసింది చెప్పలేదు కాబట్టి తను చెప్పేది జాగ్రత్తగా చెప్పక తప్పదు యెదటి మనిషి.

'ఒకటి. మన జయదేవుడు రాజయ్యాడు.' అన్నాడు అధ్యక్షుడు.

తెలుసునన్నట్టు తల ఊపింది. ఏమీ ఆశ్చర్యం చూపించ లేదు. అదేమంత గొప్ప కాదన్న దామె ముఖంలో కొట్ట వచ్చినట్టు కనిపించింది అధ్యక్షునికి. దానితో ఆమె ఇంకా గొప్ప కార్యం కాకాంబిలో చేసి ఉంటుందని భ్రమ పడ్డాడు.

'హస్తిన సార్వభౌమునితో మాటాడి, నిండు కొల్వులో ఆ గౌరవం అందుకున్నాడు.' అన్నాడు అధ్యక్షుడు చాలా చిన్న వ్యవహారంగా మాడకూడ దన్నట్టు.

'విన్నాను వజ్జిలో ఉండగా!' అంది నందిని.

'అంటే మీరు వజ్జికి కూడా వెళ్ళారా?'

ఆమె తల ఊపింది.

'మరో విషయం. మీకు చెప్పకుండా మీరు లేనప్పుడు...' వసిగాడు.

మధ్యలో 'మా ఇల్లు......' అంది. అంతలో నే అధ్యక్షుడు 'అదేమంత పెద్దది కాదు. కాదండి. అప్పటికే వత్సరం మాచాం మీరు వస్తారని. రాలేదు. పంచాయితీ జరిపి అంతా ప్రభుత్వానికి చెందేట్టు...'అని మిగిలింది తేల్చేశాడు.

'శూరసేనా నీతి ప్రకారం మూడేళ్ళు. అవంతి ఒక వత్సరం గడువు పెట్టుతుంది కాబోలు. దానిని గూర్చి

అంతగా ఆలోచన లేదు. సరే, ఆ ఇల్లు ఎవరి స్వాధీనంలో ఉంది?' అడిగింది సరిగ్గా అధ్యక్షుని కళ్ళల్లోకి చూస్తూ

'సైన్యాధ్యక్షుని అధీనంలో.' అని జవాబిచ్చాడు.

'పూర్వం సేనాపతి అనే పేరు. ఈ నాడు సైన్యాధ్యక్షుడుగా వ్యవహరిస్తున్నారా? ఇది వేరే ఉద్యోగమా?' అంది నందిని.

'అదే.' అన్నాడు.

'అయితే ఆ సేనాపతి ఇంట్లోనే ఆయన ఉండవచ్చు కదా?' అన్నది,

'నిజమే. ఆయన దానిని ఆలస్యంగా అప్పగించడంతో ఇలా జరిగింది. మీ సామాను సరంజామాలన్నీ ప్రభుత్వ బొక్కసంలో ఉన్నాయి. పట్టిక ఉంది. అది సరే నందినీదేవీ! మీరంత గొప్పవాళ్ళని నే నేనాడూ ఊహించుకోలేను.' అన్నాడు.

కన్నులెత్తి చూచింది ఊరక అధ్యక్షుని వంకకు. ఆ తర్వాత కొంచం గొంతు సవరించి 'నాకు తావరం ఎక్కడ చూపుతారు?' అంది.

'మీరు కావాలంటే మీ యిల్లే మీకప్పగించుతాం. లేదంటే పూర్వపు సేనాపతి యిల్లు ఖాళీగా వుంది. అందులో ఉండవచ్చు. బొక్కసంలోని జాబితా ప్రకారం మీ నగలూ, నాణ్యాలు రేపు ఉదయాని కందిస్తాను. ఈ రాత్రికే సభ జరుపుతాను.' అన్నాడు. అతని చూపులో 'ఇది మీ కోసం ప్రత్యేకసభ' అన్నట్లు స్ఫురింపచేశాడు. రెండు క్షణాలాలోచించి, 'అలాగే సేనాపతి యింట్లో ఉంటాను. నా దాసీది ఎక్కడుంది? మరో విషయం - నా ఆస్తికి ఎంత విలువ కట్టారు?' అనడిగింది. 'మీ దాసీదానికోసం కబురు

పెడతాను. ఇంక పోతే మీ ఆస్తివిషయం - మామూలు వస్తువులు ఇల్లూ తోట పదివేల సువర్ణాలు. ఆ వజ్రాలహారం, నవరత్నపతకం, ఒక పదిరత్నాలున్నాయి మరో పెట్టెలో. వాటికి విలువ కట్టలేకపోయారు. వాటిని కొనగలిగినవారు పంచాయితీ రాజ్యాల్లో ఎవరున్నారు? అటు హస్తినకో ఇటు పాటలీపుత్రానికో పోవాలి. అవాదే మా కందరకూ ఆశ్చర్యం కలిగింది. ఎంతో పేదరికంగా ఉంటున్న మీరు ఇంత గొప్పవారా అని. మరో సందేహం. ఆ రత్నాలు, ఆ వజ్రాలు మీకు... మరోలా అనుకోకండి.' అన్నాడు అధ్యక్షుడు.

ఆమె చిరునవ్వు నవ్వి, 'ఇందులో అనుకోవడానికేముంది? అవి మా సంపాదనకాదు. మా తరతరాలవారివి. దాదాపు ఐదువందల వత్సరాలనుండి మా మావాళ్ళు కాపాడు కుంటున్నారట. ఎవరికీ తెలియదు. ఆ విడిగా ఉన్న పది రత్నాల చరిత్ర చాలా ఉంది. అవి మొత్తం 50 రత్నాలు. 10 సింహళంలో ఉన్నాయి. 5 ఆంధ్రలో ఉన్నాయి. 15 మగధలో, రెండు కాశ్మీరంలో, రెండు ఉజ్జయినిలో మిగిలిన వక్కడక్కడా ఉన్నాయని మా అమ్మ ఒకసారి చెప్పింది. వాటినెలా వాడాలో తెలియక అలాగే ఉంచేశాం. ఎంత కరవొచ్చినా కష్టమొచ్చినా అమ్మవద్దని చెప్పింది. అది దాదాపు దేశాని కుపయోగ పడాలిసిందే! అందుకే ఉపయోగిస్తాం అవసరమైనప్పుడు.'

అధ్యక్షుడు విస్తుపోయి నెమ్మదిగా ఊగుతున్నాడు. అంత ధనం ఉండి ఆ తల్లీ బిడ్డ ఎంత డాంబిక రహితంగా ఉండే వాళ్ళు! వాళ్ళనంతకుముందు మరోవిధంగా అర్థం చేసుకు న్నందుకు చాలా విచారించినట్టు కనిపించాడు. తిరిగి ఆమె మరోమాట లేకుండా—

'నాకు ఆయిల్లు నప్పగించమని మీ సేవకు నెవరినన్నా పంపుతారా?' అనడిగింది.

'ఇప్పుడే వెళతారా? ఈ నాటికి మా యింట ఉండండి. రేపు వెళ్ళవచ్చు. ఈ లోగా అక్కడేం కావాలో ఏం చేయాలో అన్నీ సన్నద్ధం చేస్తాను. మీరు ప్రయాణబడలికలో కూడా ఉండివుంటారు. విశ్రాంతి తీసుకోండి,' అన్నాడు.

'ఏమంత బడలిక లేదులెండి.' అంది నవ్వుతూ. ఆ నవ్వులో ఎదటివారెంత తెలివిగలవారైనా పిచ్చివాళ్ళవుతారు. అలా నవ్వే ఆడది దేశాలు దేశాలు నాశనం చేసింది. తన కైవశం చేసుకుంది. అధ్యక్షునిలాంటి వాళ్ళవొక లెక్క కాదు. ఆ నవ్వుకు అధ్యక్షుని శరీరం మంచులా తయారయ్యింది. దానికి తోడుగా చంపునిలిపినట్లయితే అతనాత్మణం వెల్లెత్తి ఏం చేసేవాడో ఎవ్వరూ ఊహించుకోలేరు. మనిషంత మేధావి గల జీవం ప్రకృతిలో మరొకటిలేదు. జారిపోయినప్పుడు అంత మృగంగానీ, అంత క్రూరంగా, కన్పించకుండా ప్రవర్తించేజీవంకూడా మరొకటి సృష్టిలో దొరకదు. అదీ పరిస్థితులనుబట్టి వాతావరణాన్ని బట్టి ఎదుటివారినిబట్టి మనిషి మారిపోతుంటాడు. నిజానికి మనిషంటే ఒక వాస్తు అద్దం. అద్దంఆకారాన్ని ప్రతింబిస్తుంది. మనిషలాగాదు మనస్సునూ పరిస్థితినీ కూడా, ప్రతిబింబించగల శక్తిగల అద్దం. అందుకే పరిస్థితుల పరిసరాల ప్రాబల్యం ఎక్కువగా ఇతన్ని మారుస్తూ చేరుస్తూ ఉంటాయి. వాటి రంగం ఇతనిమీద పడి భ్రమింప చేస్తుంటాయి.

* * *

వారం తిరిగింది. నందిని నందాదేవిగా మారిపోయింది. పూర్వంలా ద్రాక్ష తోటలో పని చేయడం లేదు. చేయిస్తుంది. ఆమె వెళ్ళిపోయాక ఒక వత్సరానికి ఆ ఊరు

వారందరికీ. తమ మధ్య ఒక వింతైన మనిషి ఉంటూ మాయమైనట్టుగా తెలిసింది. అదైనా ఆమె ఇంటిని పాలకులు స్వాధీనం చేసుకున్న రోజున, ఆ నగల పెట్టె తెరచిన క్షణం నుండి-'పంచాయితీ రాజ్యాల్లో యింత ధనవంతులు కూడా ఉన్నారా!' అనేంత అచ్చెరువు పొందారు. ఆ క్షణంలో ఆమె అక్కడ లేదు కాబట్టి కల్లబొల్లి కాకమ్మ కథలు పెంచుకుని అల్లుకొని కోకొల్లలుగా చెప్పుకున్నారు. అదైన రెండో మాసంలో ఆమె తిరిగి పునర్దర్శనం ఈయడంతో ఆమెమీద గౌరవం పెరిగింది. ఆనాడు అవంతిలో ఆమె మాటకు తిరుగు లేదు. ఆమె సంగ్రగణ్ణి చూచి మండిపోతున్నాడంటే చాలా సుకుమారి అంటారు. ఆమె ఈనాడు మామూలుగా పాలకిలో వచ్చి తోటలో తిరుగుతుంటే, కాళ్లు కంది పోతాయంటారు. కారణం కళ్ళను మిరుమిట్లు గొలిపిన రత్నాలు మనుషులూహించని వెలగట్టిన వాటి ఖరీదు! అంతే గాని ఆమె ఆనాడు తోటలో ఉదయంనుండి సాయంత్రం వరకూ చాకిరి చేసిన నందిని, ద్రాక్షను పండించి ఎండించి చేరగాళ్ళు రాక అలమటించి, తింటానికి దాచుకున్న నందిని, ఆ రత్నాలు వెలికిరావడంతో నందాదేవిగా మారిపోయింది. ఆమెకు అవంతి జనసత్తాక చాలలేదు. పూర్వపు సేనాపతి ఉంటున్న భవనం యీనాడు ఆమెకిందించారు. మరొకరి కది యీయరు. సేనాపతి తోటకూడా ఆమె స్వాధీనంలోనికి వచ్చాయి. ఇప్పుడా తోట ఆమెదే. ఈనాడంగడి వీధిలో నందాదేవి అని పేరు చెబితే బేహారి సరుకులు స్వయంగా యింటికి పట్టించుకొని వస్తాడు. రెండేళ్ళ క్రితం నందిని తలి మరణం విని సాయపడింది ఒక అధ్యక్షుడు. ఒక జయదేవ సర్వసేనాపతి. ఆనాడు వారిద్దరూ అలా కల్పించుకున్నందుకు చాలా అనుకున్నారు లోకులు. ఈ నాడు! ఈనాడు ఎందరు

వచ్చినా వెళ్ళినా ఎందుకనిగాని, మరో విధంగాగాని అనుకోరు. అనుకోడానికి ధైర్యంలేదు. కారణం గొప్పతనం. అదీ సొమ్ముతో వచ్చిన గొప్పతనం. ఆమె ఉంటున్న భవన ప్రాంగణానికి ఎన్ని హంగులు కావాలో ప్రజలే ఊహించి చేశారు. దానికామెకు ఖర్చుకూడా కాలేదు. వారి స్వంత చమురుతోనే! ఎందుకు చేశారు? అనే ప్రశ్న లేనేలేదు. ఎవరూ వేసుకోలేరు. ఆ ప్రశ్నే రాదు. ఇంక సమాధానానికి తావు నాస్తి! నందాదేవి, 'నందినీదేవి, అమ్మగారు, రాణీ గారు -' జనం అది జనస్తోక అన్నది మరచిపోయారు. రాణీ ఉండదన్నది అందరికీ తెలిసినా ఆమెను రాణీగారని సంబోధించారు.

ఆమె కూడా ఆశ్చర్యపోయింది. ఇంత త్వరలో అవంతిలో ఇంత గౌరవం వస్తుందనుకోలేదు. కొంతకాలానికి తన అంచనాల ప్రకారం అంచలమీద సంచలనం కలిగించి అవంతిని ఆడించాలని తలచిందిగాని, ఇంత సంచలనం తనకు తెలియకుండా వచ్చి ఆవరించి అనుకూలిస్తుందని ఆశించలేక పోయింది. కౌశాంబినుండి కదలి వస్తూ, పథక ప్రకారం నడవాలనుకుంది. పథకం లేకుండానే సగంపని పూర్తయింది. ముందు గౌరవం-తర్వాత తన పగ-అని ఆమె అంచనా. గౌరవానికి కొన్నాళ్ళు, పగకు కొన్నాళ్ళు అనుకుంది. అందులో గౌరవానికి ఉంచిన గడువు పూర్తిగా తొలగించి, వచ్చిన గౌరవాన్ని కాపాడుకుంటూ ఇంక వీరందరిని ఆడించాలి. కాలం, ప్రయత్నం అనుకూలించింది. ఈ అనుకూలానికి కారణం తను లేని రోజున తన ఇంటిని ప్రభుత్వం పరిశోధించి వశపరుచుకోవడమే నన్నది ఆలోచించకుండా ముంజేతి కంకణంలా కనిపిస్తున్న సత్యం—

ఈ నాడు పూర్వం వదలి వేసిన వీణ వెలికి తీసి సాధన మొదలెట్టింది. అడుగు మరచిన నాట్యాన్ని అనుసరించ దలిచి కాలికి అందె కట్టింది. ఏ కష్టం లేకుంటే శరీరం లావయ్యి అవయవాల పొందిక పోతుంది. అవయవ పొందికతో పాటు అందం పోతుంది. దాని స్థానంలో సోమరితనం ఆవరించి ఆరోగ్యం పాడవుతుందని ఆమె తెలుసుకుంది. ఆమె శరీరాన్ని, మెదడుని రెంటినీ కలిపి జంటగా పని చేయించడం మొదలు పెట్టింది. పూర్వపు దాసీ ఎక్కడో ఎవరింట్లోనో ఉండడంవల్ల క్రొత్త దాసీలను నియమించారు. అందులో లక్ష పరీక్షలు పెట్టి వాటన్నింటికీ నెగ్గిన ఒక దాసీదానిని తన దాపులోనికి రానిచ్చింది. అసలు రహస్యాలు తప్పించి, మిగిలిన రహస్యాలన్నీ చెప్పి మెప్పించి అమ్మగారంటే ప్రాణం ఇచ్చేట్టు తయారు చేసుకుంది. ఆమె స్వంత పేరు తీసివేసి కొత్తగా చతురిక పేరు పెట్టుకొంది. ఆ స్థానం సంపాదించాలని మిగిలిన దాసీల్లో చాలా మంది ప్రయత్నించారు.

నందిని నందిని దేవయ్యాక గోడా ఆలయానికి రాకపోకలు జరిపింది. గోపాల దేవుని ఆలయం నందిని రాకపోకలతో అందం పెరిగి గోడా పూజలందుకొంటూ నల్లరాళ్ళకు నూనె పూసి నిగనిగ లాడేలా తయారయ్యింది. అందులో వారానికో పక్షానికో నందిని నాట్యం చేయడం మొదలు పెట్టింది. ఆ నాట్యాన్ని చూడడానికి పుర ప్రముఖులు, సభా భవన సభ్యులూ సమావేశ మయ్యేవారు. వారు రావటం నందిని అందాన్ని అన్నికోణాల్లోనుండి చూడాలనేగాని నాట్యశాస్త్రమ్మీద అభిమానంతో గాదు. నాట్యం సంగతి తెలిసి గాదు. ఈమె మొదట్లో తన అవయవ ప్రదర్శనకే నాట్యం పట్టింది కానీ, క్రమేపి కళలో లీనమై

కళను కూడా కొంత చిలికించడం తప్పలేదు. కళలో ఉన్న గొప్ప గుణం అదే. దివ్వెలాంటిది ఎవరు వెలిగించినా, ఎలా వెలిగించినా, ఏ ఉద్దేశ్యంతో వెలిగించినా వెలుగు నిస్తుంది. ప్రకాశిస్తుంది. చీకటిని పోగొడుతుంది. కళా అంతే. ఎలా సాధన చేసినా అన్మ్రయుతి సంగుకోక తప్పదు. అందుకే కళాకారులు దరిద్రులైనా తృప్తితో ఆనందంతో బ్రతుకు బాటవసముస్తుంటారు. నందిని వలన ఒకటి జరిగింది. పాడుపడి, దీపాలు సరిగా వెలిగించని గోపాల దేవుని ఆలయం కళకళ లాడుతూ జనం రాక పోకల కాలవాలమైంది. పూజారుల సోమరితనం కట్టుబడి మాన్యం తింటున్నందుకు మరపించే సేవ చేయగలిగారు. వారికది కష్టం అనిపించలేదు. గోకానుకలు రాసాగాయి. నైవేద్యం సమర్పించడం జరిగింది. అర్చనలు పెరిగాయి. ఇదంతా భక్తిలోనికి దిగి కొట్టుకు పోయింది. దానిలో ఇన్నాళ్ళూ ఊరుకున్న స్వామి శక్తి విజృంభించి వరాలు కూడా ఇస్తున్నట్టు ప్రతీతి ప్రబలింది.

ఇదంతా నందిని ప్రతిష్ఠ అని కొట్టివేయలేం. కాని నందినికీ భాగం వున్నదన్నది నిజం. మిగిలినదంతా పిచ్చి. ప్రజలలోని దుర్బలత. ఎటు మళ్ళితే అటేనని, వాళ్ళంతా గొఱ్ఱెలేనన్న పోలిక వారి నావరించింది. వీరు మరో జీవాల స్థితిని, స్థిమితాన్ని పరిశీలిస్తారు గాని వారని వీరు దర్శించుకుని నిర్ణయానికి రారు. రాలేరు. అలా రాగలిగితే, వీరి స్థితి యింకా పెరిగి ఉన్నతంగా మిన్నంటి ఉండేదే! నలుగురిలో ఉన్నారు కాబట్టి నలుగురితో పోక తప్పదు. అదే జరిగింది.

ఆ రోజు నందిని ఆలయంలో గోపాల దేవుని చిన్ననాటి చర్యలనుగూర్చి పాడుతూ నాట్యం ఆరంభించింది. చూస్తూ వినేవారు ఆ గోపాలునికొరకు, నాటి గోపికలు రాధా ఎలా బాధపడ్డారో, అలమటించారో ప్రత్యక్షంగా చూచినంతగా

సంతృప్తిపడుతున్నారు. ఒకో చరణానికీ ముగ్ధులై తల లూపారు. అడుగడుగునా తను - నందిని - గోపిక, రాధిక, భక్తురాలు హృదయమిచ్చిన దాసీ ఐపోయింది.

ఓ! గోవుల మేపే గోపకిశోరా!
బృందావనిలో ఎందని వెదకేదీ?
విన్నేనెందని వెదకేదీ?

అందరూ బృందావనాన్ని తమముందు సృష్టించుకున్నారు. అందులో ఆలను మేపుతున్న గోపాలుడు ఆమె కన్నులకందకుండా దాగుడుమూత లాడుతున్నట్టుగా ఎంచి ఎంతైనా ఆమెనలా బాధించకూడదనుకున్నారు.

చల్లగాలిలో - పిల్లన గ్రోవిని
మెల్లగ నూదుచు నుల్లముకొన్నావూ - నా
ఉల్లము గొన్నావూ!...........

మధురకు పోవుచు ఎదురు పడుదువని
ఎంతో వెదకితిరా! చెంతకు రావేరా!
చింతను మునిగితిరా.. ......

వంతమేల యిటు వరకాంతనుగాదే
నీ చింతనీడి యిటు వంతమునిగి నే
చింత జెందలేనూ నా
చెంతకు రావేరా!

కనిపిస్తే కృష్ణుని పట్టుకొచ్చి ఆమెకు అప్పగించాలన్న ఆత్రుత అందరికీ కలిగింది. నందిని గోపికై నందకిశోరుని కొరకు అలమటిస్తున్నట్టుగా భావన కలిగిందందరిలోనూ. పాట

నాట్యం ఆగిపోగానే అంతా మామూలు స్థితికొచ్చారు. ఆమె కళను, ఆమె కాలి గజ్జెలను, ఆ తీయని గొంతుకనూ తలచుకుంటూ తరలి వెళ్ళారు. ఆమె గోపాలదేవుని సన్నిధికి వెళ్ళి నమస్కరించి పూజారి ఇచ్చిన తీర్థం త్రాగి, స్వామి పాదాల చెంత రాలిన పూలందించగా కళ్ళకద్దుకొని వాటిని జడలో తురుముకొని ఆలయం వెలుపలకి అడుగు పెట్టింది. ఆమె కొరకు ఎదురు చూస్తూన్న అధ్యక్షుడు కనిపించి - 'చాలా బాగా అభినయించావు!' అన్నాడు.

చిరునవ్వు పెదవులతో క్రీగంట చూస్తూ 'అంతా మీ దయ. మీరు లేకుంటే నాకీ అవంతిలో ఈ గౌరవం ఉండదు.' అన్నది

'ఆఁ, ఎంత మాట! నాదేమున్నది! నీవు గోపాలదేవుని భక్తురాలవు. గోపికవు. నీ అభీష్టాలు తీరకేం చేస్తాయి.' అన్నాడు తనకేదో అభీష్టం నీ వలన తీరాలన్నట్టు ఆమె కళ్ళల్లోకి చూస్తూ అధ్యక్షుడు తన ఉన్నతిని మరచి.

'తమ రొకసారి మా గృహాన్ని పావనం చేయకూడదా? అటు రావడమే మాని వేశారు. ఆ క్షేత్రంలో ఏదో...' అని సిగ్గుతో తల వాల్చినట్టు అనిపించేలా అభినయించింది. అది అధ్యక్షునిలో చాపల్యాన్ని రేపింది. చంచలుడై 'అదే మన్న మాట? నీవు రమ్మనమని పిలవాలే గాని ఎవరు మాత్రం రారు? ఆ గోపాల దేవుడు రాడా?' అన్నాడు. ఈ మధ్య ఊరి వారందరూ అన్నింటికీ గోపాల దేవుని పేరు వాడుకుంటున్నారు. అందరి నోళ్ళల్లో మెసలుతున్నాడు కాబట్టే నేమో పూజలందుకోగలుగుతున్నాడు.

'మీరు రావాలే గాని ఎవ్వరు వస్తే కాదన్నాను? రావడ మేమిటి? నే నెవర్ని-మీ దాన్ని కాదా? మీ దయవలన

కాదా ఈ అవంతిలో ఉండగలుగుతున్నాను. నేను వేరే రమ్మనాలా? మీ ఇంటికి మిమ్మల్ని రమ్మనమని చెప్పడానికి నా కధకార మెక్కడిది?' అంది. ఆ మాటలకు తగినట్టు కళ్ళూ చేతులూ కదలాయి. ఆ అభినయంతో అధ్యక్షుడు వెర్రివాడై ఉన్న దానికన్న నాలుగు రెట్లు పెరిగి పోయాడు. అతను ఎక్కడికో తేలి పోతున్నాడు. తెలియనట్టు మైకంలో మునిగి పోయాడు. ఆనందంలో ఊగిపోయాడు. ఎంత గొప్పవాడయ్యాడో అంత తేలికై పోయాడు. ఆమె పయ్యెద నొకసారు తీసి తిరిగి వేసుకుంది. అది క్షణం పట్ట లేదు. రెప్ప పాటులో ఎత్తుగా ఉన్న ఆ స్తనద్వయం మత్తు కలిగించింది. ఆ పయ్యెద నెందుకు తీసి ఎందుకు వేసు కుందో ఆమెకే తెలియాలి. పోనీ జారిన పయ్యెదను సరి చేసుకున్నదా అంటే కాదు. కావాలని చేసింది.

అధ్యక్షిని నోట మాట రాలేదు. రాదేమోననిపించింది. సంతోషంతో కళ్ళు అర మూతలు పడ్డాయి. ఎంత మత్తు. ఎంత మమత. ఎంత తృప్తి. ఎంత ఆనందం. అవన్నీ ఏది వింతపాలో తెలియదు. ముత్తానికి మత్తు. అందుకే–మధువు, మదవతి అంటారు. మధువుకన్న మగత కలిగించేది, మగాణ్ణి పిచ్చివాణ్ణి చేసేది అనే కాబోలు మధువుకన్నా మదవతి అపాయకరం అన్నారు.

'తప్పకుండా వస్తారుకదూ?' అని వయ్యారంగా పల్లకి లోనికి వంగింది. తిరిగి ఒక సంబరం జరిగింది. ఆమె వయ్యా రంగా నాజూగ్గా వంగడం, అవయవాలన్నీ కదలడం నిల్వ బడి చూస్తున్న అధ్యక్షినిలో మరో మెరపు మెరసి తళుక్కు మని, గుండె కలుక్కుమంది. ఇలాగే ఆలోచిస్తూ అతను అడుగు వేశాడా! అసలు వేయగలిగి లేకదా?

కళ్ళతో వస్తానన్నట్లు చూచాడు. పల్లకీ బోయీలు పల్లకి నెత్తుకున్నారు. ఆ రంగుల పల్లకీలోనుండి తెర ఒత్తిగించి తిరిగి ఒకసారి నందిని అధ్యక్షుని చూచింది. ఆ చూపు తూపు అధ్యక్షుని గిలిగింతలు పెట్టింది. ఆ చూపుకీ ఖరీదు లేదు. ఆడది, అందమైన నందినిలాంటి యువ్వని కళ్ళతో ఎంత పని సేనా చేయించగలదు. మగవాడు బలి పశువుగా మారడానికి ఒక్క చూపు, ఒక్క చిరునవ్వు, ఒక్క వయ్యారం. ముగ్ధ మోహనంగా విసరితే ముగ్ధుడై దగ్ధమవడానికి సిద్ధం కాదా! ఆ పద్ధతి వినియోగించే రారాజులను సైతం బంధించగలిగారాడంగులు. తాళ్ళతో, సంకెళ్ళతో, ఇనుప గొలుసులతో గాదు. చూపులతో, తూపుల ఈటెలతో కనుసన్నల పరిధుల్లో తిప్పుకుంటారు. ఇక వాక్కు. వాక్కులో బహుశా మంత్రానికి సిద్ధి అనేది ఉన్నదని, అది వాక్కు యొక్క చేష్టా-పూర్వాలు వారిని చూసే సాధన ఉపక్రమించి ఆ తపసులో అని తెలుసుకొని మంత్రాన్ని సృష్టించి ఉండడం జరిగి ఉంటుంది.

పల్లకీ కనుచూపు దాటిపోయింది. కాని, అధ్యక్షుడు సరిగా లోకంలోనికి రాలేదు. లోకంలో అన్నింటికీ మందులూ మంత్రాలూ ఉన్నాయి. కాని ఆడదాని చూపుకు మాత్రం ఆ ఆడదే మందూ,మంత్రమూ అయ్యింది. మరొకటి లేనేలేదు. అలాగే శిలలా నిలచి పాలకీ వెళ్ళి పోతున్న దిశకు చూస్తూ నిలచిపోయాడు.

పశ్చిమ దిక్కంతా ఆరవేసిన పట్టుకెంజాయ వస్త్రాలు ఆరిపోయి నిగనిగలాడుతున్నాయి. ప్రాక్ దిశనుండి నిశాదేవి ఆ రంగుపుట్టాలు కట్టుకోడానికి బయలుదేరి వస్తోంది. ఈలోగా సంధ్యాకాంత ఆ బట్టలు సర్దుకుంటా సరే సరి. లేదా వాటిని చుట్టబెట్టుకొని తన రంగుతో మాపి తే రాజా

తోటమిలో ఆ వెలుగు జిలుగుల పై తెల్లరంగు వేయిస్తుంది. ఈ వెలుగు చీకట్ల కలయికలో పగటి రేడు ఊడిపడి ఇద్దరినీ తన పొలిమేరనుండి తరిమి వేస్తాడు. అంతతో వారి ఆట కట్టుతుంది. దినరాజు ప్రతిభతో తిరిగి సంధ్య-తిరిగి చీకటి - అదే వెన్నెల - అదే పోరాటం పరివర్తచర్వణం. కాని భంగిమలు, రంగులు, ఆరంగుల కలయికలో మార్పులు గోచరిస్తాయి. స్థూలంగా అంతా ఒకటే. మామూలే! వస్తువు నిత్యమైనది, కార్యం మామూలైనది. పద్ధతే మార్పు. అంతే.

రాత్రంతా నిద్రలేని అధ్యక్షుడు ఎప్పుడు తెల్లవారుతుందా అనుకున్నాడు. తెల్లవారింది. తిరిగి ప్రొద్దు వాలదేం అనుకున్నాడు. అతనికేమీ తోచడంలేదు: కళ్ళుమూసినా తెరచినా నందిని అందం, నందిని సోయగం, నందిని వాలుకనులు, నందిని చిరునగవు, నందిని రాధగా నాట్యం చేసినప్పుడు కదలిన కదలిక, ఆమె నాట్యం ముగించి ఆలయంలోనికి వెళ్ళినప్పుడు కదలిన పిరుదులు, నడకలోని వయ్యారం, నడుము చెరుకు, ఎత్తుగా ముత్తుకులో జేసిన ఆ [illegible] వక్షద్వయం, గట్టిగా ఊపిరిపీలిస్తే పగిలిపోవాలని కాచుకున్న కంచుకం, ఆ కంచుకాన్ని బిగించి ఉంచిన పట్టుతాళ్ళు, ఆ తాళ్ళు ఊడిపోకుండా ఉంచిన చివరిముళ్ళు, ఆమె కంకణావళి, ఆ దీర్ఘమైన కురులను కలిపి కొప్పులా కట్టిన తలకట్టు, ఆ తలకట్టులోని నందివర్ధనపూలు, వాటిలానే వికసించి రెక్కలు రాలుతున్న తెల్లగులాబీపూలు, ఆమె పలువరసుతో మాటాడుతున్న తెల్లని ముత్యాల హారం. ఆ హారం మధ్యలో పచ్చలు అమర్చబడ్డాయి. అవెంత మిడిసిపడుతున్నాయి! వాటి గర్వం ఆమె వక్షంమీద ఆడుతుంటున్నామనే కాబోలు. లోకంలో ఎన్ని హారాలు లేవు?

దానికున్న అందం మెరపు సోయగం మరో హారాలకు లేదేం? రాదేం?

అసలు నందిని ముఖంలో ఏదో వింత ఉంది. అది అందరినీ ఆకర్షిస్తుంది. అందులో చిలిపితనం లేదు. అలా అని అమాయికంగా, ఆగ్రహంగా కనిపిస్తాయా? లేదు. ఏదో శాసించేశక్తి ఎదటివారి హృదయాన్ని లొంగదీసే మత్తు ఏదో ఉంది. ఆమెకు కోపం వస్తే! చూడగలనా? బాధ కలిగితే చూడగలనా? ఒకసారి ఒకరాత్రి తలపులో మెదలింది. ఆనాడు ఆ కళ్ళతి పరీక్షగా చూడగలిగే అవకాశం అతనికి చిక్క లేదు. చూడగలిగేవాడనే! ఏమో! చూచి సహించలేనేమో! చూడలేకపోవడమే మంచిది. ఐనా ఆనాటికీ విధంగా ఈకోరికలు తనకులేవా? లేకేం ఉన్నాయి. మంచిగా అనుభవించలేననుకున్నాడు. అవన్నీ లోలోన మెలికలు తిరిగి అతడుకూడా నిలువలేక ఆసనమ్మీదనుండి లేచి పచారు సాగించాడు. ఏదో ఆలోచనలు. ఏదో బాధ. ఆ బాధలో తీయదనం. దేనికోసమో ఏదో నిరాశ. అందులోనే ఏదో తెలియని సంతోషం. దానికంటుకొని ఏదో తృప్తి. అధ్యక్షునికి తెలియదు. సాయంత్రమైంది. భాస్కరుని అరుణకిరణాలు పశ్చిమంనుండి తూర్పుకు ప్రాకిపోతున్నాయి. నీడలు చెదరి పరుగెడుతున్నాయి. అలా వాహ్యాళికి వెళదామా అనుకున్నాడు. అటు కూడా మనస్సు పోనీయలేదు. నందినిని గూర్చే ఆలోచిస్తూ మందిరంలోని విశాలమైన పెద్ద గదిలో పచారు సాగించాడు. తనను తాను ఒకసారి అద్దంలో చూచుకున్నాడు. చాలా అందగాడేననిపించింది. తన ప్రక్క నందినిని నిల్పుకొని అద్దంలో పరికించాడు. నందిని ముందు తను చాలా పెద్దవాడు. వయసుమళ్ళిన వానిలా అతనికే పొడగట్టింది. ఏం నందిని ప్రక్కనే ఉండకూడదా? అను

కున్నాడు. ఎందుకుండ కూడదూ? నాల్గు పుష్కరాలుం టాయేమో: నందినికో! రెండు పుష్కరాలు కూడా నిండి ఉండవు. నాలుగులో సగం రెండు: అని నాకు మాత్రం నాలుగు పుష్కరాలు నిండాయా! ఉండవు. ఒకసారి మీసాలను చూచుకున్నాడు. అందులో తెలుపూ నలుపూ సంఘర్షణ కనిపించింది. ఆఁ వెంట్రుకలు-వాటికి ప్రాముఖ్య తేమిటి? పిల్లలకు కూడా నెరుస్తున్నాయి. నుదుటి మీద ముడుతల చారలవుపించాయి. వాటినెలా సరి పుచ్చుకో వాలో అర్థం కాలేదు. ముసలి తనం వచ్చిందా? రాలేదు. వచ్చి ఉండదు. చచ్చా! నేను ముసలివాణ్ణేమిటి? ఎవరైనా నవ్వుతారు. నిజంగా నేను ముసలి వాణ్ణైతే ఆవంతిలో కాని దెవరు? నాలో యౌవ్వనం సడల లేదు. దాదాపు ఐదేళ్ళ నుండి బ్రహ్మచర్యంలో ఉన్నాను. ఐదు వసంతాలు బ్రహ్మచర్యం-అంతేనా! ఆ అంతే. ఈ మధ్య...అవెంతలే! ఐదేళ్ళనాడు గ్రీష్మానికి ముందేగా నా భార్య...ఆమె తల పుంగో మెదలింది. ఆమె చాలా అందగత్తె. నందిని కన్నానా? కాదు. తిరిగి ఆమె ఆతనిలో మెదల్లేదు. నాలో ఏదో ఆకర్షణ ఉండి ఉంటుంది. లేకుంటే నందిని నిన్న పల్లకిలోనుండి అలా ఎందుకు చూసుంది? దానికేదో కారణం ఉంటుంది. నందినిని ఆకరించ గలిగానంటే నాలో గొప్ప అందం ఉండి ఉండాలి-తప్పదు. తిరిగి అద్దంలో ఒకసారి చూచుకున్నాడు. నేను చాలా వికారంగా ఉన్నాను. అదుగో ముసలి తనం ముడుతలు చెక్కిళ్ళ నావరిస్తూంది. నిజంగా ఆలోచిస్తే నేను కోతిలా ఉన్నాను. ఆఁ, ఔను. ఇంత వికృతంగా ఉన్న నన్ను నందిని వలచిందా? లేదు. దానికి గతంలో జరిగిన చరిత్ర ఉంది. ఉండాలి. అది ఆమెకు తెలుసా? గుర్తు పట్టిందా? అసంభవం. అది జరు

గను. అధ్యక్షుని మోము చెమ్మట బిందువులతో నిండి పోయింది. పై బట్టతో తుడుచుకున్నాడు. ఆసనమ్మీద కూర్చున్నాడు. అలసి పోయాడు. ఆ అలసట శారీర కష్టం కాదు. మానసిక వేదన. దానిని నిర్వచించడం కష్టం. హత్య చేసిన వాడు శిక్ష తప్పాక అతనిలోని మానవత్వం పైకుబికి ప్రశ్నించినపుడు కలిగే వేదన - బాధా దహ్యమానసుడై అతనిలోనికి జారిపోతే జరిగే ఆక్రందన-కొన్ని క్షణాలలాగే ఉండి పోయాడు. అతనిలోని ఇతరేతర శక్తులు విజృంభించాయి. తిరిగి లేచి అద్దంలో తన ప్రతిబింబాన్ని చూచుకున్నాడు.

'నేను సుందర పురుషుణ్ణి. సౌందర్యోపాసనా శక్తి ఇంకా నాలో ఉంది. నేను రసికుణ్ణి. నా అవయవాలింకా బింకాన్ని వదల లేదు. యవ్వనం ఛాయలు అలాగే ఉన్నాయి. ఐనా నేను అవంతిక అధ్యక్షుణ్ణి. అవంతికి నియంతను. నాకు తిరుగు లేదు. ఒక్క నందిని కాదు. వేయి మంది నందినులైనా నా అనుగ్రహం కొరకు అనుభూతి నందించడానికి ప్రయత్నిస్తారు. కాలం - సంఘంలో నాకున్న పలుకుబడి, సమాజంలో నాకున్న సన్నిహితం. సమాజంలో వారికి గౌరవ ప్రపత్తులు కావాలన్నప్పుడు నాకన్న మిన్న అయినవాడు వారికగుపించడు. పైగా నా సాంగత్యంలో వారికి సంఘంలో గౌరవం లభిస్తుంది. ఆ మర్యాద కొరకేనా నందిని నన్ను కాదనడానికి వీలులేదు.

నాలుగు ప్రక్కలా పరికించి 'ఎవరక్కడా?' అన్నాడు.

పరిచారిక వచ్చి అభివాదం చేసి 'ప్రభూ!' అన్నది.

'స్నానం చేయాలి!' అన్నాడు.

ఆమె అతనివంక అలాగే చూస్తూ నిలచిపోయింది.

'నిలచిపోయావేం? నాకు ఉక్కగా ఉంది. స్వేదంతో నా ఒడలు తడిసారింది. తిరిగి స్నానం చేయాలి. ఏర్పాటు చేయించు. నీళ్ళల్లో పన్నీరు వార్పు. అగరుకూడా కూడా: దాంత వల్కలాలు సిద్ధంచెయ్యి!' అన్నాడు.

ఆమె అలాంటి పల్కులు విని దాదాపు ఆరు వసంతాలయ్యింది. లోనికి వెళ్ళి కొన్ని క్షణాల్లో తిరిగి వచ్చి శిరస్సు వంచి అభివాదం చేసింది.

అధ్యక్షుడు లోనికి వెళ్ళాడు. ఆమెకూడా వెంట వెళ్ళింది.

అప్పటికి సంధ్య సెక్రమధ్య పోరాటం జరిగి రాత్రి ఏర్పడి ప్రకృతంతా నల్లలంగా, నీలంగా, నీల వర్ణాలం ధరించింది. మేలి ముసుగు ధరించిన నిశాదేవత నింగనుండి నేలవరకు వినీలంగా కనిపిస్తూంది. ఆమె కప్పుకున్న ముసుగులానికి, పసిడి రజనదనాలుగా ఆకాశంలో నిలిపిస్తోంద సౌభాగ్యాంతమైన రీతి నక్షత్రాలు మినుకుమంటున్నాయి.

నవమన్మథునిలా అలంకరించుకొని, తన హోదాకు హుందాకు తగిన రీతిగా నడచి నందని ముంగిట ప్రాంగణానికి వచ్చాడధ్యక్షుడు.

మిద్దెమీదనుండి నలుదిశలకూ దృక్కులు పరిపరికిస్తున్న నందిని, అధ్యక్షుని తిలకించి '[illegible]!' అని [illegible]ంది.

చతురిక మందిరంతి [illegible] పక్కాముందో! [illegible] పరిచారిక వచ్చి 'అమా[illegible]

'అధ్యక్షులవారొ[illegible]న్నారు. బహుశా మన [illegible] నేమో! అన్ని [illegible] అగరు ధూపాలు [illegible] దివ్వెలు వెలిగించండి చతురికను వారి నాహ్వాని[illegible] ప్రసంగ మందిరంల[illegible] కొలువు సేయించమ[illegible]

'ఏర్పాట్లన్నీ సక్రమంగా జరిగాయా?'

'దాదాపు జరిగినట్లే. సరేగాని అమ్మా! మన అంచనాలో ఒక పొరపాటు జరిగింది. అంతా ఈ రోజే జరిపించేస్తారా?' అధ్యక్షులెవరో చతురికకు నందినికన్నా తెలుసు.

'ఏమిటి నీవంటున్నది!' అనడిగింది నందిని అర్థంగాక.

'ఏంలేదు. ఒక్కనాటితో లొంగిపోతారా?' అని అంది చతురిక.

'ఎదటివారి వేగాన్ని బట్టికదా, మన ప్రవర్తన!' అంది నందిని.

'ఏది ఏమైనా అంత త్వరగా లొంగినట్లనిపిస్తే చులకనైపోతాం.'

'నేనాలోచించా నీవిషయం. కానీ.....'

'సందేహించడానికేముంది?'

'కార్యం ఎంత త్వరగా తేలిపోతే అంత మంచిది.'

'కావచ్చు. సాధనలో లోకువగా జారితే తర్వాత తిరిగి పైమెట్టునందుకోవడం కష్టం.'

'చతురా! జారిపోయాక ఎంతకని తేనేం? మెట్టు జారాక ఎన్ని మెట్లన్నది లెక్కకాదు. చెడిపోవడం జరిగాక తర్వాత మిగిలింది బాగు పడడమేకదా?'

'ఏమోనమ్మా! మీ యిష్టం. మీకు నచ్చినట్లు చేయండి.'

నందినీ, చతురికా ఇద్దరూ మాలకలిగి ప్రసంగ మందిరానికి వచ్చారు. ఆ రావడం చూచి అధ్యక్షుడు తొట్రుపడ్డాడు. అక్కడ తొట్రుపడవలసిన అవసరం లేదు. కాని అతనికి ఆత్మలో ఉన్న సంకోచం, తనలో ఏదో చేయాలన్న ఆకాంక్ష ఆ క్షణంలో అతనికి తొట్రుపాటు కలిగించింది.

వస్తూనే నందిని అభివాదం చేసి 'నమస్కారం. ఎంత సేపయింది వచ్చి?' అనడిగింది ఏమీ తెలియనట్టు. ఆ అనడంలో గౌరవం ఉట్టి పడుతున్నా మాటల్లోని అక్షరాల్లో 'అండీ' గాని 'మీరు' గాని లేదు. ఆమె అభినయం చూస్తున్న అతనికి గౌరవ వాచకం లోపించిందన్నది గుర్తుకు రాలేదు. పట్టించుకోలేదు.

'ఆc. ఇప్పుడే ఇంతకు ముందే వచ్చాను. వచ్చి ఇలా కూర్చున్నాను. మీ పరిజనం మీకు వచ్చినట్టు వార్త అందించారు. మీరు వచ్చారు.' అన్నాడు చాలా పదాలు వ్యర్థంగా వాడి. 'ఇంతకు ముందే' అన్న మాట చాలు. అతనిలోనున్న ఈ మాటలన్నీ అయ్యాక ఒక్కసారే వచ్చిన విషయం తెలియ పరచాలని లోని ఊహ కావచ్చు.

'మీ రాకవల్ల మా ఇల్లు......'

మధ్యలోనే 'ఎంత మాట?' అన్నాడు. నందిని మాట తునిగి పోయింది.

'చతురా! ద్రాక్షాసవం' అంది.

అధ్యక్షులు 'ఇప్పుడెందుకు?' అన్నాడు.

'వెళ్ళిరావే! అలా నిల్చబడి చూస్తావేం?' అంటూ ఎదురుగా ఉన్న ఆసనమ్మీద కూర్చుంది. వెళ్ళిన చతురిక వచ్చేంత వరకూ ఇద్దరి మధ్య మౌనం ఆవరించింది. మధ్య మధ్య దివ్వెల వెలుగును మించిపోయే కళ్ళ వెలుగును అధ్యక్షుని కళ్ళకు అందిస్తూనే ఉంది. ఆ చూపులకు నిల్వలేక, కూర్చోలేక, తన కళ్ళను ప్రక్కకు తిప్పుకుంటున్నాడు అధ్యక్షుడు.

చతురిక ఒక గాజు కూజాలో ద్రాక్షాసవాన్ని తెచ్చింది. చేతిలో రెండు గాజు పాత్రలున్నాయి. రెండు పాత్రలూ

అక్కడుంచి, మధ్య ఆ కూజా నుంచింది. అందులో సగానికి పైగా ద్రాక్షాసవం ఎఱ్ఱగా దివ్వెల వెలుగును ప్రకాశిస్తూంది. ఆ కూజా మీద చెక్కిన నగిషీ చిత్రాలను చూస్తూ కూర్చున్నాడు. దాని మీద దిశ మొలలతో ఉన్న యవన యామినుల బొమ్మలున్నాయి. త్రాగే గాజు పాత్రల మీద కూడా అలాంటి బొమ్మలే ఉన్నాయి. ఆ పనితనాన్ని చూస్తున్నాడు.

అంతలో నందిని ఒక దానిలోనికి ద్రాక్షాసవాన్ని వంచింది. సగం పాత్ర నింపి అందించింది. అందుకొని ఒక గ్రుక్కెడు త్రాగి 'చాలా బావుంది. కాచిన సవం కాబోలు' అన్నాడు ఆమె వంకకు, పాత్ర వంకకూ చూస్తూ.

'మామూలుగా నేను పచ్చిదే వాడతాను. ఏదో తమ లాంటి వారు వచ్చినప్పుడుంటుందని గాంధారంనుంచి రెండు జాడీలు తెప్పించాను' అంది నందిని వయ్యారంగా రెండవ పాత్రలోనికి చిలికిస్తూ. రెండవ పాత్రలోనికి ఒలికిస్తున్నప్పుడు పయ్యెద జారింది. దానిని తీసి వేసుకోవాలని కూడా ఆమె అనుకోలేదు. ఐనా కావాలని జార్చింది కాబట్టి ఊరుకుంది. ఆ సంగతి అధ్యక్షునికి తెలియదు. జారినదే అదనని అలాగే చూస్తూ కూర్చున్నాడు. అది గమనించి పయ్యెద వేసుకున్నట్టుగా తిరిగి జారిన పయ్యెద సెగ వేసింది నందిని.

ఆ ఎత్తయిన వక్షోజాలు ద్రాక్షాసవంకన్న మత్తులో ముంచాయి అధ్యక్షుని.

'గాంధారసవం చాలా బావుంటుంది. ఎంతైనా త్రాగవచ్చు,' అన్నాడు. తిరిగి పాత్ర మీద ఉన్న దిశ మొలల బొమ్మల వంక చూస్తూ—

'ఈ పాత్రలు చాలా బాగున్నాయి.' అన్నాడు

'బాగానే ఉన్నాయి. ఆ మధ్యనే కౌశాంబీనుండి వస్తూ ఆ సార్థవాహకుల వద్ద చూచాను. ఆ తర్వాత మొన్న వచ్చారు చూడండి ఈ బేహారులు-ఆదేమిటి? మీకు చెప్పు తున్నాను. మీరేగా పంపారు వార్ని మా ఇంటికి. వారి వద్ద కొన్న సరుకుల్లోవే ఇవి కూడా' అంది నందిని.

'ఆఁ! ఆమధ్య వచ్చారు కదూ? వాళ్ళు చాలా దేశాలు తిరిగి వ్యాపారం చేస్తారు. చాలా నమ్మకమైన వారు సుమండీ! సింహళం, చీనా యవన దేశాలలో కూడా వారికి పలుకుబడి ఉంది.'

'అన్నారు. నేను నమ్మలేదు. ప్రతి బేహారీ అలాగే అంటాడు. ఎవర్ని నమ్మాలో తెలియదు కదండీ?' అన్నది నందిని.

అధ్యక్షుడు 'ఆఁ ఆఁ అలాగే అంటారు. కానీ వాళ్ళు నమ్మకస్తులు. నాకు బాగా తెలుసు. ఇది నాకు తెలిసి నాల్గవతూరి అవంతికి రావడం. అందువల్ల చెపుతున్నాను.' అన్నాడు. అతని కళ్ళు ఆ బొమ్మలను, ఆమెనే పరికిస్తు న్నాయి.

తేరితేరి వాటివంక చూస్తుండడంవల్ల 'మిమ్మల్నింత ఆకర్షించితే ఒక నాలుగు మీకు పంపుతాను. నేనో ఇరవై దాకా తీసుకున్నాను' అంది.

ఒక్కసారి ఆమె కళ్ళల్లోకి చూచాడు. ఆమె తల వంచి క్రీగంట చూచింది. ఇదే అదనని 'ఈ గాజు పాత్రలేనా, ఇంకేమేనా ఇస్తారా?' అన్నాడు.

'మీ యిష్టం. ఈ గేహంలో మీది కానిదేముంది? అంతా మీ చలవేకదా!' అంది నందిని.

అధ్యక్షుడు ఉక్కిరి బిక్కిరై పోయాడు. అంత మాట ఆమె అంటుందని అతడనుకో లేదు. అప్పటి వరకు అక్కడ నిలచి ఉన్న చతురిక తప్పుకుంది. అధ్యక్షుడది గమనించాడు. ఇప్పటికి రెండు పాత్రలు అందించింది సరం. మూడో పాత్ర నింపుతుండగా, 'మిక్కుటంగా త్రాగలేను' అంటూ ఆమెను వారించే నెపంతో ఆమె చేయి పట్టుకున్నాడు.

నందిని కాదని, వాదని విదిలించడంకాని వారించడంకాని జరుపలేదు. నిమీలిత నేత్రాలతో అలాగే చూస్తూ 'కాగు. కొంచం తీసుకోండి. ఇది మీ కోసం కాదు. నా తృప్తి కోసం అంది ఆమె కూడా అతని చేతులను అదుము తీసే నెపంతో. ఆ చేతుల కలయికతో అతనిలోనున్నదేదో మత్తు, ఏదో విద్యుత్ ప్రవాహం అతన్ని పిచ్చివాణ్ని చేసింది. తడబడుతూ పూడుకు పోయిన గొంతుతో 'నందినీదేవీ!' అన్నాడు.

ఆ చేతులలాగే ఉంచి, ఏమిటన్నట్టు చూచింది.

'ఏం లేదు నందినీదేవి! ఏం లేదు.' అని తమాయించుకున్నాడు.

ఆమె చిరునవ్వు నవ్వింది.

ఆ నవ్వులో భావాలు ఎవరికి తెలుస్తాయి? అది ఒక మూగ భాష. దానికి వాఙ్మయంలో మాటలు లేవు. వ్యక్తీకరించడం చేతనైతే దాన్ని కార్య రూపంలో ఎందుకు చేస్తారు? అది సహించడమే గాని దానికి నిర్వచనం లేదు. సరాసరి మనసులోనుండి పెదవుల మీదికి దూకిన అజ్ఞాత కదలిక. ఆ కదలికకు నిజంగా భావం లేదేమో! ముగ్ధత తప్ప ఆముగ్ధతను చెప్పడం కష్టం.

'నందినీదేవీ!......' ఏదో అనబోయి ఆపివేశాడతడు.

అలాగే అతన్ని ఆ అనుభూతిలో ఉంచితే ఏంచేస్తాడో నని, 'మీ పరిపాలనా విషయాలేమిటి? రాజ్యాంగం ఎలా నడుస్తూంది? క్రొత్త సైన్యాధ్యక్షుడు ఎలాటివాడు?' అంది.

అతనికా ప్రసంగం యిష్టంలేదు. 'ఆఁ పోనిస్తూ! ఏఁవిటీ యిక్కడకూడా ఆ బాదరబందీలు!' అని తేల్చివేశాడు.

ఇంకా ఆ మాటనే పట్టుకొని గుంజకూడదనుకుంది.

తర్వాత అతనే 'నందినీదేవీ! మీరు......' అన్నాడు.

'చెప్పండి!' అంది.

'ఏంలేదు. ఇలా ఎంతకాలం ఉంటారు?' అన్నాడు. అతని ఉద్దేశాన్ని సరాసరి ఎలా ఎదటబడి చెప్పగలదు?

'ఏదో యిలాగే ఈ జీవితం వెళ్ళిపోదంటారా?' అని, 'అదిసరేకానిండి! ఇంతకన్నా ఏం కావాలి? ఏమార్పులు వస్తాయి? ఏమార్పుకుంటాను? ఎంత కాలమున్నా నాలాటి జీవి.........'

'అలా దేనికి? ఒంటరిగా ఇలా ఉండడంకన్నా మార్పు నూడడం అవసరం కాదంటారా?'

'నా పుట్టుక, నా జీవితం అంతా మీకు తెలుసుకదా? చెప్పండి!' అంది. తనలోతాను అనుకొంది: ఇంకా వెఱ్ఱి వెఱ్ఱి మాటలు వస్తాయి కాబోలు. ఈ మగవాళ్ళంతా యింతే. కానీ! అతని విధం ఎలా నడుస్తుందో చూద్దాం-అనుకుంది.

'అదికాదు నందినీదేవీ! నీవు కావాలంటే నాలాంటి వాళ్ళు ఈ అవంతిలో చాలామంది......' తలుపు చాటునున్న చతురికకు ఇంత త్వరలో తేలిపోవడం నచ్చక, ఇష్టం లేక 'అమ్మా! భోజనానికి లేస్తారా?' అంది.

నందిని అర్థం చేసుకుంది. కళ్ళల్లోకి చూస్తూ 'వస్తాను' కాసేపుండరాదటే!' అంది.

'మనం మనమైతే ఎప్పటికైనా ఆరగించవచ్చు. అయ్యగారు కూడా వచ్చారాయెను. వారు, వారి గృహాలలో ఏవేళప్పుడు భోంచేస్తారో తెలియదు!' అంది. అధ్యక్షునికి చతురిక ఎవరో తెలుసు.

'అంటే?'

'పోండమ్మా! వచ్చిన అతిథికి ఎలా పరిచర్య చేయాలో కూడా నేను చెప్పాలా! యిద్దరికీ! అక్కడ! త్వరగా తెమిలి రండి!' అని వెళ్ళిపోయింది.

అధ్యక్షుని గుండెలో రాయి పడింది. అతడతి ఉన్నత వర్గంలో జన్మించాడు. అందులోనూ నందిని వేశ్య. వేశ్య యింట్లో భోజనం అతనికి మనస్కరించలేదు. నందినికి తెలియదు. చతురికకా విషయం తెలుసు! ఇంతవరకూ అవంతి పౌరులలో ఆ వర్గంవారు ఎవరి యిళ్ళల్లోనూ విందులారగించే స్థితికి రాలేదు. అధ్యక్షుడుమాత్రం ఎలా వస్తాడు? రాడు. రాడని తెలిసే అన్నది. వేశ్య పెదవుల్లో పెదవులుంచి అధర మధువు నాస్వాదించే అగ్రవర్గ ప్రవరులు, విందులు కుడువడానికొప్పుకోరు. ఎంగిలీ తాంబూలాచరణ గావించగలరు నాల్గు గోడలమధ్య, పసిడి పాన్పులమీద. కానీ పంచభక్ష్య పరమాన్నాలు వారు వడ్డిస్తే వీరారగించరు. పరువు ప్రతిష్ట వీధిలో కావాలని అవాకులూ చవాకులూ పేలే ప్రముఖులు ప్రొద్దువాలాక ఆ తిట్టిన కాంతల కౌగిలింతల్లో అమరసుఖమని, అనుభూతియని ఏవేవో వెఱ్ఱికూతలు ఒళ్ళు తెలియకుండా ప్రేలారు.

'మీకు భోజనానికి ఆలస్యమౌతుందేమో?' అన్నాడు.

'మీరు కూడా రావాలనికదా! యిద్దరకూ......'

'ఈ పూటకాదు. మరోమారు!' అన్నాడు. అతని మోములో ఏదో నిరాశ, ఏదో తెలియని ద్వేషం ఎవరి మీదో పెరిగిపోతూంది. అది చతురిక కావాలని చేసిందనే.

'మీరు?' అంది నందిని.

'ఎలా ఉన్నావో చూద్దామని వచ్చాను. చూచాను. చూచాను, వస్తాను' అన్నాడు

'అప్పుడే వెళ్ళడమా? ఊఁహు. నేను భోజనం చేయ నప్పుడే. కాసేపు ఉండండి. మీరు కూర్చొని మాటాడు తుంటే ఏవో తెలియని లోకాలకు వెళ్ళుతున్నట్టుగా ఉంది. మీరు ఎప్పుడూ రారు మాలాటి వారింటికి. మీరు రావడం అఁ...ఎందుకులెండి-నేనే ఎన్నోసార్లు రావాలని ప్రయత్ని స్తాను. కానీ రాలేక పోతున్నాను.' అంది.

'దానికేంలే, మనసులో ఉండాలిగాని రాక పోకల్లో ఏముంది!'

'అది కాదుగానండి-నాకు...నాకు......ఎలా చెప్పేది?' అధ్యక్షునిలో ఉద్వేగం, ఉత్తేజం తిరిగి ఆక్రమించింది. మాటలతో చేతలతో నందిని - నందినే కాదు - అందమైన ఆడది ఎవ్వతైనా ఎవ్వరినైనా క్షణంలో ఉద్రేకానికి లోను చేసి మరు క్షణంలో దాన్ని వ్యతిరేకంగా చేయగలదు. అధ్యక్షుడు మంచు రూపం దాల్చుకున్నాడు. ద్రాక్షా సారాయం అతన్ని మత్తులో ముంచుతూంది. నాల్గు ప్రక్క లకూ చూచాడు. 'నందినీ దేవీ! నందినీ దేవీ!' అన్నాడు.

ఆమె అలాగే ఒక భంగిమలో నిలచి పోయింది. ఆసన మ్మీదనుండి అధ్యక్షుడు లేచాడు. ఆమె చేయినందిచ్చి పుచ్చు కున్నాడు. ఆమె చేతిని కొంచం ప్రక్కకు తీసుకుంది.

'నందినీదేవీ!' అన్నాడు. ఆ అక్షరాలేవీ సరిగ్గా వినిపించ లేదు.

'ఏమిటీ?' అన్నది నందిని వయ్యారంగా క్రీగంట చూపులు నిగిడ్చి సిగ్గు దొంతరల నొకదాని వెంట నొకటి పేర్చుకుంటున్నట్టు.

'అంతా నా నోటి మీదుగా చెప్పాలంటావా?' అన్నాడు. ఆమె మాటాడ లేదు.

'నీకు తెలియదా? నీ కోసం నేను ఎన్నాళ్ళబట్టి... ఎంతగా...' మాట మాటకూ కాలం యిచ్చి మెల్లగా గోముగా మాటాడాడు.

'మీరే ఆలోచించండి. నన్ను గురించి కూడా మీరే ఆలోచించాలి. ఆ తర్వాత......'

'ఇంక ఆలోచన దేనికి?' అన్నాడు.

'ఔతే మీ ఇష్టం.'

'నిజంగానా?' అన్నాడు ఆశ్చర్యంగా. తనను తాను నమ్మ లేక పోయాడు. ఆమెను దాపుకు చేర్చుకున్నాడు. అతని చెయ్యిదాలను ఆమె తిరస్కరించ లేదు. వాంఛతో, ఏదో తెలియని ఉద్రేకంతో అతడు తనకు తన గొప్పతనాన్ని మరచి ఆమె అవయవాలన్నింటినీ ఆక్రమించాడు. గట్టిగా గుండెల కదుముకున్నాడు. ఆమె మెల్లగా కౌగిటిలోనుండి జారి అందకండా అడుగులు వేసింది. ఆమె వెంట అతడూ నడచాడు. ప్రసంగ మందిరం వదలి మధ్య పెద్ద గదిలోనికి వచ్చారు. అంతా నిశ్శబ్దం. ఆ ఇంట్లో మనుష్యుల జాడ లేదు. మించి పోయిందని తెలిసిన చతురిక దాస దాసీ జనాన్ని తప్పించి తోటలోనికి చేర్చింది. నందిని చేస్తున్న ప్రతి కార్యంలోని ఆంతర్యం చతురికకు తెలుసు. పథకం

ఆమెకు చెప్పింది. కారణం చెప్పలేదు. రహస్యాలు రహస్యాలుగానే ఉంచి నందిని చతురతతో చతురికకు చెప్పింది. చతురికకు తెలిసింది - అధ్యక్షుడు వలలో పడిన తర్వాత అవంతి నందిని చేతిలో ఆడుతుంది. అవంతిలో ఆమె మాటకు తిరుగుండదు. అందుకే నందిని ఇలా చేస్తుంది-అని చతురిక అభిప్రాయం.

నందిని 'నిశ్శబ్దం' అన్నట్టు ముక్కు మీద వేలుంచి నడచింది వయ్యారంగా. ఆమె వయ్యారంగా నడుస్తుంటే వెనుకనుండి వస్తున్న అధ్యక్షునికి ఆమె పిరుదల కదలిక, ఆ సన్నని నడుము తిరుగుతున్న వంపులు, తిరిగి చూచినప్పుడు ఆ చూపులలో మెరపులు అతన్ని మెరపు తీగెను చూచినట్టుగా ప్రతిక్షణం మెరుగులు దిద్దుకుంటున్న ఊహాలతో వెన్నంటి వెళ్ళాడు. ఆమె మెల్లగా తన శయన మందిరం దాపుకు వెళ్ళి ద్వారంలోనుండి చూచింది. లోపల రెండు దివ్వెలు అగరు పొగలు గ్రక్కుతున్నాయి. వాకిలికున్న తెరను తొలిగించింది. లోనికి వెళ్ళింది. అతడు కూడా వెన్నంటాడు.

తెరలపైన నీడలు ఒకటిగా కలసి మెల్లగా మూరమై కనుపించలేదు. తర్వాత —

మరునాటి సంధ్య వెళ్ళిపోయింది. చీకటి ఆవరించింది. వాడలన్నీ చీకటిలో పోరు కొడుతున్నాయి. నందిని ఉంటున్న మందిర ప్రాంగణంలోని చెట్ల పూవులు సువాసన వొదుస్తున్నాయి. గాలి మెల్ల మెల్లగా ఆ వాసనలను దూర దూరాలకు తీసుకొని వెడుతూంది. దానితో పాటు—

రావోయి। రావోయి।
నీమీదె మనసోయి।
చిన్ని వెన్నెలలోన
సన్న నీడలలోన
కన్ను మూసిన చాలు
కన్నీటి వరషాలు
రావోయి। రావోయి।
నీమీదె మనసోయి।
గున్న మావిలో కంటి
సన్న పాటను వింటి
కన్నీళ్ళతో నుంటి
నన్ను కాపాడమంటి।
రావోయి। రావోయి।
నీమీదె మనసోయి।
విరహాగ్నితో గుండె
తిరిపమెత్తగనుండె
వేదనాగ్నికి మండి
దగ్ధమైపోతుండె।
రావోయి। రావోయి।
నీమీదె మనసోయి।
మల్లెమొల్లల అందం।
తెల్లజాబిల చందం

కొల్లగొనె నా డెందం
ఎందుకోయీ అందం!

రావోయి! రావోయి!
నీమీదె మనసోయి!

ఈ పాట చాలా దూరం వినిపిస్తూంది. ఆఖరి పదం పంచమంలో అని, ఆపివేసిందామె. హాయిగా ఉన్న ప్రకృతి ఆనంద సాగరంలో మునిగి తేలింది.

నిన్నలాగే అధ్యక్షుడు అలంకరించుకొని ఆమె మందిరానికి వచ్చాడు. ఆ వస్తున్న అధ్యక్షుని మూరాన్నుండి చూచి, నందిని మిద్దె దిగి చర చరా లోనికి వచ్చి వాకలి ముంగిట నిలచింది. అది చూచిన అధ్యక్షుడు నందినికి తన మీద వలపు చాలా మిక్కుటమనుకున్నాడు. అలా అనుకోవాలనే ఆమె అభిప్రాయం కూడాను.

'ఇంత ఆలస్యమా! మీకోసం వేచి చూచిచూచి కళ్ళు కాచిపోయాయి!' అంది ఎంతో ప్రేమ ఉన్నట్లు-అధ్యక్షుని వదలి క్షణం గడపడం కష్టమన్న భావన స్ఫురించాలని. ఆంగిక వాచక పటిమనంతా మేళవించి, ముద్దులు కురుస్తూ.

అధ్యక్షులవారా మాటలకు, ఆ చేతలకు ముగ్ధుడై ముసలి సరసం ఒలకపోస్తూ——.

'నాకూ అలాగే ఉంది. ఎప్పుడు ప్రొద్దు పోతుందా అనుకుంటున్నాను!' అన్నాడు. వీధి వాకిలన్నది, దివ్వెలు వెలుగుతున్నాయన్నది మరచిపోయి, లాలనగా ఆమె బుగ్గ మీద చిటికన వ్రేలుతో మీటుతూ. సింగారం గట్టించి, వయ్యారం దట్టించి 'అఁ మరీనూ - వీధి, వాకిలి!' అంది. ఆదెంతో నాజూకు తెచ్చింది. అధ్యక్షుడు ఒళ్ళు మరచి

పోయాడు. తరుణంగాని తరుణంలో పూవు పూసినా, కాయి కాసినా, ముసలికి వలపు లేచినా పట్ట పగ్గాలుండవు. ఇద్దరూ అభ్యంతర మందిరంలోనికి చేరారు.

విశాలమైన ఆసనమ్మీద అతడు ఆసీనుడయ్యాడు. ఆమె అతని నడిలోనే కూర్చున్నంత దాపులో కూర్చుంది. ఎలాగైనా ఆమె అనుమానం ఈనాడు తీర్చుకోవాలను కున్నది. ఆమె అందుకు ఎన్నో విధాల పన్నాగాలు పన్ని మైకం తెప్పించి, మైకంలో నిజం రాబట్టాలని ఆమె అభి ప్రాయం. అధ్యక్షునికి మాత్రం తన హోదాకు, తన గౌర వానికీ ఆమె తనను మరచి తన కాయాన్ని తనకప్పగిస్తుం దన్నది బాగా నాటిపోయింది.

ఆమె ప్రక్కకు తిరిగి దాపుకు లాగి గట్టిగా తన బాహు బంధనంలో యిమిడ్చాడు. ఆమె తన్మయత్వంలో మునిగినట్టుగా పెదవులకు పెదవులందించింది. ఆ అధర సుధారసం అందీ అందకముందే చప్పున లేచి నిలచుంది. ఎందుకో ఏమిటో చెప్పలేదు. అతడు తెప్పరిల్లే లోపుగా లోనికి వెళ్ళి గాజు జాడిలో ద్రాక్షరసం తెచ్చింది.

'ఓహో! యిందుకా' అనుకున్నాడు అతడు.

పాత్ర తీయగా పాత్ర బాగా మత్తుకలిగే వరకూ అందిం చింది. పారాయం మగతకొంత, ఆ మదవతి చేస్తున్న చేష్టల వల్ల కలిగే మత్తు కొంతా కలసి, పూర్తిగా తప్పత్రాగిన రీతిగా అలసిపోయి ఆమెను గట్టిగా గుండెలకదుము కున్నాడు. అతన్ని మెల్లగా ఆసనమ్మీదకు కాగలిలో ఉంటూనే లాగి యిద్దరూ ఆసనమ్మీద కూలిపోయేలా కూల వేసిందామె. అతడు మైకంలో మైమరచి గట్టిగా ఆమెను హత్తుకొని ఆక్రమించాడు.

ఆమె చాకచక్యంగా ప్రక్కకు తిరిగి ముఖానికి ముఖం దాపులో ఉంచి, 'మనకిది ఎన్ని జన్మల బంధం? ఈ కౌగిలి, ఈ సుఖం, రాత్రి అందుకున్న అనుభూతి. ఇంతకు ముందెప్పుడో అనుభవించినట్టు! ఆనాడు బలవంతంగా ఈ సుఖాన్నందించినట్టుగా అనిపిస్తుంది!' అంది.

అతడు చిరునవ్వు వొలకబోశాడు.

'నిజం. ముమ్మాటికీ నిజం!' అంది.

'నిజమే నందినీదేవీ! నిజమే. నాకీనాడు చాలా విచారం కలుగుతుంది. నా సొత్తును నేను పూర్వం పరాధీన పరచాను. పైగా భాగం అందాను. ఆనాడు ఇది నాకు చెందేదే అన్న జ్ఞానం లేదు. సరాయివారిదనే భ్రమలో జరిగింది. దానికీనాడు విచారించి ప్రయోజనం లేదు.'

'అంటే నాకర్థం కావడం లేదు!' అంది నందిని. ఆ మాటలంటూ పూర్తిగా అతని గుండెలకు ఆమె ఎత్తైన శిరోజాలనదిమింది. అతడు మైమరచిపోయాడు.

'జరిగిన దానికి వగచి ప్రయోజనం లేదు. నాకు ఇంత సౌఖ్యాన్ని అందిస్తావని ఏ మాత్రం తెలిసి ఉన్నా అలా జరిగేది కాదు.' అన్నాడు

'ఓహో అదా!' అంది. రెండేళ్ళనాడు జరిగిన దానిని గూర్చి ఆమె కేమీ తెలియదు. అధ్యక్షుడు ఉన్నాడని అనుమానమే. తన అవమానం నాటి రేయి ఆమె ఎవ్వరినీ గుర్తు పట్టలేదు. ఊరక ముందు కాళ్ళకు బంధన వేసి చూడాలని ఊహలో అన్నది. ఒక వేళ ఇతడు లేకపోయినా ఉన్నా ఈతనితో బంధన పెట్టుకోడం వలన తనకు సాయం కాగలదు. తన ప్రత్యర్థులను ఎదుర్కొని ఏదేనా చేసినప్పుడు ఆ వివరాలూ, విచారణలు ఈతని దగ్గరకు వెళ్తాయి.

ఈతడు తన చేతిలో ఉంటే అతన్ని తారు మారు చేస్తా డని, తనకు న్యాయం కలుగ చేస్తాడని చూచింది కానీ తీరా రంగంలోనికి దిగాక మాటల్లో ఈతడు కూడా భాగస్తుడని తెలిసింది

'నీవంత తేలిగ్గా తీసి వేసినా నా కలా అనిపించ లేదు. ఆ 'రణవర్మ' బలవంత పరచాడు. రాధానాధుడు అంతా చేశాడు. జయపాలుడు 'సాయపడతా' నన్నాడు. మాలీ, నేనూ తటస్థంగా ఊరుకున్నాం. జయపాలుడు ఆ నాడు నీవు బయలుదేరడం చూచి వాహ్యాళికి వెళ్ళి కూర్చున్న మమ్మల్ని జయదేవుని తోటకు లాక్కు వెళ్ళాడు. లేకుంటే నా కసలు ప్రమేయం లేక పోయేది. ఈ నాడు ఛీ ఎందుకలా చేశామా అనిపిస్తుంది. గత జలసేతుబంధనం.'

'అ( పోనిస్తురూ - మీరు నన్ను......'అని పెదవులు పెదవులతో మూసింది.

'ఈ అందం ఆ నాడు జయదేవుని దనుకున్నాను. ఆ ఈర్ష్యతో అలా చేశాను కానీ లేకుంటే?'

'ఈ నాడనుకొని ప్రయోజనం ఏముంది లెండి. గతం గతః. మీరు మాత్రం...' అంది.

'నీ కోసం నా ప్రాణాలు నవ్వుతూ ఇస్తాను. అదే చెప్పు తున్నాగా. ఆ నాడు నీవు నాకు అందవన్న ఆవేదనతో అలా చేయడం జరిగింది,' అన్నాడు,

'ఇక నా విషయం వదలి వేయండి' అన్నది నందిని. ఆమె మనసులో పై నలుగురూ ఒకరి వెనుక ఒకరు గిరగిర తిరిగి పోతున్నారు. పథకాలు ఒనగూర్చుకుంటూంది. అధ్యక్షుని పంపాక గాని గట్టిగా ఆలోచించి నిర్ణయించుకోదు. ఆమెకు కావలసింది తెలిసింది. ఇంక కార్యం చాలా త్వరగా పూర్తి చేసుకోవాలి. ఈ ఐదుగురనూ ఏం చేయాలి? ఈ

క్షణంలో ఒక్క చిటికలో అధ్యక్షుడు లోకాన్ని మరచి పోయేట్టు చేయగలడు. కానీ అది పద్ధతిగాదు అనుకుంది.

'వదలి వేయడంగాదు నందినీదేవీ! ఆ నలుగురూ ఈ నాడు నీకూ నాకూ ఉన్న ఈ సన్నిహితం గుర్తిస్తే ఏమనుకుంటారని?' అన్నాడు. అతనికి ఆ నలుగురి పరిహాసం కళ్ళకు కట్టినట్టుగా కనిపించింది. అంతా అవంతి పౌర సభా సభ్యులు. అందులో ఈ మధ్య రణవర్మ జయదేవుని స్థానంలో సైన్యాధ్యక్షుడుగా నియమింపబడ్డాడు. ఎలానూ తెలుస్తుంది. తెలిసి నిండు సభలో తనను ప్రశ్నిస్తే తనేం చెప్పాలి? ఎలా సర్దుకోవాలన్నది బాగా పట్టుకుంది. ఆ విషయం ఉదయం తలపులో మెదిలింది. సమాధానం మాత్రం ఊహకు రాలేదు.

'ఏమనుకుంటే నేం? వాళ్ళు పెద్ద మనుష్యులైతే కదా, మిమ్మల్ని వేలెత్తి చూపడానికి?' అన్నది

'అసలు కీలకం అక్కడే ఉంది నందినీదేవీ! వాళ్ళు పెద్ద మనుష్యులైతే మన విషయం పట్టించుకోరు. వాళ్ళు కాదు కాబట్టి ఇలాంటి విషయాలు ఒదలరు. చాలా గందరగోళం రావచ్చు. దానికి నేనొక ఉపాయం ఆలోచిస్తున్నాను,' అన్నాడు. అతనికి రణవర్మ భయం ఎక్కువ. దాన్ని వెలికన లేదు.

'ఏమిటది?' అనడిగింది నందిని. తిరిగి మరో పాత్ర అందించింది. తాపీగా పాత్రనందుకొని త్రాగి, పాత్ర చేత పట్టుకొని ఆసనం వెనక్కు హాయిగా ఆనుకొని ఆమె బుజమ్మీద నొక చేయి ఉంచి వేళ్ళు కదుపుతూ,

'ఏమంత ఘనకార్యం కాదు. పౌర సభలో సభ్యత్వమిచ్చి న్యాయనిర్ణేతల్లో చేర్చితే ఎలా ఉంటుందా? అని ఆలోచిస్తున్నాను' అన్నాడు తిరిగి పాత్ర నోటపెట్టుకుంటూ.

'నాకా? పౌర సభ సంగతలా ఉంచి న్యాయాధికారుల్లో కూడానా?' అంది ఆశ్చర్యంగా - లోలోన ఆ సభ్యత్వం నాకు యిచ్చిన మరునాడుకదా నా సంగతి తెలిసేది అనుకుంటూ .

'న్యాయసభా సభ్యత్వం చాలా తేలిక. పంచాయితీలో కొంచం ప్రయత్నించాలిగాని, ఈ రెంటింటిలోనూ - జయ దేవుడు ప్రముఖంగా నిర్వహణ జరిపాడు పూర్వం. అదే మంత గొప్పకాదు. మరొకరికి తే చాలా తేలిక. ఇక్కడ చిక్కు, నీవు ఆడదానివి కావడమే. ఇంతవరకూ ఆడదానికి ఆ స్థానం రాలేదు. నీకు రావడానికి మరో తేలికైన మార్గం కూడా ఉంది!' అన్నాడు అధ్యక్షుడు.

ఉత్త పాత్రను ముందు ఉన్న గాజు జాడి ప్రక్క మంచుతూ—

'అదేమిటి?' అంది ఆశ్చర్యంగా నందిని.

'అదే! నాళ్ళెవ్వరికీ తెలియుంది. అందరూ ఆలోచించ నిది. ఈ అవంతిలో ఈనాడున్న వాళ్ళల్లో ధనవంతులెవరని ఆలోచిస్తే ముందు నిన్ను చెప్పాలికదా? అవంతికాదు. ఇటు పాటలీపుత్రం, అటు హస్తినలో కూడా నీతో సమానమైన సంపన్నులు మరొకరులేరు. అలాంటప్పుడు నీకు కాక మరొకరికి ఆ సభాంగణంలో సభ్యత్వానికి తావు లేదు!' అన్నాడు.

నందిని తిరిగి పాత్రలో ద్రాక్షాసవం నింపుతూ - 'ధనంతో సభ్యత్వం అందుతుందా? ఒక్క ధనానికి అంత విలువ ఉందా అవంతిలో?' అంది. అతనికి దాపుగా జరిగింది. ఆమె శరీరం అతని కాయాన్ని తాకుతూ ఉంది. ఆ స్పర్శ అదొక విధమైన మైకంలో ముంచుతూంది. ఆ మత్తులోనే ఉండి—

'ఔను. ధనంతోనే గౌరవం. ధనంతోనే సభ్యత్వం. ధనంతోనే యుద్ధం. ధనంతోనే రాజ్యాంగం. ధనంతోనే శాంతి భద్రతలు. ధనంతోనే విద్య. ధనంతోనే కళ్యం. ధనం చేయలేనిది లోకంలో మరొకటిలేదు. నీ దగ్గర ధనానికి విలువ కట్టగలిగినవాళ్ళు ఈ పంచాయితీ రాజ్యాల్లో కాదుకదా, ఆ ఏక సత్తాక రాజ్యాల్లోనే లేరు. అలాంటప్పుడు నిన్ను గౌరవించక యేంచేస్తారు? మూస్తూ చూస్తూ నిన్ను పోగొట్టుకుంటూరా? నీవు గభాలున ఏ మహా సివనో వెళ్ళిపోయావనుకో. అవంతి చాలా పేదదై పోతుంది. ధనం లేనివాడు ప్రక్కరాజు ఈ రాజ్యాన్ని చులకనగా చూస్తాడు. కనీసం అందుకైనా నిన్ను సభ్యతకోసం సభ్యత్వమీయమని అడగడానికి నాకు వీలుంది. నన్ను కాదని వాదని అనలేరు. ఇంతవరకూ నా వాళ్ళే సభలో ఎక్కువమంది ఉన్నారు. ఒక్కటాలోచించు. మాలికిగాని జయపాలునికిగాని ప్రత్యేక గౌరవం ఏముంది - ధనం పలుకుబడి తక్క! ఈసారి సభలో ఈ ప్రసక్తి తెస్తాను. కాదనగలవాడు ఒక్క రణవర్మ!' అన్నాడు.

'అః! నా కెందుకు లెస్తురూ - ఈ అవంతి రాజ్యాంగ వ్యవహారాలు? నన్నిలా స్వేచ్ఛగా బ్రతకనీయండి బాబూ చాలు. మీరు మాత్రం మీ నీడను నిలచే భాగ్యం ఈయండి అదే పదివేలు,' అంది నందిని. లోలోన సభ్యత్వం మీద ఆశ, ఆ తర్వాత తన కార్యానుకూలతను గూర్చి ఆలోచిస్తూనే ఉంది పైకి ఆశ లేనట్టుగా, అక్కర్లేనట్టుగా నటిస్తూ. కార్యం ఇంకా సానుకూలతగా జరుగుతుందని ఆమెకు తెలుసు. ఎప్పుడూ ఆశగా అలమటించే వారికి లోకంలో కార్యాలు సానుకూలత కావు. ఒద్దని కాదని బెట్టుగా ఉన్నవారికి కార్యాలన్నీ నెత్తినెక్కి కూర్చుం

టాయి. నిర్లక్ష్యంలో ఉన్న గొప్పతనమే. అది ఇది అన్నిం టికీ వర్తిస్తుంది. ఒక్క రాజ్యాంగానికే కాదు. మమతలు లేవూ అనే వాళ్ళ మమతలు ఏ క్షణానికా క్షణం తేలిగ్గా తేలిపోతుంటాయి. అలమటించే వారి కార్యాలు అన్నీ అను కూలత పొందనందువల్లనే నందిని కూడా ఆ మార్గాన్నే నడుస్తూంది.

'నందినీ దేవీ! ఈ మాట నాతో అంటే అన్నావు. తీరా కార్యం చక్కబడ్డాక అలా అనకు సుమా! ఆ నలుగురిలో నేనవభాసవుతాను. ఇందులో నా సాహసం ఆడదాన్ని సభలోకి లాగడమే! సభ్యత్వ మీయాలని కోరడమే. దానికి నీ ఉన్నతి, ఈ మధ్య నీవు చేస్తున్న ఒకో మంచి కార్యం చాలా వరకు పని చేయిస్తాయి. ఏరూ నిన్ను కాదనరు. దానికి తగినట్టు ప్రజల్లోనూ నీకు పలుకుబడి ఉంది.' అన్నాడు

'ముత్తానికి నన్ను స్తుతిస్తూ అందల మెక్కిస్తున్నారు' అంది నందిని చిరునవ్వు చూపుతూ అధ్యక్షుని మీదికి పూర్తిగా వాలి అతన్ని స్వాధీనం లోనికి రానీయకుండా స్పర్శతో కట్టివేస్తూ!

అధ్యక్షుడు తన్మయత్వంలో తను మరచిపోయాడు.

చతురిక ద్వారం వద్ద సద్దు చేసి నీడతో పాటు లోనికి రా ప్రయత్నించి తిరిగి వెళ్ళి పోయింది. కొన్ని క్షణాలు గడచాక అధ్యక్షుడు ఎనలేని స్థితిలో ఉండగా నందినికి ఒక పాట వినిపించింది.

వలపు యేటిలో కలత నిదురలో
కల కల బరువున కన్నులు మూసిన
మేలుకొలుప లేరెవ్వరు
నీకిక—
కాలు కదుప నీలివ్వరు.

సాలె గూటిలో - కాలు విరిపిన
మేలిమయ్యీన - ఈగ అయ్యీన
లేచి వచ్చిన జాడ గలదా?
పృధ్విలో!
లేచి తా నడయాడ గలదా?

ఎఅను చూచీ - ఆశ ముసిగీ
మేను చేర్చిన — మీన మయ్యాది
తిరిగి పోయిన జాడ కలదా?
నీటిలో
తిరిగి బ్రతుకును చూడగలదా?

మనసు చచ్చిన మనిషి పృధ్విని......

నందిని తటాలున లేచి వెళ్ళి 'చతురికా! చతురికా!' అని పిలచింది. చతురిక గొంతు ఆగి పోయింది. 'అమ్మా! వస్తున్నాను.' అంటూ దాపుకు వచ్చింది. చతురికను క్రింది నుండీ పైదాకా ఒకసారి చూచింది. ఆ చూపులో నందిని ఆశయం 'నా గత జీవితం మొత్తం నీకు పరిచిత మైనదా?' అని. కానీ చతురికకు 'ఏమిటీ ఆ పాట?' అన్నట్లనిపించి చిరునవ్వు నవ్వింది. 'వారికర్థం కాదమ్మా! నేను మాత్రం

మీకు మాట రానిస్తానా?' అంది. నందిని నవ్వింది. 'ఐనా చతురికా! తగు జాగ్రత్తలో ఉండాలి. సంగతంతా తేలిపోయింది. నీకు తెలియని విషయాలు కొన్ని ఉన్నాయి. అవి ఈ రాత్రికిగాని, రేపు పగలుగాని మనం మాటాడుకుందాం.' అంది

'ఈ గ్రహాన్ని ఈ రోజు కూడా శయ్యాగారంలో బంధిస్తారా?' అంది.

'మీ పనులన్నీ ముగించుకోండి. వీలునుబట్టి కార్యక్రమం!' అంది నందిని ద్వారం తలుపును దాపుకు వేస్తూ.

అధ్యక్షుడు మత్తులోనే అటూ యిటూ తడవుకున్నాడు. ఆసనాన ప్రక్కన నందిని లేదు. 'నందినీదేవీ!' అన్నాడు.

'వస్తున్నాను!' అంటూ దాపుకు వెళ్ళింది. తూలుతూ లేచి, నందినిని తన స్వాధీనం చేసుకున్నాడు. ఇద్దరూ కలసి శయన మందిరానికి దారితీశారు .....

* * *

ఆనాడు చతురికను వెంటబెట్టుకొని గోపాలదేవుని ఆలయానికి బయలుదేరింది. ఆమె ఎక్కిన పల్లకి ఆనాడు మరో బాటన ప్రయాణం చేసింది. ఆ బాట అవంతి దక్షిణ దిక్కు. అటునుండి కూడా ఆలయానికి వెళ్ళవచ్చుగాని, ఆమె ఆ బాటన వెళ్ళేదికాదు. కారణం ఒకనాడు ఆ బాట అన్నీ ఆమె నడచి తిరిగింది. ప్రతి కాలి బాట, ప్రతి మాళిఘ, ప్రతి యిల్లు, ఆ యిళ్ళకున్న ద్వారాలు కూడా ఆమెకు తెలుసు. పాత జీవితం తలపులో మెదలి, కొత్తకు నీరెత్తిన ఆమె పవ్నాగాన్ని కొంత దెబ్బ తీస్తుందేమోనని, ఆమె పూర్వం అనుకుందేది. దానికి తగినట్లు పూర్వం తను నివసించిన గృహాన్ని చూస్తున్నప్పుడు తన ప్రియుడు, తన

హృదయం, తన ఆత్మ, ఆ ఆత్మతో మాటాడిన మాటలు, చేసిన చేతలు తప్పకుండా జ్ఞప్తికొస్తాయి. తలచుకొని కొన్ని క్షణాలేనా మనస్సిమితాన్ని కోల్పోవాలి. అందుకని ఆమె అటు వెళ్ళేదికాదు. కానీ, ఈనాడు మార్గం మార్చి అటుగా బయలుదేరింది.

సరిగ్గా పల్లకి తన పాత యింటి ముంగిటకుండా వెళ్తున్నప్పుడు పల్లకి తెర తొలగించి మందిరం వంకకు దృష్టి సారించింది. వెలుపలి ప్రాంగణంలో ఎవరితోనో నిలచి మాటాడుతున్న రణవర్మ ఎవరిదా పల్లకి?అని అటు చూశాడు. పల్లకిలోని చూపులు, రణవర్మ చూపులు కలుసుకున్నాయి. రణవర్మ ప్రక్కన మాటాడుతున్నవారితో—

'ఆ వెళ్ళేది నందిని పల్లకీ కదూ?' అనడిగాడు. ఆ మాటలు పల్లకీలోనివారికి వినిపించాయి. కానీ, పట్టించుకోనట్టూరు కున్నారు.

మాటాడుతున్న వ్యక్తి 'ఆఁ! ఆఁ! ఆమెగారిదే! అటు వెళ్ళేది రోజూ. ఈనాడు యిటుగా వెళ్తుందేఁవిఁటబ్బా!' అన్నాడు

'తన పాత యిల్లు జ్ఞప్తికొచ్చి ఉంటుంది. చూచిపోదా మనుకొని ఉంటుంది!' అన్నాడు రణవర్మ నవ్వుతూ.

'ఆమెకీయిల్లొక లెక్కలోనిదా? ఆమె ఉంటున్న యింటిని ఇంద్ర భవనంలా మార్చింది!' అన్నాడు ఆ వింటున్న వ్యక్తి.

'అది సరేగాని, ఈ మధ్య మన అవంతి అధ్యక్షులు రోజూ ఆమె యింటికి ప్రదక్షిణలిస్తున్నాట్ట!' అన్నాడు.

'మామూలుగా వెళతాడుకదా? మొట్టమొదట ఆశ్రయ మిచ్చింది - ఆ తర్వాత ఆమె కాశాంబినుండి తిరిగి వచ్చాక కూడా, ఆయనే మంచీ చెడ్డా చూచాడు.'

'ఆఁ చూశాను. నాకు తెలుసు.'

'ఆమె ఎంత గర్వరహితంగా ఉంటుందండీ!'

'నేనెప్పుడూ ఆమెతో మాటాడలేదు. అసలామెది...' వాక్యం పూర్తికాకుండానే 'శూరసేనం' అన్నాడు—

'కులం?'

'ఏదైతే యేం. మాణిక్యం ఎక్కడున్నా విలువ కలిగింది. ఆమెకెంత భక్తి. ఎంత అణకువ. ఎంత మంచితనం. ఆమె రాకవలన అవంతికే నిండుదనం వచ్చింది!'

'ఆ కులం వాళ్ళంతా అలాగే ఉంటారులే!'

'ఆఁ మనకు తెలియదాయేం. మనవూళ్ళో ఉన్నవాళ్ళను చూడడంలేదా?'

'అది సరే. ఎంతకాలం అలా ఉంటుంది? యింతకూ ఏనాటికైనా ఆమె ఆమె కులధర్మాన్ని అమలు జరుపుతుందా? లేక...'

'ఆమెకేమవసరం? ఈ పంచాయితీ రాజ్యాలన్నింటినీ ఉన్నపాళంగా కొనగలిగినంత ధనం ఉంది. ఒక్క రత్నం చాలు. ఇటు హస్తిననుండి అటు పాటలీపుత్రం వరకూ కావాలన్నా యిస్తారు.'

'మీరంతా అక్కడే పొరపాటు పడుతున్నారు. కొనలేనిది, ఎనలేనిది ఒక వస్తువు ఉన్నా ఊడినా ఒకటే. నేను చూచానులే - ఆమె దగ్గరున్నవి. ప్రయోజనమేమిటి?'

'అంతేనంటారా? వాటిని అవంతికే యిచ్చివేస్తానందిట కదా?'

'ఈయకేం చేస్తుంది? మరో విధంగా అవి ఎలాగా అమ్ముడు పోవుకదా?'

'ఆమెకా ఆశయం ఉంటే పాటలీపోతుంది. లేదా.

ఆంధ్రవాటికి పోతుంది. లేదా ద్రావిడం. అదీ కాదంటే వేహారులకిచ్చి సింహళం పంపి అమ్ముతుంది. ఆమెకూ, ఆ రత్నాలకు విలువలేకపోతేకదా!'

'ప్రస్తుతం ఆమె విలువ నిర్ణయించవలసిందిగా ఉంది. ఊరులో ఉన్న కుఱ్ఱకారంతా పనులుమాని తిరుగుతున్నారు. వారి నరికట్టాలంటే...'

'మీ యిష్టం. మీ మాట కాదనగలవారెవరున్నారు పంచాయితీలో? ఐనా మీ కెందుకా మెమీద అంత అభిమానం?'

'ఆమెమీద కాదు. ఊరుమీద. ఈ అవంతీ శ్రేయస్సు మీద.'

'ఆమె జయదేవుని వలచింది. అతడు మధురనాయకుడై వెళ్ళిపోయాడు. అతనికీ మెలేదన్న దిగులే మిక్కుటంగా ఉన్నట్టుంది. ఈమె యిక్కడున్నట్టు తెలుసో తెలియదో!'

'అదంతా గతం. ఇంక వర్తమానంలో ఉండి భావిని ఎలా నెట్టాలో ఆలోచించాలి. రేపటి సమావేశంలో ఈ విషయం తెస్తాను. నీవు నా తరఫున నిలవాలి.'

'నా దేముంది? ఆలోచించండి.' అన్నాడా వ్యక్తి. రణ వర్తకుకూడా తిరిగి నందినిని ఒకసారి అనుభవించాలని ఉంది. దానికి మార్గం తెలియక గతంలోలాగా ఆమె ఈ వాడు ఒంటరిగా దారి వెంటగాని తోటకుగాని రాకపోకలు జరుపకపోవడం వలన వీలుకాక అలా ఊరుకుంటున్నాడు. అంతేకాక, పూర్వం జరిపిన కార్యంలో ఆమె అతన్ని గుర్తుపట్టిందేమోనన్న భయంకూడా అతనిలో ఉంది. అది అందరికీ ఉంది. అందుకే అందరూ ఆమె మందిరం ఛాయలకు రావడంలేదు. అవంతిలోని వారందరికీ ఆమె తలలోని

వాల్కయింది. అలా కావడంతో వీరు నేరస్థులు. ఈ నేరస్థత వారిలో అలాగే ఉండిపోయింది. ఆమె ఊరు విడిచిందని తొందరపడి వస్తే రాకండా కట్టడి జరపాలని ఆనాడు పెద్దలంతా తంత్రం పన్ని, వెళ్ళిందే చాలని ఆమె గేహాన్ని, ఆస్తిని ప్రభుత్వపరం చేయ సంకల్పించారు. వీరి కర్మ కాలి ఆమె ఉన్నది. ఆమె నిరాడంబరత ఈనాడు దిగ్భ్రమ కలిగించింది. తిరిగి ఆమె ఊరిలో కాలు మోపడంతో వీరి కాళ్ళు తెగి పోయాయి. ఏ విషయం కాదంటే ఆ ఆకార్యం వెలికి వచ్చి అభాసవుతామోనని ఎవరికి వారు కుదించుకు పోయారు. తర్వాత నన్నింటికి తల లూపారు. ఎవరికీ చెందని దాసిని తమ దానినిగా చేసుకోవాలని ఎవరికి మాత్రం ఉండదు! అలాగే నందిని విషయంలో వారికి వారు మథన పడుతూ ఊరుకున్నారు. వెలగ పండై కూర్చుంది రాను రాను నందిని. పరిణామం నిర్ణయించడం చాలా కష్టం. ఈ సందర్భంలో ఎవరూ ఏ కొలిక్కి రాలేక మథన పడి పోతున్నారు. ఆమె మీద అందరికీ అధికారం ఉందనుకుంటున్నారు ఎవరికి వారు. కానీ ఆమె వీళ్ళ ప్రాణానికి చాలా గొప్పగా ఉంది. పలుకుబడి పెంచుకుంది. హుందా అలవాటు చేసుకుంది. అందని స్థాయిలో ఆకర్షిస్తూ పల్లకీలో కాలు క్రింద పెట్టకుండా తిరుగుతుంది. ఎవరికీ అందని ఎత్తులో సంచరిస్తుంది. అందరూ ఎలా అందుకోవాలా అన్న జిజ్ఞాసలోనే ఉన్నారు. ఎలాగైతే రణవర్మ బైట పడ్డాడు.

ఒకప్పుడు రణవర్మ మామూలు యుద్ధ వీరుడు. తర్వాత దళాధిపతి అయ్యాడు. ఆ తర్వాత జయదేవుడు మధుర నాయకుడయ్యాక సైన్యాధ్యక్ష పదవిలోనికి వచ్చాడు. అజానుబాహుడు. 30 - 40 వసంతాల మధ్య వయస్సులో కండ బలం మెండుగా, గుండె బలం గలిగి మెదడుతో పని

చేస్తున్నాను అనుకుంటాడు. చాలా త్వరితంగా ఒక నిర్ణయానికి రావడం అతని అలవాటు. మార్చుకోడం కూడా దాదాపు అంతే. చాలా విషయాల్లో చాలా సార్లు అనుకున్న దాన్ని మార్చుకున్నాడు. దానిని గూర్చి అతని కెప్పుడూ విచారం లేదు. అతనితో మాటాడుతున్న వ్యక్తి పంచాయితీలో మొన్న మొన్ననే సభ్యత్వం అందుకున్నాడు ధన గౌరవంతో. .

వీరిలా మాటాడుకుంటూ ఉండగానే చతురిక ఒంటరిగా నడచి వీధి వెంట రావడం కనిపించింది. 'రణవర్మా! ఆ వచ్చేది నందిని దాసీ కదూ!' అన్నాడు అటు చూచి అతనికి చూపిస్తూ - ఆమె ఎవరో తనకు తెలియనట్లు! ఆమె దాసీత్వానికి కారణం అతడే. ఎలా పైకనగలడు?

'ఆఁ ఆఁ! ఆమే!' అన్నాడు అటు చూచి. చతురిక కూడా చలాకీగా ఒక చూపు వీరి మీద విసరి ముందుకు వస్తూంది. 'దానిని పిలుద్దామా?' అన్నాడు రణవర్మ. పిల్వాలని లోపలుంది.

'పిలపించండి.' అన్నాడు అ మాటాడుతున్న మనిషి.

'రేయ్! ఎవర్రా అక్కడ?' అన్నాడు రణవర్మ. కొంచం అటుగా ఉన్న సేవకుడు ముందుకు వచ్చి నిలబడ్డాడు. 'అదుగో, ఆ వెళ్తున్న ఆ అమ్మాయినిటు రమ్మని పిలూ.' అన్నాడు.

వాడు వెళ్ళాడు. రణవర్మ ఇదంతా జరపడం ఆమె చూస్తూనే ఉంది. నడక కొంచం మందగించింది. ఆ సేవకుడు ఆమెను కలుసుకొని 'అయ్యగారు మిమ్మల్ని పిలుస్తున్నారు.' అన్నాడు. 'ఎవరూ?' అన్నట్టు చూచింది.

అతను సైన్యాధ్యక్షుని వైపు చూపుతూ 'అదిగో, మిమ్మల్నే పిల్వమన్నారు.' అన్నాడు.

ఒకసారి ఇంటి వైపు చూచి వాడి వంక చూచి 'వస్తున్నా ఒద!' అంది. తిరిగి వీధి వంకను చూచి వాణ్ణను సరించింది. ఇద్దరూ కలసి పది బారల దూరంలో ఉన్న వారిదరి దాపుతూ వెళ్ళారు. ఆమె ఏమీ మాటాడ లేదు. చాలా అణకువగా మర్యాదగా గౌరవంగా అభివాదం చేసింది. ఆ అభివాదాన్ని సైన్యాధ్యక్షుడు తన హోదాలో అందుకున్నాడు. ప్రక్కతను ప్రత్యభివాదం చేశాడు. వారి దరి సంగతి ఆయనకు తెలియదు.

రణవర్మ ఆమె కళ్ళల్లోకి చూస్తూ 'ఏదేనా అవసరమైన పనిమీద వెళ్తున్నావా? నీవు నందిని......'

పూర్తిచేయకముందే 'యువసఖిని. నన్ను చతురిక అంటారు. మా సఖి కాలి అందెలు మరచి వచ్చింది. వెళ్ళి తెద్దామని బయలుదేరాను,' అంది చతురిక.

'అదంతా సరేగాని, మీరు మార్గంమార్చి యానం సాగించారేం యీ నాడు?' అన్నాడు రణవర్మ. చాలా తెలివిగా గొప్పగా మాటాడానని ప్రక్కనున్నతనివంక చూచాడు.

చతురికకు వ్యంగ్యంగా ఉన్నట్టనిపించి 'ఆఁ ఆఁ. మా చెలి మార్పు కావాలని కోరుకుంటుంది. ఎప్పుడూ కొత్తదనం కోసం ప్రాకులాడుతుంది!' అంది చతురిక. నసాళాని కంటింది రణవర్మకు. అతను 'ఆఁ - ఏదో యిలా వచ్చాం. రోజూ అటు వెళ్ళేవాళ్ళమనో' లేక 'అమ్మగారు ఊరో కెందుకో అటుకాదు యిటు' అన్నారనో అంటుందను కున్నాడు. ఆమె దానికొక సిద్ధాంతం చెప్పేటప్పటికి, చప్పున ఏమనాలో తోచక, సమాజ ధోరణికి దిగి—

'ఇప్పుడు పల్లకీ దిగదు కాబోలు!' అన్నాడు, ఎదటి వారిని చిన్నతనంగా చెప్పి హోదా చూపాలని.

అందులోనూ ఏదో అయిష్టత కనుపించింది చతురికకు. 'ఆమె పల్లకీ దిగాలసిన అవసరం ఏముచ్చింది? ఆమె ఎప్పుడూ పల్లకీలోనే సంచరిస్తుందే!' అంది. తన గతం తిరిగిందామెలో.

దానితో రణవర్మకు లోలోన కోపం రేగింది. దాసీముండ- అందులోనూ నందిని దాసీది. ఇలా మాటకుమాట అంటుందే అనుకొని, అతనిలోనూ గతం చతురికదంతా తిరిగింది.

'మొదటినుండీ పల్లకీల్లోనే తిరిగేది కాబోలు!' అన్నాడు. అసలతడు ఆమెను పిలిపించి 'నందిని ఎలా ఉంటుంది? ఏం చేస్తూంది? ఆమెకు ఏంతోస్తుంది?' అని అడిగి 'కులవృత్తిలోనికి దిగుతుందా?' అని అడగాలని. కానీ, అదంతా మరచిపోయి వెర్రివానిలా, అతడు సైన్యాధ్యక్షుడన్నది ఆమె దాసీ దానికి చూపాలని, ఆమె చాలా తక్కువదని, తను చాలా గొప్పవాడ ననిపించుకోవాలన్న పురుగు మెలిదిరిగి పుట్టె మారుమార్గం త్రొక్కి ఏ మాట ఎలా అనాలో మరచి నోటికి వచ్చినట్లు మాట్లాడ్డం మొదలెట్టాడు. అది గ్రహించింది చతురమతియైన చతురిక.

'నిజమే. ఆమె అంతస్తుకు పల్లకి చాలదు. రథాలు కావాలి. కానీ, మనది జనసత్తాక కావడంతో ఆమె పల్లకి కే వాడుతుంది!' ఈ సమాధానం సరైంది కాదని ఆమెకు తెలుసు. ఐనా అనేసింది కావాలని. అనడానికి కారణం తన పాత వైరమే! అదంతా ఒక కథ.

రణవర్మ ఆ సమాధానానికి దిమ్మరపోయాడు. నోట మాట రాలేదు. రెండు క్షణాలైనా అలాగే ఉండి

పోయాడు. ఎదుట మగవాడు ఆ మాట అనివుంటే,అతనికా కోపం వచ్చినట్లయితే నిలువునా చేతులతో నలగ పొడిచి మాంసముద్ద చేసేవాడు. కానీ - కానీ చతురిక ఆడది. చతురిక పరిస్థితి గ్రహించి—

'సెలవిస్తే వెళ్ళివస్తాను!' అని తిరిగి అభివాదం చేసింది అక్కడ ఉండడం యిష్టంలేక. రణవర్మ 'ఊఁ!' అన్నాడు ఏమీ చేయలేని నిస్సహాయ స్థితిలో ఉన్నట్టు. ఆమె వీధి ద్వారం దాటుతుండగా 'ఎంత గర్వం! ఎంత తలబిరుసు సమాధానమో విన్నారుగా?' అన్నాడు. వ్యక్తి దానికి కూడా తందాన పాడాడు. ఆ వంతతో రణవర్మ కోపం మరీ హెచ్చురేగింది. 'దీని సంగతి, దీని చెలికత్తె సంగతి తేలుస్తాగా!' అన్నాడు.

వ్యక్తి వింటూ ఊరుకున్నాడు.

'ఇప్పుడు గోపాలదేవుని నాట్యం చేస్తుంది కదూ, అది!' అవడిగాడు రణవర్మ-మర్యాద మరచిపోయాడు.

'ఆఁ. చేస్తుంది. రోజూ చేస్తుందిగా.' అన్నాడు వ్యక్తి.

'మనంకూడా వెళ్దాం పదండి.' అన్నాడు ఏదో బ్రహ్మాండం బద్దలు చేసేట్టు.

అతను మౌనంగా అతన్ని వెంబడించాడు. యిద్దరూ కలసి గోపాలదేవుని కోవెలకు బయలుదేరారు.

వీరు ఆలయప్రాంగణానికి చేరేప్పటికి నందిని నాట్యం మొదలుపెట్టింది. ప్రేక్షకులంతా ఆమె పాటకు, అభినయానికి, ఆ వేస్తున్న అడుగుకు ముగ్ధులై పరవశంలో మునిగి ఉన్నారు.

నందకుమారుని నాట్యవిశేషం।
అందరి డెందము లందె సంతోషం।

లేగలు పాలను త్రాగుట మరచెను
మూగిన గోవకు యూగిసలాడిరి
ఆగి విన్నదా యమునా నదియూ
ఈగుటమరచెను గాలికి కొమ్మలు ॥నంద॥

మందలమేవరి నందకిశోరుడు
చిందులు త్రొక్కగ చిత్రమదేమిటో।
ఇందిరమందిర మందున దేవత
లందరు మెచ్చిరి అచ్చటికొచ్చిరి ॥నంద॥

అందరిడెందము లాడగనాడెను
నందకుమారుడు అందెలరవళితో
సందరమాయెను సదయులహృదయము
సుందరరూపుని అందరు బొగడిరి ॥నంద॥

ప్రేక్షకమండలిలోని తలలన్నీ ఊగిసలాడాయి.

'చూశావుగా, అది వీళ్ళనందరినీ ఎలా పిచ్చివాళ్ళను చేసి ఆడిసుందో!' అన్నాడు నాట్యం ఐపోయేంతవరకూ చూచి, రణవర్మ మెల్లగా ప్రక్కనున్నవాని చెవిలో.

అతడామె అందానికి అచ్చెరువొంది రణవర్మ అంటున్న దాన్ని సరిగా వినిపించుకోకుండానే, 'ఆఁ ఆఁ ఔనౌను!' అన్నాడు. ఆ మాట రణవర్మకు శాంతి నిచ్చింది.

రణవర్మ రావడం, ప్రక్కనున్న వ్యక్తి చెవులో గుసగుస లాడ్డం చూస్తూనేవుంది, చతురిక. రణవర్మ నందినిమీద కత్తి

కట్టాడు. ఆ యొత్తిన కత్తిని దించకుండా అలాగే మరొకరి మీదికి మళ్ళించాలి. లేదా ఎదురు తిరిగి ఆ కత్తి అతని గుండెల్లోనే గృచ్చుకోవాలి. అమ్మగారితో కర్తవ్యం ఆలోచించాలని ఆమె ఆలయ గర్భదేవుని సందర్శనంకోసం వెళ్ళుతుండగా వెంటనంటి వెళ్ళింది. చేరిన జనం యిళ్ళకు మళ్ళారు. ఏదో కొందరుమాత్రం అటూయిటూ తారస లాడుతూ నందిని చూడకుండా ఆమె అందాన్ని చూస్తూ కళ్ళకు పండుగ చేసుకుంటున్నారు. వాళ్ళంతా కొన్నాళ్ళ ముందు ఆమెను వీధుల్లో ఏదో ఒక కొంటె మాటలన్న వాళ్ళే. కాని ఈనాడు ఆమె ఎదటగాని, వెనుకగాని ఏ మాటా అనలేరు. ఒకళ్ళే మరొకరంటం సహించ లేరు.

పూజారి తీర్థం పోశాడు. అణకువగా భక్తి శ్రద్ధలతో తీర్థం అందుకొని త్రాగి, ఆ చేతులు తలకు రాసుకుంది. పూజారి పూవులిచ్చాడు. ఒక్క పూవు కొప్పులో ఉంచు కొని మిగిలిన వాటిని చతురిక కందించింది. చతురిక ఆ పూవుల కోసం తెచ్చిన వెండి బుట్టలో ఉంచింది. మంద యానలిద్దరూ అందంగా అడుగులు వేసుకొంటూ ఒక ద్వారం దాటగానే—

'పాము పగబట్టి వెన్నంటిందమ్మా!' అంది చతురిక.

'వాలు చూపుల మంత్రం పనిచేయదా?' అంది నందిని.

'చెప్పలేం.'

'సరే నాగస్వరం పడతాను భయపడకు,' అంది నందిని.

'ఎదట పడితేకదా?' అంది చతురిక.

నందిని క్షణం నిలచి కళ్ళు మూసి ఆలోచించింది. 'భయ పడకు. మార్గంలోనే బుసలు కొడుతూ వెన్నంటిందికదా?

ఎందుకైనా మంచిది, జాగ్రత్తగా ఉండు. నేనింకా ముసలి దాన్ని కాలేదు. ఆడిస్తాను. పరుగెత్తిస్తాను చూద్దువుగాని. నీవు కొంచం గసరడం మానెయ్. అణకువ కార్యసాధన కనుకూలిస్తుంది. మెచ్చుకుంటే మనకొచ్చే నష్టం లేదు. ముఖస్తుతికి లొంగని మనిషి లోకంలో నూటికొక్కరు. ఆ ఒక్కరూ ఇతడు ఎట్టికీ కాలేడు. ఒకవేళ అయినా డొంక తిరుగుడుగా [illegible]ంచి, కార్యాన్ని సానుకూల పరుద్దాం.' అంది నంది.

'అంత దూరం ఎందుకమ్మా' అంది చతురిక.

'చదరంగంలో ప్రక్కకొచ్చిన ప్రతి పావునూ పరికించి దాని నడకను బట్టి మన పావు నడపాలి. మంచి నడకే ప్రక్కనే ఉంటుందాయను. కాస్త ఆట సాగనీ. మొదటి ఎత్తు దగ్గరనుండే చంపుకో కూడదే! అసలలా ఆడితే ఆట ఏపోదా? రక్తేమ్మిగులుతుంది? కానీ చూద్దాం. కానీ నీవు మాత్రం గడిని మాంచి అడుగు పెట్టు,' అంటూ రెండవ ద్వారం దాటి మండపం లోనికి వచ్చారు. ఎదురుగా రణవర్మ నిలచి ఉన్నాడు. అతని ప్రక్క వ్యక్తి కూడా వీరిద్దరినీ చూస్తూనే ఉన్నాడు. వీళ్ళు వెలికి వెళ్ళాలంటే వాళ్ళ ముందుగుండా వెళ్ళాలి. అటూ ఇటూ జనం వారిని చూస్తూ తొరసలాడుతూనే ఉన్నారు. నాల్గు వంకలకూ చూచింది నందిని. నడక ఆపలేదు. అడుగు తడబడకుండా చూచుకుంది. సరాసరి వారి ముంగు నిలచి తల వంచి చేతులు జోడించి—

'నమస్కారం అధ్యక్షుల వారికి' అంది.

రణవర్మ అలా చేస్తుందని ఊహించుకోలేదు. కాబట్టి తెల్లబోయి అభివాదాన్నందుకోడం గాని, తిరిగి అభివాదం చేయడం గాని మరచి పోయాడు. 'ఇహిహి!' అని పకిలించి

'బాగున్నావా?' అన్నాడు రాజసంగా - నడిమంత్రపు సిరి యొక్క అవలక్షణాలు అలాగే చేయిస్తాయా అన్నట్టు.

'ఏదో ఇలా ఉన్నాను మీదయ' అంది అతి అణకువను చూపుతూ. అతనికేం తెలుసు? 'అతివినయం ధూర్త లక్షణం' అన్నది. అంత దూరం చదువుకోవద్దా? తక్షశిల దాకా వెళ్ళి కత్తి తిప్పడంలో శిక్షణ పొందాడుగాని, మనస్సులోని సంగతులతో అతనికేం పని? కండలు కావాలి. దంపులు తిరిగి అవి కొట్టవచ్చేట్టు కనిపించాలతనికి. మాటల్లో మలుపులు అతనికి తెలియవు. అయినా ఒక మాట విసిరి చూద్దామని—

'నా దయేమిట్లే? అవంతీ అధ్యక్షుని దయగాని,' అన్నాడు ఒక విధమైన వెటకారంగా చూస్తూ. ఆ చూపులు ప్రక్కనున్న వ్యక్తి వంకకు త్రిప్పుతూ 'చూచావా తెలివి? నేను కూడా వ్యంగ్యంగా మాటాడగలను.' అన్నట్టు.

నందిని పసిగట్టింది. ఇతనికి కోపమేకాదు. ఈర్ష్య కూడా ఉంది. మన పని చాలా తేలిక అనుకొని, 'అదేమన్న మాట! మీరుమాత్రం సామాన్యులా? సైన్యాధ్యక్షులు. మీ దయ లేకపోతే అవంతిలో అరక్షణం ఉండగలనా?' అంది నందిని - ఆ మెరుపన్న అస్త్రాల్లో మొదటిది చూపు - దాన్ని సంధించి. రణవర్మ ముఖంలో మార్పు వచ్చింది. కాకమీద సాగకపోతే లోహం చల్లారాక సాగదని తెలిసిన నందిని వెంటనే—

'మీ దర్శనం చేసుకుందామని ఎంతో కాలంగా అనుకుంటాను. నేనుగా మీ యింటికి వస్తే మీ గౌరవానికి భంగమని, లోకులేదేనా మిమ్మల్నిగూర్చి అనుకుంటారని, అపోహాలకెందుకు వీలు కలిగించాలన్న ఆశయంతో మీ

మందిరానికి రాలేకపోయాను. మీరు మరోలా అనుకోకండి. దర్శనం చేసుకోనందుకు క్షమించండి!' అంది నందిని.

ఇంకేముంది? ఐపోయాడు! అంత లావూ పొడుగూ ఉన్న సైన్యాధ్యక్షుడు మంచుగడ్డలా చల్లారి నీరుగారిపోయాడు. 'అఁ ఉహఁ! అదికాదు' అన్నాడు. ఏఁవిఁ అహోఁ, ఏం అఁవో, ఏది కాదో అతనికి తెలియదు సరిగదా! ఆ పరిస్థితిలో అక్కడుండి అర్థం చేసుకుందే వాళ్ళకు కూడా తెలియదు. నందిని మాటాడలేదు. అలుపు తీర్చుకోనీ అనుకుంది.

'అదికాదు నందినీదేవీ! ఎవరేమనుకుంటారు? డొక్క చించేస్తాను ఎవరేమన్నా అనుకున్నారంటే!' అన్నాడు. అనుకోడం వెలికి తెలియదని అతనికెవరు నచ్చచెప్పగలరు? 'పోనీ మీరు కాకితో కబురు పెడితే నేను రాకపోయానా?' అన్నాడు. తిరిగి చల్లారిపోయాడనుకుంది. 'ఎంత మాట! మీకు ఈ దాసానుదాసురాలు కబురుపెట్టేదా? అలా ఎప్పుడూ అనకండి. నేనెంత? నా తాహతెంత? మీకు కబురుపెట్టడమా? మీరు కబురంపితే వచ్చి, మీ ఆజ్ఞ పాలించవలసిన నన్ను మీరలాగ గౌరవించకండి. నాకదోలా ఉంటుంది!' అంది నందిని. సర్వసైన్యాధ్యక్షుడైన రణవర్మ మెలికలు తిరిగిపోయాడు. శక్తి ఉడిగిపోయింది. ఇంక నాలుగు మాటలామె అంటే అతనికి మంచినీళ్ళు కావలసి వచ్చేది. అప్పటికే తన్మయత్వంలో కొంత, ఆమె అనే మాటలకు కొంత, తనమీద ఆమెకున్న గౌరవానికి కొంత సొప్పున ఒంట్లో నీరూ నెత్తురూ కొవ్వూ అంతా హరించిపోయాయి. ఇంక ఒక్క కట్టెమాత్రం ఉంది. అది ఆమె అనే మాటలలోని వ్యంగ్యం తెలిస్తే కాలిపోతుంది. కానీ, అది రణవర్మదవడంవల్ల అలాగే నిల్వగలిగింది.

'నేనంటే మీ కెంత గౌరవం!' అన్నాడు. అంటే ఓడిపోయానని పూర్తిగా ఒప్పుకున్నట్టేనన్నది తెలియపరచినట్టు.

'గౌరవం - అదేమిటండీ! అది నా కర్తవ్యం. నేను మీ దాసీదాన్ని. మీరెలా చెబితే అలా వినాలి!' అంది నందిని. అంతలో చతురిక 'అమ్మా! ప్రొద్దు పోతున్నట్టుంది. వారిని రేపు విందుకు ఆహ్వానించండి. మళ్ళీ......' ఏదో అనబోయింది. నందిని గంభీరంగా—

'చతురికా! నీకు రాను రాను మర్యాద తెలియడంలేదు. మనలాటివాళ్ళ యిళ్ళకు విందులకు వారొస్తారా? అంత పుణ్యం చేసుకోలేదే. నేను, నా బ్రతుక్కి వారినాహ్వానించేటంతదాన్నా! తమరేమీ అనుకోకండి! దానికి తెలియదు. అసలు నాదే పొరపాటు. రేపు నా పుట్టినరోజు పండుగ. అందుకు అందరినీ ఆహ్వానిద్దామని ముందుగా అనుకున్నాను. తర్వాత నా తాహతు తెలుసుకొని చాలా మందిని పిల్వ తగననుకున్నాను. మీరు చెప్పండి? నా వరకు నేను మిమ్మల్ని పిల్వ తగుదునా?' అంది నందిని. చతురిక అనబోయినది వేరు. నందిని తీసిన అర్థం వేరు. రణవర్మ యింకా చల్లదనంనుండి తెప్పరిల్లకుండానే 'అలా అనుకోకు నందినీదేవీ! నీవు పిలవాలేగాని, నేను రానా? నా వరకు నేను వస్తాను. ఆఁ అదిసరే! రేపేనా మీ పుట్టినరోజు?' అనడిగాడు రణవర్మ.

'ఆ!' అని తలూపింది వాలుచూపు విసరి నందిని.

'అలాగే. నేను తప్పకుండా వస్తాను. మీరు సందేహించ నక్కర్లేదు. ఊళ్ళో అందర్నీ పిలవండి,' అన్నాడు.

'నాకు చాలా భయమండి! అందుకే అసలు మానేద్దామా అనుకుంటున్నాను,' అంది నందిని.

'అరెరే, భలేవారే నే మీరు! వైభవంగా జరిపించాల్సింది పోయి,' అని నవ్వి, 'ఇంక యిప్పుడేం లాభం? వేళ మించి పోయింది. ఈసారి కేలాగో గడిపివేయండి. వచ్చే యేటికి దర్పంగా చేయించుకుందురు గాని,' అన్నాడు. ఇందులో ఏదేనా అంతరం ఉందాని ఆలోచించి, లేదని తెల్సుకొని, 'ఎంత మాట! అంతా మీదయ. రేపు మీరు...' అని మిగిలింది అభినయంలో నయనాల ద్వారా తెలియపరచింది.

'ఓ! తప్పకుండా!' అన్నాడు రణవర్మ. నమస్కరించి, 'మీ విలువైన కాలం అనవసరంగా ఖర్చు పెట్టించాను. వస్తాను,' అంది.

'ఆఁ, ఆఁ! కాలందేముందిగాని, మళ్ళీ కలుసుకుందాం - వెళ్ళి రండి,' అన్నాడు.

'మీ దయ!' అంటూ అలాగే వెనక్కి తిరిగి నాస్తూ వెళ్ళి పల్లకీలో కూర్చొంది.

తెరలు పడ్డాయి. లోపల కూర్చున్న నందిని కెదురుగా ఉన్న చతురిక 'అమ్మా! రేపు మీ పుట్టిన రోజా?' అంది ఆశ్చర్యపోతూ.

'నాకేం తెలుసు? ఎప్పుడు పుట్టానో! నీవు విందు అన్నావు. దానికది తోడు చేశాను. రోజూ చేసుకుంటే మాత్రం ఏమే? నేను పుట్టిన రోజు చేసుకోక, చచ్చిన రోజు ఎలా చేసుకుంటాను? నేను చచ్చాక తలచుకుందే వారుండరు. కనీసం బ్రతికినన్నాళ్ళూ రోజూ పుట్టిన రోజు వేడుక జరుపుకోవాలి,' అంది నందిని నవ్వుతూనే.

అందులోని బాధ అర్థం చేసుకుంది చతురిక. పల్లకీ సాగి పోయింది. చాలా దూరం వెనక్కి తరలిపోయింది దేవళం.

'అది సరేగాని, వీళ్ళందరినీ ఏం చేద్దామని ?' అంది చతురిక మౌనాన్ని బ్రద్దలు చేస్తూ.

'ఈ పెద్దమనుషులు నాకు జరిపినదానికి ఏం చేసినా పరిహారం కాదు. కాని నేను చేయదలచింది చేస్తాను. ఈ కసికి తిరుగు లేదు. ఈ పగ తలచుకుంటేనే పెగలాడు సుంది. చతురికా ! చేయవలసింది చేసి వదలుతాను. వాళ్ళను క్షమించడమంటూ లేదు. ఈ అవంతిని నా అవమానాగ్నితో దహించి వేస్తాను. నన్ను విషపూరితం చేసి లోకం మీదకు వదలిందీ అవంతి. ఇంక అవంతికి వంత తప్పదు. నాలో అవంతైనా అవంతి మీద జాలి లేదు. రోజు రోజుకూ పంతం పెరిగిపోతూంది,' అన్నది నందిని స్థిరంగా.

'అమ్మా ! మీ బాధ నాకు తెలుసు. నా సాయశక్తులా మీకు తోడుగా ఉండి, సాటి స్త్రీకి జరిగినదానికి ప్రతి చేస్తాను,' అంది చతురిక.

'ఆమాత్రం ఓదార్పు నాకు చాలు చతురికా! కాని నీవు రేపు నాకొక సాయం చేయాలి. చాలా దూర ప్రయాణం. చాలా శ్రమ. అది చేయనిదే నాకు నిద్ర పట్టేటుగా లేదు,' అంది నందిని చాలా విచారంగా. అది గమనించిన చతురిక—

'చెప్పండమ్మా! నా ప్రాణాన్నైనా ఇచ్చి ఆ కార్యం పూర్తి చేస్తాను.' అంది.

'పిచ్చిదానా! ప్రాణాలెందుకేకి? వాటికి విలువ లేదు. ఒక్క పోటుతో, ఒక్క చిటికెడు విషంతో, ఒక్క బల మైన ఘాతంతో, లేదా ఒక్క మాటతో పోతాయీ ప్రాణాలు. నా క్కావలసింది కార్య సాధన. అదిచేయి. అందుకు కావలసిన సర్వ సన్నాహాలు సమకూర్చుకుని రంగంలోనికి దిగు.' అంది నందిని.

'చెప్పండమ్మా! అలాగే చేసి చూపుతాను.'

'అదే కావలసింది. రేపు సాయంత్రం సార్థవాహకులు ప్రయాణ మౌతారు. వాళ్ళతోపాటు నీవు ప్రయాణమై కౌశాంబికి వెళ్ళు. అక్కడ ఆరామాలున్నాయి. వాటిల్లో ఒక అంధభిక్షువు ఉంటాడు. ఆయన్ను కలుసుకో. నేను కులాసాగా ఉన్నానని చెప్పు. గత గ్రీష్మంలో ఆయన కందించిన సొమ్ముతోపాటు ఆయన ఉండడానికి కనువుగా ఒక జాగా చూచుకొమ్మని వార్త పంపాను. ఎక్కడైనా చూచాడో లేక ఊరుకున్నాడో తెలుసుకొని ఆయన ఊరుకుంటే ఆ ఏర్పాట్లన్నీ చేసి సక్రమమైన స్థలంలో ఆయననుంచి రావాలి. అదే నీవు చేయవలసిన పని. ఇదంతా ఒక్క మాసంలో జరుపుకొని రావాలి.' అంది నందిని.

'ఆయనక్కడ లేకుంటే?'

'ఉంటాడు. ఆ నమ్మకం నాకుంది. లేదా వెదకి ఆరా తీసి నీ ఇష్టం వచ్చిన దేశంలో ఏకు ఎక్కడ సుఖంగా ఉంటుందని తోస్తే అక్కడ ఆయన క్కావలసిన సదుపాయాలు చేసి ఆయనను మెప్పించి ఆయనకు ఒక స్థిర నివాసం ఏర్పరచి రావాలి. అది చాలు. ఆ తర్వాత అవసరమైన వాటిని గూర్చి ఆలోచిద్దాం.'

'అలాగే వెళతాను. మన అవంతి దాపులోనే వెదకితే!' అంది చతురిక.

'కాదు. ఉండకూడదు. ఉజ్జయినిలో చూడు. కాదనను. అవంతి ప్రాంతంలో అతడుండడానికి వీలు లేదు.' అంది నందిని. తిరిగి క్షణం ఆలోచించి—

'బయలుదేరు. నీ క్కావలసినంత ధనం తీసుకొని వెళ్ళు. వెళ్ళిరా! తిరుగు లేదు. తిరుగు లేనిది చేసుకొని రా! చతురిక నా జీవితంలో...' ఆగిపోయింది మాట.

అంతలో పల్లకీ ఇంటి ముందుగా ఆగింది. ఇద్దరూ పల్లకీ దిగి లోనికి వెళ్ళారు. అప్పటికి అధ్యక్షుడు వచ్చి, ఆమె కోసం ఎదురు చూస్తున్నట్టు దాసీది వార్త అందించింది. బట్టలు కూడా మార్చుకోకుండా సరాసరి వెళ్ళింది. విశాలమైన ఆసనమ్మీద కూర్చొని ఇంటి పై కప్పు వంక చూచి ఆలోచిస్తూ ఈమె రావడం చూడలేదతడు. ఆమె సరాసరి వెళ్ళి అతని ఊరువుల మీద కూర్చున్నంత దాపులో కూర్చుని రెండు చేతులతో అతని మెడను పెనవేసుకుంది. అధ్యక్షుడు 'వచ్చావా?' అన్నాడు.

'ఎంత సేపయింది వచ్చి? చాలా జాగయిందా, నే రావడం,' అంటూ ఆమె ఎత్తయిన వక్షాని కతని తలను హత్తుకుంది.

'ఇంతకు ముందే వచ్చాను.' అన్నాడు ఆమె వెన్నును తన చేతులతో మృదువుగా రాస్తూ.

'రేపటికిగాని నా అభిప్రాయాల సారం బయట పడదు,' అన్నాడు అధ్యక్షుడు.

క్షణం నివ్వెరపోయి చూచి, తెప్పరిల్లి, 'ఏమిటి మీ అభిప్రాయం? నాకు చెప్పకుండానే సారం విషయం ఆలోచిస్తున్నారు,' అంది. అని వెంటనే 'మరచాను. మీకు దాసీలు ద్రాక్షాసవం అందించ లేదు. ఏమిటీ మర్యాద తెలియని పద్ధతి? చతురికా! చతురికా! మధూలికతో ఆ ద్రాక్ష పాత్ర నింపి పంపు,' అంది. అధ్యక్షుడు చెప్పుతున్నది వినిపించుకోకుండా, 'మాచారా! క్షణం యింట్లో లేకపోతే, ఎవరినెలా గౌరవించాలో మరచిపోతారు,' అంది అతని తల ముంగురులు తన పల్లవాంగుళులతో మెల్లగా సర్దుతూ.

'నేను రాగానే ఆ పాత్ర నీ గదికి పంపారు నందినీదేవీ! నేనే యింకా అందుకోలేదు,' అన్నాడు, ఎదురుగా ఉన్న పాత్రను చూపుతూ అధ్యక్షుడు.

'ఏం? నా చేతిమీదుగా యిస్తేగాని మీకు రుచించదా? ఉండండి,' అంటూ లేవబోయింది. అతడామెను దాపునుండి కదలనీయకుండా అలాగే పట్టుకొని, 'నా ఆలోచనను విను. తర్వాత అందివ్వుదుగాని... మిగిలిన సభ్యులతో నీ ప్రస్తావన తెచ్చాను. చాలావరకందరూ అంగీకరించినట్లే. రణవర్మతో సంప్రదించలేదు. అతడేమంటాడో?' అన్నాడు.

'ఒప్పుకుంటాడు. అతన్ని నేను ఒప్పించగలను' అని అందామనుకున్నది. కానీ ఎందుకేనా మంచిది-తొణక్కుండా ఊరుకోడం ఉత్తమం అని, 'మీరు నా కోసం చాలా ప్రయాసపడుతున్నారు. వాత్సల్యమనుకుంటారో!' అంది నందిని అతని కౌగిలి వదలించుకో ప్రయత్నం చేస్తూ. కానీ అతడామెను విడువకుండానే—

'ఎవరేమనుకున్నా, నేను సాధించదలచింది మానను. నీవు అవంతి పౌరసభ సభ్యురాలవు కావలసిందే. దాని కొరకు కొనసాగుతూ నేను ప్రయత్నిస్తాను. కనీసం ఒక్క రోజైనా సభలో నీవు పాల్గొనాలి!' అన్నాడు ధీర చిత్తంతో.

'ఏంచేస్తారో మీ పిచ్చిగాని, మీకున్న అభిమానం, మీకున్న వాత్సల్యం, మీ అంత సదాశయం వారికుండాలి. ఎక్కడుంటుంది? నన్నో ఎంగిలాకులా చూస్తారు. దానికి నాకు చింత లేదు. నిజానికి అవంతి ప్రజానీకంతో పోలిస్తే నేను అలాటి దాన్నే. కులానికి తక్కువే కదా. కులాన్ని బట్టి, వంశాన్ని బట్టి గౌరవం వస్తుందిగాని...' మాట మధ్యలోనే—

'గుణాన్ని బట్టి రాదంటావు. పిచ్చిదానా! అవంతి రాజ్యాంగం ఎలాంటిదో, ఇక్కడ నడుస్తున్న పంచాయితీ విధాన మెటువంటిదో నాకు ఏకరువు పెడుతున్నావు. ఇక్కడే కాదు. ఎక్కడైనా, ఎప్పుడైనా ధనాన్ని బట్టి గౌరవ మర్యాదలు గాని కులాన్ని, గుణాన్ని బట్టి గాదు నాకు తెలిసినంతల్లో. గతంలో నీవు నిరుపేదవని ఊరక ఆశ్రయమిచ్చారు అవంతి పౌరులు. ఆ తర్వాత ఏదో ఉంటుందిలే, అనుకున్నారు. కానీ ఈ నాడు నీ స్థానం అలా లేదు. నీవు చాలా భాగ్యవంతురాలవని తెలిసిన నాటినుండి నీవు వేసే ప్రతి అడుగుకూ విలువగట్టి, నిన్ననుసరించి నడవాలని ప్రయత్నిస్తున్నవారు అవంతిలో చాలామంది. చాలామంది కాదు - దాదాపు నూటికి తొంభైమంది. ఆ మిగిలిన పదిమందీ పరమ ఛాందసులు. వారికేమీ తెలియదు. తెలుసునన్న అహం చాలా యెక్కువ. నిజానికి ఈ మారుతున్న సమాజంలో ఉండతగనివారు వారు. వారు నమ్మినది ఉన్నతమనే భావన వారికింకా పోలేదు. నమ్మినది మంచిదనే భావం మంచిది కాదని, ఆ ధ్యేయం తప్పని నేననను; అనలేను. కానీ, వారికి పురోగమన దృష్టి లేదంటాను. వారి అడుగులో ప్రతిదీ తిరోగమనమే సూచిస్తుంది. ప్రస్థానపథం వారందుకో లేరు. ఈ సభ్యుల్లో నీవనుకుంటున్నట్టు అంతా నీతివేత్తలులేరు. గొప్పవారుకారు. కానీ, వారిమీద ప్రజలకు చాలా మమకారం, మంచి అభిప్రాయం ఉండికాదు అక్కడ ఉండగలుగుతుంది. వీరికి చేతయినది గుప్పిటిని తెరవకుండా చూచేవారికి భ్రమ కలుగచేయడం. అలా చేయగలిగిన ప్రతివాడూ, అవంతి సభాసభ్యుడై పేరెన్నికగన్నాడు,' అని ఒక్కసారిగా ప్రసంగాన్ని ఆపి

క్షణం ఊరుకొని 'ఈ రోజు నేను చాలా ఎక్కువ మాటా డాను కదూ?' అనడిగాడు.

నందిని ఆ మాటాడుతున్న ధోరణికి చాలా ఆశ్చర్య పోయి వింటూ ఊరుకుంది. 'అమ్మో! అధ్యక్షుడు సామా న్యుడు కాదు. కూలంకషంగా తెలుసుకొని చర్చించగలడు. ఏవంకకైనా హాయిగా సమర్థించగల చాతుర్యం ఉన్న వాడు. పైగా మంచి ధారాశుద్ధి గలవాడు.' అనుకొంది.

'మీరు మాటాడుతుంటే న్యాయ దేవత మాటాడు తున్నట్టుగా ఉంది నాకు వింటానికి. మీరిలా మాటాడ తారని నేనూహించలేదు సుమండీ!' అన్నది నందిని.

'నందినీదేవీ! నన్నేదో ఉబ్బేయాలని మాటాడకు. నిజం చెపుతున్నాను. మిమ్మల్ని గాని, లోకాన్ని గాని నమ్మించా లనికాదు. దానివలన నాకు ప్రయోజనం లేదు. కొత్తగా ఒరిగేదిలేదు. మీకు తెలియనిది యేముంది?' అన్నాడు అధ్యక్షుడు.

నందిని ఒక్కసారి దిమ్మరపోయింది. నిజానికి అతనన్న దానికన్నా మిన్నగానే ఆమె అతన్ని అభినందించింది. దానిని సరిగ్గా అందిపుచ్చుకుని విపరేసరికి ఆమె ఉక్కిరి బిక్కిరై తన్నుతాను సమర్థించుకోడానికి 'అంటే నేనన్న దానిలో మీకు అతిశయం కనిపించింది కాబోలు!' అంది.

'అది అతిశయమో కాదో నాకర్థం కాలేదుగాని ఎబ్బెట్టుగా ఉంది!' అన్నాడు.

'పోనీలెండి. ఇంకమీదట మిమ్మల్ని అభినందించను. సరా!' అంది చిన్నబుచ్చుకున్నట్టు.

'కోపంలోనికి వెళ్ళకు. కోపంలో పనులుగావు. నిన్ను చూస్తే నాకు నచ్చినదందుకే. ఆడవాళ్ళుగాని మొగవాళ్ళు గాని కోపంగా చిరాగ్గా విసుగ్గా మూడుమొహంతో ఏడుస్తూ ఎదుట తిరుగుతుంటే నాకు చాలా విచారంగా ఉంటుంది. ఈ లోకంలోకి మనం వచ్చింది ఏడుస్తూ గడపడానికి కాదు. నవ్వుతూ పేలుతూ వల వలలాడుతూ కవ్విస్తూ నవ్విస్తూ జీవితాన్ని గడిపివేయాలి. ఆ తర్వాత సంగతి ఎవడికిబట్టింది? నిన్ను నేను మొదటనుండి చూస్తున్నాను. సంతోషంగా జీవితాన్ని లెక్క చేయకుండా, స్వేచ్ఛగా గాలిలాగా, సెలయేరులాగా కనిపించావు. అందుకే నీకోసం పడిగాపులు కాశాను. మనలో చాలా ఉంటాయి. అవి వెలికి చూపిస్తూ, ఆ విచార భారంలో మనం క్రుంగిపోయి ఎదటివారిని కూడా క్రుంగదీసి, వాళ్ళను విసిగించి మనం విసుక్కుని ఎందుకు బాధపడాలి?' అన్నాడు.

అధ్యక్షుడు అంత ఖరీదుగల్గిన సత్యాలను నగ్నంగా విప్పి చెప్పడం ఆమె మొదటిసారిగా అదే వినడం. వింటూ యిటువంటి వానికి ప్రాశసరం కాచింది మనస్సుకోసం యిచ్చి సైకంలో అతన్ని ఇన్నాళ్ళూ మన్నుతిన్న పాములా ఎందుకు చేశానా అనిపించిందామెకు. ఆమె మౌనంగా ఉండడం చూచి 'ఏం నందినీదేవీ! మాటాడవేం? నేను చెప్పేవాటిని నీవు ఒప్పుకోలేవా? ఐనా నాకు చింతలేదు. ఒకరికోరకు ఒకరు నిర్వచించేవిగావు. ఇవి నా జీవితంలో అనుభవంతో తెలుసుకున్నవి. నీకు నచ్చనంత మాత్రాన అవి చెడ్డవిగావు. ఒకవేళ నేనంటున్నానని వాటిని నీవు అంగీకరించాలని నిన్ను బలవంత పరచను. మరొకటి -

ఇవన్నీ నిజాలని నీవనాలని నాకేం లేదు. నాక్కావలసింది నీవేదేనా మాటాడడమే!' అన్నాడు.

'మీరివాళ చాలా ఖరీదుగా మాటాడుతున్నారంటే! ఇంతకన్న ఏదిచెప్పినా ఎబ్బెట్టుగానే ఉంటుంది.' అంది నందిని.

'పిచ్చిదానా! వెళ్ళి ఆ ద్రాక్షాసవపాత్ర తీసుకురా! అన్నట్టు నీవు బట్టలు మార్చుకోలేదేం యింకా?' అనడిగాడు ఆమె వయ్యారంగా నడవడం చూస్తూ. ఆమె ద్రాక్షాసవాన్ని తెచ్చి ఎదురుగా ఉన్న ఆసనమ్మీద ఉంచి చిన్నగాజు పాత్రలోనికి ఒలకించి అందిస్తూ, 'మీకీరోజు చాలా తక్కువగా యిస్తా నీ సవాన్ని. కావాలంటే పచ్చి సవం ఎంతేనా యిస్తాను.' అంది నందిని.

'ఏం, కారణమేమిటి? ఐపోయిందా, గాంధారంనుండి తెచ్చింది? ఇవాళ కూడా ఎవరో బేహారులొచ్చారు కదా?!' అన్నాడు పెదవులతో సవాన్ని చప్పరిస్తూ.

'చాలా ఉంది. ఎంత తాగినా ఇంకా ఉంటుంది. కానీ, యిది కాచింది. మత్తులో మిమ్మల్ని ఉంచడం యిష్టంలేక' అంది నందిని.

'నేను మత్తులో ఉండకూడదా?'

'ఊఁహుం!' అని తలూపింది నందిని. అంతలో పని మనిషి వచ్చి దివ్వెలు వెలిగిస్తూంది.

'వెళ్ళి ఉడుపులు మార్చుకోనిరా.' అన్నాడు ఆమె రావడం గమనించి అధ్యక్షుడు.

'ఏఁ, ఇన్నిసార్లు చెపుతున్నారు! ఈ దుస్తుల్లో నేను బాగా లేనా?' అంది.

'ఏ వేళ, ఏ వయసుకు, ఏ కార్యంలో ఆ యా దుస్తులు వాడడం వలన హాయిని కూరుస్తాయి. పోనీ నీవు ఇప్పుడు నాట్యం చేస్తావా?' అన్నాడు.

'మీ రాజ్ఞ ఈయాలేగాని, ఏది చేయమంటే అది చేస్తాను. మీకు నిజంగా నా నాట్యం చూడాలని ఉందా! రండి. విశాలప్రాంగణంలోనికి వెళదాం,' అని దివ్వెలు వెలిగిస్తున్న దాసీదానితో—

'మఘూలికా! ఆ నాట్య ప్రాంగణంలో ఉన్న పరదేశ దివ్వెలన్నీ వెలిగించండి. ఆ చీనా దివ్వెల్లో కొవ్వువత్తు లుంచండి.' అంది నందిని.

'చిత్తం అమ్మగారూ!' అంటూ రెండు దివ్వెలు వెలిగించి అలాగే వెళ్ళిపోయింది కాగడా చేతబట్టుకొని మఘూలిక. వారు కూర్చున్న ప్రాంగణం వెలుగుతో నిండిపోయింది. మరొక పాత్ర సవం అందించింది. అధ్యక్షుడు అందుకొని త్రాగి, పాత్ర నక్కడ ఉంచి, చేతులు చాపాడు. ఒక భంగిమలో వచ్చి అతని చేతుల్లో వాలిపోయింది. ఆమె తనువులోని ఒక భాగం పూర్తిగా అధ్యక్షునిలో పొందు పడి మిగిలిన సామభాగం తనదని నిలచినట్లుగా ఉంది. ఆ క్షణంలో వారిద్దరుగా లేరు. ఆమె అర. అతను పూర్ణంగా ఉన్నారు. యింతకాలం మైకంలో ఆమె పూర్ణంగా అతడే అరగా ఉండేవాళ్ళు. ఆ క్షణమాత్రం అందుకు భిన్నంగా జరిగిపోయింది. కొన్ని క్షణాలనంతర మాతని కౌగలి విడి పించుకొని, అతని చేతులు బట్టుకొని 'నాట్యమందిరానికి వెళదామా?' అంది.

అధ్యక్షుడు తలపంకించాడు. ఇరువురూ నాట్యమంది రానికి చేరారు.

ఆ మందిరం జయదేవుని తాతలనాడు మలిపించారు ఎన్నో దీనారాలు వెచ్చబెట్టి. చాలా అందమైనది. మందిరం దివ్వెలతో వెలుగులాడుతుంది. క్రిందపరచిన స్ఫటిక శిలలు నల్లని తెల్లని వెలుగులాడుతున్నాయి. ప్రతిజాగాలో రాతిలో కూడా దివ్వెలమరిచినట్లుగా ప్రతిబింబిస్తున్నాయి. ఆ మందరం చదరంగా ఉన్నా వలయాకారంగా ఉన్నట్లు కనిపిస్తుంది. మందిర మధ్య వివిధ వర్ణ సమ్మిళిత శిలా ఫలకాలు స్థాపితం చేయబడ్డాయి. అవి ఒక కోణం నుండి పరికిస్తే విచ్చిన సహస్ర కమలంలా ఉంది. మరో దిక్కునుండి దర్శించినప్పుడు అదే మందిరం కాసారంవలె విచ్చిన పత్రాలు అక్కడక్కడ పొదిగిన రీతిలో ఉందాన్న భ్రమ కలిగిస్తుంది. మరో దిక్కునుండి చూచే మాపరులకు చదరంగా చదరంగ పీఠంలా నలుపు తెలుపు ఫలకాలు అతికిన రీతిగా ఉంది. ఆ మందిరం నిజంగా నాట్య మందిరమే. ప్రేక్షకు లధికంగా ఉన్నప్పుడు కూర్చోడానికి మరో అంతస్తు కూడా ఉంది. ఆ అంతస్తులో ఉన్న మాపరులకు తమ ముందే నాట్యం చేస్తున్నదా నర్తకి అన్న భావన కలుగుతుంది. క్రిందినుండి పై అంతస్తు నేర్పరచడానికి స్తంభాలు ఏర్పరచబడ్డాయి. ప్రతి స్తంభంలోనూ విలాసినీమణులను ఎనిమిది ప్రక్కలా ఎనమండుగురును మలచారు. ఆ విలాసినీమణుల సోయగం ఒక్క పోలికగా ఉన్నా ఎనమండుగురు భంగిమలు ఒక వంక కొక తీరుగా ఉన్నాయి. నాల్గు స్తంభాల కొక స్తంభం, స్ఫటికం. అందులో ఒకే ఒక మూర్తి నిలచి ద్రాక్షాసవ పాత్రను చంకనుంచుకొని కావాలా అన్నట్లుగా ఉంటుంది. దాపుకు వెళ్ళి చేత తాకినప్పుడు అది శిలగానున్నగా ఉంటుందేగాని, మలచిన గతుకులు అవయవాల వంపులో రాయి పైభాగంలో కనిపించవు. అప్పటికి వంద

వత్సరాలనాడు గాంధార శిల్పి యవనంలో రెండేళ్లుండి చూచివచ్చి ఇక్కడ మలచాడని ప్రతీతి. దానిని విదేశీయులు పరికించి ఇది ఆంధ్రవాటిలో ఎవరో మలచినప్పుడు వందు వందల వత్సరాల క్రితం చీనా వారు చూచి వెళ్ళి అక్కడ ఒక జ్ఞాన బుద్ధుణ్ని చెక్కారని, దానిని యవనులు చూచి వారి దేశంలో ఒక ఒయ్యారిని మలచారని, అదే విధంగా అరబ్బీ రాజ్యాల్లోనూ ఈనాడు వాడకం లోనికి తెచ్చారని అంటారు. మొత్తానికెలాగైనా దాని స్ఫటికాన్ని దాదాపు పోత పోయడం జరుగుతుందా అనిపిస్తుందా శిల్ప విజ్ఞానం. అలాటి స్ఫటిక స్థంభాలొక పన్నెండు మధ్య మధ్య చాలా అందంగా కన్నుపండువు కూరుస్తున్నాయి. పై అంతస్థు ముందు వరుసలో ఒక్కటే రాయిని మలచారు. నానావిధ ఫలపత్రాలతో విరిసిన దిరిసిన పూలు, కొన్నియొడల పెలివెట్టిన లతలు, వానిలోని వంపులతో సోయగాన్ని చిమ్ముతున్న పత్రాలు-చూడడానికి కళ్ళు చాలవు. కాలం చాలదు. క్రింద భాగంలో ప్రతి ఆసనానికి సింహ పాదాలు చెక్కారు. వెన్నున కేసరీ శిరస్సు. చేతులకు హరి భుజాలు నిర్మితమై ప్రతి ఆసనానికి రంగుటద్దాలు తాపితమై వన్నె చిన్నెలతో, శిల్ప విజ్ఞానంతో, ఏనాడు పరికించినా నిత్యనూత్నతతో విలసిల్లుతున్న తీరుగా ఉన్నాయవి. ప్రతి స్థంబాన్ని, ప్రతి ఆసనాన్ని తాకుతూ మండప మధ్యనున్న కమలంలో నిలచి—

'మీరా ఆసనమ్మీద ఆసీనులు కండి!' అంది ఎదురుగా ఉన్న ఆసనం చూపుతూ నందిని. అధ్యక్షుడు ఆసనం వెనుక భాగానికి తన చేతులుంచి అలాగే నిలచి, మందిరాన్ని, మందిర ప్రాంగణాన్ని పరికిస్తున్నారు.

ఉన్నట్టుండి ఒక్కసారి మృదంగం సద్దయింది. దాని వెంటనే వీణ ఒకసారి సప్తమంవరకు వరుసగా తన స్వరాన్ని మ్రోగింది. సారంగి కోకిలలా అన్ని స్థానాల్లో ఆలపించింది. మూడు కలసి రవించాయి. ఆ రవళి కనుగుణంగా నందిని తన కంకణాలను కదిపింది. తిరిగి మద్దెల ఒకసారి మూడు దెబ్బలు మ్రోగింది. నందిని తన పాదాన్ని మూడు మార్లు కదిపింది. వాల్గవమారు కాలితో ధరను తాకింది. గజ్జలు లయగా మ్రోగాయి. మందిరం నలుప్రక్కలా గజ్జల గల్లు లారవం ప్రతిధ్వనించింది. ఇదంతా ఎలా జరుగుతుందో, వాద్యా లెక్కడ మ్రోగుతున్నాయో తెలియడంలేదు. వాయించే వైణికులు - వ్యక్తులు కనుపించడంలేదు. సద్దు మాత్రం వస్తూంది. అధ్యక్షుడు 'ఓహో!' అన్నాడు. ఆ చేతులలాగే ఉంచి గిర్రున తిరిగి ఆసనమ్మీద కూర్చుని తల నెగురవేశాడు. ఆ ఠీవి, ఆ రాజసం, ఆ చురుకుతనం - పాతికేళ్ళ కుఱ్ఱవాడు అలా చేయలేడు. పన్నెండేళ్ళ చిరుతకా చురుకుతనం ఉంటుంది. అర్ధశతం దాటిన అతంతి అధ్యక్షుడు అలా కూర్చోడానికి దాని వెనుక ఉన్న ఉత్సాహం మైమరపించిన కళ. కళోపాసనలోను. కళలోనూ ఉన్న ఔన్నత్యం, ఆ గొప్పతనమే అతనికా ఉత్సాహాన్నిచ్చి గంతించింది. అంతలో నందిని పాట నందుకొంది:

నవనవమ్మౌ ఈ వనమ్మౌ
నయనమ్ముల కానందము
రారమ్మో! నవ రసికా!
లేలెమ్మో! నవరసికా!

అరుణకిరణ తాడనతో
అరవిచ్చిన తామరలో
నిరుపమాన మధువిదిరా!
పరువమ్మున నందుకొమ్మ!

నవనవమీ మకరందము
యనరానిది ఒనగూరెను! రారమ్మా నవరసికా!

అరుగుదెంచి భృంగములు
తిరుగుచున్న వదెగనుమా!
దరిజేరిన కాదనదిది
మురి యుంచుచు నారగించు

వాసిచెడిన పిదప నరుగ
అవసమది అందదురా-రారమ్మా నవరసికా!

కరకిరణవి వారిమిలో
కరువ లరగు తెరువులలో
కర మరుదుగ దొరకునిద్ది
తిరిగి మూడకిక త్రాగుము

లేలేరా! నవరసికా!
రా! రారా! నవరసికా!
నవసవమ్ము ఈ వనమ్ము
నయనమ్ముల కానందము!!

అధ్యక్షుడు తనకు తెలియకుండా తాను చేతులు చరచాడు. మందిరం ప్రతిధ్వనించింది. కాలిగజ్జెలు, వాయిద్యాలు

ఒక్కసారి అన్నీ అనుకున్నట్టు ఆగి పోయాయి. అధ్యక్షుడు ఆసనమ్మీద నుండి చివాలున లేచి నందిని దాపుకు వెళ్ళి 'నందినీదేవీ! నేను తన్మయత్వంలో ఉన్నాను. ఏం చేస్తానో నాకు తెలియడంలేదు. అన్నిటా నాకన్న చిన్నదానివి. నిన్నెలా అభినందించేది?' అంటూ చేతులు చాచాడు. ఆమె చేతులలో వాలి పోయింది. ఆమె నుదుటనున్న చెమ్మ బిందువులను అధ్యక్షుడు తన వల్లెవాటులో మెల్లగా తుడిచాడు. నందినీదేవి అతని అక్కున వాలిపోయింది. అంతే! అతడు మెల్లగా నడిపించుకొని ప్రక్కనున్న విశాల ఆసనమ్మీద కూర్చోబెట్టి తాను కూడా మెల్లగా ప్రక్కన కూర్చొని ఆమెను అటు ప్రక్కకు త్రిప్పి వెనుకకు ఉన్న కంచుకం ముడిని వదలు చేశాడు. ఆమె మెల్లగా ఒకసారి గాలి పీల్చి చివాలున తిరిగి అతని గుండెలకు తన ఎత్తయిన స్తనాలను తాకించింది. రెండు కరాలతో అతని మెడను గట్టిగా లాగుతూ తను అతని గుండెల్లోనికి దూరి పోవాలనుకుంది.

అతడు అలాగే తన చేతులతో ఆమె వెన్నును నిమురుతూ 'నందినీదేవీ!' అన్నాడు.

'చెప్పండి. ఏమిటి? చెప్పదలచింది ఆపుతారేం? చెప్పండి!' అంది నందిని.

'ఏమీ లేదు నందినీదేవీ! నీ చేతల్లో ద్యోతకమవుతున్న తలపు నీ హృదయంలో ఉన్నదా?' అని అన్నాడు. కౌగిలి నుండి వెలికి వదలి, 'మీ కెందుకు కలిగిందా సందేహం?' అన్నది నందిని.

'నాకు మాత్రమే కాదు నందినీదేవీ! ఆలోచన గల్గిన ప్రతి వారికీ కలుగుతుంది. వయసు, రూపం అలాటివి. నా రూపం, నా వయస్సు నాకు తెలుసు.' అన్నాడు.

'నేను మీతో అబద్ధమాడ దలచలేదు. కొంత ఉన్నది. కొంత నటిస్తున్నాను. తప్పదు' అంది నందిని.

'నాకు తెలుసు. నటించడం మాని ఉన్నంతవరకూ చరించు నందినీ! నేను ఉన్మాదంలో పడుతున్నాను. నన్ను పిచ్చివాణ్ని చేసి నీవు బావుకుందే దేమిటి?' అనడిగాడు.

'నేను బావుకుందేదీమీ లేని మాట వాస్తవమే. ఈ విషయాలు మరొకసారి మాటాడుకుందాం. అలా అభ్యంతర మందిరంలో కూర్చుందాం రండి. నేని బట్టలు మార్చు కొస్తాను.' అని అతని చేయి పుచ్చుకుని లేవతీసి అభ్యంతర మందిరానికి దారి తీసింది.

చతురిక అభ్యంతర మందిరంలోనుండి వెలికి వచ్చింది. ఇద్దరూ లోనికి వెళ్ళారు. అక్కడ నందిని కట్టుకోవలసిన పుట్టాలు పెట్టి ఉన్నాయి. నిలువుటద్దం ముందు నిల్వబడి ఆమె బట్టలు మార్చుకుంది. అధ్యక్షుడు శయ్య మీద కూర్చొని ఆమె అందాన్ని పరికిస్తున్నాడు.

చతురిక ద్వారంవద్ద నిలచి 'అమ్మా! అలంకరణ య్యిందా? మీకు పళ్ళు పట్టుకొస్తున్నాను.' అంది.

'ఆఁ. రా చతురికా రా! ఆ ఆసనమ్మీద ఉంచు.' చతురిక పళ్ళు ఫలహారాలు కలిగిన పళ్ళెరం ఆసనమ్మీద ఉంచింది. తిరిగి వెళ్ళబోతుండగా 'చతురికా!' అని పిల చింది నందిని. చతురిక ఆగి పోయింది. 'నీ ప్రయాణం రేపు నిశ్చయమైనట్లేనా?' అంది నందిని కురులకు కట్టే నల్లని పట్టు మాలును జడలో ముడుచుకుంటూ అటు తిరిగి నిలచి చతురికతో.

'మీ సెలవైతే అలాగే వెళతాను.' అంది.

'నేను ముందే చెప్పానుకదా? వెళ్ళి రావాలి.' అంది నందినీదేవి.

'ఎక్కడికీ?' అనడిగాడు అధ్యక్షుడు మధ్యలో కల్పించుకొని.

'కౌశాంబికి.' అంది నందిని.

'విషయం తెలుసుకోవచ్చా నేను?' అనడిగాడు అధ్యక్షుడు.

'ఏముంది? అక్కడొక భిక్షువును కలుసుకొని అతనికి కావలసినవన్నీ ఏర్పాటు జరపాలి,' అంది నందిని. వేసిన జడను బుజముమీదనుండి వెన్ను మీదకు విసురుతూ, ముందుకు వసాను.

'అదేమిటీ వింతగా ఉంది! భిక్షువెవరు? అసలు భిక్షువా? లేక సన్యాసా?' అనడిగాడు.

'భిక్షువు. సన్యాసిగాదు.' అంది నందిని.

'ఏమిటీ? నీవు కూడా ఆ మతంలో చేరతావా ఏమిటి?' అనడిగాడు ఆశ్చర్యంగా ఉన్నా నవ్వుతూ అధ్యక్షుడు.

నందిని వాలుగా చూస్తూ, 'ఏం చేరకూడదా?' అంది.

'ఎందుకు చేరకూడదుగాని - ఒకమాట! ఆ భిక్షువుకూ నీకూ సంబంధమేమిటి? అందులో మీ చతురికను స్వయంగా పంపుతున్నారంటే ఎంతో దగ్గరివాడైతే గాని అలా జరగదు.'

'అతడు చాలా దగ్గరివాడు. మనిషికీ ప్రాణానికీ ఉన్న దాపు. కంటికీ చూపుకూ ఉన్న దగ్గర. నడకకూ కాళ్ళకూ ఉన్న స్నేహం. నెటికీ పల్లానికీ ఉన్న చెలిమి...'

'అహో! నందినీదేవీ! నీవు నాట్యకత్తెవే కాక కవివి కూడాను! కవిత్వం చెప్పుతున్నావు. అతడు ఏవూరు వాడు? ఏ ప్రాంతంవాడు?' అనడిగాడు.

'మీరొకటి మరచిపోయారు. వయసు సంగతి అడుగనే లేదు.' అంది నందిని నవ్వుతూ.

'నాకు ఈర్ష్య, అసూయా లేవు. మరొకటి గుర్తించుకో నందినీదేవీ. నీ వనుకున్నంత తెలియని తనంలో ముందుసంగతి ఆలోచించకుండా నేను ఏ కార్యం చేయను. ఆ అవసరం వచ్చినప్పుడు నీవే తెలుసుకుంటావుగాని. అతని విషయం చెప్పు.' అన్నాడు.

'ఏముంది? అతనొక ముసలి అంధభిక్షువు. చాలా మంచి వాడు. జ్ఞాని.' అంది. అంటున్నా లోలోన అధ్యక్షుడన్న దానిలోని అంతరార్థం గురించి ఆలోచిస్తూనే ఉంది. ఎంత దాచుకున్నా ఆమె ముఖ కవళికలు గ్రహించాడు అధ్యక్షుడు.

'నా విషయంలో నీవు భయపడవలసిన పనిలేదు నందిని దేవీ! ఎక్కువగా ఆలోచించి మనసు పాడుచేసుకోని భిక్షువు ప్రసంగంలోనికే రా ప్రస్తుతం! అతనికి కావలసిన ఏర్పాట్లన్నీ ఎక్కడ చేసిపెట్టాలని?' అన్నాడు.

'కౌశాంబిలోనే!' ఆమె అతని ఈనాటి ధోరణికి ఎదురు నిల్వలేకపోయింది:

'అంత దూరంలో ఎందుకూ? ఇక్కడికే రమ్మను. ఇక్కడే ఒక ఆశ్రమం కట్టిద్దాం. అదీకాక, పూర్వం బౌద్ధులకని ఏర్పరచిన ఆరామం, దానికని ఉంచిన కొంత సొమ్ము ఉంది. అది అతనికి యిచ్చివేద్దాం. ఆరామానికి, ఆ మాన్యానికి బాధ్యులుకూడా ఎవరూ లేరు. దానికి తగినట్లు

ఇక్కడ ఆ మతం కొంచం ఈ మధ్య దెబ్బతిన్నదికూడాను.' అన్నాడు.

నందిని తల అడ్డం త్రిప్పింది. అప్పటివరకు చతురిక అలాగే నిలచి వారి ప్రసంగం వింటూ ఉంది. కానీ పాల్గొనలేదు. 'అలాంటప్పుడు ఇంక ఆలోచన దేనికి? వెంట బెట్టుకొస్తాను.' అంది చతురిక.

'చతురికా! అది ఏ నాటికీ జరుగరానికార్యం. అవంతిలో ఆ భిక్షువు తావు నేర్పరచుకో కూడదు. అది నాకు నచ్చని పని. అలా పొరపాటున కూడా జరుగకూడదు. గుర్తుంచుకో. ఆ భిక్షువే అడిగినా సరే - నీవు ఒప్పుకోకు.' అంది నందిని.

'నందినీ దేవీ! ఎందుకంత కచ్చితంగా అవంతిలోనికా భిక్షువు నొద్దంటున్నావు?' అనడిగాడు.

'అతనికి నామీద ఉన్న మమకారం వేరు. నేనంటే అభిమానం చాలా మిక్కుటం. నా విషయాలు ఆయనకు తెలిశాయా ఆ ముసలి బ్రతకడు. ప్రాణాలొదిలి వేస్తాడు. మాన్నూ మాన్నూ ఆయన ప్రాణాలెలా తీయగలను నేను?' అంది నందిని. చాలాబాధగా స్వరం ధ్వనించింది. దానిలోని భావం ఆధ్యక్షుల కర్థమైంది. ఆ ముసలిప్రాణం అనగానే వీరికి తరతరాలసంబంధం ఏ మూరసేనంలోనో ఉండిఉంటుంది. ఆ నాడు ఆ రేయి ఆ వెన్నెల ఆ జయదేవుని తోటలోని సంఘటన తలపులో మెదిలి అతడే వణికిపోయాడు. కౌశాంబి అనగానే, ఆ రోజు ఈ భిక్షువు వచ్చి తరతరాలబంధం త్రవ్వి వెంట బెట్టుకొని వెళ్ళి ఆ తర్వాత కౌశాంబిలో నిలచిపోయి, ఈమెను పంపి ఉండాలి. అని ఊరక గాలిపోగు చేసుకుని కలిపి ఆలోచించాడు. తర్వాత కొంచం తృప్తి కలిగింది. నందినిమీది మమకారం తెంచుకోలేనంతగా అతనిలో

పెరిగిపోతూంది. అందువల్లనే అతనికి ఆమెమీద అనుమానం కలుగుతుంది. తనమీద నూపేటంత వలపూ నిజంగా ఆమెలో ఉన్నదా అన్న సందేహం కలుగుతుంది. దానితో పాటు అతనిలో ఏదో అనుమానాలు మర్రిగింజలాగ మొలకెత్తి ప్రతి చిన్న విషయాన్నీ పరిశీలించి దానితో పెద్ద చెట్లయిపోయి, అడుగు అడుక్కూ అనుమానం బలసి ఊడలు దించుకుంటుంది. అందుకే క్షణక్షణానికీ నందినిని నమ్మలేనంతవరకూ దిగజారి ఆలోచిస్తూ, ఆ ఆలోచనల లోకంలోనే ఉండి, అనుకోకుండా అంతరంలోని ఆలోచనా భావాలు వెలికి కక్కేస్తున్నాడు.

అధ్యక్షుడింకా ఆలోచనలోనే ఉన్నాడు. చతురిక 'మీ యిష్టమమ్మా. ఎలా చేయమంటే అలా చేస్తాను. దానిదేముంది?' అంది.

'సరే. ఇప్పుడే మందసంలోనుండి ఒక వంద వెండి నాణాలు నీ ప్రయాణ ఖర్చులకు తీసుకో. ఒక రెండు వందల బంగారు నాణాలు, అక్కడి ఏర్పాట్లకు తీసుకో. నీకేమైనా కావాలంటే యింకా.....'

'ఇంకా నాకెందుకమ్మా! అవి చాలు.' అంది.

'ఔరా చతురికా! నాకు తెలిసిన వ్యాపారి ఒకడు ఉన్నాడు కౌశాంబిలో. నీవు అతని యింటిలో విడిదిగా: అతనికో లేఖ రాసిస్తాను. ఆ గంటం, ఆ మొగలి రేకు యిలా తే!' అన్నాడు అధ్యక్షుడు.

'వద్దు. మీవాళ్ళ యిళ్ళల్లో ఆమె దిగరాదు,' అంది నందిని.

'అదేమిటి నందినీదేవీ! అలాగంటావు? నా మనిషని తెలిస్తే ఎంత గౌరవిస్తాడో నీకు తెలియదు. ప్రాణసమంగా చూచి, కావలసిన ఏర్పాట్లన్నీ అతడే జరుపు

కాదు సుమా!' అని, 'అది సరే, నా మనుషులెందుకు వద్దంటున్నావ్?' అన్నాడు సందేహంగా చూస్తూ.

'మీకు గౌరవం లేదని, మీమాట వినరనీ కాదు సుమండీ! మీ గౌరవం అవంతిలో మాత్రం కాదు. ఎక్కడైనా ఉంటుంది. నాకు తెలుసు. చతురిక మీ హోదాలో అక్కడికి వెళ్ళాలంటే సామాన్యమా? అదీకాక మీ మనిషి అక్కడ అందరిలోకీ మిన్నయై ఉంటాడు. కాకాంబిలో అందరికీ ఎరిగినవాడై ఉంటాడు,' అంది నందిని.

'అదే నేననేదిన్నూ. అందుకే మీ కార్యం చాలా తేలికగా జరిగిపోతుంది,' అన్నాడు.

'ఔతుంది. అందుకు చతురికకు చాలా సొమ్ము వెచ్చపెట్టాలసినదిగా ఉంటుంది!'

'సొమ్ముకోసం చూస్తున్నావా? నేనిస్తానొక అయిదు వేల బంగారు నాణాలు. తీసుకెళ్ళమను!' అన్నాడు అధ్యక్షుడు.

'ఆఁ అదే నేననేది! మీ హోదాలో మీ తాలూకు మనిషిగా వెళితే అన్నీ రెట్టింపు ధరలౌతాయి. అన్నీ అలాగైతే భిక్షువుకు మిగిలేది ఉండదు!' అంది నందిని.

'పోనీ! ఒక పని చేద్దాం. ఏమీ ఖర్చు కాకుండా ఒక లేఖ రాయిస్తాను. అది తీసుకొని వెళ్ళి నా మిత్రునికీయమను, చాలు. మీతో ప్రమేయం లేకుండా అన్నీ జరిపివేస్తాడు' అన్నాడు.

'అదికూడా నాకు నచ్చనిదే! ఆ భిక్షువుకు ఏంజరిగినా, ఏం జరిపినా నా సొమ్ముతోనే జరగాలి!' అంది నందిని. అధ్యక్షుడు దానికి సమాధానం ఈయలేదు.

'చతురికా! నీ ప్రయాణ సన్నాహం పూర్తి చేసుకో! వ్యాపార శకటం ఏ వేళకు బయలు దేరుతుందో వెళ్ళి తెలుసుకొని రమ్మని మఘాలికను పంపు' అంది.

చతురిక వెళ్ళి పోయింది. వెళ్ళేంతవరకూ ఊరుకొని, వెళ్ళాక అధ్యక్షుడు 'నందినీదేవీ! నా సొమ్ముగాని, నా సాయంగాని నీకేమీ అక్కరలేదా?' అన్నాడు.

'నాకక్కరలసింది అడుగుతాను - యిద్దరుగాని' అంది నందిని.

'నా ప్రాణమైనా సరే యిస్తాను.'

'ఆఁ ఆఁ! ఈయవచ్చు. ఆ తర్వాత' అని ఆపేసింది. లోలోన ఎలాగూ తప్పదులే అనుకుంది. వెలికెలా అనగలదా మాటను? మలుపు త్రిప్పి చెప్పింది.

'నింద బరాయించవలసి వస్తుందనా? ఈ క్షణాన అడుగు నీకేది కావాలో!' అన్నాడు.

'నాకేమీ వద్దు! మీరు నన్ను నమ్మి యిప్పుడున్నట్టుగా ఉంటే చాలు.' అంది నందిని.

'నామీద నీకు నమ్మకలేదా?' అన్నాడు.

'లేకుంటే ఈ ఇంటితలుపులు మూసుకు పోయి ఉండేవి. నమ్మబట్టే తెరచి ఉన్నాయి. అవంతిలో నాకు మీరు కాక ఎవరున్నారు చెప్పండి? ఏఁవిఁటో అంతా అయోమయంగా ఉంటుంది నాకు. నే నెవర్ని? నా బ్రతుకేమిటి? మీహోదా ఎక్కడ? మీతో నాకు పొత్తేమిటి? ఇవన్నీ ఆలోచించు కుంటే నాకదోలా అనిపిస్తుంది' అంది నందిని - దానికి తగినట్టుగా వైరాగ్యాన్నభినయిస్తూ.

'ఏఁవిఁటో చాలా లోతుగా మాటాడుతున్నావ్?' అన్నాడు.

'లోతూ లేదూ పాదూ లేదు! ఏదో అనుకోడం, ఏదో చేయడం. ఏదో తినడం. ఏదో నిద్ర, ఏదో మత్తు, ఏదో మమత, ఏదో ఆశ్చర్యం, ఎదో జుగుప్స, జీవితమ్మీద అసహ్యం' అంది నందిని, ప్రతి పదానికి ఆరోహణ, అవరోహణల క్రమం తప్పక పాటించి—

'భిక్షువు తలపులో మెదలగానే వైరాగ్యం అబ్బినట్టుంది' అన్నాడు.

'వైరము, రాగము, వైముఖ్యం అంతా కృత్రిమం. జీవనమే మోసం, దగా, కుళ్ళూ, కుట్రా' అని ఏదో అనబోయింది నందిని. మెల్లగా అధ్యక్షుడు సెయ్యామీదనుండి లేచి ఆమెను దాపుకు తీసుకొని సెయ్య చేర్చాడు. అంతే! ఆ వైరాగ్యమంతా రాగంగా, రసికతగా మారి పోయింది. ఇద్దరూ తెలియని లోకాల్లో ఎంతసేపున్నారో ఇద్దరికీ తెలియదు. దివ్వెల్లో చమురుడిగిపోయింది. అభ్యంతర మందిరం కావడంలో దాసీలు లోనికి రాసాహసించలేదు.

## 7

ఎండ చాలా తీవ్రంగా ఉండడంవల్ల సాయంతనమయ్యేంతవరకూ, యిళ్ళల్లోనివారెవరూ వెలికి రాలేదు. గంధం పన్నీరు ఒంటినిండా అలదుకొని సన్నని వల్కలాలు ధరించి భాగ్యవంతులంతా చల్లగాలికోరకు అలమటించారు. అప్పటివరకూ వీచిన వేడిగాలికి హస్సూ ఉస్సూమంటూ, వీవన వీస్తున్న దాసదాసీలను కసురుకున్నారు.

సాయంతనమయ్యేప్పటికి, చల్లని గాలి శిప్రానది ఎండి పోయినా దానిమీదనుండి గాలిమాత్రం శీతలంగానే

అందించింది. చాలామంది కాలి నడకతో తమ తమ తోటల వైపు వాహ్యాళి వెలుదేరారు. నందిని పల్లకిలో వెలికి రావా లనుకుంది. కానీ, ఆమెకు చతురిక తోడులేకపోవడం తక్కువతనంతో బాధ కలిగింది. చతురిక తనకు కావలసిన ఏర్పాట్లన్నీ జరిపేది. కొన్ని అడక్కుండానే చేసేది అంతా తెలిసినట్టు. నందినికి చతురిక లేకపోవడంవల్ల చాలా అండ లేనట్టుగా అనిపించింది. మధూలిక ఉందిగాని, తనకు వేళకేం కావాలో అవన్నీ మధూలికకు చెప్పాలి. చెప్పాక గాని చేయలేదు.

ఆలోచన చాలా మలుపులు తిరిగి, రణవర్మ, రాధానాథుల దాపుకు వెళ్ళింది. నిన్న సాయంతనం రాధానాథుడు తనను చూచి చిరునవ్వు నవ్వాడు. ఆ నవ్వునందుకొని తను కూడా ఒక చూపు విసరింది. తన పతనానికి పూనుకున్న వారిలో, దాదాపు ముగ్గురు సాలెగూటిలో యిరుక్కున్నట్టే! ఇంక యిద్దరున్నారు. అందులో మాలికి చిత్రలేఖనంలో చాలా నేర్పు ఉంది. రాధానాథుడు గాయకుడు. జయపాలుడు కవిగా ఉంటే కథ యింతా రక్తి కట్టేది. కానీ, జయపాలుడు భాగ్యవంతుడేగాని కవిగాడు. పైగా కవిత్వమంటే వెగటు అన్నట్టుగా ఆ మధ్య ఎవరో అంటుండగా విన్నది. వారంతా పౌరసభా సభ్యులు. పంచాయితీ పెద్దలు. అవంతి అధికారులు. ఈ అవంతికి ఎలాటిగతి పట్టింది! ఒకప్పుడు చాలా ఉన్నతపథమందున్న రాజ్యం. ఈ నాటికీ ఆ గొప్పతనం పోలేదు. కానీ పెద్దలు ఎంత మంచివారో తెలిస్తే ప్రజలేమనుకుంటారు? సభా భవనంలో ఎంతలేని నీతులు వల్లిస్తారు? అంతా ఇంద్రపదవో యమపదవో నిర్వహించే తెలివితేటలున్నాయని నిరూపించుకోవాలన్న దురాశ ప్రతివారిలోనూ ఉంది.

మొన్నటి సభలో అంతా తేలిపోయింది. అంతా ఏక గ్రీవంగా తనను న్యాయ పాలనలో భాగం పంచుకోమని సభ్యత్వమిచ్చారు. ఆడది పంచాయితీలో సభ్యురాలు కావడం అదే మొదలు. తనకా గౌరవం దక్కింది. అంతకు ముందు ఏం చర్చించారో తెలియదుకానీ, ఆ తర్వాత తన యింటికి పిలుపు వచ్చింది. ఏదో శాస్త్రం చెప్పినట్లు తన వారుంటే కడఘం కినుక్నా ముడుతుందని కొలువులో ప్రతి తలా తనను గౌరవించింది. దాదాపు అవంతి ప్రజలు కూడా ఆమోదించినట్టే! అన్నీ ఒకటి తర్వాత ఒకటి తలపులో కదలి చాలా తృప్తి కలిగించాయి. రాధా నాథుడు మూడవవాడు - వలలో పడినట్టా - కాదా? అని యోచించింది. పడకేం చేస్తాడు? రేపటి సమావేశంతో మాలి జయపాలురను యింటికి వచ్చేట్టు చేయాలి. ఏం వచ్చినా, చతురిక లేదు. వెళ్ళి చాలా రోజులయింది. ఏ వార్తా అందలేదు. భిక్షువు లేదేమో! అసలు భిక్షువును కలుసుకుందో లేదో! జాడ తెలియకుండా తెలుపకుండా ఏమైపోతుందో! ఎలాగైనా తెలుసుకుంటుంది - అనుకుంది.

సంధ్యా విహారానికి మధూలికను వెంటబెట్టుకొని కాలి నడకన బయలుదేరింది. గాలి హాయిగా ఉంది. సిప్రానది ఒడ్డునున్న గంద్రయిసుక సంజ కెంజాయలు పడి పసిడి పొడిలాగా ఉంది. దానిమీద మెల్లగా అడుగులు వేసు కుంటూ, ఆవలి దరి చేరాలని నడుస్తున్నారిద్దరూను. మధ్యలో నీరు సన్నగా నందిని నడుములాగా చిక్కిపోయి పల్చగా ఉంది. ఎటూ పారడంలేదు. లోని గంద్రయిసుక కళ్ళకు కట్టినట్టు కనిపిస్తూంది. మోంగాళ్ళవరకూ కుచ్చెళ్ళు ఎత్తి పట్టుకుని యిద్దరూ మడుగు దాటుతున్నారు. వారి కాళ్ళ నీడ నీళ్ళకు అందాన్ని తెచ్చింది. వయసులో ఉన్న

ఆడంగులిద్దరూ సంధ్యవేళ గాలికోసం అలా రావడం అవంతి పౌరులకు కొత్తే. వీరిద్దరూ అలా నడచిపోతుంటే, అంతకుముందు వచ్చి నీరులేని యేటిలో కూర్చున్నవారి కళ్లు వీళ్ళమీదే ఉన్నాయి. అందినంతమేరా వీరిద్దరినీ పరికిస్తునే ఉన్నారంతాను.

వారిద్దరూ ఆవలి గట్టు చేరగానే, నందిని నడుస్తూ నడుస్తూ ప్రక్కకు చూచింది. ఆమెకు చాలా ఆశ్చర్యం కలిగింది. రాధానాథుడు, రణవర్మ కూర్చొని ఏదో మాటాడు కుంటున్నారు. గతం తలపులో మెదలి కాస్త చలనం కలిగింది. కానీ ఏమీ వెనుదీయకుండా అడుగు ముందుకు వేసింది. మధూలిక తన వెంట వస్తూనే ఉంది. ఆ ఇద్దరూ ఆమెను చూచారు. ఏదో ఒకరి కొకరు చెప్పుకున్నారు. ఆ విషయం కూడా ఆమె గ్రహించింది. కానీ తనకు ఏమీ తెలియ నట్టూరుకుంది. ఇద్దరూ వారి కనుచూపుకు అందే జాగాలో చుట్టూ ఇంకా చాలామంది నడయాడే తావులో ఇసుకను చదును చేసి కూర్చున్నారు. ఇద్దరూ మౌనంగానే ఉన్నారు. ఇద్దరూ సమాన వయస్కులే. అదే సమాన హోదాలో ఒకరు దాసీ-ఒకరు అధికారిణి కాకండా ఉంటే చాలా విషయాలు చెప్పుకుందే వాళ్ళు పూర్వ స్మృతులు. ఆ ప్రకృతి ఎన్నో ఏకాంత వ్యవహారాలను వెలికి లాగి ఉందేది. ఆ తరతమ భేదాలు వాటిని రానీయకండా ఆటంక పరచాయి.

మౌనాన్ని సహించలేక మధూలిక 'చరుగిక ఏం చేస్తుందో నమ్మగారూ!' అంది.

'ఇక్కడ ఈ సిప్రా ఒడ్డున మనం ఉన్నాం. అక్కడ గంగ ఒడ్డున అది భిక్షువులో కూర్చుని వేదాంత గోష్ఠిలో ఉండి ఉంటుంది' అంది నందిని.

'భిక్షువును కలుసుకోనుంటుందంటారా?' అనడిగింది మధూలిక.

'ఏం? నీ కెందుకా సందేహం!' అంది నందిని.

'అంత తేలిగ్గా కావలసిన మనుష్యులు దొరకుతారా? అని నా సందేహం లెండి.' అంది మధూలిక ఆలోచిస్తు న్నట్టుగా ఆకసం వంక చూస్తూ.

నందిని మధూలిక వాలకం పరీక్షగా చూచి 'మధూ! గతంలో నీ వెప్పుడైనా ఎవరినైనా కలుసుకోవాలని తిరిగి కలుసుకోలేక పోయావా?' అంది.

మధూలిక దానికి సమాధానం ఈయలేదు. జారిపోతున్న సూర్యుణ్ని చూస్తూ కూర్చుంది. అటు తిరిగి ఉన్న నందిని 'మధూ మాటాడవేం?' అనడిగింది.

'ఏఁ ఉందమ్మా! ఏం లేదు' అంది. మధూలిక మాటల్లోని నిజం అంతు చిక్కక—

'అది కాదే. నే నడిగిన దానికి సమాధానం ఈయవేం? ఎవరినైనా కలుసుకోవాలని వారు దొరకక బాధ పడ్డావా?' అంది మళ్ళీ అదేమాటనంటూ.

'ఇంకా పడుతున్నా.' అని, 'ను' పూర్తి చేయలేదు. నాలుక కరచుకొని 'లేదమ్మా! నే నెవరి కొరకు చూస్తాను? నా కెవరున్నారు కనుక?' అంది

నందిని తల ఊపి 'పిచ్చిదానా! లోకంలో ప్రతివారూ ఎవరి కొరకో ఒకరి కొరకు ఎదురు చూస్తూ దేవులాడుతూ గడుపుతుంటారు. అది తప్పు కాదు. పొరపాటు కాదు. ఏ కోరికా, ఏ ఆశా, ఏ నిర్ణయం లేకుండా ఈ జీవరాసులు చరించవు. అది భ్రమణం. ఈ భ్రమణంలో ఎన్నో భ్రమ లకు లొంగి పోతాం. పోవాలి. లేకుంటే జీవితపు విలువ

తెలియదు. అసలు ఉండదు' అంది నందిని. మధూలిక కూర్చున్న పద్ధతిని, ఆ చూస్తున్న తీరును కొంచం కొంచంగా అర్థం చేసుకుంటూంది. ఏదో ఆశతో, ఏదో లోపలుంచుకొనే ఈ మధూలిక నా దాసిగా ఉంటుంది. ఇలాగే నా దాసీలందరిలోనూ ఏదో కథ, ఏదో బాధ, ఏదో భారం ఉంటుంది. ఒక్కొక్కరిదీ ఒకో కథలా ఉండి ఉండాలి. చరిత్ర లేనిదేముంది సృష్టిలో! అన్నీ చరిత్రలోనే నిండి ఉన్నాయి. ఈ దాస దాసీలలోనూ అంతే. తప్పకుండా చెప్పుకోలేనివి, అవసరమైనవి అనేకం దాగి ఉంటాయి. ఉండాలి.

'అదిసరే మధూ! ఎవరికోసం చూస్తున్నావన్నావు! ?' అంది ముందరికాళ్ళకు బంధనవేస్తూ.

'నేనా?' అంది మధూలిక ఆశ్చర్యంగా - ఎలా ఏం సమాధానం చెప్పాలో తెలియక.

చిరునవ్వు నవ్వి, వారగంట మధూలికను చూస్తూ, 'మధూ! నాకేమీ తెలియదనుకోకు. చాలావరకు తెలుసు. ఐనా నావల్ల నీకు అపకారం జరగదు. నీవు నాకు దానివు గావు. పరిచారికవు మాత్రమే! నీవు ఇకమీదట నీ ఇష్టంవచ్చినట్టు ఎక్కడికి వెళ్ళాలన్నా వెళ్ళవచ్చు-రావచ్చు. ఎవరితోనైనా మాటాడవచ్చు. నాకది అనవసరం. నీ వ్యక్తిగత జీవితంలో నాకు ప్రమేయం లేదు. కానీ ఒకటి నాకు తెలిసింది- ఈ మగజాతిని నమ్మకు. వీరి మనస్తత్వం తుమ్మెదలాంటిది. తేనె త్రాగడమే వాటికి తెలుసు. వీరికి ఆడదాన్ని అనుభవించడమే తెలుసు. ఆ తర్వాత ఎన్నిపాట్లు పడదిపడ్డా ఈ మగవారు పట్టించుకోరు. తుమ్మెదకూడా అంతే! ఆ తర్వాత ఆ పూవు ఏమైనా దానికనవసరం. హాయిగా రెక్కలు

కొట్టుకొని తన తేనె తన్నుతాగి మత్తుగా వెళ్ళిపోతుంది. ఆలోచించుకో నీవే! ఒకవేళ సొమ్ము అవసరమైతే అడుగు. అడగక్కర్లేదు. చెప్పి తీసుకుని వెళ్ళు. చెప్పమని ఎందు కంటున్నానో తెలుసా? నీకూ నాకూ ఒక్కసారే అవసరం కావచ్చు. అప్పుడు జాగ్రత్తపడడానికి మాత్రమే!' అంది నందిని.

'అమ్మా! మీరు నన్నుగూర్చి చాలా ఎక్కువ ఆలోచి స్తున్నారు. నాకదేంలేదు. నా కెవరూ లేరు. నే నొంటరి దాన్ని.' అంది మధూలిక బిక్కపోయిన మొహంపెట్టి. అది గమనించి—

'పోనీలే ఇలా నీవు స్వేచ్ఛనీయడంవల్ల నాకు వచ్చిన నష్టమేముంది? ఐనా మధూ! నాకు తెలిసినదంతా అబద్ధ మంటావా?' అంది నందిని.

'అదికాదమ్మా!' అంది మధూలిక.

'మధూ! నీ చరిత్రను, నీ రహస్యాలను తెలుసుకోవాలని నాకేంలేదు. అవసరమైతే సంగతి నేనన్నది.' అంది నందిని. మధూలిక అంత గట్టిగా ఉన్న మనిషి బేలపడిపోయింది. 'మీరు చాలా మంచివాళ్ళమ్మా. నేను మిమ్మల్నర్థం చేసుకో లేకపోయాను. ఇంత మంచివాళ్ళకు అనవసరంగా అపకారం తలపెట్టకూడదు. ఇంతవరకూ మీ కపకారం నేను చేయలేదు కూడాను.' అన్నది మధూలిక.

నందిని నవ్వుతూ, 'పిచ్చిదానా! నా కపకారమేమి టేకి? అయినా నాకు మీరేం చెయ్యగలరు? మీరు చేయవలసిన అవసరం ఏం వచ్చింది? పోనీ అంత అవసరంవస్తే అలాగే చెయ్యండి,' అన్నది.

'అదికాదమ్మా! అధ్యక్షులవారు మమ్మల్ని నియమించారు మీ దగ్గర. మీ రాకపోకలు మీ రహస్యాలు ఏ రోజు వా రోజు ఎరుకపరచమన్నారు!' అంది మధూలిక. ఒకసారి దిమ్మరపోయి తెప్పరిల్లి—

'ఓసిదా? నా కిదంతా ముందే తెలుసు. నా రాకపోకలు, నా ప్రవర్తనవల్ల ఆయనకుగాని మీకుగానీ ఒరిగేదేమిటి? ఇప్పుడు యిటు వచ్చానుకదా? ఈ చేసిందేమిటో చెప్పండి. నా దగ్గరఉన్న వాళ్ళెవళ్ళో, ఎవరి మనుష్యులో నాకంతా తెలుసు? చతురిక రణవర్మమనిషి. కావాలి, రంజన, చంచల రాధానాథుడి మనుష్యులు. ఈ పంచాయితీలోగల ఈ పెద్దలందరూ ఎలాటివారో నాకు తెలుసు. నేను వెళ్ళి పోగానే నా ఆస్తినంతా కాజేసి నన్నేదో చేయాలని చూచారు. తిరిగి వచ్చానని ఎలాగేనా మోసగించి, నా ధనం అపహరించాలని వారి ఊహ. మీరంతా వారికి సాయపడండి. ఇంతకన్నా నాకు తరిగేదిలేదు.' అంది నందిని గంభీరంగా. అన్నా ఇంతకాలంనుండి తను పడగనీడలో ఉన్నానని ఈ క్షణమే తెలుసుకుంది. అందుకే అందరినీ అనుమానిస్తున్నట్టూ అందరినీ అందరికీ విభాగించింది. ఎవరు ఎవరితాలూకు మనుష్యులో ఆమెకు తెలియదు—విసరింది నిజం రాబట్టాలని. మధూలిక అదరిపోయింది. 'అవన్నీ నాకు తెలియదమ్మా! నేనూ, జయంతిమాత్రం అధ్యక్షులవారి మనుష్యులం,' అంది.

'చతురిక రణవర్మ మనిషి కాదా?' అని కళ్ళల్లోకి చూచింది నందిని.

'కావచ్చు, కాకపోవచ్చు కానండి—చతురిక మీకపకారం చేయదు. చతురిక శ్యామసుందరుని ప్రేమించింది. శ్యామసుందరుణ్ణి బలవంతంగా యుద్ధానికిపంపి చంపించాడు రణవర్మ. ఈ అవంతి పౌరసభ మీద ఆమెకు ఎనలేని కోపం

ఉంది. అవకాశంకోసం ఎదురు చూస్తూంది. ఏనాడో ఆమె ఈ అవంతి పెద్దలను సర్వనాశన చేస్తుంది!' అంది మధూలిక.

'మిగిలిన వారి సంగతి నాకు తెలుసు. తెలియనట్టూరు కుంటున్న కొంగుకో మీ కర్థం కాదు. నన్ను ఈ పౌరులు, ఈ పెద్దలు కత్తుల బోనులో ఉంచామనుకుంటున్నారు. కాను. నేను స్వేచ్ఛా విహంగాన్ని. ఈ రోజు, ఈ క్షణం ఇటు పాటలీ పుత్రంగాని, అటు తక్షశిలగాని, అటు హస్తిన గాని వస్తాన్నదుకో గలదు సరికదా-అవంతి, నూరసేనంలాటి ఈ పంచ పంచాయితీ రాజ్యాలు ఏకసత్తాకమై పోతాయి. అంతటితో ఆగదు. చాలా అరిష్టాలు సంభవిస్తాయి. ఎవరెలా పోతే నాకెందుకు? నేను ఒక పనికోసం అవంతికి వచ్చాను. అది నెరవేరగానే కౌశాంబికో-ఉజ్జయినికో వెళ్ళి పోతాను. గణతంత్రమని పేరేగాని, అంతా కుతంత్రం! ఇందులో ఎవరి ప్రక్క మనిషిని వారు నమ్మరు' అంది నందిని.

'మీరిలా గంటున్నారు. మీ గురించి అధ్యక్షుల వారు పూర్వం ఒక రకంగా చెప్పారు. మొన్న వచ్చినప్పుడు మరో విధంగా చెప్పారు. పైగా మిమ్మల్ని కంటికి రెప్పలా చూడాలసిందని అనుమానించవలసిన అవసరంలేదని మీరు మంచివారని చెప్పారు కదమ్మా!'

'క్షణానికో రకంగా అంటారు. అనుకుంటారు. నేను వీళ్ళ మాటలను నమ్మనే నమ్మను. వీళ్ళ మోసాలన్నీ నాకు తెలుసు. ఎలా పోతే నాకేం! ఏమీ మాటాడకు. ఆగు. ఆ వచ్చేది ఎవరు?' అంది దూరాన్నుండి ఎవరో తనదాపుకు వస్తున్నట్టు తెలుసుకున్న నందిని.

'అలవాటైన నడకేనమ్మా! రాధా నాథులు' అంది.

'ఇ ఎందుకు వస్తున్నారో!' అంది నందిని.

'ఏమో! రానీయండి!' అంతలో రాధానాథుడు దాపుక వచ్చాడు. నందిని సూటిగా అతని కళ్ళల్లోకి చూచింది. అతను చూడలేక కనులు దించేశాడు. వీరి ముందుగా వెళ్ళి పోయాడు చాలా నెమ్మదిగా! ఆ నడకలో ఆమె తనను చూడాలన్న ఆకాంక్ష ఉన్నట్లు గట్టిగా స్పష్టపడింది. అతను కను మరుగయ్యేంతవరకూ అలాగే చూస్తూ ఊరుకున్నా రిద్దరున్నూ. అతను వెళ్ళి పోయాక —

'ఎక్కడికో ప్రొద్దుపోయి బయలుదేరాదే?' అన్నది నందిని.

'నాకు తోచింది చెప్పమంటారా?' అంది మధూలిక.

'ఊ' అని తల ఊపింది నందిని.

'ఏంలేదు. మిమ్మల్ని చూడాలని, మీరతన్ని చూడాలని, అతనంటూ ఒకడీ లోకంలో ఉన్నట్లు మీ దృష్టికి తేవాలన్న ప్రయత్నమే యిది' అంది మధూలిక.

'ఊఁ. నీకూ చాలా విషయాలు తెలుసునే మధూ!' అంది నందిని ఓరగా కనుకొలకుల్లోనుండి చూపులు నిగిడించి చిరు నవ్వు నవ్వుతూ.

మధూలిక మాటాడలేదు. మౌనంగా తల వంచుకుంది.

'మధూ! నీవు నాకు చాలా దూరంగా ఉండు. లెక్క ప్రకారం రాధానాథుడు తిరిగి కొన్ని క్షణాల్లో ఇటు రావాలి. వచ్చే ముందు నీవు తప్పుకో. అతడు నన్ను కలుసు కొని మాటల్లో దిగాడా—నీవు ఇంటికి వెళ్ళు. అతనితో పాటు నేనింటికి వస్తాను. అలాకాక అతడు నా ఎదటనుండి వెళ్ళి పోయాడా—నీవు నా దగ్గరకు రా. ఇద్దరం వెళదాం,' అంది. అదిసరే. ఇందాక మనం అధ్యక్షులవారి విషయంకదూ

మాటాడుతున్నాం: ఆయనకు నా మీద ముందు అనుమానం ఎందుకు కలిగింది? ఆ తర్వాత ఇంత దయ ఎందుకు కలిగింది?'

'ఏమోనమ్మా!'

'నీకు తెలియకుండానే నన్ను వంచించడానికి ఒప్పుకున్నావా?'

'మీరు నమ్మరుగాని అమ్మగారూ! నిజం చెబుతున్నాను. ఎవరి మీద ప్రమాణం చేయమన్నా చేస్తాను. నాకో అన్న ఉన్నాడు. అతనికి సేనంటే చాలా ఇష్టం. అతడు అధ్యక్షుని కుడి భుజం. దాదాపు అధ్యక్షులవారు వాడికి చెప్పకుండా ఏ కార్యం చేయడు.'

'అతనేం చేస్తుంటాడు?' అంది నందిని మధూలిక అన్నను గూర్చి వివరాల కొరకు.

'ఏమీ చేయడు. ఊరకనే ఉంటాడు. పేరు మోసిన మల్లు. వాణ్ని మల్లయుద్ధంలో జయించే వాళ్ళు పంచాయితీ రాజ్యాల్లో లేరు. ఒక్కడే ఉన్నాడు. అతడు కూడా అవంతీ వాసే. వీరమల్లు. ఈ మధ్య అతను కనిపించడం లేదు. అతడు...' ఆపేసింది మధూలిక.

'నీ ప్రియుడు. అతని కోసం నీవు వెదకుతున్నావు. అందుకే కావాలనుకున్న వాళ్ళు మనం ఆశించి నప్పుడు దొరకరు' అన్న అభిప్రాయం నీలో మొలకెత్తి పెద్ద వృక్షమైంది. అతని కోసం ఎదురు చూస్తున్నావు కదూ?' అని గ్రుక్క త్రిప్పకోకుండా అనేసింది నందిని.

గాబాలున 'అమ్మగారూ!' అంది మధూలిక.

'మధూ! నాకు తెలిసినంత మాత్రాన నీకు కీడు రాదు. నా మాట విను. వీరమల్లు ఎక్కడున్నా తెలియ పరుచు.

ఎంత సొమ్మయినా సరే వెచ్చించి, అతనిని మనం అజ్ఞాతంగా ఉండే ఏర్పాట్లు చేద్దాం. అవసరమైనపుడు నీవూ అతనూ పెండ్లి చేసుకోండి. నీకు కొంత సొమ్మిస్తాను. మీరు ఎక్కడికైనా వెళ్ళి హాయిగా బ్రతకండి.' అంది. నందిని పథకం ఆలోచించింది. అధ్యక్షుని కుడి బుజాన్ని తట్టి జార కొట్టగల బలం గలవాడు ఒకడున్నాడు. వాడు మధూలిక ప్రియుడు. మధూలిక అతన్ని మనసారా వాంఛిస్తూంది. సరే! చాలా గొప్ప సమస్య ఒకటి తీరిపోయింది. అధ్యక్షుడు చేరదీసిన వాడు సామాన్యుడై ఉండడు. వాడిని ఓడించే వాడు తన మాట వినేట్టు చేసుకోవాలి. ఇంక కథ జరిపి వేయడమే! మధూలిక మెల్లగా 'అమ్మగారూ! మీరిదంతా ఎందుకు చేస్తున్నారు?' అనడిగింది.

'కారణం నీ కెందుకుగాని, నా స్వలాభం ఉంది. నా కోసమే నేను మిమ్మల్ని చేరదీస్తున్నాను - కానీ నా కంఠంలో ప్రాణ ముండగా మీకు ఏ ఆపదా రాదు. అందులో నే నీనాడు న్యాయ నిర్ణేతల్లో ఒకదాన్ని. ఆ సంగతి మరచి పోకు,' అంది నందిని. ఆ మాట అంటుండగా ఆమె గొంతులోనికి గంభీరం వచ్చింది. ఆ గంభీరం చూచి నిజంగా మధూలిక భయపడింది. వెంటనే ఆమె మంచితనం తలపులో నిలచి భయానికి ప్రక్కనే భక్తి కూడా కలసి నిలచి పోయింది.

'మీ ఇష్టం. మేమంతా సన్నకారు వాళ్ళం. మీరు మాతో ఆడుకుంటే మధ్య మేం నలిగి పోతాం. కొంచం మా సంగతి గుర్తుంచుకొని మీరు మమ్మల్ని ఉపయోగించు కోండి.' అంది మధూలిక.

'మధూ! ముందేచెప్పాను. మీాకే ఆపదా రాదు. కానీ, నన్ను వంచించ దలచారా! నాశనమైపోతారు. నేను ఈ నాడు నివురు కప్పుకొనున్న నిప్పును. ఆ నివురుమాత్రం తొలగించ దలచకండి. మీారు నమ్మకద్రోహం చేయకండి. మీా అన్న మాట మీాద అధ్యక్షుని పంపున నా దగ్గర పరిచర్యకు వచ్చావు. అంతేకదూ?' అంది నందిని నిలదీసి.

మధూలిక తల ఊపింది - అందులో నిస్సహాయత, తన జాలితనం స్పష్టంగా కనబరుస్తూ.

'నీ మీాద నాకు కోపం లేదు. నీ అన్న పేరు?'

'జయసింహుడు.'

'జయసింహుడు నీ అన్నా?' అంటుండగా అంతలో దూరాన రాధానాథుడు వస్తున్న ఛాయకనిపించి 'మధూ తప్పుకో' అంది మధూలిక. సిప్రానది ఒడ్డునే మెల్లగా చెట్ల చాటుకు వెళ్ళిపోయింది. మరుగు వెదక్కొని వీరిద్దరూ కనుపించడాని కనువైనతావు వెదక్కొంది.

సూర్యుడు వెళ్ళిపోయాడు. సంజకెంజాయిలరుణవర్ణం నీలిమకు తిరుగుతూంది. తెల్ల తెల్లని మబ్బులు నీలాకాశం మీాద పారాడుతున్నాయి. పిట్టలు గూళ్ళకు వెళ్ళిపోతున్నాయి. శుక్లపక్షం చంద్రుడు పశ్చిమాన అర్ధాకృతిలో వెన్నెల ఒలికించాలని ప్రయత్నిస్తున్నాడు. గాలి అలలకు తగిలి నందిని వల్వాలను కదుపుతూంది.

రాధానాథుడు మెల్లగా అటూయిటూ చూస్తూ నందిని ముందుకువచ్చి, హఠాత్తుగా చూచినట్టు ఆశ్చర్యాన్నభినయించాడు. ఆమెకూడా గమనించింది. ఇదంతా నటన అని ఆమెకూ తెలుసు-అతనికీ తెలుసు. ఐనా నటించాడు. నందిని చూచీ చూడనట్టూరుకుంది.

రాధానాథుని అడుగు ముందుకు పడలేదు. ఒక రాధానాథుడు కాదు. ఎవరైనా అలా ఆగిపోవలసిందే. ఆ ఆకర్షణకి ఆడవారికున్నది కాబట్టే మగజీవం చేష్టలు కోలుపోయి లోకంలో బ్రతుకుతుంది. మెల్లగా తనలో గొణుక్కుంటున్నట్టుగా ఆమె ముఖంలోకి చూస్తూ—

'మీరు ఒంటరి......గా...' అని ఏదో అనబోయి మిగిలింది ఆంగికంగా అభినయంతో వ్యక్తపరచాడు. నందిని చిరునవ్వుతో వారగంట చూస్తూ—

'మధూలికను పల్లకికోసం పంపాను,' అంది.

'ఆఁ హాఁ' అని అడుగు వేయబోయాడు.

'మీరు వెళ్ళిపోతున్నారా?' అంది.

'ఏఁ' మన్నట్టు చూచాడు రాధానాథుడు.

దీనగా, భీతిగా, జాలిగా, అతనివంక చూచింది. అతడాగిపోయాడు. ఇది క్రొత్తకాదు. ఇలా ఎందరో ఆగారు. ఇంకెందరో స్త్రీలలా చూస్తే ఆగుతారు. తీయదనానికి ఈగలు ముసిరిన రీతిలో ముసురుతారుకూడాను.

'నేను ఒంటరిగా ఉండలేను. తోడు కాస్త ఉంటారా?' అని తిరిగి ఆమే, 'మీరు ఏదేనా తొందరపని కలిగి వెళుతున్నారా?' అంది అతని మాటకోసం చూడకుండా.

'లేదు.' అన్నాడు. వయసులో ఉన్న ఆడది సాయమడగడం, మగవాడు కాదనడం చరిత్రలో ఎక్కడాలేదు.

మధూలిక చెట్లచాటునుండి అటే వెళ్ళిపోయింది. ఆమెకు అర్థమైపోయింది - అమ్మగారు రాధానాథుని ఉచ్చుల్లో బిగించి వేస్తుందని.

నందిని అతనివంక చూస్తూ, 'కూర్చోండి. లేకుంటే నేను కూడా నిల్చబడాలనిపిస్తుంది.' అంది. రాధానాథుడు 'ఆఁ!

ఆс! మీరు కూర్చోండి. నేనూ కూర్చుంటాను. లేవకండి' అన్నాడు - ఆమె లేవబోయినట్లు నటించడంతో ఆమెను వారిస్తూ అతడక్కడున్న యిసుకను కాలితో చదును చేస్తూ!

'నిజంగా ఈరోజు మీతో ఇలా పరిచయం కలగడం నా అదృష్టం. నేనెన్నడూ అనుకోలేదు. అసలది ఆశించ తగిన కోరికకూడా కాదుకదూ?' అంది. మసక వెన్నెల వారి మీద పడుతూంది. చల్లని దక్షిణపుగాలి వారి మీదుగా, వారి ఉడుపులను తాకుతూ ఎక్కడికో వెళ్ళిపోతూంది. మోముల లోని మార్పులు ఒకరి ఒకరికి గోచరించడంలేదు. కానీ ఒకరి నొకరు చూచుకుంటున్నారు.

'మీరలా మాట్లాడితే నేనేమీ చెప్పలేనుకుమండీ' అన్నాడు రాధానాధుడు పూర్తిగా యిసుకలో కూలబడి. అతని మాట ఆగీ ఆగక మునుపే—

'నిజం ఆలోచించండి. నేనెంత? నా తాహతెంత? మీలాటి వారి పరిచయం నాకెన్ని జన్మలెత్తినా దొరకు తుందా? ఏదో 'కాకతాళీయంగా' ఈ రోజు సంధ్యలో, ఈ వెన్నెల్లో దొరికిందిగాని!' అంది నందిని. రాధానాధుడు ఆ తీయని మాటలకు చల్లబడి పోయాడు. అందులో ఆమె మాటల్లో సంధ్య, వెన్నెలా, జన్మలు రావడంతో అతనికి అంతకు ముందులేని అహం లోనుండి తొంగి చూచింది. ఐనా దానిని వెలికి గానీయకుండా 'ఎంతమాట! మీరను కుంటేంత గొప్పవాణ్ణి కానుకుమండీ! అసలు అవంతిలో మీయంత అందగత్తెలుగాని, ధనవంతులుగాని మరొక రెవరున్నారు?' అన్నాడు. ఆమె అంటున్నదిగదా మనం ఎందుకనగూడదు? అని. మరో తెలియని తత్వం ఉంది. ఎవరైనా, ఎవరికైనా ఎదటివారిని 'మీరు గొప్పవారు - మంచివారు' అనగానే వారుకూడా చిలుకల్లా ఎదటి వారిని

ఆ మాటలే అంటారు తప్పకుండా. అందుకనే తెలివి కలిగిన వారు ఎదటివార్ని మంచివారని మెచ్చుకుంటూ ఉంటారు. ఎదటివారు ఉబ్బి నిజమేనేమో అనుకొని తప్పనిసరిగా నటిస్తారా మాటలే. ఇది యిద్దరికీ తెలుసు - ఎవరికి వారు మంచివారు గాదని.

'నాదేమున్నది గెండి. మీలాటివారు దయతలచి అవంతిలో తల దాచుకోనిచ్చారు.' అంది నందిని. అప్పటికి పూర్తిగా చీకటి ఆవరించింది. వెన్నెల శోభ కనిపిస్తూంది. వాతావరణం నిశ్శబ్దంగా ఉంది. చుట్టుపట్ల కీనీడ తప్ప మరో జీవి సంచరిస్తున్న అలికిడి కనిపించడంలేదు. చాలా సేపిద్దరూ మౌనంగా ఉన్నారు. రాధావాధుడు మాట్లాడ్డం లేదు. అతనికి ఇచ్చినది-అందినది-అవకాశం ఊరక పోతుందే! అనవసరంగా అవకాశాన్ని దుర్వినియోగం చేస్తున్నానా? అనిపిస్తూంది. ఏమనడానికి, ఏం చేయడానికీ ధైర్యం చాలడం లేదు. ఆమె ఒక అంతస్థులో ఉంది. అవంతిలో ఈనాడామె కేదేనా జరిగితే అవంతి ప్రజలే ఊరుకోరు. చాలా పలుకుబడి, బలం, అన్నింటికీ మించినది ధనం - ఈనాడామె కలిగి ఔన్నత్యంలో ఉంది. ఏదో ఆశతో త్వరపడి పొరపడితే తర్వాత చాలా బాధపడాలే అని ఆలోచిస్తూ కాలాన్ని వ్యర్థం చేస్తున్నాడు.

నందిని 'ఏమిటీ మనిషి! ఒంటరిగా అందాముకదా? అందకతైనని అతనే అన్నాడుకదా? ఎందుకూరుకున్నట్టు? ఎందుకూరుకుంటున్నట్టు? వీరంతా ముందిమీద వ్యవహార వేత్తలు కాబోలు, గబాలున ఆమెకో అవకాశం కనిపించి—

'మీరు మంచి గాయకులని విన్నాను' అంది మౌనాన్ని ఛేదిస్తూ.

‘ఆఁ! నాపాటదేముంది? అంతబాగా పాడలేను. ఐనా మీముందసలు పాడలేను’ అన్నాడు. మాట లాగిపోతా యేమోనని జంకింది నందిని.

‘మీరు చాలా నిగర్వులు. మిమ్మల్ని చూస్తుంటే మీరేదో గర్విష్టుల్లా కనిపిస్తారుగాని మీతో పరిచయం కలవారా మాట అనుకోరు’ అంది. దానితో రాధానాధుడు పొంగిపోయాడు.

‘నేను కూడా అదే ఆలోచిస్తున్నాను. నేను విన్నదానికి, మీరీనాడు మాట్లాడుతున్నదానికీ చాలా తేడా కనిపిస్తూంది,’ అన్నాడు ఆమె ముఖంలోనికి చూస్తూ.

‘ఏంవిన్నారు నన్నుగూర్చి?’ అంది నందిని అతని చూపుల్లో చూపులు కలుపుతూ.

‘ఏముంది. మీరు చూచి అనుకున్నది - నేను విని అనుకున్నాను. తీరా యిద్దరం కలుసుకున్న తర్వాత యిద్దరి ఊహాలూ యిద్దరు విన్నవీ అనుకున్నవీ తప్పిపోయాయి!’ అన్నాడు. నందిని లోలోన అనుకుంది: మాటలు కొంచం వస్తున్నాయి. ఇంక లోని భావాలు వెలికి రావాలి. అవీ త్వరలో వచ్చేస్తాయి.

‘పోలికలుబట్టి ఎదటివారినిబట్టి మనం ఒక నిర్ణయానికి రావడం తప్పేనేమో!’ అంది.

‘ఆహా! తప్పకుండాను. ఏదీ యింకా పల్లకీ రాలేదేం?’ అన్నాడు ఒక్కసారి ప్రసంగంలోనుండి మరో వంకకు మాటను లాగుతూ.

మాటలు మార్చడం చూచి కారణం తెలియక, ‘వెళ్ళింది. నేను నడచి వస్తాననుకొని బోయీలు ఎక్కడికేనా వెళ్ళా

రేమో! వాళ్ళకోసం కబురు పంపి ఉంటుంది. వస్తారు. మీకు అలస్యమౌతుందనుకుంటాను. పోనీ అలా నడచి వెళదాం పదండి! ఎదురువస్తే తర్వాత ఆలోచించుకోవచ్చు!' అని లేవబోయింది నందిని. రాధానాధునిలో నిరాశ ఆవరించింది. 'లేదు - లేదు. నాకాలస్యమేముంది? ఇప్పుడు వెళ్ళి చేయ గలిగింది మాత్రం ఏముంది? మీరు మీ......' అని ఆపేయకముందే, నందిని అందుకొని—

'నాకు మాత్రం మునిగిపోయే పనులేమున్నాయి? మీలాంటివారితో మాటాడగలిగాను. అదే పదివేలు. నన్ను గూర్చి మీ రేమీ త్వరపడకండి!' అంది.

'మీరు మొత్తానికి నన్ను మీ మెచ్చుకోలుతో చాలా బాధపెడుతున్నారు!' అన్నాడు.

ఆమె లేవబోయి తిరిగి మరో ప్రక్కకు తిరిగి మరో విధంగా కూర్చుంది. ఆ కదలికలో ఆమె అవయవాల తీరును పరికించాడు రాధానాధుడు. ఇంత అందాన్ని ముసలి అధ్యక్షుడు అనుభవిస్తున్నాడా! ఆ ఎత్తైన వక్షాన్ని ఆ ముసలిపీనుగ గుండెలకదుముకుంటాడు! ఆ లేత బుగ్గలు ఆ ముసలి ముడుతలుపడ్డ...ఆ తలపతనికి రాగానే అధ్యక్షుని మీద మండిపోయింది. ఆపుకోలేనంత కోపం, ఈర్ష్య, అసూయ అతనిమీద జుగుప్స కలిగింది. అసలు విషయం లోనికి ఎలా మళ్ళించాలా? అనుకున్నాడు.

'ఒకటడుగుతాను చెపుతారా?' అన్నాడు. అతనిలో ధైర్యం పేరుకుంది. అవతల అధ్యక్షుడు ఈ అందాన్ని అనుభవిస్తున్నాడు అనుకుందేప్పటికి, 'అతనికి లొంగినది నాకు లొంగదా?'-పైపెచ్చు మరొకరితో బంధం ఉన్న సంగతి ఎదటివానికి తెలిసిందే అని కించపడియైనా ఏదో

ఒకటుంటుందన్న భావం అతనిలో చెదరిన ధైర్యాన్ని కూడ గట్టింది.

నందిని అనుకుంది: రంగంలోనికి వస్తున్నాడు-రానీ అని.

'అడగండి! అదేమిటలా అడుగుతారు! మీకూ వాకూ మాటలు లేకపోవచ్చు. పరిచయం చాలా కాలాన్నుండి ఉంది,' అని వెంటనే ఆలోచించింది. ఇది గతాన్ని త్రవ్వుతుందేమో అనుకొని, 'నేను మీ మంచితనాన్ని చాలా కాలంగా వింటున్నాను. మీరు పెద్దమనుష్యులు. మాట్లాడని మాత్రాన తెలిసినతనం మరుగుపడదు!' అంది మాట మాటకూ గతంలోకి వెళ్ళి, అదికాదు భావం-అనుకొని తిరిగి వర్తమానంలోనికి వచ్చి పడుతూ.

'ఏంలేదు. అవంతిలో ప్రథ వృథాగా ప్రచారం అవుతుంది. అది......అది' అని నసిగాడు. అలా నసగడం గమనించి ధైర్యమిస్తున్నట్టుగా—

'మీరు సందేహించాలసిన పనిలేదు. అడగండి. స్పష్టంగా చెప్పండి' అంది నందిని. ఆ అడిగేదేమిటో ఆమెకు తెలుసు. దానికి సమాధానంకూడా ఆమె ఆలోచించే ఉంచింది.

'ఏఁలేదు-మీకూ అవంతి అధ్యక్షులకూ ఏదో.........'

నందిని పెద్దగా నవ్వింది. ఆ నవ్వుకు ఆ నిశ్శబ్ద వాతావరణం - ఆమె గొంతు పంచమంలో దూరదూరాలకు వినిపించింది. ఆ నవ్వులో ఏదో కృత్రిమం, తెలియని ఆవేశం - దాన్ని కప్పుకొని వెలికి కనిపించేది, వినిపించేది శబ్దమాత్రమే!

ఆ నవ్వులోని భావం ఇదని ఇదమిత్థంగా అర్థం చేసుకో లేక పోయాడు రాధానాథుడు.

'ఎందుకలా నవ్వుతారు?' అనడిగాడు - ఉండబట్టలేక. ఆ నవ్వతనికి చెంప పెట్టయింది.

నవ్వుతూ నవ్వు నాపుకుంటున్నట్టుగా 'ఏంలేదు - మీరీ మాట అనడానికి ఇంత సంకోచించారు దేనికాని!' మాట పూర్తవుతుండగా ఆమె నవ్వు పూర్తిగా ఆగిపోయి గొంతులో గంభీరం వచ్చింది. 'బట్టబయలుగా అధ్యక్షుల వారు నా యింటికి వస్తున్నారు. ఈ రెండు యోజనాల చదరంలో ఉన్న అవంతికంతా తెలుసుగా? అయినా అవంతి అధ్యక్షులతో బంధ కలిగి ఉండడంవల్ల నాకు గౌరవం హెచ్చిందిగాని తగ్గలేదు. మరొకమాట. నా తర తరాల వాళ్ళు వారకాంతులై సూరసేనంలో సురత భోగా లందించారు. పెరమార్గం పట్టించాలనుకున్న నాకు అవంతి పరాభవం జరిపింది. నాకు తగిన రీతిగానే బుద్ధి చెప్పారు అవంతి ప్రజలు. ఐనా ఈ అవంతిమీద నాకు మమకారం చావలేదు.' రాధానాధుడు తల్లక్రిందులై పోయాడు. ఆమెకు ఆనాటి పరాభవ సంఘటన తలపులో ఉంది. ఆ అకార్యం జరిపిన వారిలో నేనుకూడా ఉన్నానని ఈమెకు తెలుసేమో అనుకున్నాడు.

'మీరు మాటాడుతున్నది నాకర్థం కావడంలేదు' అన్నాడు రాధానాధుడు కంచెలోని బిల్లముండను ఎందుకు కెలికావా అనుకుంటూ.

'ఇందులో నేనేమీ గూఢంగా మాటాడడంలేదు. నాకు తెలుసు - నేను హాయిగా బ్రతుకుతున్నాను. అవంతి అధ్యక్షులు నన్ననుభవిస్తున్నారని ఈర్ష్యపడడం దేనికి? దాన్నిగూర్చి చెప్పుకోడం దేనికి? నేను వేశ్యనుకదా? నా సరసకువచ్చి నిల్వగల్గిన ధైర్యమున్న ప్రతి వారినీ కాదన డానికి వీల్లేదు.'

రాధానాధుడు ఉక్కిరిబిక్కిరై, ఎంత అకులంలో పుట్టినా ఇంత గుండె నిబ్బరంతో ఇంత తేలిగ్గా ఇదేమంత ఘనకార్యం

అనే ధోరణిలో మాటాడుతుందనుకోలేదు. 'ఏదో లౌకిలు కాకులు అనేకం అనుకుంటారు - దాన్ని మీలాంటి వాళ్ళు నమ్మకూడదనో', లేక మొహం మాడ్చుకొని తడబడుతూం దనో అనుకొని, దాన్ని పురస్కరించుకొని ఏదేనా లౌకిక చేసి మాటాడి, నందినిని లొంగదీసుకోవచ్చని భ్రమపడిన రాధానాథునికి పూర్తిగా వ్యతిరేకమైన సమాధానం వచ్చింది. ఆమె అన్న ఆ మాటలకు సమాధానం ఏమీయాలో తెలియక చాలా బెంబేలు పడిపోయాడు. తిరిగి సమర్థించుకో వాలని—

'మీరింతకుముందు అవంతి మీకేదో అపకారం జరిపినట్లు మాటల్లో ధ్వనింప చేశారు. ఏం చేశారు? ఏం జరిగిందో వినవచ్చా!' అన్నాడు. ఏమాటా దొరక్క ఆమాట అన్నాడు గాని అనాలని, ఆ విషయం తెలుసుకోవాలని సంపూర్ణంగా అతని ఆశయం కాదు.

ఇలా అడగడంవల్ల నేను 'ఇతడు ఆనాడు లేడు' అనుకో వాలని కాబోలు. కానీ! ఎంతమారం మభ్యపరచి సంభా షిస్తాడో చూద్దాం. ఒకోరూ దొరకుతూనే ఉన్నారు. అట్టే కాలం ఎలాగూ ఈ రహస్యాన్ని దాచకూడదను కొంది నందిని.

'ఆడదానికేది జరగకూడదో అదే చేశారు ఐదుగురు పెద్దలు-అందులో నలుగురు తెలిశారు. ఇంకొకరు తెలియాలి. ఒక కన్నె జీవనం ఆ ఐదుగురూ సర్వనాశనం చేశారు. పున్నమరేయిలో మామిడితోటలో. ఆనాడు సిప్రాలో నీరున్నట్లయితే ఈనాడు మీతో ఇలా మాటాడే అవకాశం దొరికేదికాదు. అంత అవమానాన్ని దిగమ్రింగి కాళాంబిలో కొంతకాలం కాలం గడిపాను. అంతకన్న తలదాచుకున్నాను-

అనడం సబబు. తర్వాత తిరిగి అవంతికి చేరాను. ఈనాడు నేను జీవశ్చవాన్ని ఐనా, ఆ ఐదుగురిలో నలుగురు ఇంకా ఏదో బావుకోవాలని, నన్ను సర్వనాశనం చేయాలని చూస్తున్నారు. వార్ని వారి అధీనంలో ఉన్న నేనేం చేయగలను? అందులోనూ ఆడదాన్ని. అవంతి అని ఆనాడు వింటే నాకెంతో సంతోషం కలిగి మా అమ్మతో బయలుదేరి వచ్చాను. నా సర్వస్వం నాశనం చేసుకోడానికే వచ్చానేమో ననిపిస్తుందీనాడు' అని ఒక విధమైన విచారస్వరంతో పలికింది నందిని.

రాధానాథుడు లోలోన దిగులుపడిపోయాడు. అధ్యక్షుడు అందరినీ చెప్పి తన పేరు చెప్పుకోలేదేమో! అబ్బా! ఎంత వంచకుడు! అనుకొని, సరే కదలేద్దాం అని—

'ఆ నలుగురూ ఎవరూ?' అన్నాడు.

తెలిపోగూడదనుకుంది నందిని. 'వారి పేర్లతో దేనికి లెండి! చాలా పెద్దమనుష్యులు. ఈనాడు నా మాట నమ్మరు కూడాను. వారి అంతస్థది-నా స్థితిది. ఈ నాడేమనుకొని ప్రయోజనం? నా జయదేవునితో ఆనాడు ఒక ముక్క చెప్పి ఉన్నట్లయితే, వారందరినీ నాశనం చేసేవాడు ఆ పగలో. కానీ, నాకా రక్తపాతం ఇష్టంలేదు. అలా చేయించడం మంచిదికాదు కూడాను. ఊఁ, జరిగిపోయింది!' అని నిట్టూర్పు వదలింది నందిని.

'బహుశా అధ్యక్షులు చెప్పి ఉంటారా నలుగురు పేర్లూను!' అని మాట జారాడు.

'ఆయనకేం తెలుసు? ఇలా జరిగిందని. నేనలాటిదాన్ని; అలా నాశనమైనదాననని తెలిస్తే నా గడపకు చేరతారా? అంత విశాలంగా ఆలోచించగల మగవాళ్ళుంటారా?

వారికీ విషయం తెలియదనుకుంటాను. ఒకవేళ తెలిస్తే ఆయన ఊరుకోరు కూడాను. ఈ నాటికీ ఆ విషయం ఆయనకు తెలియదు!' అంది నందిని.

అమ్మో! వృద్ధ జంబూకం - అనుకొని వాడికి తెలిస్తే ఊరుకోడా! జయదేవుడంటే పరవాలేదు. వాడు చాలా మంచివాడు. కోపం వస్తే నిల్చునా అవంతిని నాశనం చేయ గలడు. పలుకుబడీ, బలగం అంతా వాడికుంది. ఈ రుద్రాక్ష పిల్లిని నమ్మవద్దని ఎలా చెప్పడం? ఈమెకున్న నమ్మకాన్ని ఎలా పోగొట్టడం? అది జరిగే పని కాదు. అందులోనూ అవంతిలో యిందరు వయసు వాళ్ళుండగా ఈ చక్కని చుక్క - ఈ చిన్నది ఆ ముసలిపీనుగ వడిలో వాలడ మేమిటి? వాడి సంగతి బయట పెట్టేస్తాను - అని ఆలోచిస్తూ మౌనంగా ఊరుకున్నాడు రాధానాధుడు.

'ఏమిటీ? ఒక్కసారే ప్రసంగాన్ని ఆపేశారు! మీకీ ప్రసంగం బాగాలేదా? మానేద్దాం. పోనీ, లేద్దాం. చాలా ప్రొద్దుపోయినట్టుంది!' అన్నది నందిని.

'వెళదామంటారా?' అన్నాడు. అతనికి లేవడం యిష్టం లేదు. ఎలాగేనా అధ్యక్షుని నక్కజిత్తులనుండి ఆమెను కాపాడాలని చాలా ఉబలాటపడుతున్నాడు.

'వెళదాం. బాగా ప్రొద్దుపోయింది. బోయీలు దొరకి ఉండరు. మధూలిక ఏమవస్థ పడుతుందో నాకోసం అక్కడ!' అంది లేస్తూ.

'ఒకటి గుర్తుంచుకోండి. మీరు అధ్యక్షులమీద అంత నమ్మకం ఉంచకండి!' అన్నాడు తనుకూడా లేస్తూ.

'ఏం అలాగన్నారు?' అనడిగింది నందిని.

'మరొకసారి మాడాడుకుందాం.' అన్నాడు.

'అదేమిటి? ప్రసంగం అర్థాంతంలో ఆపివేస్తూ అత్రుతతో రాత్రికంతా వేగిపోనా చెప్పండి?' అంది తనకేమీ తెలియనట్టు. రాధానాథుడు అనే ఈగ తను పన్నిన సాలెగూటిలోనికి వచ్చేసినట్టుగా భావించింది. దుష్ట పంచకంలో త్రయం తన గూటిలో తగుల్కొన్నాయి. ఇంక పోతే మాలీ జయపాలుడూ ఈ ఇద్దరూ కలశాక ఇంక రణరంగంలోనికి ప్రవేశించాలి. కాదాపు ఈ మూడూ ఒక రకమైన వలలో, ఒక పన్నగడలో ఇరుక్కొన్నాయి. ఆ రెండూ ఎలా వాల్తాయో, ఎలా వాలే ఏర్పాటు చేయాలో చూడాలి.

ఇద్దరూ నడక ప్రారంభించారు.

'ఏమిటీ దీర్ఘంగా ఆలోచిస్తున్నారు?' అనడిగాడు రాధానాథుడు.

'ఏం లేదు. ఇంతకు ముందు మీరన్నారే - అధ్యక్షులను నమ్మవద్దని! దానిని గూర్చి. అలాగే నడచుకుంటాను. కానీ నేను ఇటు వచ్చి కూర్చుంటున్నప్పుడు మీతో ఎవరో ఉన్నారు - ఈ తిన్నె మీద. వారు వెళ్ళిపోయారా?' అంది సరిగా ఇంతకు ముందు రణవర్మ రాధానాథుడు కూర్చున్న జాగాలోనికి రాగానే. ఆమె ఇద్దరినీ గుర్తు పట్టి అసలు తనను చూడగానే రావలసింది రణవర్మ. రాధానాథుడు వచ్చి రణవర్మ తప్పుకోడం ఆమె కాశ్చర్యం కలిగించింది. అయినా ఇంత సేపూ ప్రసంగంలోనికి రణవర్మను తేవడం జరిగితే తప్పక అందరి పేర్లు తెలుసునుకుంటాడని ఆ పేరు ఎత్తలేదు.

'మన రణవర్మ, సైన్యాధ్యక్షుడు మీకు తెలియదా? ఆయన కూడా సభ్యుల్లో ఒకరు. మీరు సభ్యత్వం స్వీకరించాక అతను సభకు రాలేదనుకుంటాను.'

'వచ్చారు. మొదటి సభలో ఆయన్ను చూచాను' దూరాన ఉండడంతో ఇందాక సరిగా కనిపించ లేదు. మీరు ఇటు తిరిగి ఉన్నారుకదూ? అందువల్ల నా చూపా యన మీదకు పోయింది కాదు. మీలో ఉన్నది రణవగ్మ సైన్యాధ్యక్షులన్న మాట.' అంది నందిని.

'ఆఁ ఆఁ! మీ...' అని నాలుక కరచుకున్నాడు. నందిని కూడా గమనించని రీతిలో ఊరుకుంది. 'మీ రింతకు ముందొకసారి అతనితో ప్రసంగించారని చాలా గొప్పగా మిమ్మ గూర్చి ముచ్చటించాడు.' అని ముగించాడు.

'అంత గొప్పతనం నా దగ్గరేమీ లేదని మీకు తెలుసు కదా? దాదాపు చాలా విషయాలు మీకు తెలిసి పోయాయి. నేను ఎలా జీవిస్తున్నానో మీకు తెలుసు. ఇంకా నా గొప్పతనమేముంది?' అంది.

అంతలో దూరాన మఘూలిక వస్తున్నట్టు కనిపించింది. ఆమె నడక నందినికి తెలుసు. చూచి—

'అదిగో మఘూలిక వస్తూంది. బోయీలు కనిపించ లేదు కాబోలు' అంది. సిప్రాలో దిగి నడుస్తున్న రాధానాథుడు 'మీ దాసీది వస్తుంది కాబట్టి ఇంక నేను ఇటుగా వెళ్ళి పోతాను.' అన్నాడు.

'మీ ఇష్టం.' అంది నందిని.

'తిరిగి మనం కలసుకుంటామా!' అన్నాడు.

'అది మీ దయ మీద ఆధారపడి ఉంది. నాదేముంది?' అన్నది.

'ఇంతకూ అసలు ఆ నలుగురెవరో చెప్పారు కాదు.' అన్నాడు రాధానాథుడు.

'మీకూ తెలుసు. ఐనా తర్వాత మరోకసారి మాటాడు కుందాం. ఈ విషయాలు దాసీలకు తెలియడం దేనికి?' అంది. రాధానాధుడు ప్రక్కనుండి తప్పుకొని వెళ్ళిపోయాడు. మధూలిక సిప్రానది నడి ఒడ్డులో ఉంది. నందిని వెళ్ళి కలసుకొంది.

'ఇంతసేపు ఎక్కడున్నావు? యింటికి వెళ్ళకపోయావా మధూ' అంది నందిని.

'ఎలా వెళ్ళగలను? వెళ్ళనిస్తేనా!' అంది నవ్వుతూ. ఆ నవ్వు వెన్నెలను పరిహసించింది.

'ఆదేమిటి? నీతో ఎవరు మాటాడారు? ఎవరడ్డు తగి లారు?' అంది నందిని.

'అంతా గూడుపుఠాణీ అమ్మగారూ! అమ్మా! అవంతి పెద్దలూ వారి యెత్తులూ చాలా తమాషాగా ఉన్నాయి. రణవర్మగారు, రాధానాధులవారు అక్కడ కలసి మాటాడు తుండగా చూచామా! ఆ తర్వాత రణవర్మగారు ఈ బాట కాచారు. అటు రాధానాధులు వచ్చారు. మీ యిద్దరినీ వదలి నేను ఆ పొదలమాటగుండా ఏటిలోకి వచ్చాను. రణవర్మగారు ఎదురయ్యి, ఏదో అదో విధంగా నవ్వుతూ 'మీ అమ్మగారు...'అని మొదలుపెట్టారు. ఎంత చెప్పినా వినరే! రాధానాధులకూ మీకూ ఏదో సంబంధం ఉందని, అతనేదో మోసం చేశాడని, అతనంతా దాచి మీ కొరకు అటు వచ్చాడని ఏదేదో చెప్పాడు......'

'అలాకాదు. నాకు వివరంగా చెప్పు!'

'ఏముందమ్మా వివరానికి? మీకూ రాధానాధులకూ ఆంతర్యంగా ఏదో గట్టి సంబంధం ఉందని ఆయన పూర్తిగా నమ్మారు. అదే మాటల్లో వ్యక్తపరచి 'నిజమా

అబద్ధమా?' అని ఇంతసేపూ నన్ను వేధించుకు తిన్నారు,' అంది మధూలిక.

'మొత్తానికి వారిలో వారికి విష బీజాలు మొలక లెత్తాయి. యింకమీదట కథ చాలా తేలికగా నడచి పోతుంది. మనం జాగ్రత్తగా మసలుకోడమే ప్రస్తుతం చేయగలిగింది. కానీ, మధూ! నీవు నీ వీరమల్లును త్వరగా వెతికి పట్టుకోవాలి.'

'అంటే వారినికూడా మీరు...' మాట మధ్యలో ఆపింది మధూలిక.

'పిచ్చిదానా! నేనంత నీచానికి ఒడిగట్టనే. అతడు నా యింటికి రెండుసార్లు వచ్చిపోతే చాలు. అతను నాకే సాయమూ చేయవలసిన పనిలేదు. రెండురోజులు కనిపించాక మీ యిద్దరూకలసి, మీ యిష్టంవచ్చిన దేశానికివెళ్ళి బ్రతకండి. అతను రావడం పోవడంవల్ల అధ్యక్షులవారికి, అతని కుడ భుజమైన మీ అన్నకూ నేను బలహీనంగా లేననీ, నా జాగ్రత్తలో నేనున్నానని తెలియడానికి మాత్రమే. మీ కెవ్వరికీ తెలియదు. దాదాపు వందమంది అవంతి వీరులు నా యింటి చుట్టు అజ్ఞాతంగా కాపు కాస్తున్నారు. కావాలంటే అధ్యక్షులు మనింటికి వచ్చినప్పుడు నీవు మందిరం పైభాగంలో నిలచి పరికించు. ఏ క్షణాన నా చేతి చప్పట్లు వారికి వినిపిస్తే ఆ క్షణం అధ్యక్షులుగాని, నా కపకారం జరిపే వారుగాని కనిపించరు. కళేబరం సిప్రానది మలుపుల్లో ఎక్కడో ఉంటుంది. నేనేనా నీ ప్రియుణ్ణి ఎందుకోరు తున్నానో తెలుసా? అధ్యక్షులకున్నది నీ అన్న జయ సింహుని అండ. అతన్ని తలదన్నే వీరమల్లు నా మందిరంలో కనిపించాలి. అతన్ని అతడు చూడాలి. కారణం తన వీరుని మొదలంట కూల్చగలవాడు నా మందిరంలో ఉన్నాడని

తెలిస్తే చాలు. అతను చేయవలసిందేమీ లేదు. అందుకే అడుగుతున్నాను.' అంది నందిని. ఆ మాటలంటుండగా ఆమెలో ఆవేశంగాని, కోపంగాని ఉన్నట్టు స్వరంలో ఏమీ ద్యోతకం కాలేదు.

'ఇంటిలో సరేనమ్మా! ఇలా ప్రొద్దుపోయి, ఊరుదాటి వచ్చాంకదా! ఇప్పుడేదేనా జరిగితే?' అనడిగింది మధూలిక.

నందిని కిలకిలనవ్వి, 'మధూ! నీవు రణవర్మతో మాటాడి నట్లు దాచినా రాత్రికి నాకు తెలుస్తుంది. చూడు.' అని రెండు చేతులూ చరచింది. ఆసద్దుకు నాల్గుప్రక్కలనుండి చప్పట్ల సద్దు వచ్చింది. ఆ తర్వాత రెండు క్షణాలకు అతి కాయులైన పదిమంది ఆమె ముందుకు వచ్చి నిలిచారు. మధూలిక దిమ్మెరపోయింది. ఆ వచ్చినవారితో, 'ఇప్పుడు నాతో మాటాడినవారిని చూచారుగా! గుర్తుంచుకోండి.' అంది నందిని.

వారంతా తలలూపారు. తర్వాత ఎటు వారటు వెళ్ళి పోయారు.

నందినీ, మధూలిక యింటికి చేరారు.

## 8

ఎండలు బాగా తగ్గాయి. సిప్రానదిలో నీరు ఏరులై పారుతూంది. ఎండిపోయిన గరిక మరుక్కు ఆకులు దాల్చింది. సిప్రాకు అవంకా యీవంకా పచ్చకంబళీ పరచి నట్టు ఎండపొడ పడి ఆకసంలోని నీడ నీళ్ళల్లోపడి స్ఫటిక రాతితో ప్రకృతి దేవత నడచిపోడానికి బాట వేసినట్టుగా ఉంది.

ఏటి కిరువంకలా ఉన్న చెట్లు తమ నీడలు చూచుకుంటున్నాయి ఏటిలోనికి. ఆ చెట్లమీది పిట్టలు నీళ్ళలోనికి చూచి మరో పిట్ట తమ జాతిది క్రింద ఉన్నదన్న ఊహతో నీళ్ళలోని కురికి రెక్కలు తడచి రివ్వున మరో చెట్టుమీద వాలి ఎరుకలార బెట్టుకుంటున్నాయి.

నీటిమబ్బులాకసమ్మీద ఆటలాడుకుంటున్నాయి - తమ అందాన్ని సిప్రా అనే అద్దంలో చూచుకుంటూ తన్మయత్వంలో ఒళ్ళు తెలియక దిశ దిశలకు పరుగులెత్తుతూ.

ఏరు దాటడానికి నిర్మించిన నావ లావలా యీవలా సన్నద్ధంగా ఉన్నాయి. మధ్య మధ్య నావలు తిరుగుతున్నాయి. రెండు బారల ప్రొద్దెక్కింది. నిర్మలాకాశంలోని మబ్బులు తప్పుకున్నాయి. పొడి యెండ ప్రకృతిమీద సమతలంగా పడుతూంది. ఒక నావ ఏటి మధ్య చాలా అందంగా అలంకరించబడి మందంగా నడచి ఈవలి వంకకు వస్తోంది.

ఇంటిలో ఉన్న నందిని మనసంతా నావమీదే ఉంది. ఎన్నడు లేని సంబరం, ఏనాడూలేని ఉత్సాహం, అతి ఉత్సాహం, అతి ఆనందం, అతి తొందరా ఆమెకు చిరాకు కలిగిస్తున్నాయి. దాసీలను కసురుకొంటుంది. వెంటనే 'ఏమిటీ యిలా కసురుతున్నాను, ఛాఛా!' అనుకుంటుంది. అంతలో మధూలిక అటు వెళ్ళడం చూచి 'మధూ! పల్లకీ సిద్ధం చేయించావా? అబ్బా! ఆ స్వర్ణ పాత్రలో ద్రాక్షాసవం ఉంచమని చెప్పలేదా? వాసలి యేదీ? దానికి మందిరంలో పాన్పు సిద్ధం చేయమని చెప్పాను. మధూ! అది చేసిందోలేదో చూచి ఆ పైకివెళ్ళి నావ ఎంత దూరంలో ఉందో చూడు! బోయీలున్నారుకదా?' ఆమె అంటున్న ఒక మాటకు మరో మాట - ఒక పనికి మరో పని

సంబంధం లేకుండా ఆత్రుతతో సంతోషంతో నిలువలేక ఊరుకోలేక మాటాడలేక మాట్లాడకూరుకోలేక సతమతమైపోతూంది.

మధూలిక నవ్వుతూ - మందిరంపైకి వెళ్ళడానికి మెట్లనెక్కబోయింది.

'మధూ! స్నాన మండపంలోని నీటిలో సుగంధ ద్రవ్యాలు కలిపారా?'

'ఆఁ.' అంది మధూలిక.

'నీవు చూచావా?'

'కలిపిందే నేనుగదమ్మా!'

'ఆఁ. ముందు వాకిటిలో కాశ్మీర శాలవా పరచు. ఇదిగో మధూ! పాన్పుమీద చీనా పట్టు దుకూలాలు పరచు. మడతలుండకూడదు. పాదాల దగ్గర సింహళం కంబళీ తోలుది మెత్తగా ఉండేది పరచు. ఆ ప్రక్కన తమాల కొయ్యతో చేసిన బల్ల - అబ్బా! అదే నే! ఆ దంతతాపితమైంది; దానిమీద - ఏఁవిఁటీ వినిపించుకోవు. దానిమీద ఆ స్వర్ణ పాత్ర, ఆ చీనావారి గాజుపాత్ర ఒకటి, గాజు పాత్ర కాదు - ఆ వజ్రాలు పొదిగిన పసిడి పాత్రలేదూ - మొన్న కేరళనుండి వచ్చిన సార్థవాహులిచ్చింది అది ఉంచు. అలా చరచరా వెళతావేమే మాట లాలించకుండా! అసలా నాక ఎంత దూరంలో ఉందో చూడు!' మధూలిక మళ్ళీ నవ్వింది. 'నవ్వుతావేమిటే?' మధూలిక మెట్లమీదనుండి నవ్వుతూ ఓరచూపు చూచింది. 'ఏఁవిఁటి అలా చూస్తావు?' అంది నందిని. 'ఏం లేదమ్మా! మీరు ఇలా వెఱ్ఱెత్తినట్లు సంచరించడం నేను వచ్చిన దగ్గరనుండి యింతవరకూ చూడలేదు. అందుకు నాకు నవ్వు వస్తూంది. రాత్రి

నుండి మీ చర్యలన్నీ అదోలా ఉన్నాయి. చాలా వింతగా ఉన్నాయి. అందుకంటున్నాను.'

'నా చర్యలన్నీ కొత్తగా ఉన్నాయా!' అనడిగింది నందిని.

'కొత్తగాను వింతగా ఉన్నాయి.'

'ఆ వస్తున్నదెవరో తెలిస్తే అలా అనవు.'

'తెలియదని మీ రనుకుంటున్నారు. నాకు తెలుసు. రాత్రి మీ కలవరింతలన్నీ విన్నాను. ఏం జరుగుతుందో కూడా నాకు తెలుసు.'

'మధూ!'

'నిజమమ్మా!'

'ఆ వస్తున్నది నా ప్రాణం. నా హృదయం. ఈ కాయం, ఈ శరీరం, ఈ ఆస్తి, ఈ మందిరం సర్వం ఆయన సొత్తు. ప్రతి రక్తబిందువులోని భాగం ఆయన కొరకు అలమటించింది. అహర్నిశలూ ఆలోచించాను. నిరంతరం ఆ మత్తులో ఆ దివ్యస్వరూపుని సందర్శనం కొరకు అలమటించాను. అల్లాడి పోయాను. ప్రతి అవయవం ఆరాధించడానికి, బలి ఈయడానికి సంసిద్ధంగా ఉంది. నా ప్రభు డీనాడు నన్ను చూడ వస్తున్నాడు. ఇంక ఈ జీవితం సమాప్తమైతే మాత్ర మేం? ఇలాగే ఇలాతలం పగిలి ఆ బాటలో నన్ను చేర్చు కున్నా బాధ లేదు. అబ్బా! నన్నొక్కసారి చూడవచ్చి, నన్నాతడు చూచి, మచ్చికగా, లాలనగా 'నందా!' అని పిలిస్తే చాలు. ఇంతకన్న ఏ ఆడది ఎక్కువ వాంఛిస్తుంది? అది చాలదా! ఆ ఆరాటంలో ఆ నిలబడని మనస్సుతోనే మాటాడుతున్నాను. అది మీకు ఎలావుందో మొత్తానికి నవ్వు తెప్పించిందేమో. నా హృదయం, నా సర్వస్వం నా దాపుకు వస్తూంది. నా గారాబుకొండ నన్ను చూడవస్తూంది.

నా ఊహ హిమవన్నగం నన్ను చేరవస్తూంది. నా నిల్పి కొన్న స్వర్గం నా ముందుకొస్తూంది. ఇంతకన్నా నాకేం కావాలి. మధూ! త్వరగా వెళ్ళి పనులన్నీ చూడు. నేను నిల్వలేనిక్కడ. త్వర త్వరగా వెళతాను. నదీతీరంలో నావ చేరేప్పటికి నేను ఎదురుగా కనిపించాలి. నన్ను చూడగానే నా జయదేవుడు-నా దేవుడు నవ్వుతూ నా వంక చూచి, నా కన్నులలోనికి ఒక్కసారలా చూచి, 'నందా! వచ్చావా? రావేమో ననుకున్నాను' అంటాడు కాబోలు. నా సంగతి అతనికి తెలుసు. జయదేవుడు. మధూ! అన్ని ఏర్పాట్లు చెయ్యవే. వెళ్ళి నా ప్రభుణ్ణి వెంటబెట్టుకొని వస్తాను' అని సాగిపోయింది. సరాలున పల్లకిలో కూర్చుంది. పల్లకీ ఊగిసలాడుతూ మెల్లగా సిప్రా దరికి చేరుకుంది. నదిలోనుండి నావ ఒడ్డుకు చేరుకుంది. నందిని ఉన్న పల్లకి రేవు దాపున ఉన్న వృక్షం క్రింద ఆగింది. ఆమె పల్లకీలో నుండి దిగి పల్లకిని పట్టుకొని నిల్వబడి ఉంది. నావ వంక చూస్తూ నావ దరికి చేరింది. అందులోనుండి ముందు ఒక పది మంది రాజభటులు దిగారు. ఆ తర్వాత జయదేవుడు రాజసంగా దిగి నలువంకలా చూచాడు. ధనువు విగ్రహం. అతని తలమీద కిరీటం! ఇంతకు ముందు పాగా ఉండేది. సమరానికి వెళ్ళేప్పుడు సిపాయీలు ధరించే శిరస్త్రాణం ఉండేది. కవచం ఉండేది. చేతులకు ఇనుపవో, కంచువో పట్టీలు ఉండేవి. అవన్నీ ఈ నాడు లేవు. తలకు రత్నకిరీటం, మెడలో వజ్రాలహారం, ముంగాళ్ళవరకూ మెరసి పోతున్న జలతారు అంగీ క్రింద సన్నని పంచ. ఎంత మారుపు ఉన్నా చూస్తున్న నందినికి అంగీలోని అతని విశాల వక్షం, చేతులకు పూర్తిగా కప్పబడి ఉన్నా అతని కండలుదేరిన దీర్ఘమై బలమైన చేతులు, మోములో ఏదో తెలియని గాంభీర్యం,

అలవాటు పడిపోయిన రాజసం కనిపిస్తున్నాయి. బాహ్యంగా కనిపిస్తున్న ఆ దర్పాన్ని ఆ గంభీరాన్ని ఆ సుకుమారమైన ఆ ఆకారాన్ని ఆలోచనలతో నిండిన ఆ నుదురునూ చూచి నందిని నిరాశపడి పోయింది. ఏమిటీ మూర్తి! నా జయదేవు దేనా? నాతోపాటు ద్రాక్షతోటలో గోధుమ చేలల్లో కాయకష్టం చేసిన జయదేవు దేనా? అని ఆశ్చర్యంలో ఉంది. దిగిన జయదేవుడు కిరీటాన్ని ప్రక్కనున్న అంగరక్షకుని చేతి కందించి వెనుక వేలాడుతున్న వల్లెవాటును కుడి చేతితో లాగి, ఎడం ముంజేతిమీద వేసుకొని ఒక్కసారి పల్లకీ ఉన్న వేపును పరికించి, నొసలు ఎగుర వేసి, 'నందినీ!' అని పెదవులమీద మాత్రమే నిలచేట్టుగా అని, ముందుకు అడుగు వేశాడు. అవతీవల అంతకు ముందునుండి కాచుకున్న అవంతి పౌర రక్షకులు, పుర ప్రముఖులు అతనిదాపుకు చేరి అభివాదం చేశారు. అందరినీ దాటుకొని నందినీదేవి నిలచిన పల్లకి దాపుకువచ్చి, 'బాగున్నావా? నీవు రావేమో ననుకున్నాను' అన్నాడు.

'మధుర నాయకులు వార్త పంపితే రాకుండా ఉంటానా?' అంది నందిని.

'నీ మాట మారలేదు.' అని 'ఆ!' అని అటుచూచాడు. అధ్యక్షులు, పౌరసభ సభ్యులూ వరుసగా నిలచారు. వారి వంకకు తిరిగి 'నాకు విడిది ఎక్కడ ఏర్పరచారు?' అన్నాడు.

అధ్యక్షునికి ఒళ్ళు మండిపోయింది. కానీ పెద్దమనిషి లక్షణం గాదని 'మన సభా భవనం ప్రక్కనున్న ఇంద్ర భవనంలో' అన్నాడు. ఎంత ఒళ్ళు మండినా అతను ఒక నాటి అవంతి సేనాపతి. ఈ నాడు మధురకు రాజు

గావచ్చు. ఇక్కడ ఎదురుగా అవంతి అధ్యక్షుడుంటే వెళ్ళి, సామాన్య సభ్యురాలు-అదీకాక, తను సభ్యత్వ మిప్పించిన ఆమెతో ముందు మాటాడి, తర్వాతనా నాతో మాటాడ్డం! అనుకున్నాడు. వెంటనే- ఆం మాట్లాడింది మన నందిని. అవంతిలో అందరికన్న గొప్పది. గౌరవనీయురాలు - తన ప్రియురాలు - అనుకున్నాడు. రాగానే వెళ్ళి పల్కరిద్దామనుకున్నాడు. కానీ సభ్యతగా ఉండదని తటపటాయించాడు నందిని రావడం చూచినప్పుడు. అంతేకాక ఈ మధ్య అవంతి సభ్యులందరితో పరిచయంగా ఉంటుందని ఆడొక అనూయగా ఉంది. అన్నీ ఆ క్షణంలో తలపులో మెదిలి, కదిలి మాయమయ్యాయి.

అధ్యక్షుంగా మాట అనీ అనక ముందే 'నా ఇంట అన్ని ఏర్పాట్లు జరిపించాను. మధుర నాయకులు నా ఇంట విడిది దిగుతారు. ఒక రకంగా అది వారింటికి వారు రావటంలా ఉంటుంది,' అంది నందిని. 'హతోస్మి' అనుకున్నాడు అధ్యక్షుడు. 'వారింట వారు దిగినట్లు' అంటే జయదేవునింట తను ఉంటూంది - అంటువల్ల ఆ పరంగా అది అతని ఇల్లు. ఇటు ఈమె వాని...ఒహో నంగినీదేవి! ని తెలివే తెలివి-అనను కొని, 'ఏమైనా మధుర నాయకులు వచ్చినప్పుడు, అవంతి రాజమర్యాదలు వారికందించాలి. కాబట్టి జనసత్రాకలోని సభ్యులు...' అని ఏదో గొణగ బోయాడు. వెంటనే అందుకుంది నందిని- 'అలా చూచినా నేను కూడా సభ్యురాలనే. ఈ నాడు నా స్వాగతాని కభ్యంతరం లేదు. మధుర ఏలికకు మర్యాద భంగం రానీకుండా చూచుకుంటానని అవంతి సభ్యులకు విన్నవించు కుంటున్నాను,' అంది. నందిని కూడా తనలో ఆలోచించింది. అధ్యక్షులకు తన బండారం జయదేవునితో చెపుతానని, అవంతి పెద్ద మనుష్యుల

పెద్దరికం బయట పడుతుందని బెదరుతున్నాడు. నిజంగా అధ్యక్షుడు అవసరం వచ్చినప్పుడు వృద్ధజంబుకమే. అతనికి సరైన మార్గంలో నేను నడచి తీరాలి.

ఇదంతా గమనిస్తున్న జయదేవుడు చిరునవ్వుతో 'నందినీ దేవిగారు చెపుతున్నది సబబుగా తోస్తుంది. ఎటు చూచినా ఆమె ఆతిథ్యం తప్పనట్లుంది. నాకూ కూడా తర తరాలుగా నా ఉన్న ఇంటి మీద మమకారం ఉండడం సహజం గనుక...' అని మిగిలింది అనకుండా ఊరుకున్నాడు.

అధ్యక్షుడు లోలోన-ఒక్క ఆతిథ్యం కాదు. అన్ని మర్యాదలూ సక్రమంగానే చెల్లిస్తుంది. నీకూ పెళ్ళి పెడాకులు కాలేదుగా! అనుకున్నాడు.

మూగిన అవంతి ప్రజలు - మనిషంటే అలా ఉండాలి. తన పట్టు నెగ్గించుకుంది. ఇలాటి మనిషి ఉండడం వల్ల అవంతికే గౌరవం-అనుకున్నారు.

మధుర నాయకులెపుడు తన అభిప్రాయాన్ని వెలిబుచ్చాడో మిగిలినవారెవరూ మాటాడలేదు. అంతలో నావలోని సామానంతా దిగింది. అంగరక్షకులు అయిన పరివారం అశ్వాలతో సిద్ధమయ్యారు. మరో భటుడు నాయకుల అశ్వాన్ని ఆయన దాపున నిలిపాడు.

అధ్యక్షులు 'తమరు విడిదిలో విశ్రాంతి తీసుకోండి. తర్వాత తమ దర్శనం చేసుకుంటాం,' అన్నాడు. అభివాదం చేసి అశ్వాన్నధిరోహించాడు మధుర నాయకులైన జయ దేవుడు. అంతా కొంతదూరం వెంబడించి ఎవరికి వారు ప్రక్కవారితో ఏదో అనుకుంటూ జంట జంటలుగా వెళ్ళి పోయారు. నందినీదేవి ఎక్కిన పల్లకి వేగంగా అశ్వసేనను వెంబడించి తన యిల్లుచేరి మధుర యేలికకు స్వాగతం చెప్పి లోనికి తీసుకొని వెళ్ళింది.

మధురయేలిక తన యింటినిచూచి తనే అచ్చెరువులో మునిగిపోయాడు. ఆనాటి తన యింటికీ, ఈ నాటి తన యింటికీ ఎంత భేదం ఉంది! ఎంత పరిశుభ్రంగా, ఎంత అందంగా చేసుకుంది, తన యింటిని! ఆనాడు ఆ యింటిలో తన తండ్రి తదనంతరం ఇద్దరు దాసీలు, తనూ, తన తల్లీ ఉండేవాళ్ళు. ఏదో శుభ్రంగా ఉండేదే గాని, ఇంత అందంగా ఉండేది కాదు. పై అంతస్తులో తనొక్కడే ఉండేవాడు. ఈ గచ్చు మార్పించింది. తాతలనాడు కట్టిన నాట్యశాల మందిరం తలుపులు ఎప్పుడూ మూసే ఉండేవి. తన ఊహ తెలిశాక వాటిని తెరపించలేదు. ఆ ద్వారాలన్నీ తెరచి ఉన్నాయి. అన్నింటికీ పట్టు, ఉన్ని పరజాలు కట్టించింది. రాముడు లోకమూకతో అంతలావు రావణాసురుని చంపినట్టు వినడమేగాని ఈనాడు నందిని ఉన్నదానిలో ఎంత అందాన్ని, ఎంత మహత్తరమైన మందిరంగా మార్చు కుంది! అతడలా ఆలోచిస్తుండగా దాసీది వెండి పళ్ళెరం మధురయేలిక పాదాలవద్ద ఉంచింది. మరో దాసీది పన్నీరు తెచ్చింది. నందినీదేవి మధురయేలికవంక తిరిగి, 'ఆ పళ్ళెరంలో మీ పాదాలుంచండి,' అంది.

ఏమిటన్నట్టుగా చూచాడు.

'మీ పాదాలు పళ్ళెరంలో ఉంచండి.' అని తిరిగి మరొక మారన్నది. మధుర యేలిక పాదాలు పళ్ళెరంలో ఉంచాడు చిరునవ్వు నవ్వుతూ. నందినికింకా నా మీద మక్కువ పోలేదు. నా కోసమే ఆమె బ్రతికిఉంది. ఇంత కాలం నా కార్యకలాపాలలోబడి ఆమెకెంత అన్యాయం చేశాను? అనుకున్నాడు.

పరిచారిక పన్నీరు పోస్తుండగా మధురనాయకుడు, తన హృదయ నాయకుడూ అయిన జయదేవుని పాదాలు కడిగి,

మెత్తని దుకూలంతో కాళ్ళనొత్తి వయ్యారంగా నిలచి, అంతస్థుమీదికి దారి చూపింది తన వాలుకన్నులతో. మిగిలిన పరివారానికంతా పరిచారికలు మర్యాదలు చేస్తూ ప్రక్కనున్న విశాలమైన ఆవరణలో వారి కాసనాలు చూపారు. ముందు నందిని, వెనుక మధురయేలిక ఇద్దరూ సోపానాలధిరోహించి మందిరం పైనున్న గదులలోనికి వెళ్ళారు. అందులో దక్షిణదిక్కుగా ఉన్న ఒక విశాలమైన గది తెర తొలగించుకొని నందిని నడచింది. అతడుకూడా ఆమెను వెంబడించాడు. తన యింటికి పాలరాతి పని తన తాతలు చేశారని, తన యింటి గోడలన్నీ తెల్లరాతిమయమని ఆనాడు మాత్రమే తెలుసుకున్నాడు. తన యిల్లు యింత ఉన్నతంగా, ఇంత అందంగా కట్టించారా తన పూర్వులు! అనుకున్నాడడుగడుగునా.

ఆ విశాలమైన గదిలో ఒక కిటికీకి కొంచందాపులో ఒక పనసకొయ్యతో చేసినపాన్పు కాశ్మీరపు ఉన్నిలతో కప్పబడి ఉంది. దానికెదురుగా గోడకు నిలువుటద్దం ఉంది. ఆ మంచానికి ప్రక్క అదే యెత్తుకు సరిగా ఒక బిల్ల. ఆ బిల్లలో బాగా ఒదలకండా ఏదో లతనో కాయనో బొమ్మనో మలచాడా వడ్రంగి తన పనితనాన్ని చూపాలని. దానిమీద ఒక సువర్ణపాత్ర - జాడీ ఆకారంగా ఉంది. దానిమీద మూడు వంకల నవరత్నాలతో మానవాకారాలు చెక్కి పొదిగారు.

దాని ప్రక్కనొక చిన్న పాత్ర ఉంది. గోడలకు ఆనించి నిలువెత్తు మందసాలున్నాయి. జయదేవునికి పాన్పు చూపింది. తన గదిని తనొకపరి పరిశీలనగా చూచుకొని, నిలువుటద్దంలో తన మోము చూచుకున్నాడు. ద్రాక్షాసవం చిన్న పాత్రలోనికి ఒలకబోస్తూ, 'ఇన్నాళ్ళకైనా నేను

తలపులో మెదలినందుకూ, నా ఆహ్వానాన్ని మన్నించినందుకూ చాలా సంతోషిస్తున్నాను,' అంది నందిని.

ఆలోచనలో ఉన్న మధుర యేలిక 'నందా!' అన్నాడు.

'నిజం ప్రభూ! నిజం. ఈ దాసీది తమకొరకెంత నిరీక్షించిందో, ఎంతకాలం వేచి ఉందో, ఆమె హృదయం ఎంత గాయమైందో, ఎంత తపతో తృప్తిలేని ఈ జీవనాన్నీడుస్తుందో మీకేం తెలుసు? తిరిగి మిమ్మల్ని కలుసుకోకూడదనుకున్నాను. ఈ కళేబరాన్నావహించిన జీవ వాయువు లెగసిపోయాక, మీకు గాయపడ్డ యెడదలేని శీతలాన్ని మాత్రమే అందీయ దలచాను. మీరు మధురకు ఏలికైనట్లు నాకు చాలాకాలం క్రితమే తెలుసు. కానీ, ఎందుకు? ఒక్క క్షణమైనా ఒక్కసారైనా పోనీ ఒక మెరుపుపాటైనా మీ యెడదలో ఈ నందిని నిలచిందా? తలచుకున్నారా? లేదుకదూ! నందిని చచ్చిపోయిందనుకొనుంటారు.'

అలాగే ఆ పాన్పుమీద కూర్చుని నందినికంకకు చూస్తున్నాడు. ఒక్క మాట, ఒక్క పలుకు, ఒక్కసారి పెదవి కూడా కదల్చలేదు. ఆ కళ్ళలాగే ఉన్నాయి. ఆ రెప్పలు మూతపడడం జరిగివుంటే మధురనాయకుని చెక్కిళ్ళు నీటి బొట్లతో తడిసిపోవడమో, తామరాకుమీద మంచు బిందువులు నిలవక పోరాడినట్లో, జరిగి ఉండేది. కాని ఆయన రెప్ప వేయలేదు. గాజుపోత కంటిమీద పోసినట్టుగా అరా చేర్పడింది ఆ కన్నుల మీద.

'ప్రభూ! పలుకరేం? నేనేం తప్పు చేశాను? నేనెందుకు మధురకు రాలేదనా మీ అభిప్రాయం? రాలేకపోయాను. ఏమని వచ్చేది? ఎలా వచ్చేది? మన యిద్దరి ఎడదలనీ లోకం అర్థం చేసుకుంటుందా? చేసుకోదు.

దానికి తెలియదు. మీ గౌరవానికి భంగమని ఊరుకున్నాను. అంతేకాదు. నేను రాకపోవడానికి నేను కదలలేకపోవ డానికీ యువంతి నా సర్వస్వం దోచుకుంది. నన్ను నాశనం చేసింది. ప్రియా! నీకోరకేది దాచి ఉంచానో దాన్ని ఈ అవంతి బందిపోటు దొంగలు దోచుకున్నారు. కొల్లగొట్ట బడిన నేను గొల్లున ఏడుస్తూ చేతగానిదానిలా ఉండి పోయాను. కాని బ్రతికి ఉన్నాను. చచ్చిపోయినట్లయితే ఎంతేనా బావుండేది. ప్రభూ! చావడానికి సాహసంలేక యిలా జీవచ్ఛవంగా ఉన్నాను. నాకు జరిగిన ఈ అన్యా యానికి నిష్కృతిలేదు. కళ్ళలమైన ఈ కాయాన్ని కల్మష రహితమని మీకెలా అప్పగించేది!' అంటూ అతని కాళ్ళ మీద వాలిపోయింది. ఆ దుఃఖాని కావల తీరం లేదు. ఎన్నాళనుండో తన గుండెల్లో మరుగుతున్న నిరాశా స్రవంతి గట్లు పగిలి కొట్టుకొని వెలికి వచ్చింది. ఆ కళ్ళ నీళ్ళతో అతని పాదాభిషేకం చేసింది. ఆ వెచ్చని కన్నీటి వేడికి, అందులో ఉన్న భారానికి అతని కాళ్ళు కాలి పోతున్నట్లనిపించింది. మధుర యేలిక ఆమెను లేవనెత్తా డవలీలగా - పసిపిల్లను ఒడిసిపట్టుకున్నట్టుగా ఆమెను లేవ నెత్తి నిలువబెట్టి—

'నందా! నాదే లోపం. సేనాపతిని మధురకు రాజు నయ్యాను. మధుర నాయకత్వంలోబడి నన్ను నేను మరచి పోయాను. నేనే నాకు గుర్తులేనప్పుడు నాలో ఉన్న నీవు కూడా మరుగుపడిపోయావు. నేను దుర్మార్గుణ్ణి. ఇంత నిర్మల హృదయాన్ని అవగాహన చేసుకోలేక ఆ రాచ కార్యాల్లోబడి మధుర బాగు ఓగులలో నీ మాట మరచాను. క్షమించు దేవీ క్షమించు!' అన్నాడు. అతని భుజాల కండలను తన సుకుమారమైన లేత చేతులతో మెలగా

నిమురుతూ, కన్నీరు కారుస్తూ 'ఈనాడు విచారించి ప్రయోజనం లేదు. జరిగిపోయింది జరిగిపోయినట్లే!'

ఆమె అలా అంటుండగా ఆమెనాతను గుండెల దగ్గరకు లాక్కున్నాడు.

'ప్రభూ! నన్ను వదలండి. ఈ ద్రాక్షాసవం తీసుకోండి.' అంది.

అతడామె పెదవుల నందుకో బోయాడు తన పెదవులతో. ఆమె వాటి నందించకుండా మెల్లగా క్రిందికి జారిపోయి కౌగలి సడలించుకొని పాన్పు కావలినున్న బల్ల దాపులో నిల్చబడింది. అంత శోకం ఏమయిందో పెదవుల మీద చిరునవ్వంకురించింది. జయదేవుని కళ్ళలోనికి చూస్తూ తల అడ్డంగా కదలించింది.

మధుర నాథుడు నలుదంకలా పరికించాడు. కిటికీలకు ద్వారాలకు కట్టిన పరదాలు గాలికి రెపరెప లాడాయి.

'ఎవరూ లేరుగా?' అని శయ్యమీద నుండి లేచాడు.

ఆమె కాదన్నట్టుగా తిరిగి తలనాడించింది.

ఏమన్నట్టు మధుర నాథుడు ఆమె దాపుకు వెళ్ళి రెండు బుజాలూ పట్టుకొని అలాగే ఎత్తి గుండెల కదుము కున్నాడు. ఆమె పాదాల క్రింద నేల లేనట్లే ఆమె ఎడద ఆకసానికి లేచింది. పాదాలందక గిలగిల కొట్టుకున్నట్లే ఆమె హృదయం కొట్టుకుంది. మెల్లగా ఆమె అతని విశాలమైన రెండు బుజాలమీద చేతులు వేసి 'జయా! జయా! నన్ను వదలు' అంది

మధురనాథుడు తల వడ్డంగా తిప్పాడు. 'కాదు జయా! ఉండు, నీకు చెప్తానుండు,' అంది. అతడు గోముగా తల నాడించాడు వదలనని. 'జయా! నేను కులటను,' అంది.

'ఔ'తే నాకేమిటి? నీవు నా కావాలి' అన్నాడు.

అలాగే రెండు బుజాలనూ తన చేతులతో పెనవేసెట్టింది. ఎత్తుకున్న ఆమెను వదలాడు. ఆమెవ కాళ్ళు నేల మీద ఆనాయి. అలాగే అతని పాదాల మీద కూలబడి—

'జయా! నేను సర్వ నాశనమై పోయాను. నా హృదయమ్మాత్రమే నీ కోరకు ఎదురు చూస్తూ విలపిస్తుంది. ఈ శరీరాన్ని ఏ నాడూ కోరకు,' అంది.

'నందా!' అన్నాడు.

'ఔను ప్రియా! ఈ శరీరాన్ని ఈ అవంతి పౌరులు నాశనం చేశారు. మలినం చేశారు. దీని కోసం నీ వెప్పుడూ ఆశించకు. హృదయాన్ని మాత్రమే నీకు ఈయడం జరిగింది. దానిని వాళ్ళెవరూ దాయలేరు. ఈ జన్మకింక ఇంతే! మరో జన్మలో మనం.'

'నందా! నీవు నాకు కావాలి. నీ అందాన్ని—'

'ఆగు జయదేవ్! ఈ అందమైన కాయం కొరకు ప్రాకులాడకు. ఇది అశాశ్వతమైంది. శాశ్వత మైనది నీకీయదలచాను. కానీ వీరంతా కలసి సర్వనాశనం చేశారు. ఈ శరీరాన్ని వారిష్టమొచ్చినట్టు నలిపి పంకిల పరచారు. అది నీకు ఈయను. ఈయలేను. దానికి పాల్పడకు. జయదేవ్! దానిని కోరకు. నీ కీయాలనుకొని నీ కొరకు దాచిన దానిని దోచుకున్నారని చెప్పానుగదా! ఈ పంకంలో నీవు పడకు. పవిత్రంగా మాత్రమే నేను కోరుకుంటున్నది. నిన్నపవిత్రం చేయలేను. ఈ పాపంలో పాలు పంచుకోకు జయదేవ్! ఇది పాపకాయం. సున్నంలా అందంగా ఉంది. అంతే! ఇది వెన్నపూసకాదు. భ్రమ చెందకు. దూరంగా ఉండు.'

ఆమె మాటాడుతుండగానే అతడు వెళ్ళి పాన్పు మీద పడుకున్నాడు. గట్టిగా కళ్ళు మూసుకున్నాడు. ఆమె చెపుతున్న ప్రతి మాటా అలానే వింటూ ఏదో ఎక్కడో ఆలోచిస్తున్నాడు.

అతడికేమీ తోచింది కాదు. ఆమె ప్రతి మాటలోనూ బాధ ద్యోతకమవుతోంది. ప్రతి అక్షరం బరువుగా ఉంది. అతడామెనేమీ అనలేదు. కాదని ఔనని వాదించలేదు. అతని కావాదేనాడో హృదయంలో నిలచి పోయిన నందిని కనిపిస్తూంది. ఆనాడు నందిని చాలా పేదతనంతో చాలా గొప్పదైన హృదయంతో అతనితో మాటాడేది. ఈనాడు ఆ నందినే చాలా గొప్పదనమైన అంతస్తులో ఉంటూ చాలా పేదతనమైన హృదయంతో బాధపడుతూ మాటాడుతూంది. అసలేం జరిగింది? అవంతి పౌరులామెకేం అపకారం చేశారు? అంత అపకారం జరిపినా ఎందులకింకా అవంతిలోనే ఉంది? మధురను గాని, తన స్వంత ఊరు పుట్టి పెరిగిన సూరసేనం పారిపోలేదేం? వివరాలు సేకరించాలి! ఆమెనే అడుగుదాం-అనుకున్నాడు.

'నందా! జరిగినదాన్ని తలచి ఎందుకు బాధపడతావ్! జరిగింది చెప్పు' అన్నాడు అతడలాగే చలన రహితంగా పాన్పుమీద పండుకొనే.

'చెప్పడానికేముంది ప్రభూ! పూజకోసం పూవు సిద్ధం చేశాను. ఆ పూవును రాక్షసులు నలిపి వేశారు. ఆ తర్వాత నాస్వామి నా యెదుట పడడం జరిగింది. పూవులేదు. హృదయం మాత్రం ఉంది. ఆ హృదయాన్నందుకొని పూవు కోసం ప్రాకులాడకుండా ఉండాలని కోరుతున్నాను' అంది నందిని. ఆమె కన్నీరు సిప్రానదిలా ప్రవహిస్తూంది. ఆమె బాధ కంతులేదు. ఆమె హృదయానికి శాంతి లేదు.

'ఆ నలిపిన దెవరు?' అన్నాడు చరాలున పాన్పుమీద కూర్చుని సూటిగా ఆమెవంక చూస్తూ. లేవడం, ఆ చూడడం లోని రాజసం నిజంగా న్యాయాధిపతి - దండించడాని కర్హుడైనవాడు, నీతి వేత్త న్యాయం కొరకు ప్రతి అణువూ ఈయగల సమర్థునిలా ఆ స్వరంలోనూ ఆ గంభీరం, ఆ రాజసం నిలద్రొక్కుకున్నట్టుగా ఉంది. దానిని నందిని చూచి నిజంగా వారి పేరులు చెప్పిన మరుక్షణం ఈ అవంతిని నేలమట్టంచేసి వెళతాడు తన ప్రభువని భయపడి-

'పారిన నీటికి అడ్డుకట్ట ప్రయత్నించకండి. నీరుపారి పోయింది. ఈనాడు నిందించి, బంధించి, నిగ్రహించి ప్రయోజనంలేదు. దాని విషయం నా అంత నేనుగా చూచు కుంటాను' అంది.

'కాదు. న్యాయం కావలిసింది. ఈ అవంతి ఒకప్పుడు నాది. ఈ అవంతిలో ఒక్క ఆడదానికి రక్షణ జరగలేదని తెలిసికూడా గతంలో సేనానిగా ఉన్న నాకు ఎంత అవమానం! అందులో మధురకు నాయకునిగా ఉన్నప్పుడు తెలిసీ తెలియనట్టూరుకోడం న్యాయం కాదు. ఎవరు వారు? అసలేం జరిగింది! అవంతి ఒక యింతి శీలాన్ని కాపాడలేక పోయిందనడం ఎంత చింతించాలసిన విషయం?' అన్నాడు. అతని కన్నుల్లో నిప్పులు రాలుతున్నాయి. ఒకటి న్యాయం కొరకు - రెండవది తన ప్రియురాలు - మూడవది అంతవరకూ వచ్చిన అవంతి ప్రతిష్ఠ. ప్రస్తుతం అతను మధుర నాయకుడు కావచ్చు కానీ, అవంతే అతనిది. అవంతి లేకపోతే అతను లేడు. అవంతి గౌరవమే అతని గౌరవం. అతడు వచ్చిన నిర్ణయంయొక్క తుది యిది.

నందిని అతన్ని చూచి భయపడింది. బాధపడింది. పలుకాడ

లేదు. ఆమె నోటమాట రాలేదు. అలాగే స్థంభించి పోయింది.

ఆ మౌనాన్ని సహించలేక పోయాడు. 'నందా! నీవు చెప్పకపోయినా నేను తెల్సుకోగలను. నాకు తెలుస్తుంది. ఎక్కడో సూరసేనంనుండి వచ్చిన నీకు ఆసరా యిచ్చి అండగా కాపాడవలసిన నిన్ను అవంతి సర్వనాశనం చేసిందంటే అది అవంతిలాటి జనస్వామ్య రాజ్యాల కెంతైనా కళంకం. దానినే అవంతి పౌరుడూ సహించలేడు. నీవింత కాలం ఈ విషయాన్నెందుకు దాచావు? అధ్యక్షునికి తెలియపరచలేక పోయావా?' అనడిగాడు.

అంత బాధలోనూ ఆమెకు నవ్వు వచ్చింది. అప్పటి వరకూ తలవాల్చి వింటున్న ఆమె ఒక్కపుదటున తలనెత్తి పెదవి విరుస్తూ అతని వంకకు మాచింది.

ఆ మాపులోని భావం అర్థంకాక, 'వారితో ఈ విషయం చెప్పావా?' అన్నాడు.

'లేదు' అని తల అడ్డంగా త్రిప్పింది.

'ఎందుకు చెప్పలేదు?' అనడిగాడు.

తల నిలువుగా ఊపింది - ఆలోచించి చెపుతానను కున్నాను-అన్నట్టు.

'ఏదో దాస్తున్నావు నందా! ఎంత దాచినా ప్రయోజనం లేదు. ఈ రోజే ఆ విషయాన్ని గూర్చి, నేను ఈ రోజే అవంతి పౌరసభలో ప్రసంగం తెస్తాను. ఏమని సమాధానం యిస్తారో అక్కడే తేల్తుంది. ఈ విషయాన్ని ఊరక త్రోసి రాజనను.' అన్నాడు.

ఆమె పెదవి విరచి, 'జయా! నీవీ విషయంలో పట్టించు కొని ప్రజ్ఞను కోలుపోకు. ఇది నా స్వంత విషయం. దీనిక

కావలసిన పద్ధతిలో నేను పరిష్కారం చేసుకుంటాను. నీవు గౌరవంగా వస్తానన్నావు. గౌరవంగా ఆహ్వానించారు. స్వాగతమిచ్చారు. లేని విషయాన్ని కల్పించుకోకు. అవంతి నీవు ఉన్నప్పటిలా లేదు. చాలా మార్పులు వచ్చాయి.' అంది నందిని.

'అవంతి నాది. అవంతిలో ప్రతి అణువులో భాగం ఉంది,' అన్నాడు.

'నాకు జరిగిన దానిలో కూడానా?' అనడిగింది.

'ఆ!' అన్నాడు.

'లేదు. కాదని సభలో ఋజువు చేస్తా నవసరమైతే.'

'నందా!'

'ఔను జయా! నీకు తెలియదు. అవంతి రాజకీయాలు నీవున్నప్పుడే విషమించాయి. అవన్నీ ఈనాడు తవ్వుకొని ప్రయోజనం లేదు. ఒక్కమాట. అవంతి చరిత్రలోగాని జన సత్తాక రాజ్యాల చరిత్రలోగాని, ఆడది సభ్యురాలయిందా? అందులోనూ వేశ్య! వేశ్యల్లోనూ దేవదాసీలాటిది కాదు. కులట. కులట అని ప్రతిపౌరునికీ, అధికారంలో ఉన్న ప్రతి సభ్యుత తెలిసిన సభ్యునికీ తెలిసినది. ఎందుకయ్యిందో, ఎలా అయ్యిందో తెలుసా!' అంది నందిని గంభీరంగా నిలచి.

'అది నీవేగా!' అన్నాడు.

'అది వేరేవిషయం. ఎవరైతే యేం! ఈనాడు నా ధనాన్ని చూచి, నా ధనానికి అవంతి అమ్ముడుపోయింది. ధనంతో జనసత్తాక రా   ్యలను కొనవచ్చని చరిత్రలో ఇంతవరకూ ఎవ్వరికీ తెలియదు. కొనలేదు. అది అవంతిలో ఆరంభ మయ్యిందంటే అవంతి ఎంత తక్కువస్థాయికి దిగజారి పోయిందో తెలుసుకో, అలాటి అవంతికి ఈనాడు నీవు

వారసత్వం, పౌరసత్వం కావాలని వస్తున్నావు-స్వీకరిస్తావా? ఒకవేళ నీవు స్వీకరించ సాహసించినా అవంతి వాసులు అంగీకరించరు. ఒకవేళ అంగీకరించడం జరిగిందా! అది నీ మీద పూర్వం ఉన్న ప్రేమావాత్సల్యాలతో మాత్రం కాదు. నీవు మధురనాయకుడవన్న భయంతో! లేదా నీకపారమైన సేన ఉన్నదన్న భీరువుతో! అదీకాదా, నీవు కూడా గొప్పవాడవని రాజువన్న చేతగాని తనంతోనే గాని, మంచిమీద, నీతిమీద నిజమైన వాక్కు నీకు కూడా ఉన్నదన్న నిజాయితీ వలన కాదని మాత్రం గుర్తుంచుకో జయా!' అన్నది.

కూర్చున్న జయదేవుడలాగే స్థంభించి పోయినట్లుగా తలచాడు. ఏమిటీ నందిని! ఇంత న్యాయంగా, ఇంత రాజకీయంగా, ఇంత అనర్ఘళంగా ఎలా మాటాడుతుంది? ద్రాక్ష తోటలో పని చేస్తూనా మామిడి తోటలో కూర్చున్న నందినియేనా? కాదా? అనుకున్నాడు. ప్రకృతి తన అవసరానికి తగిన రూపం బలం శక్తి యుక్తి వాక్కు అన్నింటికీ ప్రసాదించిందని అతనికేం తెలుసు. మాటలన్నీ నిశ్చలంగా విని నిబ్బరంగా—

'ఇంతకూ నీవు చెప్పదలచింది?' అనడిగాడు.

'ఏమీ లేదు. అంతా శూన్యం. అంతా మిథ్య. అవసరాలు తీర్చుకోడం కొరకు లోకం లోనికి వచ్చాం .మనం వచ్చాం అనేదానికన్న ప్రకృతికి మనతో ఏదో అవసరం ఉండి తెచ్చుకుంది. ఆ అవసరం తీరిన మరుక్షణం మనని తనలో కలుపుకుంటుంది. మిగిలిన జీవరాసులకన్న మనం కున్న ధన్యత్వం-కొంచం ఆలోచనా శక్తి. వాటికున్నదో లేదో మనకు తెలియదు. వాటిలా కాకుండా మనుష్యులం మనుష్యుల్లా బ్రతకడం, అంటీ అంటనట్టు సంచరించడం-నీవీనాడు చేయవలసింది అదే!' అన్నదామె. ఆమెకు

తెలుసు. తను తనకు వ్యతిరేకమైన సిద్ధాంతాన్ని అతనికి చెప్తూంది. దానినామె ఆచరించడం లేదు. ఐనా ఎదటి మనిషిని ఒప్పించాలి కాబట్టి చెప్పింది.

'ఏఁవిఁటీ వేదాంతాన్ని అందిస్తున్నావు?' అన్నాడు.

'వేదమూ కాదు, దాని అంత మంతకన్నా కాదు. ఇదంతా అవంతి రాజకీయం జయా! పండి పురుగులు పడి పోయింది. ఇంక ఎంతో కాలం ఈ జనసత్తాక నిల్వదు. బలం గలిగిన నీలాటి వారెవరో దీనిని ఆక్రమించి ఏక సత్తాకంలో కొంత కాలం ఉంచాలి. ఆ తర్వాత తిరిగి జన సత్తాకగా రూపొందడం జరిగితే బాగు పడుతుంది. వారికి జనసత్తాక విలువ తెలియడం లేదు. ప్రజా రాజ్య విలువ తెలియని వారికి ప్రజా పాలన దేనికి? నియంతృత్వంలో బాధపడి తల బొప్పి కట్టాక తిరిగి అందించడం ధర్మం. అది ఎలాగూ జరుగుతుంది. నీవూ నేనూ కాదన్నా అడ్డు తగి లినా అయ్యే కార్యం కాక మానదు. అవంతిని రక్షించ గలిగిన జేతలు లేరు. సమయం కొరకు కాచుకొనున్న చుట్టు పట్ల ఏకసత్తాకలు కబళిస్తాయి. అంతేకా......'

'నందా!'అని అరచాడు తన జనసత్తాకను విమర్శి స్తూందని, అవంతిని తూలనాడుతుందని జయదేవుడు. కూర్చున్నవాడు అలాగే చూపు నిగిడ్చి, అపుకోలేని ఆవే శంలో చేయి యెత్తి దాన్ని బలంగా తన తొడమీద చరచుకున్నాడు. ఆ దెబ్బకు అతని కాలి నరాలు, కండ రాలూ ఒక్కసారి ఉలికి ఆగిపోయాయి. అతడు మరో మాట ఆడలేక పోయాడా వేశంలో.

'జయా! నా మీద ఆవేశపడేం ప్రయోజనం! అవంతిలో జరిగే విషయాలు తెలియజేస్తున్నాను. ఇందులో నాకు

ప్రమేయం లేదు. నీ లాటి వీరాధి వీరుడుండగనే నీ కన్న ముందున్న మధుర నాయకుడు కాలు కదిపాడుకదా! ఆ నాడు నీవు మాత్రమే స్వసైన్యంగా అవంతి కోసం పోరు కాడావు. ఈనాటి సైన్యాధ్యక్షుడు ఆనాడు గాజులు తొడుక్కొని ఇంట కూర్చుని సంధ్యకంతా మామిడి తోటలో వయస్సు పిల్లల కొరకు కాపు కాచి కామం తీర్చుకున్నాడు. రణానికి నీతో పాటు రాలేదేం? యుద్ధంలో ఒక్క నీకు తప్ప గౌరవ సభా సభ్యులకు ప్రమేయం లేదా? పట్టించుకోలేదేం?' అంది నందిని. ఆమె కూడా ఆవేశంతో నిండిన చూపులు నిగిడించింది. గొంతులోనుండి వస్తున్న ప్రతి మాటలోనూ ఈ విషయం ద్యోతక మవుతూంది.

'నందా! నేనాలోచించుకోవాలి!' అన్నాడు.

'విశ్రాంతి తీసుకో ప్రభూ! నీకు విశ్రాంతికొరకేకదా నా మందిరం - 'నా' కాదు 'నీ' మందిరం చేర్చాను. నీ యిష్టంవచ్చినంత సేపు సేదతీర్చుకో! ఆలోచించుకో. ఒక మాట! ఇక్కడ జరిగిన ఈ ప్రసంగాన్ని దేనినీ వెలికి రానీయకు. ఒక ఆడది, అంగులో కులట, జారిణి-అవంతిని విమర్శించేదిగా ఉండకూడదు. అలా చేసిందని లోకులకు తెలియకూడదు. నేనయినా నీవు కాబట్టి, అవంతికి కావలసిన వాడవు కాబట్టి యిన్నీ చెప్పాను. మరొకరితో నేనీ విష యాలు మాటాడను. మరొకరు నా యింటికెందుకొస్తారులే! విశ్రాంతి తీసుకో!' అని ఆమె నడక సాగించింది.

ఆ విశాలమైన గదిలో ఆమె వెళ్ళుతుండగా జయ దేవుడు ఆమెవైపు కన్నార్పకుండా అలాగే చూస్తూ కూర్చున్నాడు. ఎంత అందం! ఏమిటీ అవయవ పొందిక! నీడపట్టునే ఉండడంవల్ల కాబోలు ఆమె రాగిరంగు పసిడి

రంగులా ఉంది. ఆ చెక్కిళ్ళు గులాబి రెక్కల్లా ఉన్నాయి. ఆ నడుమెంత సన్నంగా ఉంది! ఏమిటా నడకలోని రాజసం! 'నందినీ! ఇంత అందంగా ఉన్నా నీ అవయవాలు, నీ అందం నాకు కాకుండా అంతు పెడుతున్నావు. నీలో ఏదో ఆకర్షణ బలీయంగా ఆకర్షించి లాగుతూంది. నీ కళ్ళలో ఏదో కాంతి వారిస్తూంది. ఇంత అందంగా ఉన్నావు కాబట్టే నిన్ను అవంతి ప్రజలు ఆత్మలు మరచి, అనుజ్ఞల నుల్లంఘించి, చేయలేని చేయరాని కార్యం చేశారు. నిజానికి వారి తప్పులేదు. వారినని ప్రయోజనం ఏమిటి? నీవుకూడా ఆ నిజాన్ని తెలుసుకొనే వారినేమీ చేయలేక, చేయకూడదనికూడా అంటున్నావు. నీ అందాన్ని అంతా అనుభవించాలసిందే. ఒకనికిచెంది ఒకరి అధీనంలో నిజానికి ఉండకూడదు. ఉన్న దగ్గరనుండి తగాయిదాలు పెరిగి ఒకరినొకరు లెక్క చేయకుండా నరుక్కుంటారు. నీకోసం ఈ అవంతి బద్దలవుతుంది. నేనుకూడా నిన్ననుభవించాలి. ఇంక నన్నాపలేవు. నేను నీ అంతు దాటి నిన్ను బలవంతం పరచేంతమూరం దిగజారనీయకు నందా! నీవు నాకు అవసరం. లేదా నాతోపాటు రా. మధురలో ఎదురులేని జీవనం గడుపుదువుగాని - అనుకున్నాడు. అతడలాగే అనుకుంటూ ఆ పాన్పుమీద పవళించాడు. కొంతసేపటికి నిద్ర పట్టింది.

ఆ నిద్రలో—

మధురలో తన ఉద్యానవనం. పిండారబోసినట్లున్న వెన్నెల. యమున దూరంగా కనిపిస్తూంది. అక్కడ చాలా గాథలు జరిగాయింతకుముందు. జయదేవుడు నిలచి ఉన్నాడు. పొగడచెట్టు పూల వాసనను దూరదూరాల కందిస్తూంది.

లతలు విచ్చివున్నాయి. తన మహాలు వెన్నెలకు మెరు స్తూంది. వనం మధ్యలో ఒక కొలను ఉంది. ఆ కొలను లోనికి చూస్తూ నందిని, ప్రక్కనున్న పత్రాలను కాయలనూ కొలనులోనికి విసురుతూంది. కొలనీదరినుండి ఆ దరి వరకూ వలయాలు తిరుగుతూంది. ఆ వలయంలో పూర్ణ చంద్రుడు ఊగిసలాడి పోతున్నాడు. ఏకారో వేసినకొన్ని క్షణాలవరకూ దరిదాపు దొరక్క చందమామ అల్లాడి పోయాడు. జయదేవుడు వచ్చి ఆమె వెనుక నిలచాడు. ఆమె అది గమనించలేదు. మెల్లగా మృదువుగా బుజాలమీద చేతులు వేశాడు. నందిని 'ప్రియా!' అంది. ఆ రెండు బుజాలూ పట్టుకొని ఆటబొమ్మను త్రిప్పినట్టుగా త్రిప్పాడు. ఆమె బొంగరంలా తిరిగి ఎదురుగా నిలచింది. రెండు చేతులూ సాచి అందని అతని బుజాలందుకొని వంచుతూంది. ఆ మహా వీరుడు వంగలేదు.

'నిన్ను వంచాలి ప్రియా!' అంది.

'నీవల్లగాని పనికి నీవెందుకు దిగుతావు. నిన్ను నేను...' అంటూ పిరుదులపై చేతులువేసి పైకెత్తాడు. ఆమె అతని విశాలమైన వక్షంలో తన హృదయాన్ని దాచుకుంది. అతని లోనికి పూర్తిగా ఇమిడి పోయింది. తను చాలనందుకు ఎంతగానో విచారించింది. మిగిలిన శరీర భాగం చాలా ఉంది. అలాగే ఎత్తుకుని లతామండపం చేర్చాడామెను. చంద్రుడు ఆకుల మాటునుండి చూస్తున్నాడు. అతని చూపులు వారిమీద పడుతున్నాయి. రెండు చేతులతో అతని మెడ కౌగలించుకొని 'మనం ఇలాగే ఉండి పోతామా' అంది ఆమె.

'అలాగే ఉందాం-దానికేం' అన్నాడు అతను. చంద్రుని చూపులు ఆమె ముఖంమీద పడుతున్నాయి. ఆ పడ్డ స్థళా

లన్నింటినీ అతడు ముద్దులతో తుడిచాడు. తుడిచాక కూడా ఆ ఛాయలలాగే ఉన్నాయి. ఆ తర్వాత ఆ యిద్దరూ ఆ తోటలో ఎంతోసేపు అలాగే ఉన్నారు.

హటాత్తుగా తోకత్రొక్కిన తాచులా నందిని చివాలున లేచి 'మీ మగ పురుగులంతా నాశనం కావాలిసిందే. చేస్తాను. చేయక తప్పదు. నన్ను నాశనం చేశారు. బలవంతంగా ఆటవస్తువుగా చేసి మీ కామం తీర్చుకుంటున్నారు. ఇంక మీదట నా కార్యం పూర్తి చేసుకుంటాను' అంది.

'నందినీ! నందా! నందా!' అన్నాడు జయదేవుడు.

'పిలచారా?' అంటూ పరిచారిక ద్వారంవద్ద నిలచి అడిగింది.

జయదేవుడు మేల్కొన్నాడు. తను ఈ క్షణం కల గన్నానని తెలుసుకొని 'ఏం చేస్తుంది?' అన్నాడు తప్పలేక.

'క్రింద వంటశాల్లో ఉన్నారు. పిల్వమంటారా?' అంది పరిచారిక.

'ఆఁ హాఁ, అక్కర్లేదు' అని తిరిగి పడుకున్నాడు. పడుకున్నా ఏమిటీ పగటికల! నందిని నాశనం కావలసిందే. అందుకు అవంతి అడుపలికిందా, ఆక్రమిస్తాను-అనుకున్నాడు. అతనే మళ్ళీ, అవంతి నా స్వంత దేశం. అవంతిని ఆక్రమించి జనసత్తాకను నాశనం చేయడం మంచి పనికాదు. చేయకూడదు. తల్లి దేశాన్ని రక్షించాలి. నందిని ఒక ప్రక్క, అవంతి ఒక ప్రక్క నిలచారు. అవంతికి తల్లిదేశానికి పోటీ ఏమిటి? ఛా! నాదే పొరపాటు. నందిని వస్తానంటే ఆపగలవాగెవరు? అసలు నందినికా ఉద్దేశం కలిగించాలి. ఎలాగేనా నందినిని మధురకు చేర్చాలి. అంతే! అని నిశ్చయానికి వచ్చాడు.

'జయా! నీవు నన్ను కామంతో ఈశరీరం కొరకు చూడకు. నిన్ను నా హృదయాధి దేవతగా మాచుకుంటున్నాను. నా ప్రాణం నీకు యిస్తాను. కానీ, జయా! ఈ శరీరం పంకిల మైంది. మైలపడిపోయింది. దీన్ని నీకు సమర్పించలేను. నే నందుకురాలేదు. నీవు నన్ను ఆ కోరికతో, ఈ కాయమ్మీది మమతతో చూడకు. నన్ను వదలు. నీ ప్రక్కన కూర్చుంటాను. యిద్దరం ఏ తెలియని లోకాలలోనో ఉన్నట్లు మాటాడు కుందాం. క్షణోద్రేకంతో ఆ సుఖంకొరకు నన్ను నాడు కోకు,' అంటూ అతని ముంగాళ్ళమీద శిరసుంచి ఏడ్చింది. ఆ ఏడుపును చూచి చిరాకు కలిగింది. అతనికి కావలసినది ఆమె అందం, ఆమె సుఖం. ఆ సుఖాన్ని యివ్వకుండా ఈ స్పర్శతో అతన్ని పిచ్చివాణ్ణి చేస్తుందని భావించాడు. మైకంలో, అతని కామప్రకోపంలో అతన్ని అతడు మరచి పోయి ఆమెను లేపి గుండెలకత్తుకున్నాడు. అతనికి కావలసింది ఆ సుఖం అనిపించింది. ఉద్రేకంలో పడి పోయాడు. దాదాపు పశు ప్రవృత్తిలోనే ఉండి ఆమె రొమ్ములను అతని వక్షానికదుముకుంటూ వేడిగాలి ఆమె నుదురుకు తగిలేలా వదలుతున్నాడు. నందిని గ్రహించింది. స్వాధీనంలోలేదు. కామప్రకోపంలో ఉన్నాడు. ఈ క్షణం ఈ కబంధ హస్తాలనుండి తను తప్పుకోకపోతే వారిలా ఈతడుకూడా తనను...ఆ మాట అనుకున్న క్షణం అతన్ని పాన్పుమీదికి నెట్టి దూరంగా నిలచింది. అతడావేశంతో -

'నందా! నన్ను తప్పుకోలేవు జాగ్రత్త!' అన్నాడు.

ఆమె పిచ్చినవ్వు నవ్వింది. అందులో జాలి, కోపం, అతనిమీద ప్రేమ నిలచి ఉన్నాయి. ఆ మూడింటి కలయిక వల్లనే అది పిచ్చినవ్వు, వెర్రి వెటకారంలా ఉంది. అతని చెవ్వులు బద్దలయ్యాయి.

గంభీరంగా పాన్పునుండి లేచి 'నందా! ఇంక నేనాగ లేను. నిన్ను రక్షించుకోలేవు. నీ శరీరం నాకు కావాలి. నాకు తృప్తి కలిగించాలి!' అన్నాడు ముందుకు వస్తూ.

జాలిగా అతన్ని చూస్తూ, 'జయా! నా కంఠంలో ప్రాణం ఉండగా ఈ మలిన వస్త్రాన్ని నీకు కట్టబెట్టను. నిజంగా నిన్ను ప్రేమించాను. నా ప్రేమ అతీతం. స్వామి పూజకు కుళ్ళిన పండు పనికిరానట్లు - ప్రభూ! నీ పూజకు, నీ ఆరాధనకు ఈ కుళ్ళి పంకిలమైన శరీరం ఈయను!' అంది రెండడుగులు వెనక్కి వేసి.

అతనలాగే ముందుకు వస్తున్నాడు.

'జయా ఆగు!' అని తీవ్రంగా అరచింది. అతడు నవ్వుతూ ముందుకడుగు వేశాడు. అడుగువేస్తూ 'అనుభవించకుండా నిన్ను పోనీయను!' అన్నాడు.

'అది నీ చేతగాని పని జయా! నా అతిథివి. నిన్ను ప్రాణాలతో అవంతినుండి పంపడం నా బాధ్యత. అందుకే చూస్తున్నాను.' అంది.

జయదేవుడు నవ్వాడు. 'జయా! నీ మూర్ఖాన్ని వదులు. నీవింత పశువువని తెలిస్తే నా మనసునింత ఉన్నతంగా పెంచుకుందేదానినికాదు. నలుగురితోపాటు నీకూ శరీరాన్నప్పగించేదాన్నే. నా భావంలో నీవు దేవుడవు. నేను భక్తురాలును.' అతడాగకుండా ముందుకు వస్తూ—

'ఇలాంటి మాటలతోనే రెండు రాత్రులు వ్యర్థ పరచావు. నాకూ నీ అందం కావాలి. దాన్ననుభవించాలి!' అని అంటూ అడుగువేశాడు.

నందిని చేతులు చరచింది. 'మధురనాయకా! నా ఒంటి మీద చేయిపడిందా, నీ ప్రాణాలు ఈ లోకంలోనుండి దాటిపోతాయి!' అంది.

'అంత వీరత్వముందా?' అన్నాడు వెటకారంగా. 'ఒకసారి వెనుదిరిగి చూడు!' అంది. తిరిగి చూచాడు. అంతే! అతనినోట మాటలేదు. కిటికీలలోనూ ద్వారాల పరజాల లోనూ కత్తులూ బాకులూ ఈటెలూ అతనికి గురిపెట్టి నిలచి ఉన్నాయి. స్తంభించిపోయాడు. 'నందా!' అని నోరు తెరచాడు మధుర నాయకుడైన జయదేవుడు. 'ప్రేమను ప్రేమగా అర్థం చేసుకోలేని నీలాటివానికి మనసీయడం నా తెలివితక్కువ. కానీ యిచ్చిన హృదయాన్ని తీసుకోలేను. నీకు కీడు జరగదీ యింట్లో. సాధ్యమైనంతవరకు మేలే చేస్తాను. నా యెదటమాత్రం నీ చావు జరగదు. వస్తాను! నిశ్చింతగా నిద్రపో. నీవు చంపవలసినవారున్నారు. నన్నీగతికి తెచ్చినవారున్నారు. అవసరమైతే తెలియ పరుస్తాను,' అని సర సర త్రాచు పాములా నందిని క్రిందికి వెళ్ళిపోయింది. కత్తులూ కటార్లూ మాయమయ్యాయి.

## 9

తెల్లవారింది. శకుంత సంతానం నెలవులు వీడి పొట్టకోసం రెక్కలు కొట్టుకుంటూ దూర దూర తీరాలకు వెళ్ళిపోతున్నాయి. నందినీదేవి గేహంలోని దాస దాసీ లంతా ఎవరి కార్య కలాపాల్లో వారున్నారు. మధుర నాధుని సేనకంతా కావలసినవన్నీ సమకూర్చారు. అమ్మగారింకా నిద్ర లేవ లేదని ఆమె కోసం ఎదురు చూచేవారు చూస్తున్నారు. రేయి నిద్రలేమి వలన ఎండ పొడ మందిర

ద్వారాలలోనుండి పరదాలను చీల్చుకొని లోనికి ప్రవేసిస్తుండగా నలదిని నిదుర మేలుకొని తన కార్య కలాపాలు చూచుకొని మందిరం పైకి వెళ్ళింది. మధుర నాయకులింకా నిద్ర పోతూనే ఉన్నారు. వెళ్ళి అలికిడి చేసింది. మేలుకో లేదు. దాపుకు వెళ్ళి పాల భాగం తన చేతితో నిమిరింది. ఐనా నిద్ర లేవలేదు. రాత్రి కన్నీరు కార్చినట్టుగా అరాబులు కణతిల మీద కనిపించాయి. సేను వెళ్ళాక నా స్వామి నా కోసం పరతపించాడులా ఉంది. పాపం అమాయకుడు. ఇతన్నేమనాలి? ఏమిటో! ఏరికీ ఈయని సామ్రాజ్యాన్ని కాదని, తాత్కాలికంగా దొరకేదాన్ని కావాలని మారాం చేస్తున్నాడు పసికందు. ఏది కావాలో ఏది అక్కర్లేదో తెలియదు. పిచ్చితండ్రి! నన్ను చూడగానే ఏమనుకుంటాడో? కోపం వస్తుంది కాబోలు. రానీ! నా మీద కాక ఇంక ఎవరి మీద చూపుతాడు తన కోపాన్ని? నా హృదయాన్ని దొంగిలించుకొని. ఇన్నాళ్ళూ నన్ను వేధించి ఈ నాడు వచ్చి, ఈ తుచ్ఛమైన కాయాన్ని కామానికి వినియోగించమని, అబ్బా! రాత్రి ఎంత మారాం చేశాడు. ఆఖరకు నా బలగంతో బెదరిస్తేగాని లొంగి దారికి రాలేదు. అంత బాధ కలిగించడం కూడా భావ్యమైన పనిగాదు - కానీ అంతకన్న గత్యంతరం లేకపోయింది. ఊఁ. ఇంక ఏమనుకుని లాభం లేదు. నన్నపార్థం చేసుకున్నాడు. ఏం చేసుకున్నా ఏమైనా ఇక ఆ ‘చించి చేయగలిగింది నాస్తి - అని తనలో తాను చాలాసేపు వితర్కించుకొని ‘మధూ! మధూ!’ అని ద్వారం దాపుకు వచ్చి పిలచింది. మధూలిక క్రిందినుండి పైకి వస్తూ ‘అమ్మా! పిలచారా?’ అన్నది.

‘ఆఁ! వస్తూ నా వీణ తీసుకుని రావే’ అంది.

## 28

మధూలిక వీణ తెచ్చింది. అందుకొని అక్కడ తివాసి మీద కూర్చుని వీణ శృతి చూచుకుంటూ, 'మధూ! స్నానానికి మిగిలిన ఏర్పాట్లన్నీ చూడు.' అంది.

మధూలిక వెళ్ళిపోయింది. సన్నగా వీణను మీటుతూ మేలుకొలుపు మొదలు పెట్టింది నందిని.

ఉదయ మాయెను మేలుకొనుమా।
సదయ హృదయా। కోలుకొనుమా।

గతము రాతిరి గడచి పోయెను
వ్యతల బాపగ తెల్లవారెను
వెల్లబారెను దిక్కులన్నియు
కల్లగానిది నిలచి పిలచెను ॥ఉదయమా॥

చీకు చింతల పాలసుమ్మా।
వేకువన్నది వెలుగుసుమ్మా।
మంచి ఏదో ఎంచి నమ్మము।
కంచె చేనును మేయదెప్పుడు ॥ఉదయమా॥

పగలు రాతిరి భేద మరసిన
పగలు పెగలవి లేవవెప్పుడు
రగిలిపోయే గుండె నిదురను
నగము సత్యము తెలుసుకొనులే ॥ఉదయమా॥

ఆమె పాట ఆపింది క్షణం. ఆ క్షణంలో జయదేవుడు-

'నందా! ఐపోయిందా? అలాగే పాడలేవా?' అన్నాడు. అంతకు ముందెప్పుడు నిదుర మేల్కొన్నాడో నందిని గమనించలేదు.

'ఎన్ని పాటలు, ఎంతపాట, ఎలాటిపాటయినా నేను పాడ తాను ప్రభూ! రాత్రి జరిగింది నీవు మరచిపోతే చాలు' అంది. నందిని వీణ నక్కడే అలాగే ఉంచి లేచి పాన్పు దాపుకు వచ్చింది.

'రాత్రంతా ఆలోచించాను నందా! నిజంగా నేను పశువులా ప్రవర్తించాను కదూ!' అన్నాడు. ఆ వినయాన్ని నమ్మలేదు. ఐనా అతడు తన జన్మజన్మాల ప్రియుడు. ఎన్ని జన్మలకైనా అతని హృదయంలో స్థానం తనకు స్థిరంగా కావాలి. ఎంత ఉన్నత పథంలో ఉంటున్నా అతని పాదాల చెంత నీడమాత్రం తనకై వేరుపరచి ఉంచాలి. తనకు కావలసింది అది. అతడే తనను వంచించి నాశనం చేయదలుస్తాడా! అతని పాదాలమీద ప్రాణాలు వదలడం కన్న మరో మార్గంలేదు. ఆ ధ్యేయంతో, ఆ ఊహతోనే నిలచి ఉందామె.

అలాగే నిలచి ఉండడం గమనించి 'నందా! ఏమిటలా నిలచిపోయావు. నన్ను నమ్మడంలేదా? నీవు పాటలో అన్నట్టు రాత్రి చింతలపాలు-సగం సత్యంకాదు. సంపూర్ణ సత్యం తెలుసుకున్నాను. నిజం తెలుసుకున్నాను. నిన్నిక నేను పశుత్వంతో అంటను. నందా! నీవెంత బాధపడక పోతే నన్ను బెదరిస్తావు. నాకు తెలుసు. నందా! నన్ను క్షమించు. నేను రాత్రి చాలా త్వరపడ్డాను. కానీ నీకు నేనేమీ చెప్పి మెప్పించలేను...' అన్నాడు.

నందినికి సంతోషించాలో ఏడవాలో తెలిసింది కాదు. అతని కౌగలిలో అతని బలమైన చేతులలో ఆనందాన్ననుభవించవలసిన తనకు ఎంత నిరాశ గలిగించారు! ఆ అందమైన బలమైన ఆ విగ్రహం తనది. కానీ ఏం లాభం? ఈనాడు కామంతో కోరికతో అతనిని తాకలేదు. తనను కళంక

పరచారు. ఈ కళంకమైన శరీరాన్ని అతని శరీరంతో కలిపి అనుభవించలేదు. ఆ బాధతో అలాగే స్థాణువులా ఉండి పోయింది. అంతేకాదు. అతడు రాత్రి తన కార్యానికి చింతిస్తుంటూ డనుకుంది. ఆమె చేసినదానినిగూర్చి అత దేమీ పట్టించుకోలేదు. పైగా తనతప్పు తెలుసుకున్నట్టుగా పశ్చాత్తాప పడుతూ మాటాడుతున్నాడు.

'నందా! నీకు నామీద నమ్మక కలగడంలేదా?' అని అడిగాడు. నిజంగా అతని భావాలు, మారిపోయిన ఛాయలు మోములో ద్యోతక మవుతూనే ఉన్నాయి. స్వరంలో కొట్ట వచ్చినట్టు దీలతనం కనిపిస్తూంది. ఎంత వీరాధి వీరుడైనా తన ప్రేయసి ఎదుట అలా మసలుకోక తప్పదేమో!

నందిని 'ప్రభూ!' అని అతనిముందుకు వెళ్ళి మోకరిల్లింది.

'నందా! మనిద్దరి మధ్య ఈ తరతమ భేదాలు, క్షమా పశ్చాత్తాపాలు, వేడుకోలులు నశింప చేసుకుందాం. ఈ శారీరక వాంఛలు, కామకార్యాలూ నీవన్నట్టుగా ఈ జన్మకు నిషేధించుకుందాం మరు జన్మలో మన జీవితాలీ తీరు గాకుండా చూడమని దైవాన్ని ప్రార్థిద్దాం. ఈజన్మ కిలాగే గడిపివేద్దాం,' అన్నాడు ఆమెను పైకి లేవదీస్తూ:

ఆనందంతో ఊగిసలాడి పోయింది. తన ప్రియుడు - తన ప్రాణం-తన ఆత్మ - తన సర్వస్వం తన అధీనంలో తన మాట వింటూ ఉంటానన్నందుకు విన్నందుకు పొంగి పోయింది.

'ప్రభూ! నా శరీరం ఎలాగేనే పోనీ. మీ పాదాలచెంత కొంచం చోటు నాకు యీయండి చాలు. మీ మనసులో కొంత మేర నా మనసుకు జాగా కల్పించండి. అంతకన్నా కోరుకుందేదేమీ లేదు. మీ దాసీదానిగా నేను త్వరలో వసాను' అంది నందిని.

'నేనెక్కడ ఉంటానో అక్కడి తలుపులు నీకు ఎప్పుడూ తెరచి ఉంటాయి. నీకు దానిని గూర్చిన భయం అక్కర్లేదు. నీవు దాసీదానిగా కాదు. నామీది అధికారిణిగా రావలసిందే నందా! నిన్ను నేను మరచిపోను. లే వెళదాం. ఈర్ష్యాసూయ కృత్రిమాలకిక మన జీవనంలో తావులేదు. పద! నా ప్రయాణానికి కావలసిన ఏర్పాట్లన్నీ చూడు. నీవు చూచేదేముంది? నీ పరిచారికను పిలు' అన్నాడు మధుర సాధుడు.

నందిని 'మధూ! మధూ!' అని కేక వేసింది. నందిని కేక విని మధూలిక చేతిలో పని వదలి మందిరం పైభాగానికి వచ్చింది.

'క్రింద ఉన్న పరివారంతో నావలను సిద్ధం చేయమని చెప్పు. మధ్యాహ్నం లోపుగా సిప్రాదాటి మధ్యాహ్న భోజనాలు ద్వారవతిలో జరగాలని ఆదేశించు - వెళ్ళు' అన్నాడు. అతని మాటల్లోని అనుజ్ఞా - గంభీరం చూచి, ఇలా ఉండబట్టే జయదేవుడు మధుర ఏలిక భారాన్ని నిర్వహిస్తున్నాడనుకొంది. మధూలిక క్రిందికి వెళ్ళి యేలిక పలుకులు చిలుకలా వల్లెవేసింది-అంతే. అంతా నిశ్శబ్దంగా పరివారం ఎవరిపనుల్లో వారు మునిగి పోయారు. కాలకృత్యాలు తీర్చుకొని ఏలిక మందిరంపైకి వచ్చేప్పటికి సేనాపతి రాజపాలుడు వచ్చి మందిరం పైభాగాన ఉన్న ద్వారంవద్ద నిలచి 'ప్రభువులకు నా రాక ఎరిగించ'మన్నాడు. ద్వారం దాపునున్న పరిచారిక లోనికి వెళ్ళి 'సేనాపతి తమ దర్శనార్థం...' అంది.

ఆసనమ్మీద అలాగే ఉండి 'రమ్మను' అన్నాడు యేలిక.

సేనాపతి వచ్చి అభివాదం చేసాడు. యేలిక దానినందుకొని, ఏమిటన్నట్టు చూశాడు.

'అంతా సిద్ధమైంది. తమరిక రావచ్చు' అన్నాడు.

'వస్తున్నాం! నందిని యేదీ?' అని పరిచారిక నడిగాడు.

'క్రింద గదిలో ఉన్నారు' అంది పరిచారిక.

'పదండి!' అని బయలుదేరి క్రిందికి వచ్చాడు. నందిని గదిలో తలగడమీద కళ్ళ నీళ్ళతో వాలివుంది. 'నందా!' అన్నాడు జయదేవుడు.

'ప్రభూ!' అంది నందిని.

'ఎందుకూ విచారం? బేలపడి పోకు. వెళ్ళి వస్తాను. సాగనంపడానికి సిప్రావరకూ రావా?' అనడిగాడు.

'వస్తాను. రాకేం చేస్తాను? జీవితంలో అంటకుండా సాగనంపడమేకదా నేను చేసుకున్నది!' అంది.

'బాధపడకు నందా! రా, అంతా సిద్ధమైంది. అవంతీ సభాసభ్యులంతా ఒకోరు సిప్రా దాపు చేరుకుంటున్నారు. పద వెళదాం!' అన్నాడు జయదేవుడు.

నందిని పల్లకీలో కూర్చుంది. పరివారం మెల్లగా సాగి, సిప్రానదికి చేరుకుంది. సామాను సరంజామాలన్నీ ఓడ లోనికి యెక్కించారు. వాడిన మోముతో మోడువారిన యెడదతో పల్లకిలో ఓడిపోయిన నందిని కూర్చొనుంది. అవంతి ప్రజలూ, అవంతి పురపాలకులూ, న్యాయ సభా సభ్యులు, పౌర సభ్యులూ అంతా అభివాదాలు చేస్తూ అందుకొంటూ ఉన్నారు. అందరినీ చూస్తూనే ఉంది నందిని పల్లకీలోనుండి.

అందరి దగ్గరా వీడ్కోలు తీసుకున్నాడు అవంతి సర్వ సేనాపతి జయదేవుడు - ఈనాడు మధుర యేలిక: పల్లకీలోనున్న నందిని అతడు నావనెక్కుతుండగా రెండు కన్నీటిబొట్లు చెక్కిలిమీద నిలుపుకొంది, సిప్రా నదిలో

రెండు నావలూ బయలుదేరాయి. నందిని పల్లకీలోనుండి వెలికి వచ్చింది. అప్పటివరకూ ఆమె బాధ-అందరితోపాటు మధుర యేలిక తనవద్దకూడా శలవు తీసుకుంటాడేమో! ఆ అందుకుంటున్న క్రమం చూస్తూ తన కళ్ళనీళ్ళు ఆగక అక్కడే విడువడం జరిగితే, అది అందరూ గమనిస్తారని, తన బాధను పరులు గ్రహించరాదనే భావంతో నందిని తొలగి నిలచింది పాలకిలోనే. నావలు నీటిలో కదలు తుండగా తన సర్వస్వం సిగ్రాలో తేలి దూర దూరాలకు పోతున్నంతగా ఒ·ధ కలిగిందామెకు.

నావ నీటి మధ్యకు పోయేంతవరకూ చాలామంది అలాగే చూస్తూ నిలచి, ఆ తర్వాత ఒకోరూ తప్పుకు పోయారు. ఒక్క ఐదుగురుమాత్రం ఒకచోట అలాగే నిల్చబడి నావ వంకకు, నందినివంకకూ పరీక్షగా చూస్తు న్నారు. వారి వారి హృదయాల్లోని ఆలోచనలు మాత్రం వేరు వేరు విధంగా ఉన్నాయి. నావలోని రూపాలు మసక మసకగా కనిపించినంతమేర చూచి, ఆ తర్వాత నందిని ఆ ఐదుగురున్న తావుకు చేరింది. అధ్యక్షులామెను చూచి 'మీరు అవంతి గౌరవానికనుగుణంగా మధుర యేలికకు గౌరవ మర్యాదలతో సపర్య చేసినందుకు మిమ్మల్ని అవంతి తరఫున అభినందిస్తూన్నాను.' అన్నాడు.

'అవంతి గౌరవ ప్రతిష్టలు నావేకదా! ఈనాడు అవంతి ప్రధానాంగాల్లో నేనూ ఒకటికదా? నాకూ బాధ్యత ఉన్నది. దానిని నెరవేర్చానని మాత్రమే అనుకుంటు న్నాను. దానికి పెద్దలు మీరభినందించడమేమిటి?' అంది నందిని లేనినవ్వు తెచ్చిపెట్టుకొని.

చంపింది - అనుకున్నాడు అధ్యక్షుడు లోలోన, పైకి నవ్వుతూ 'నిజం-నిజం!' అన్నాడు.

మిగిలిన నలుగురూ - వాత వేసింది. మహా తనే గొప్పయినట్లు పెద్దరికం వెళ్ళబోసుకున్నాడు-అనుకున్నారు.

అంతా అంతకన్నా ఏమీ అనుకోలేదు. ఆమె నడచి వారితో కొంతదూరం వచ్చి వీధి మలుపులో పల్లకీనెక్కి 'వస్తానని' శలవు తీసుకొని వెళ్ళిపోయింది. ఐదుగురూ మెల్లగా నడక సాగించారు ఏదేదో అనుకుంటూ. అగ్గి రగులుకుంటుంది గుండెల్లో.

# 10

జయదేవుని సాగనంపి వచ్చాక నందిని మనసు చాలా బాధ పడింది. కానీ ఆమె చేయగలిగింది లేదని ఆలోచించుకొని తనను తాను సర్దుకుంది. ఎంతగా సర్దిచెప్పుకున్నా నందినికి మనసులో దుఃఖం ఆగింది కాదు. జరిగినదంతా ఆ ముందు కదలుతూంది. అందులో ఉన్న న్యాయాన్యాయాల పరిధిని మించిపోయిన హృదయం చాలా ప్రశ్నలను వేసింది. వాటికి సమాధానం చెప్పుకోలేక పోయింది. ఆమెకా బాధలో తీరం దొరక లేదు. రెండు రోజులు చపల చిత్తలా చంచలంగా సాగరంలోని నావలా అల్లాడి పోయింది. ఎవరి కొరకో ఎందుకో ఎదురు తెన్నులు చూచింది. ఏ తీరూ అందని వారెవరో ఆమెలోనుండి ధైరం చేస్తారు. వారెవరో ఆమెకు తెలియదు. ఆడదాన్ని! వాకు మించిన కార్యాలు చేయాలనుకుంటున్నాను. ఏమిటిది? ఇంతవరకూ ఏ ఆడదైనా ఇలా సంచరించిందా? ఎవరినో ఒకరిని అంటి పెట్టుకుని తన బ్రతుకీడ్చిందిగాని, అంటి పెట్టుకొని ఉండవలసిన నేను అండలన్నింటినీ పోగొట్టుకొని ఇక్కడ ఇలా ఏదో సాధించాలని ఉరులు

పన్నుకోడం భావ్యమా-అనుకుంది. భావ్యా భావ్యాలకతీత మైనదేదో ఆమెలో తళుక్కున మెరసింది. ఇంక జాప్యం కూడదు. నా శాస్త్రాలు చక్కబెట్టుకొని వెళ్ళిపోవాలి-అనుకుంది. తనలో తాను ఇంత మథన పడుతున్నా, దాస దాసీ జనానికే విషయం తెలియనీయకండా చాలా జాగ్రత్త తీసుకుంది.

మధూలిక వచ్చి బాగా ఆమెను పరకాయించి, 'అమ్మా! ఆరోగ్యం బావులేదా?' అన్నది.

మెల్లగా కను రెప్పలు విచ్చి, 'మధూ! ఆరోగ్యం బాగానే ఉంది కానీ, మనసులో ఊహా కందని గాయం తగిలిందే! దానిని మాన్పుకోడానికి వీలు పడడం లేదు. మరువ శక్యంగాని కార్యం చేశాను. ఐనా తప్పదు. అనుభవించ వలసిందే? సరేగాని మధూ!...' ఏదో అనబోయి ఆగి పోయింది నందిని.

క్షణం అలాగే చూస్తూ నిలచి, 'అమ్మా! మీకు నా మీదింకా సంపూర్ణ విశ్వాసం కుదర లేదనుకుంటాను. అలా కుదరనప్పుడు మీ రహస్యాలు నాకు చెప్పకండి. ఐనా దాసీ ముండకు యజమాని రహస్యాలతో ఏం పని? ఒక వేళ అలా రహస్యాలు విన్న దాసీది అట్టేకాలం ఆ యజమాని క్రింద పని చేయదు. యజమాని పని చేయించుకో లేదు కూడాను.'

'నీదంతా ఒక గొడవ. నా ఆలోచనలతో నేను సతమత మవుతుంటే నీ కేదో నన్ను మరో ఆలోచన వైపుకు లాగుతున్నావు. పోనీ! మధూ! నిన్ను నేను దాసీదానిగానే చూస్తున్నానా?' అంది నందిని. ఆమె అలా చూడడం

లేదని ఇద్దరకూ తెలుసు. కానీ తెలిసిన విషయాలనే మనుషులు వింటానికి కుతూహలం పడతారు.

'మీరు చూడక పోవచ్చు. కానీ నా భావాలు, నా చేతలు మీ దాసీ పద్ధతిలోనే ఉండాలికదా?'

'అది ఎవరి హృదయాన్ని బట్టి వారి సంస్కారం అందించేది. దానిని గూర్చి నే నంతగా ఆలోచించ దలచుకో లేదు. ఒక పని చెయ్యి. అధ్యక్షులు ఊళ్లో ఉన్నారో లేరో కాస్త కనుక్కో.'

'అలాగేనమ్మా!' అంది మధూలిక.

'రెండు రోజు లయ్యింది కదా జయదేవుడు ఊరికి వెళ్ళి! ఆ సంగతి అధ్యక్షులకు తెలుసుకదా? ఇటు ప్రక్కకు ముఖం కూడా చూపలేదు.'

'ఆయనకు కోపం వచ్చిందేమో?'

'ఎందుకూ కోపం? జయదేవుడు వీరి సొత్తును దొంగలించ లేదు. నాశనం చేయలేదుకదా? ఇంకా మీరంతా కలసి అతనికెంతో అపకారం జరిపారు. అది ఇంతా అంతా కాదు.'

'పోనీ వెళ్ళి పిలిచిరానా అమ్మా!'

'పిలుస్తానంటావా?'

'ఏం, పిలుద్దాం. మనకు నష్టమేముంది?'

'మనకు రావలసిన నష్టం ఇదివరకే వచ్చింది. ఆ నష్టం యిక ఈ జన్మలో పూడదు కానీ, లోకువగాదూ? - అని ఆలోచిస్తున్నాను మధూ!'

'అంత తెలివితక్కువగా వార్త నందిస్తానంటూరా? దూతగా వెళుతున్నది మధూలిక. మరచిపోకండి!' అంది మధూలిక. నందినికి ఆలోచన పడింది. మధూలిక అధ్యక్షుని

మనిషి. ఆమె తనవైపు తిరిగిపోయిందని నమ్మకంలేదు. ఆ మాటలు, చేతలూ చూస్తుంటే చాలా జాణ అని తేలుతూనే ఉంది. అలా కిదాన్ని తనే అధ్యక్షునింటికి పంపడం కొరివితో తల గోకుకున్నట్టుగా ఉంటుందేమో ననుకొని, తిరిగి ఆలోచించింది. నా మాటమీద పోకపోయినా రహస్యాలు చేరవేయ దలచినపుడు దానికి అడ్డేముంటుంది? ఎలాగో చేర్చదా? ఐనా ప్రస్తుతం రహస్యాలేమున్నాయి? అందరకూ తెలిసినవేగా జరిగాయి. జయదేవుడు వెళ్ళిన నాటి నుండి నేను వెలుపలికి రాలేదుకదా?

మధూలిక వెళ్ళిపోయింది. అధ్యక్షుని ఆంతర్యం ఎలా తిరిగిఉందో? అతన్ని నమ్మకూడదు. నేను మంచిదాన్నయితే కదా- నమ్మడాలనుగూర్చి ఆలోచించడం? అని సంతృప్తి పడింది నందిని.

ఆమె మనస్సు అలా అలా తిరిగి, చతురిక మీదకు మళ్ళింది. చతురిక కౌశాంబీ చేరినట్టు వార్త అందింది. కాని, భిక్షువును కలుసుకుందో లేదో తెలియదు. కలుసుకొనే ఉంటుంది. భిక్షువు కౌశాంబిలోనే ఉంటాడా? ఏమో. అతడు ఏ రాజ్యాలు ఏలడానికి వెళ్ళిఉంటాడో! ఏది ఏమైనా చతురిక మాత్రం అంధ భిక్షువుని కలుసుకోకుండా రాదని గట్టినమ్మకం ఉంది. అది ఎవరిమనిషో! ఇంకా ఈ అవంతిలో నాకెందరు పగవాళ్ళున్నారో తెలీలేదు. అదీ నటిస్తుందో లేక అంతఃశుద్ధిగా నాకు తోడ్పడుతుందో! అది తెలుసుకోడంకష్టంగానే ఉంది. అవంతి పంచాయితీ ఎంత బావుంది! వీళ్ళంతా అవంతి ఏలికలా? వీళ్ళందరినీ ప్రజాసమక్షానికీడ్చి వీళ్ళ బ్రతుకలన్నీ వెలికి లాగి స్తే ఎలా ఉంటుందో? వీరితోపాటు నేనూ రావలిసిందేకదా? ఎంతవచ్చినా యింతకన్న చెడిపోతానా? ఇంతకన్న నాకు తలకొట్టి మొలవేయగలిగిం

దేముందీ? ఆలోచించాలి. బాగా ఆలోచించాలిసిన కార్యం యిది.

నందిని నిలకడలేని ఆలోచనల్లో కొట్టుమిట్టాడుతున్న వేళను యింటిముందు గంటల సద్దయింది. అవి సార్థవాహకుల బళ్ళకు కట్టిన యెద్దులమెళ్ళో గంటలు. గంటలు, మువ్వలూ కలిసి ద్వంద్వంగా వచ్చిన సద్దుకు మిద్దిమీదనుండి అడ్డుగా ఉన్నగోడ దగ్గరకువచ్చి అల్లుకున్న మాలతీ తీవెను ప్రక్కగా తొలగించి చూచింది. క్రింద బండిలోనుండి చతురిక దిగుతూంది. నందిని ఆనందం పట్టలేక మిద్ది సోపానాలను రెండు రెండు చొప్పున గెంతుకుంటూ వచ్చి తొలి ద్వారం దగ్గర నిలచి తమాయించుకొని హుందాగా అడుగు ముందుకు పెట్టింది చతురిక. వస్తూ వస్తూనే చిరునవ్వు లొలకబోసింది. నందినికి ఆ చిరునవ్వు జయసూచకంగా అనిపించి, 'చతురికా! కాయా? పండా?' అని అడిగింది.

'మీరు పంపడం, నేను వెళ్ళడం, కాయకావడమున్నా! పండే. అందులో మిగల పండిందమ్మా!' అన్నది చతురిక. యిద్దరూ కలసి లోనికి వెళ్ళారు. పరిచారిక లంతా వారిద్దరినీ చూచి విస్తుపోయారు. చతురికా, నందినీ యిద్దరూ నేస్తాలలా, చిన్ననాటినుండి కలిసి పెరిగి మధ్య విడిపోయి తిరిగి కలసుకున్నట్టు అందరికీ భావన కలిగింది. ఇద్దరూ గదులుదాటి సోపానాలధిరోహించి మిద్దిమీదికి వెళ్ళారు. నందిని ఊయల బల్లమీద కూర్చుంది. నందిని కూర్చుంది కదాని దూరంగానే చతురిక నిలచి ఉంది. 'చతురికా రా! కూర్చో,' అంది నందిని. చతురిక తల అడ్డంగా త్రిప్పి, 'నేను కూర్చోను. నేను నేనుగానే ఉన్నాను. ఉండనీయండమ్మా! నాకు మీరు గౌరవం ఈయవద్దు. నన్ను నన్నుగాచూస్తే చాలు.' అన్నది చతురిక.

'అదేమిటే అలా అంటావు? రా!' అని, 'పోనీలే ఇక్కడ వద్దు. ఎందుకే నామంచిది. ఆ గదిలో మాటాడుకుందాం రా!' అని లోనికి దారితీ, తను ఒక ఆసనమ్మీద కూర్చొని మరొక ఆసనం చతురికకు చూపి—

'ఆఁ యింక చెప్పు. అన్నట్టు నీ కార్యకలాపాలన్నీ అయ్యాయా! ప్రయాణ బడలికలో ఉన్నావా?' అంది నందిని.

'నాకు ప్రయాణ బడలికేమిటమ్మా!' అంది చతురిక.

'ఐతే విషయాలు చెప్పు.' అన్నది నందిని. చతురిక అక్కడున్న ఒక ఆసనమ్మీద కూర్చుని చెప్పడం మొదలు పెట్టేందుకు సర్దుకు కూర్చుంటూంది. అంతలో నందిని 'అసలు భిక్షువు కనిపించాడా?' అంది.

'ఉండండి. అలా త్వరపడితే యెలా? చెపుతాగా!' అన్నది చిరునవ్వు నవ్వుతూ చతురిక.

'అదికాదు. కలుసుకున్నావా? ఆయన బావున్నాడా? అది ముందు చెప్పి, తర్వాత మిగిలినవన్నీ చెప్పు' అంది నందిని చతురికను చూస్తూ తన త్వరితాన్ని గుర్తుంచుకో అన్న రీతిలో.

'ఆఁ చూచాను. బాగానే ఉన్నాడు...'

'ఏంచేస్తున్నాడు?' అంది నందిని మాట మధ్యలో—

'ఏఁవిఁటమ్మా మరీ పసిపిల్లల్లా ప్రశ్నిస్తారు? అతదేం చేయగలడు? రాజ్యాలేలగలడా? రణాలు చేయగలడా? మామూలుగా బిచ్చమెత్తుతున్నాడు అంతే!' అన్నది. నందిని ఆత్రం, నందినిలోని తత్వం, చతురిక కెందు కుంటుంది? అందులోనూ చతురిక అతనివద్దనుండి వస్తుందా

యను. చూడనిది నందిని గాబట్టి ఆమెలో భిక్షువు విషయా లన్నీ ఒక్కసారే తెలుసుకోవాలన్న కాంక్ష ఉంది.

'కౌశాంబిలోనే ఉన్నాడా?' అన్నది నందిని.

'అఁహఁ-లేదు. కౌశాంబికి రెండు యోజనాల దూరంలో ఉన్న ఒక చిన్న గ్రామంలో ఉన్నాడు. నేను చాలా యాతనపాలయ్యేదాననే కానీ, కౌశాంబిలోని ఆరామ వాసి నాతోపాటు మాళవానికి ప్రయాణమైనాడు. మేమలా ప్రయాణమై వెళ్తుండగా, భిక్షువు చైత్యానికి బయలు దేరాడు కాబోలు. కాకతాళీయంగా ఆ గ్రామ నది బాటలో తారసపడ్డాడు. నా వెంట వచ్చిన శ్రమణుడు, 'అతడే అంధభిక్షువు' అన్నాడు. నిజంగా నా ఆనందానికి మేర లేదు. ఎంతదూరమని ముఖం తెలియకుండా తిరగ్గలను? మేము అనుకోకుండా అతన్ని కనుక్కొని విచారించాను. నాకు లోలోన అనుమానమే. కానీ, అమ్మా! మీరు చెప్పనిదీ, దాచినదీ ఒక విషయం ఆ భిక్షువు చెప్పాడు. దానితో నమ్మాను. మీరు ప్రతి పున్నమికీ వెర్రివా రవుతారట. అది ఆ ముసలాయన చెప్పాడు. అలాంటివి విన్నాక మీ తరఫున మనిషినని చెప్పుకున్నాను. ఆ తర్వాత చాలా రోజులు కాలి నడకనే ప్రయాణం సాగించాం. మాతోపాటు ఆ శ్రమణుడు కూడా వదల కుండా వెంట వచ్చాడు. అదంతా ఒక బ్రహ్మాండమైన గాథ. ఏం చెప్పను! ఎలాగో అవస్థపడుతూ ప్రహస్తి చేరాం. ప్రహస్తి చేరాక శ్రమణుడు - నేను వెళ్ళిపోతానని వెళ్ళిపోయాడు. అతడు మా వెంట ఉన్నంతకాలం భిక్షువుతో నేనంటున్నది: అవంతికి చేరదామనే! ఆ తర్వాత చెప్పాను, మీరు చెప్పినవన్నీ. ఆయనకు గ్రీష్మంలో మీరు పంపిన సొమ్ము అందింది. దానినాయన కౌశాంబిలోని ఒక

వణిజానకిచ్చాట్ట! 'నాకెందుకమ్మా సొమ్ము!' అన్నాడు వాడో. ఆ తర్వాత జరుగవలసింది చెప్పాను. ప్రశస్తి చాలా బావుంది. ఊరుచుట్టూ సేద్యానికి అనువుగా ఉన్న భూమి - నీటికి కొదువలేకుండా ప్రక్కన గంగలోని పాయ ప్రశాంతంగా ఉంది. కానీ మనకు బాగా దూరం. అందువల్ల నాకక్కడ భిక్షువు నుంచడానికి యిష్టంలేదు,' అన్నది చతురిక.

'అడగడం మరచాను. ఇంతకూ భిక్షువుకు తావెక్కడ చూపావు?' అంది నందిని.

'వస్తున్నా - అంతలోనే అంత త్వరపడతావేమమ్మా! నర్మదా నదీతీరంలో మాళవంలోనే. దాదాపు రాజధాని కంటుకొనే ఉన్న తావు చూచాను.'

'చాలాదూరం తిరగావే! చతురికా! మాళవంలో నాకు తెలిసిన వారు... లేరు,' అంది క్షణం ఆలోచించి.

'నేను ఉజ్జయినిలోనే ఏర్పాటు చేద్దామనుకున్నాను. కానీ భిక్షువు తను మాళవంలోనే ఉంటానన్నాడు. ఉండే వాడు ఆయనకదా! అందుకని మాళవంలో ఒక చోటు చూచాను. నర్మద కనుచూపులో ఉంటుంది. మంచి ఎత్తయిన ప్రదేశం. సగం సొమ్ముకే అందిందా స్థలం!' అన్నది చతురిక.

'అదేంవిటి?' అనడిగింది విస్తుపోతూ.

'ఊరుకు దూరంకాదా? అందువలన సగం సొమ్ముకు అందింది. చాలా బావుంది. మంచి ప్రదేశంలెండి. దగ్గర ఉండి చుట్టూ చెట్లు నాటించాను. ఒక కొలను తవ్వించాను. మధ్యలో కుటీరం అందంగా ఉండేట్టు ఏర్పరచాను.'

'అలాకాదు. జరిగినదంతా ఒక వరుసగా చెప్పు. అక్కడో ముక్క, యిక్కడో ముక్క చెప్పడంవల్ల ఏది ఎలా జరిగినదో అర్థం కావడంలేదు.' అనడిగింది నందిని.

'ఇక్కడనుండి సార్థవాహకులు నన్ను వెంటబెట్టుకొని వెళ్ళి కౌశాంబిలో దించారు. కౌశాంబిలో దిగి సరాసరి ఆరామాల తావుకు వెళ్ళి రెండింటిలోని గదులన్నీ వెదకి పేరు పేరునా విచారించాను. అంధభిక్షువు లేడని తేలింది. ఆ తర్వాత వారినడిగాను. ఎంతోకాలంనుండి ఉంటున్న శ్రమణుడు చెప్పాడు - ఆ అంధభిక్షువు ఒక మాసం క్రితం ఉజ్జయినికి వెళతానని బయలుదేరాడని. సరేనని నేనూ బయలుదేరాను. మధ్య మధ్య పల్లెల్లో వెదకుతూ తిరుగుతూ, బయలుదేరాను. నాతోపాటు మాళవానికి వెళ్ళే శ్రమణుడు కూడా ఉన్నాడు. అతదేం శ్రమణుడో నాకు అర్థం కాలేదు. అతడు నావెంట ఎందుకు వస్తున్నాడా అనిపించేది. కానీ, గత్యంతరంలేదు. అతనిని కాదని ఎలాగనను? అలాగే రెండు యోజనాలుమాత్రం ప్రయాణం చేశాం. రెండు యోజనాలకు రోజులు పట్టదు. కానీ ప్రతి పల్లెనూ - గ్రామాన్నీ వెదకడంలో జాగయ్యింది.

ఆనాడు ఆ పల్లెలో భిక్షువు చైత్యానికి వెలికి వచ్చాడు. నాతో ఉన్న శ్రమణుడు చూచి 'అతదే ఆ అంధ భిక్షువు!' అన్నాడు. ఆ భిక్షువును కలుసుకొని విషయం చెప్పాను. మీ పేరు చెప్పి, మీ తాలూకు మనిషిని, మిమ్మల్ని అవంతికి తీసుకొని పోదామని పయనమై వచ్చానన్నాను.'

'భిక్షువుకు కూడా మిమ్మల్ని చూడాలని ఉందని అన్నాడు. ఆ గ్రామంనుండి బయలుదేర దీశాను. మేము ముగ్గురం చాలా రోజులుకలసి ప్రయాణం చేశాం. ఎక్కడా బండ్లు

దొరకలేదు. నాదగ్గర చాలా సొమ్ము ఉన్నది. నాకు నామీద భయంకన్న, సొమ్ము భయం అధికమైంది. దానిని కాపాడడం చాలా కష్టమైంది. ఏపని చేస్తున్నా నా సంచిమీద చూపు పెట్టుకుని మసలక తప్పింది కాదు.

'ఎలాగైతే నేం ప్రహస్తి చేరాం. ప్రహస్తినుండి ఏదేశానికి కావాలన్నా వ్యాపార శకటాలు దొరకుతాయి. ప్రహస్తి మంచివ్యాపార కేంద్రం. మీకు తెలియనిదేముంది! అక్కడ మూడునాళ్ళున్నాం. ఆ మూడు నాళ్ళల్లో ఒకనాడా శ్రమణుడు నేను వెళ్ళి పోతానన్నాడు. 'సరే వెళ్ళండి. ఆ తర్వాతెప్పుడైనా మీరు అవంతిలో కలుసుకోండి' అన్నాను. శ్రమణుడు వెళ్ళి పోయాక చెప్పాను భిక్షువుతో - 'మీరు స్థిరంగా ఉండడానికి ఎక్కడైనా ఏర్పాటు జరుపమని మా అమ్మగారి ఆజ్ఞ. మీరెక్కడ ఉండదలచారు?' అని.

'దాని కాయన చిన్నగా నవ్వి,'నాకెక్కడైతే ఏమమ్మా!' అన్నాడు. నేను-'ప్రహస్తిలోనే ఉండండి. ఊరు బావుంది. వ్యవసాయానికి ఆటపట్టు. కరువు కాటకాలు దరిచేరవు' అన్నాను.

'ప్రహస్తి నాకెందుకో నచ్చదమ్మా! మనం మగధ రాజ్య పొలిమేరలు దాటి వెళ్ళి పోదాం. నేను మాళవంలో ఉండాలనుకుంటున్నాను' అన్నాడు.

'సరేనని ఆ మరునాడు బయలుదేరుతున్న సార్థవాహకులతో మాటాడి యిద్దరం బయలు దేరాం. మాళవం చేరడానికి మాకు నెలనాళ్ళకుపైగా పట్టింది. బళ్ళకన్న నడకే నయమమ్మా! నదులుదాటి హాయిగా అడ్డు త్రోవలుబట్టి వెళ్ళి పోవచ్చు. ఈ బళ్ళు నీళ్ళనుచూచి దడుస్తాయి. మజిలీ కొకకథగా మీ జీవితాన్ని చెప్పాడు భిక్షుడు. నేను ఆయన కేమీ సంధియలేదు. సందేహానికి తావుకూడా ఈయలేదు.

మాళవంలో చేర్చాను. మాళవ మంచి యోగ్యమైన స్థలం. మరో విషయం. నేనంతా ఏర్పరచి వస్తున్న నాటికి- నేను రేపు బయలుదేరతాననగా ఆనాడు సంధ్యకు రాజవీధి పోయి బిచ్చం తెస్తున్న భిక్షువు చాలా చిన్నపిల్ల ఎవరో దిక్కు లేనిదట- ఆమెను వెంటబెట్టుకొని వచ్చాడు.

'ఎవరని' అడిగాను.

'నాకు మాత్రం ఏం తెలుసమ్మా! నాలాంటిదే! నాకు దొరికింది. ఎన్నాళ్ళుంటుందో నా సందిట!' అన్నాడు. చాలా చిత్ర మేసింది. అంధ భిక్షువు ఏమైపోతాడో అనుకున్నాను. ఆ అమ్మాయి అతనికి దొరకింది. ఇంక పర్వాలేదు. దిక్కు లేని వారిద్దరినీ ఒక తావుకు చేర్చాడు భగవంతుడనుకున్నాను. వారం ఐందనుకుంటాను, బయలుదేరి. అదీ పరిస్థితి' అన్నది చతురిక.

'తెలివి మనం కొంత చేయగలిగాం! భిక్షువును భిక్ష మానిపించలేక పోయావా?' అంది నందిని.

'ప్రహస్తిలో కూడా దానిమీద మా యిద్దరకూ వాదం జరిగింది. ఆయన మాననన్నాడు. బలవంత పరచడానికి నే నెవ్వతెను? ఊరుకున్నాను,' అంది చతురిక.

'ఎలాగేనా భిక్షువుచేత భిక్ష మెత్తడం మాన్పించాలి. ఆలోచిద్దాం! ఎలాగైతే నేం మనకు దాపులో నే సక్రమంగా ఉన్నాడు. అది చాలు చతురికా! అది చాలు' అంది నందిని సంతోషంతో.

'అది సరే గానీండి! ఇక్కడి వ్యవహారాలు...' అంది చతురిక.

'వలలు పన్నాను. అందరినీ కూడగట్టుకున్నాను. అంతా కలసి వచ్చింది. ఇంకా కొంత కాలంలో జరపుకోడంలో నే

ఉంది. ఆఁ-చేద్దాం చతురికా! చేద్దాం! నీవు రెండు రోజుల క్రితం వచ్చినట్లయితే బావుండేది. జయదేవుడు మొన్ననే వెళ్ళాడు.' అంది నందిని చాలా బాధగా.

'సిప్రాలో పోతున్న నావలు జయదేవుల వారివా?' అంది చతురిక.

'చూచావా?' అంది నందిని.

'చూచాను. మొన్న సాయంత్రం సిప్రా ఒడ్డున వస్తుండగా మాకు కనిపించాయి. మా బళ్ళవాళ్ళు ఎవరివో ఏమో అన్నారు. తర్వాత వాటిని గురించి అంతగా పట్టించుకోలేదు. అవి జయదేవుల వారివా?' అన్నది చతురిక నందినిని పరీక్షగా చూస్తూ.

అంతలో మధూలిక అక్కడకు వచ్చింది. రావడం రావడం చతురికను చూచి చాలా సంతోషంగా ముందుకు వచ్చి, 'ఎప్పుడు రావడం? అనుకోకుండా రావడం జరిగిందా?' అన్నది. చతురిక మధూలిక నఖశిఖ పర్యంతం పరీక్షగా చూసి, నా తర్వాత నా స్థానం ఆక్రమించిందిదే కాబోలు అనుకొని, 'ఇదే రావడం! కులాసాగా ఉన్నావుగా! నే లేని లోటు రాకుండా చూచావా?' అంది చతురిక.

'అది కాదే! నీ లోటు నేను పూర్తి చేయగలనా? నేను నేనే. నీవు నీవే. నీ స్థానం నాకు దొరకదు. నాకా పేరాశ లేదే! నేను నేనుగా మిగిలిపోతే చాలే!' అన్నది మధూలిక.

'మనం తర్వాత మాటాడుకుందాంలే! ఎక్కడకు వెళ్ళి వచ్చావ్?' అన్నది చతురిక.

'చెబుతాను. అమ్మా! వెదుక బోయిన తీగ కాలుకు తగిలినట్టు, జయసింహుని పగవాడు వీధిలో కనుపించాడు.

అతనిని తోటలోనికి రమ్మన్నాను. ఈపాటికి వచ్చి ఉంటాడు.' అంది మధూలిక.

'జయసింహుని పగవాడు! ఏమే మధూ! అతడేనా?' అంది చతురిక చిరునవ్వులో.

'ఔన'ని తల ఊపింది మధూలిక.

'అంటే మళ్ళీ వీరమల్లుకూ జయసింహునికీ యుద్ధం - అవంతి వాసులకు రెండు ఏనుగుల పోరాటం చూచే భాగ్యం కలుగుతుందన్న మాట!' అంది చతురిక నవ్వుతూ.

'ఈసారి అలాగాదు. ఆ రెండూ పోరాడవు. అన్నీ కలిసి వస్తున్నాయి. అవంతిలో గణసత్తాక గణ విభజనకు పునాదులు పడుతున్నాయి. మధూ! నీవు వెళ్ళి, రాగానే తీసుకొనిరా. వీరమల్లు దొడ్డిదోవగా ఎందుకు రావాలి? వీధి వాకిలిగానే రానీ! అతని మీద ఈగ వాలదు. ఈ నాటి నుండి నా బలగానికి అతడే నాయకత్వం వహిస్తాడు. అది నీ కిష్టమేగదా? లేదంటే ఈ రాత్రికి మీరు మాళవానికో, ఉజ్జయినికో వెళ్ళి హాయిగా బ్రతుకుతామంటే ప్రయాణా నికి సిద్ధం కండి.' అంది నందిని. నందినిలోని భావం వేరు. వీరమల్లు ఒకసారి వీధి వాకిలి లోనుండి లోనికి రావడం అవంతి పౌరులలోని వారెవ్వరు చూచినా చాలు. అంతే కాదు. తన భవనంలో తనతోపాటు తిరుగుతున్న వేగు లెందరో ఉన్నారు. వారు ఎలాగూ ఈ వార్త అధ్యక్షు లకు తెలియ పరుస్తారు. అది చాలు ప్రస్తుతానికి. ఆ కోరిక లోనే ఉంది. కానీ సాధించాలసినది కూడా మల్లు లాటి వారి సాయంతోనే. ఐనా అది వారికి తెలియ కూడదు. తను వారిచేత చేయించినా ఆ చేయించినది తను అని కాక

తనే చేసిన రీతిలో జరగాలని ఆమె కోరిక. దానిలో లాభ నష్టాలన్నీ ఆమెకే చెందాలి. వెలికి మాత్రం ఒకరితో గాని, ఒకరి సాయంతోగాని తను తన కార్యం సాధిస్తున్నట్లు సాయపడేవారు కూడా అనుకోరాదు. అందుకే మధూలికతో 'నీ ప్రియునితో ఉజ్జయినికి వెళ్ళ'మంది. ఎటు తిరిగీ ఉజ్జయిని వెళ్ళడానికి మధూలిక ఒప్పుకోదని తెలుసు. అనవసర సాయాన్ని, పలాయనాన్ని ఎవరు మాత్రం అంగీకరిస్తారు? మధూలిక కూడా ఆ మాటే అన్నది. 'పారిపోవలసిన అవసరమేమిటమ్మా?' అని

'ఆఁ అది కాదు మధూ! నే నానాడు నీకు మాట నీయలేదా? మీరు వెళ్ళాలనుకుంటే తక్షణం బయలుదేరవచ్చు.' అన్నది నందిని.

'అది తర్వాత ఆలోచిద్దాం' అన్నది మధూలిక.

'అది మీ యిష్టం. ఎప్పుడైనా సరే!' అంది నందిని.

'మరి అతడు వస్తే యిటు పిల్చుకొని రానా, అమ్మా!' అన్నది మధూలిక.

'ఆఁ పిలు పిలూ! నేనూ యింతవరకు చూడలేదుగా!' అన్నది నందిని నవ్వుతూ. దీనిలో 'నీ ప్రియుడు' అన్న భావం మధూలికకు మాత్రం తెలియాలని. చతురిక చతురమతి. తనంత కన్న ముందే పసిగట్టి—

'అదేమిటమ్మా! అలా అనేశారు? చూడవలసినవారు వేరే ఉన్నారు. మీ కెందుకు?' అంది నవ్వుతూ, ఒక ప్రక్క నుండి మధూలికను చూస్తూ చతురిక.

'చతురా! నన్నిక బ్రతకనీయవు కాబోలు' అంది మధూలిక వెళ్ళిపోతూ.

'ఆ మాట నన్నడుగుతావేమే. వెళుతున్నావుగా, ఆ వెళ్ళే చోట ఉన్నారడగవలసినవారు,' అంది. మధూలిక ద్వారం దాకా వెళ్ళి గిరుక్కున తిరిగి చూచి వెళ్ళిపోయింది. మధూలిక వెళ్ళిపోయాక-

'చతురికా! మధూలికను మనం నమ్మవచ్చా!' అంది నందిని. నందిని చతురికనుకూడా నమ్మదు. ఆ సంగతి చతురికకు తెలియదు. తన చరిత్రకూడా నందిని తెలుసుకొనే ఉంటుందని తెలియదింకా, ఆమెకు.

'ఎందుకైనా ఒక కంట కనిపెట్టి ఉండడం అవసరం. మధూలిక అధ్యక్షులవారి మనిషి. జయసింహుడు మధూలిక అన్న. ఈ వచ్చిన వీరమల్లు దానిప్రియుడు. వారిద్దరకూ క్షణం పడదు. ఆ యిద్దరకూ రాజీకుదరదు. ఈ మధూలికను వంచుకురావాలని జయసింహుడు నానాయాతన పాల య్యాడు. ఈ వీరమల్లు నిల్కడలేని మనిషి. మధూలికంటే అతనికి మోజుఉంది. ఇక అతనికి ఈ మధూలిక బానిస. అందువల్ల మధూలికను మనం చిక్కించుకోవాలంటే వీర మల్లును జార్చకూడదు. వీరమల్లు చాలా గడసరి. ఎవరినీ లెక్క చేయడు. వస్తాడుగా, చూస్తారు. అతడు మాటాడలేడు. కార్యవాది. మాట్లాడ్డం అతనికి చేతరాదనవచ్చు ఒకరకంగా!' అంది చతురిక తనకు తెలిసినదంతా చెపుతూ.

'ఈ విషయాలన్నీ నే నిదివరకే గ్రహించాను. నమ్మ వచ్చా? నమ్మరాదా? అనేది సమస్య.' అంది నందిని.

'అదే చెపుతున్నాను కదా? వీరమల్లును మనం వదల నంతకాలం మధూలిక వదలదు. మధూలిక వలన మనకు కీడు రాదు. ఐనా మధూలిక మనకేం చేయగలదులెండి! పోతే జయసింహుడు. వీరమల్లు మనచేతిలో ఉన్నాడని జయ సింహునికి తెలిస్తే అతడు వక్కన పేను. అతడు-అలా పడి

ఉంటే అధ్యక్షులవారి ఆట కట్టినట్లే. అధ్యక్షులవారి ఆట కట్టబడితే అవంతి సభ్యులు - అందులో నలుగురేక దా? చూచుకోవచ్చు.' అంది చతురిక.

'మనం అనుకున్నంత తేలిగ్గా కార్యం అవుతుందంటావా?' అంది నందిని.

'చాలా కాలం మనం ఆలస్యం చేశామమ్మా! నేను తిరిగి వచ్చేలోగా మీరు చాలా కార్యం తెముల్చుకొనుంటారనుకున్నాను. మించిపోయిందిలేదు. చేసేద్దాం.' అన్నది చతురిక.

'ఏం చేద్దామని నీ వ్యూహ చతురికా?' అంది నందిని.

'మీరు ఎవరిని ఎలా ఒదలినా రణవర్మ నా కైజారుకు బలికాక తప్పదు. నాకు జరిపిన అన్యాయానికి అతణ్ణి...' చతురిక చండీరూపం దాల్చింది. ఆమె పెదవులు కోపంతో వణకి పోయాయి. కనులు ఎఱ్ఱబడ్డాయి. ఆమె శరీరం ఆమె స్వాధీనంలో లేకండా పోతున్న తీరుగా ఉంది. నందిని కని పెట్టింది.

'చతురికా! ఆవేశంతో కార్యసాధన కూడదు. ఆవేశాన్ని అణచుకో. ఆలోచించు. కైజారుతో నీవు నీ స్వహస్తాలతో కార్యం రంగంలోకి దూకకు. చేయించాలిగాని, చేయకూడదు. అవసరమైతే వీరమల్లును వాడుకో. వీరమల్లును తప్పించే బాధ్యత నాది.' అన్నది నందిని.

'కాదమ్మా! కనీసం నా చేతి బాకుపోటు ఒక్కటైనా రణవర్మ శరీరంలో నాటబడాలి. అందుకే ఇంతకాలం వేచి ఉన్నాను. లేకుంటే ఈ ప్రాణాల నిదివరకే వదలి వేసే దానను.' అంది చతురిక.

'రణవర్మ అంత అపరాధం నీకేం చేశాడు?' అంది నందిని తెలియనట్టు.

చతురిక ఒక నిట్టూర్పు వదలి, ఏది చేయాలో అదే చేశాడు. ఇంతవరకూ ఎవరికీ తెలియదు. మొదటిరోజుల్లో కోరచూపులు చూచేవాడు. ఆ వలలో నేను పడలేదు. నేను శ్యామసుందరుని మనస్ఫూర్తిగా వరించి ఉన్నాను. ఆ సంగతి రణవర్మకు తెలుసు. తెలిసి ఆ నాడు యుద్ధం రాగానే నగర రక్షణకు నియోగించిన నా ప్రియుని కాదని, యుద్ధానికి దడిచిన వాడై ఆ తర్వాత అధ్యక్షపదవికి రావలసిన నా ప్రియుని యుద్ధానికి పంపి తను నగర రక్షణకు నిలచాడు. పోనీ నిలచినవాడు ఊరుకున్నాడా? శ్యామసుందరుని రణరంగంలో తన వాని చేత వెన్నుపోటు పొడిపించి చంపాడు. కారణం ఏమీ లేదు. నేను దక్కలేదని ఒకటి - తర్వాత సైన్యాధ్యక్షుడు శ్యామసుందరుడు. అతని అడ్డంకి లేకుంటే తను కాగలనని చేశాడు. అయ్యాడు, ఇంత కాలం ఉన్నాడు. ఉండడం కాదు. ఉండనిచ్చాను. తప్పదమ్మా! నేను కౌశాంబిలో ఉన్నంత కాలం వాడిని మీరు ఏదేనా చేస్తారేమో! నా కక్ష ఎలా సాధించాలా? అనేదే యోచన!' అంది చతురిక.

'చతురికా! నీకు కత్తిసాము వచ్చునా?' అంది నందిని.

'వచ్చుగాని, వాడిముందు నేనెంత? పోరాడి గెల్వ గలనా?' అంది చతురిక - నందిని అందుకే అడుగుతుందని ఊహించి—

'నీవు మగవాడితో పగవాడితో పోరాడమని గాదు. అతనిని అలయకొట్టిన తర్వాత- లేదా, అతనిని నీరస పరుస్తాను. పదుగురలోకి లాగుతాను. నీవు ద్వందిగా ఊరక పోరాడితే చాలు' అంది. అని, చూస్తున్న చతురికతో -

'అంటే ఒక్కగుళికతో అతని సర్వావయవాలు స్వాధీనం తప్పుతాయి. తప్పుతున్నాయని, తప్పాయని అతనికి తెలియదు. ఆ క్షణంలో పోరాకే, నీవు అతని సంగతి తేల్చు. నీ కక్ష తీరినట్టూ ఉంటుంది. ధర్మంగా మన కార్యం సాధించినట్టూ ఉంటుంది. ఆడదానిచేత ఓడాక అతడు బ్రతికను కూడా బ్రతకడు,' అంది నందిని.

'అతన్ని రచ్చకీడ్వడం ఎలా?' అనడిగింది చతురిక.

'అది నేను చేస్తాను. పోతే ఆనాడు వెన్నుపోటు పొడచిన నాడెవరో బ్రతికి ఉన్నాడా?'

'ఉన్నాడు. వాడు ఉత్త భటుడు. ధనం చూపి చేయించాడు. ఆ తర్వాత వాడు నాతో స్వయంగా చెప్పాడు జరిగిన విషయాలన్నీను,' అంది చతురిక.

'చాలు! నేను కార్యవర్గ సభ్యురాలను - మరచిపోకు చతురికా! వాళ్ళ వ్రేళ్ళతో వాళ్ళ కళ్ళు పొడవాలి. అందుకే యింతకాలం ఆగాను. కొంచం ఓపికపట్టు - పూర్తి చేస్తాను' అంది నందిని.

వీరిలా మాటాడుతుండగా మధూలిక వచ్చింది. ఇద్దరూ ఒక్కసారే, ఏమి టన్నట్టు చూచారు.

'క్రింద ఉన్నాడమ్మా, వచ్చి.' అన్నది మధూలిక. చతురిక అక్కడే ఉంది. నందిని లేచి 'రా వెళదాం!' అంది చతురికతో.

'మీరు వెళ్ళి మాటాడండి' అంది చతురిక.

నందినీ మధూలికా క్రిందికి వచ్చారు. ఉద్యానవనం వేపు దారితీసింది మధూలిక.

'మధూ! నేనా మందిరంలో ఉంటాను. లోనికి తీసుకొని రా!' అన్నది నందిని మధ్య పెద్ద గదిలో ఆగి - తనుగా అతని దాపుకు వెళ్ళడం యిష్టం లేక.

మధూలిక వెళ్ళింది. కొన్ని క్షణాలయ్యాక వీరమల్లును వెంట బెట్టుకొని లోనికి వచ్చింది. ఆ వస్తున్న వారిద్దరినీ చూచి గదిలో అటూ యిటు తారసలాడిన తీరులో తిరిగింది.

వీరమల్లు వెనుకా, మధూలిక ముందూ వచ్చారు.

వీరమల్లు ధనువు పొడుక్కు-మించి ఉన్నాడు. వస్తున్న అతడు ద్వారానికి తల తగిలే తీరులో నడుస్తున్నాడు. కాని దూరానికి మామూలు మనిషిగా ఉన్నట్లనిపిస్తుంది. పొడుగుకు మించిన దేహదార్ఢ్యం అలా అనిపిస్తుంది. ప్రతి కండా మెలికలు తిరిగి వంపులుదేలి ఎంతోగట్టిగా ఉన్నట్లని పిస్తున్నాయి. అతనిని చూడగానే మల్లుడనిపిస్తుంది. అతని కళ్ళూ ముక్కూ తీరుగా ఉన్నా గంభీరంగా ఉన్నాయి. బొద్దు మీసాలు. ఆ మీసాలవలన ముఖానికి గంభీరం వచ్చిందో - ఆ ముఖమే మీసాల కందం తెచ్చిందో చెప్పడం కష్టం. చాలా మొరటుగా ఉన్నాడు. వీరమల్లు ముందు వారిద్దరూ పసికాయల్లా ఉన్నారు. ప్రతి మాటా తలనెత్తి మాటాడాలసిందే అతనితో. గదిలోనికి వచ్చాక—

'నీవేనా వీరమల్లు అంటేః రా! అలా కూర్చో!' అంది నందిని ఆసనం చూపుతూ. ఆడది తనను గౌరవిస్తుందో లేదో అన్న అసంతృప్తితో వచ్చాడు వీరమల్లు లోనికి వస్తూ. కానీ, నందినిని చూచేప్పటికి ఆమెలోని ఆకర్షణ, గంభీరం అతన్ని మార్చివేసింది. అతడు అమర్యాదా మర్యాదలమాట మరచి, తనామెకు గౌరవం ఈయాలను

కున్నాడు. పైగా ఏమిటూ ఈమె తీరు! ఎవరో రాజ వంశంలోని మనిషిలా, రాణీలా ఉందే! అనుకున్నాడు.

అతడు ఆసనమ్మీద కూర్చోలేదు. ఆమెముందు కూర్చో డానికెందుకో సందేహించాడు. అతని మనసు కూర్చోనీయ లేదు.

నందిని ఆ విషయం గమనించింది.

'రా! వీరమల్లూ! అలా కూర్చో! ఎప్పుడో ఒకసారి నీగూర్చి మధూలిక చెప్పింది. చూడాలనుకుంటూ ఉన్నాను. నీవు లేవని తెలిసింది. ఈ నాటికి ముడి వడింది,' అన్నది నందిని. నందినికి దాపుగా వెళ్ళి నిలచి పరికిస్తూంది మధూ లిక. అప్పటికీ వీరమల్లు కూర్చోలేదు-మాటాడలేదు.

'విషయాలన్నీ మధూలిక చెప్పే ఉంటుంది!' అన్నది నందిని.

'నాతో ఏమీ చెప్పలేదే!' అని మధూలికవంక చూచాడు.

'చెప్పలేదా? సరే! పోనీలే! నీవు అటూ యిటూ తిరుగుతూ ఉండడం దేనికి? ఎక్కడో ఒక చోట నికరంగా ఉండిపోరాదా?' అంది నందిని.

'ఎక్కడుంటే ఏముందిలెండి,' అన్నాడు. అతనెందుకో ఆమెముందు - అంత శరీరం, అంత బలం, ఎంతో ధైర్యం ఉండికూడా పిల్లిలా మసలుకొంటున్నాడు. సరిగ్గా నిలచి సమాధానం చెప్పలేకపోతున్నాడు ఆమెకు.

'ఆలోచించు వీరమల్లూ! ఇలా ఎంతకాలం తిరిగినా ప్రయోజన మేముంటుంది? నీకు కావాలంటే అవంతి సైన్యంలో ఏదో రాజోద్యోగం ఇప్పించగలను' అంది నందిని.

అతడు మౌనంగా ఊరుకున్నాడు.

'నీకేం తక్కువ? బలం ఉంది. ధైర్యశాలివి. ఎంత పనైనా చేయగలవు! దాదాపు నీతో పోల్చగలవారు ఈ అవంతిలో లేరు. అదీ నచ్చదా? మధురకు వెళ్ళు. నేనొక లేఖ రాసిస్తాను. లేఖకూడా అనవసరం - నీకు జయదేవులు తెలుసుకదా? ఈనాడు ఆయన మధురకు ఏలిక. ఇలా అవంతినుండి వచ్చానని చెప్పినా చాలు - ఏదో ఒక ఉద్యోగం ఈయగలడు. హాయిగా మధూ, నీవూ కలసి మధురలో ఉండండి' అంది.

వీరమల్లు తన్మయత్వంలో తత్తరలాడి పోయాడు. ఆమె మాటల్లో ఏదో తేనె ఉంది. అది ప్రతి అక్షరానికి అంటుకొని చెవులకు సోకుతుంటే ఏదో హాయిగా నాగానికి నాగస్వరం పట్టినట్టుగా ఉంది. ఎంతలేసి కర్కోటకోరగులైనా ఆ పలుకులు సోకిన వెంటనే సొమ్మసిల్లి పోతాయి. వీరమల్లు కూడా ఆ అవస్థలోనే ఉన్నాడు. తన నాగస్వరం పని చేస్తుందని, చేసిందని గమనించిన నందిని ఊరుకోలేదు.

'నీకు ఒకరిక్రింద పనిచేయడం ఇష్టం లేదంటావా? మధూలికను వెంటబెట్టుకో-మాళవానికి వెళ్ళు. నేను కొంత సొమ్మిస్తాను. అక్కడ ఏదేనా పొలం చూచుకొని కొనుక్కొని సేద్యం చెయ్యి. పాపం మధూలిక ఒక చోట, నీవు ఒక చోట ఇలా తిరగడం నాకు యిష్టం లేదు. మగ దక్షత లేకుండా ఉంటే ఆడదెంత అవస్థపడుతుందో నాకు తెలుసు వీరమల్లూ! నేను ఎంతో కాలంగా అనుభవిస్తున్నాను' అంది నందిని.

వీరమల్లు నీరు కారిపోయాడు. పొగరుపోతు. ఎవరి మాటా వినడు. ఎవరినీ లెక్కచేయడు - అన్న వీరమల్లు నీరుగారిపోయాడు. అదంతా మధూలిక ఆశ్చర్యంగా చూస్తూంది. ఏమిటీ నందినీదేవిలో ఉన్న శక్తి! ఒకనాడు

అధ్యక్షుడు జయసింహుని వెనుక వేసుకొని కూలనాడాడని, 'నీవు అధ్యక్షుడవయ్యావని ఒదులుతున్నాను. చేతకాక కాదు. నా దేశ గౌరవంకొరకు, మర్యాదకొరకు నేను తిరుగబడడం లేదు. లేకుంటే ఎంతైనా చేయగలను,' అని సాగిపోయాడు.

అలాంటి వీరమల్లు ఇంత అణకువగా నోరెత్తకుండా ఊరుకొనడమేమిటా అనుకుంది. కాస్తో కూస్తో మనసిచ్చాడు మధూలికకు. పరిస్థితులనుకూలించక తన మనసు చంపుకొని, అవతల అధ్యక్షులు-అతని ప్రక్క జయసింహుడు ఉన్నారని, తనకు మించిన కార్యమనీ ఊరుకుంటున్న వీరమల్లునకు మధూలిక నెపంతో మాటాడిన నందిని మాటలు రుచించకేం చేస్తాయి! ఆ సంగతి మధూలికకు అర్థంకాదు. వీరమల్లుకంతకన్నా అర్థంగాదు. అర్థం చేసుకోగలిగింది ఒక్క చతురిక మాత్రమే.

దానికి వీరమల్లు 'ఆలోచిద్దాంలెండి. ఇప్పుడే యేం తొందర?' అన్నాడు.

'నీకు తొందర లేకపోవచ్చు. ఆడదానికి తనవారితో ఉండాలని ఉంటుంది. ఆ విషయం ఆడదానికి మాత్రమే తెలుస్తుంది. మీ మగవాళ్ళు దాన్ని గ్రహించలేరయ్యా!' అంది నందిని.

'సరేలెండి చూస్తాను,' అన్నాడు వీరమల్లు.

'అలాగే! అదేమిటది? నీవు నిలబడే మాటాడుతున్నావు? ఇలాగైతే ఎలాగయ్యా? సరే! వెళ్ళిరా! అప్పుడప్పుడూ కనిపిస్తూండు. ఇప్పట్లో ఊరు వదలవుగదా?' అంది నందిని.

'లేదు లేదు!' అన్నాడు.

'ఆఁ! నీవు దొడ్డిదట్టు రావడం దేనికి? హాయిగా వీధి వాకిలిని రా. చాటుగా తిరగవలసిన పనిలేదు. నీకు అవసరమని తోస్తే ఏవేళ అని కూడా చూడకు. అవంతిలో నిన్ను ఎదిర్చగల మొనగాడులేడు,' అన్నది నందిని.

'నాకా! నాకెప్పుడూ భయంలేదు. కానీ, గౌరవంగా ఉందామని మంచికోసం చూస్తూన్నానమ్మా! లేకుంటే అధ్యక్షుని, వాడి బంటునూ నిల్వనా అవంతి పురపాలక కార్యాలయంముందు నరికిపారవేస్తాను. నన్నడ్డేవాడెవడు?' అన్నాడు వీరమల్లు ఉక్రోషంతో.

'ఆఁ! ఆఁ! త్వరపడకు. నరుక్కోడం, కొట్టుకోడం దేనికయ్యా చిన్న చిన్న విషయాలకు? నీకు భయమని కాదు నా భావం. నీకు మించినవాళ్ళు లేరనే సుమా! అలా అనుకోకు. ఆలోచించు! నీవు ప్రభుత్వం తరఫున ఉద్యోగం చేస్తానంటావా అదీ చూడగలను,' అంది నందిని. ఆమె అర్థం-చేస్తానంటావా? అంటే-'ఒద్దు. నా మనుష్యుడివిగా ఉండిపో' అని. అది వీరమల్లు అర్థం చేసుకోలేదు. అతనికి కచ్చితంగా నా క్రింద ఉద్యోగం చెయ్యి అంటేగాని తెలియదు. ఆమె కావాలనే అన్నది ఎంతవరకూ అర్థం చేసుకోగలడో చూడాలని. అదతనికి నిజంగానే అర్థం కాలేదు.

'చూద్దురుగాని లెండి! తర్వాతగదా?' అన్నాడు వీరమల్లు.

'సరే, నీ యిష్టం,' అంది నందిని. క్షణం నిలచి 'వెళ్ళి వస్తానండి!' అని బయలుదేరాడు. అతడు పోతుండగా - ఒక పర్వతం - ఒక యేనుగు వెళ్తూన్న రీతిగా అనిపించింది నందినికి. మధూలికను చూచింది: 'మధూ! నీకేమీ చెప్ప లేదా?' అంది.

మధు తల ఊపింది లేదన్నట్టు. నందిని నవ్వుతూ - 'నీ స్వంత విషయమనా!' అంది.

## 1 1

నందినీ చతురికా కలసి అవంతి వదలి విహారానికి చాలా దూరం వచ్చేశారు. ముందునాడు వాన కురిసి ఉండడంవల్ల మడుగుల్లో నీరు కొంత ఇంకి, కొంత ఆకసాన్ని చూస్తూంది-తను గూడా ఆకసానికి ఆవిరి రూపంలో ఎగసేదెప్పుడా అని, పైన ఆకసంలోని మబ్బులలో నేనెప్పుడు కరిగి నా వారిలో కలసి పోతానా? అని, తన నీడ చూచు కుంటుంది మడుగుల్లోనూ, సిప్రానదిలోనూ.

ప్రొద్దు వాలిపోయింది. కెంపు వన్నె లలుముకుంటు న్నాయి. ఆ కెంపు తగ్గడంతో చీకటి ఆక్రమిస్తుంది. లోకం చీకటి కౌగిట్లో చిక్కి సొక్కి సొక్కిపోవలసిందే. దూరాన తోటలు చీకటి కాశ్రయ మిచ్చి ఊరిమీదికి తరమాలని సిద్ధం చేస్తున్న పిశాచాలో అన్న తీరుగా ఉన్నాయి. సిప్రా నదిలోని నీరు తెల్లగా ప్రకృతి దేవత కట్టిన చీర పయ్యె దేమో అనిపిస్తుంది, ఒంపులు సొంపుగా తిరిగి.

ఎటెటో తిరిగి వస్తున్న మాలి వారిద్దరనూ చూచాడు. వారిద్దరూ అతనిని చూచారు. నందిని 'అదిగో నాలుగో గ్రహం! దానికి మన ఊసు లేదనుకుంటాను' అంది.

'ఊసు లేకేమమ్మా! ఉంటుంది. ఊసులో పని లేనట్టు బెట్టుగా ఉంటుంది. అంతే. అవకాశం, అదనూ దొరకితే ఒదలడు' అన్నది చతురిక.

'చతురికా! మంచి చిత్రకారుడుగదా? నా బొమ్మ వేస్తా డేమో!' అంది నందిని.

'ఏకాంతంగా దొరికాడుగా, అడిగి చూద్దామా?' అంది చతురిక.

'ఊఁ కానీ!' అంది నందిని ఉసిగొల్పే రీతిలో.

చతురిక మెల్లగా మాలి వెళ్ళుతున్న దారికి దారి తీసింది. ఆ త్రోవగా అటు వెళుతూన్న మాలి చతురిక రావడం చూచి ఆగాడు. సరాసరి చతురిక వెళ్ళి 'అమ్మగారు మీతో ఏదో మాటాడాలంటున్నారు. ఒకసారి వేంచేస్తారా?' అంది ఎంతో నమ్రతగా.

'నాతో ఏమ్మాటలు? వృద్ధజంబుకం ఉందిగా!' అన్నాడు వేసిన బొమ్మను సూక్ష్మ తప్పిదాలేమేనా ఉన్నాయేమోనని పరికించే తీరులో మాలి చతురికను చూస్తూ.

ఓహో! తీశాడు దెబ్బ. ఆడది తనంత తానుగా ఎదురుబడితే జరిగేదిదే. ఐనా వదలకూడదని నిశ్చయానికి వచ్చి- 'ఆ! ముసలి ముసలే-వయసు వయసే! జంబుకానికింత దడుస్తున్నారని మా అమ్మగారికి తెలియదులెండి,' అంది చతురిక.

'ఒకరికి దడవాలసిన కర్మ నాకేమిటి?' అన్నాడు మాలి. అంతలో నందిని అక్కడకు వచ్చింది.

'నమస్కారం అవంతీ సభా సభ్యులకు!' అంది నందిని.

'నమస్కారం' అన్నాడు నిర్లక్ష్యంగా మాలి.

'వారు 'వృద్ధ జంబుకం ఉందికదా?' అంటున్నారు అమ్మా!' అంది చతురిక

'అంటే అన్నారులేవే! వారికి తెలియనిదేముంది? వాళ్ళూ వాళ్ళూ ఒకటేగా. వారి నేస్తం-ఒక కంచం, ఒక మంచం, ఒక కామిని!' అంది నందిని.

మాలి స్తంభించి ఆగాడు. 'కాదంటారా స్వామీ ! మన మంతా అవంతీ కార్యవర్గం వారం. కాదన్నా ఎలా చెల్లు తుంది? ప్రజలూరుకుంటారా?' అంది మళ్ళీ నందిని.

మాలి కొంచం ఒళ్ళు దగ్గర పెట్టుకొని మాటాడాలను కున్నాడు. ఐనా అతనిలోని అహం చంపుకోడానికి అతని కిష్టంలేక—

'అధ్యక్షులకు పరివారమవుతామా? అల్పులం!' అన్నాడు. ఆ మాట అంటే 'అదేమిటిలెండి, మీ గొప్ప మీది-వారి గొప్ప వారిది' అని అంటుందని అతని భావం. కానీ నందిని—

'అదీ నిజమే ననుకోండి. కొన్నింటిలో కాకపోయినా కొన్నింటిలో భేదం లేనంతగా కలసి పోతాం తప్పదు. అన్నీ కలవవు. అంతవరకు నిజం!' అంది.

గబాలున 'మీ ఉద్దేశం?' అన్నాడు మాలి.

'ఉద్దేశా లేమున్నాయి. అడక్కన్న - నా ఉద్దేశా లేమిటి లెండి! చాలా దూరం వెళ్ళివస్తున్నట్టున్నారు. ఇంటికి బయలు దేరారా?' అంది నందిని మర్యాదగా, మాట మారుద్దామని.

'అదంతా అనవసరం. మాట మార్చ చూడకండి. మీ భావం నాకు తెలిసేలా చెప్పండి. అధ్యక్షునికీ నాకూ భేదాలు దేనికి లేవో? దేనికున్నాయో? చెప్పండి' అన్నాడు రోషంగా.

'నిజంగా చెప్పమనే అంటారా? మాట మార్చవలసిన అవసరం నాకేమిటి?' చాలా నిదానంగా అన్నది.

'చెప్పమనేగా అంటున్నాను!' ఆ మాటా దూకుడుగానే అన్నాడు మాలి.

'ఆఁ! తప్పదంటారు. వినండి! మీరు బొమ్మలు గీస్తారు. ఆయన గీయలేదు. ఆయన ముసలివాడు. మీరు వయసు వారు. ఆయన తెలివిగలవాడు. మీరు లేనివారు...'

'ఏఁవిఁటీ?' అన్నాడు గద్దిస్తూ మాట మధ్యలో.

'త్వరపడకండి! ఆగ్రహంతో రంకెలేస్తారేం? సాపత్యం కలసినవి వినండి-హాయిగా కాచిన సారా ఇద్దరూ త్రాగుతారు. అభాగ్యురాలు, అనాథ, దిక్కులేనిది అని తెలిసిన ఆడది దొరకితే భేదరహితంగా మీరూ, ఆయనా, ఇంకో ముగ్గురూ కూడా కలసి ఉచ్ఛ నీచమనకుండా, ఇంట్లో తల్లి ఉన్నదని, చెల్లెలున్నదని, పెళ్ళాయున్నదని వారిని కూడా ఒరులలా చేస్తే మనకెంత బాధగా ఉంటుందన్నది కూడా ఎంచకండా దాన్ని నాశనం చేయడానికి వెనుకాడరు. చాలా! ఇంకేమైనా చెప్పమంటారా?'

మాలి కళ్ళు ఎర్రబడ్డాయి. కోపంతో వణకి పోతున్నాడు. అతని పెదవులు అతని స్వాధీనంలో లేవు. అలాగే అతని చిత్రాలలోని మూర్తుల్లా నిలచిపోయాడు. నోట మాట పెకల్లేదు. అతడే పదం దగ్గర బిగుసుకు పోయాడో చతురికకు గాని, నందినికిగాని తెలియదు.

'సాపత్యం సరిపోయిందా? భేదం భేదంగానే ఉన్నదా?' అంది నందిని.

కొన్ని క్షణాల తర్వాత తెప్పరిల్లాడు. తెప్పరిల్లడం చూచి నందిని తిరిగి మొదలు పెట్టింది.

'మీరంతా ద్రోహులు. నీతిమాలిన వారు. నికృష్టులు. అవంతికి చీడ పురుగులు. ఒక రోజు వస్తుంది. ఆనాటికి మీమీ పాపాలకు పశ్చాత్తాప పడకతప్పదు. కళ్ళు మూసుకొని పాలుతాగే పిల్లుల్లా మీరుచేసే అక్రమాలు ఒరులకు

తెలియ వనుకుంటున్నారు. కానీ అన్నీ లోకానికి తెలుస్తూనే ఉన్నాయి. మీ ఆటలెంతో కాలం సాగవు! నా జీవితం ఇలా కావడానికి కారణం మీరు కాదా?' అన్నది. ఆ మాట అంటుండగా ఆమె గొంతులో ఏదో తెలియని మార్పు వచ్చింది.

'చేసే చేస్తాం! నీవెవరడగడానికి? నీ దిక్కున్న చోట చెప్పుకో!' అన్నాడు. ఆ మాటల్లో గంభీరం లేదు. చేతగాని తనంగా, ఏ ఆధారమూ లేని నిరాధారుల నే తీరులో అన్నాడు ఆక్రోశించినట్టుగా!

'తెల్లవారుతుండగా మిమ్మల్నందర్నీ పంచాయితీకి పిలిచి, ప్రశ్నించి, పౌరులచేత శిక్షలిప్పించగలను. మాలీ! నీమాలిన్యాన్ని కడుక్కో. ఈనాటికైనా పశ్చాత్తాపపడు,' అంది నందిని.

'పశ్చాత్తాపం! ఒక కులటను, ఒక జారిణిని, ఒక వేశ్యను ఏదో చేసినందుకు పశ్చాత్తాపమా? నీవు జరుపుతున్నదంతా ఎవరికి తెలియదని!...' అని ఇంకా ఏదో అనబోయాడు.

'ఈ క్షణం నిన్ను నానాహింసా పాలు చేయగలను. కానీ, యింకా మీ పాపాలు పండలేదు. మొన్న జయదేవుడు వచ్చినప్పుడే అడిగాడు. వరసగా మీ పేరులు చెప్పినట్లయితే ఏం జగగాలో అది జరిగి ఉండేది. కానీ, మించిపోయింది లేదు. చూస్తూ ఉండు మాలీ! మాలీ! చూస్తూ ఉండు. నీకు...ఎందుకులే!' అని ఊరుకుంది నందిని.

'జయదేవుడు నీ రంకు మగడా? అతడంత శూరుడా? చెప్పకపోయినావా?' అన్నాడు.

'మాలీ! నీకు కాలం లేదు. అనవసర ప్రేలాపన ప్రేలుతున్నావు.' అన్నది నందిని ఆ వేళంలోనే—

'అది నేననవలసిన మాట.' అన్నాడు. అతడు ఏమ్మాట్లాడుతున్నాడో అతనికి తెలియడం లేదు. తల తిరిగి ఉంది.

'నీవు త్రాగి లేవు కదా?' అన్నది నందిని అతన్ని పరీక్షగా చూస్తూ.

అంతలో చతురిక గబాలున ముందుకువచ్చి, కైజారుతీసి, 'మాలీ! ఇందాకటనుండి మాటాడినవన్నీ, ఏదీ - మరొకసారి మాటాడు. అని చూడు. ఏదీ ఏమన్నావు! అను.' అంది నిప్పులుగ్రక్కే చూపులు బరపుతూ. అతనికేమీ తోచలేదు. అతడు చేయి చేసుకోడానికి వీలులేదు. మాటలైతే ఎన్నైనా అనవచ్చు. కయ్యానికి ఆడదానితో దిగడం మంచిదికాదని అతనికి తెలుసు. ఐనా ఇందాకటినుండీ తను మాటాడినవన్నీ తలపులో మెదులుతున్నాయి. ఏమిటీ ఇలా మాటాడాను! నాకేమేనా పిచ్చిపట్టిందా? అసలు వారువచ్చి నన్నేమన్నారు? నేనేమన్నాను? అని తనను తాను ప్రశ్నించుకొని, ఐనా తగ్గకూడదని, లేనినవ్వు తెచ్చుకొన్న మోములో చిరునవ్వు నవ్వుతున్నట్టుగా—

'నీ చేతిని పళ్ళాలు అందంగా ఉంటాయిగాని కత్తులు, కైజారులు బావుండవు. వచ్చిన అతిథులకు సారా, ద్రాక్షాసవం. ఇంక ఏవేవో పట్టుకొని అందించాలి. వెళ్ళు. వెళ్ళి ఆపని చూచుకో,' అన్నాడు.

'మాలీ!' అన్నది చతురిక మించిపోతున్న ఆవేశంతో.

'చతురికా! వద్దూరుకో! పోనీ! నీ నా చేతులు పాడు చేసుకోడం దేనికి? రేపు ఉదయం వీధికి లాగుతాను. వదిలివెయ్యి! రేపే సభాంగణంలో ఈ ఐదుగురూ నిలచి ఏం సమాధానం చెపుతారో చెప్పుకుంటారు. అనవసరంగా

మన మెందుకు చేతులు పాడు చేసుకోడం?' అంది నందిని. చతురిక చేతిలోని కైజారును లాక్కుంటూ, 'వెళ్ళండి మహాశయా! రేపు ఉదయం చెప్పదలచుకున్న దేదో చెప్పు దురుగాని! నేనీ నగరుకు తిరిగి వచ్చిన దెందుకో తెలుసా? ఇందుకే! ఊరువంతా కట్టుకున్నదీ, కట్టుకుంటున్నదీ ఎందుకో తెలుసా? ఇందుకే. ఈనాడు నీవు అవంతిలో నాకు యెదురు నిల్వలేవు. అది మరచిపోకు. నీ తరతరాల చరిత్రనూ వెలికి లాగుతాను. దానికి కావలసిన సాక్ష్యాలు సేకరించాను. మరచిపోకు. ఆ పున్నమ రేయి, ఆ చీకటి జయదేవునితోట, తోటలో నాల్గు చెట్లమాటున జరిగింది మరచిపోకు. వెళ్ళు,' అని నందిని చతురికను చేయి పట్టుకొని జరజర ఈడ్చు కొంటూ వెళ్ళిపోయింది.

అలాగే బ్రాన్పడి నిలిచి పోయినాడు మాలి. అతనికేమీ దిక్కుతోచలేదు. ఏమి చేయవలసిందీ తెలియలేదు. తను రేపు నిండుగా దండిగా ఉన్న సభాసదుల ఎదుట నిల్వాలి కాబోలు. నిలచి, నందిని ఒకోమాట అడుగుతుంటే సమాధానం చెప్పాలి కాబోలు.

ఎంతపని జరిగింది! ఈ రోజెందుకింత పిచ్చిగా మాటాడాను! అసలు నేను అనవలసిన మాటలా? నందిని ఇది సామాన్యంగా ఉందా? ఈనాడు అవంతిలోని వారందరి కన్నా గొప్పది కదా? అందమైనది. దానికి తగినట్టు దాని తట్టు న్యాయం ఉంది. సభాసదులందరూ దానిమాట కాదనరు. గౌరవం సంపాదించింది. దానికి తగిన హోదాలో ఉన్నతంలో ఉంది. అందరూ దానివిషయం తెలిసిన మరుక్షణం బ్రతుకనిస్తారా? తోలు బొమ్మలను చేసి ఆడిస్తుంది. ఈ క్షణం అదన్నట్టు ఏం చేయించలేదు? సర్వం చేయించగల సమర్థురాలుగదా? దానితో ఎందుకు పెట్టుకున్నాను? నిజంగా

రేపు ఉదయానికి పంచాయితీ ఏర్పాటు చేస్తే! నా పరువు, నా మర్యాదా ఏంకావాలి? ఊరుకుంటుందా? ఊరుకోదు. అమ్మో! అది కత్తులూ కఠార్లతో తిరుగుతుంది. ఏం చేయాలి? ఏమి చేసినా ప్రయోజనం ఉండదు. మించిపోయింది. వారందరి సంగతి యేమిటి? మేమెదుగురం కలిస్తే దానిని మట్టుపెట్టలేమా! వెళ్ళి రణవర్మతో మాటాడనా? రణవర్మ కూడా దానిమనిషే. జయపాలుడుమాత్రం తిరిగి సంబంధం పెట్టుకోలేదు. అధ్యక్షుడు, రణవర్మ, రాధానాధుడు ఈ ముగ్గురూ దానితో తిరిగి మంతనాలేర్పరచుకున్నారు. నేనూ, జయపాలుడుమాత్రం దూరంగా ఉంటున్నాం. ఆ ముగ్గురూ కాదని, అది ఎవరో ఆ నామకుల ముగ్గురను వెలికి లాగిం దంటే చేయగలిగిందేముంది?—అని చాలా ఆలోచించి ఎటూ పాలుపోక, ఏమీ తోచక తన దారిన తాను బయలు దేరాడు. అతనికెటుపోవడానికీ తోచిందికాదు. అలాగే ఆ ఊరుబైట చాలా ప్రొద్దు పోయేంతవరకూ తిరిగాడు. తిరిగి యింటికి పోవడమో, మానడమో తేల్చుకోలేక ఆలోచనారహితంగా ఆలోచిస్తూ పిచ్చివానిలా తిరగాడు ఆ సిప్రానది వొడ్డున మాలి.

చతురికా, నందినీ యింటిముఖం పట్టారు. దారిలో యిద్దరూ ఎవరి ఆలోచన వారు ఆలోచించడంలోనే సరి పోయింది. ఒకరితో ఒకరు చాలాసేపటివరకూ మాటాడ లేదు. వీధుల్లో దీపాలు వెలిగాయి. ఆకసాన సన్నసన్నగా నక్షత్రాలు మిల మిలమంటున్నాయి. చల్లని గాలి తోలుతూ ఉంది. ప్రాణాలకు హాయిగా ఉంది. కానీ, యిద్దరకూ పగ సెగలాడుస్తూంది. నందినే ముందుగా—

'చతురికా! అతడెందుకే అలా అర్థం పర్థం లేకుండా మాటాడాడు?' అంది.

'అదే ఆలోచిస్తున్నాను. మన అవంతి సభ్యుల్లో నిదానస్తుడు, పిరికివాడు మాలి. అలాంటివాడు ఇంత చంచలంగా ఎలా మాటాడాడా అన్నదే నాకు పట్టుకుంది!' అంది చతురిక ఆలోచిస్తూ.

'ఒకవేళ ఉండవచ్చునే! అతదేదేనా చిరాకులో ఉండగా మనం కనిపించి ఉండవచ్చు! ఆ చిరాకు మన మీద పడి ఉంటుంది. లేకుంటే అసలలా మాటలాడడానికి వీలులేదు,' అంది నందిని.

'అన్నట్టు రేపు సభకు లాగుతారామరి?' అనడిగింది చతురిక ముందుపోతున్నది కాస్తా ఆగి, నందినిని చూస్తూ. చతురిక ఆగడంవలన నందినికూడా ఆగి, 'అప్పుడేనా! ఇంకా ఉంది. అసలు వారందరినీ అవంతిలో నిలవేసి ఎలా ఆడగాలా అన్నది ప్రశ్న. అది సరేగాని అలా కైజారు తీసుకొని తిరుగబడ్డావెందుకే?——అంత అణచుకోలేని ఆవేశమా?' అంది నందిని.

'చాలా రెచ్చి మాటాడాడమ్మా! లేకుంటే నేనెందుకు కల్పించుకొంటాను?' అంది చతురిక.

'మనం తక్కువ మాటాడామా? అసలతన్ని కొంతవరకు రెచ్చకొట్టాం. దానికి తగినట్టు ఏదో అతను చిరాకులోనూ ఉన్నాడు. అన్నీ కలసి వచ్చాయి. పోతే ఒక్క జయపాలుడున్నాడు. అతని సంగతికూడా తేల్చాలి. ఒకసారి మాటాడి, ఆ తర్వాత కార్యరంగంలోనికి దూకాలి!' అంది నందిని.

'మీరు పూర్వంలా దేవళంలో నాట్యం చేస్తూనే ఉన్నారా-వారం వారం?'

'లేదే, వెళ్ళడంలేదు. సభ్యత్వమందాక పెద్దలంతా వద్దన్నారు. అందుకని మానివేశాను. నీవు వెళ్ళాక ఏమంత పెద్ద మార్పులు రాలేదు. నీవు ఉన్నప్పుడే మానేశాను కదూ? అంతే! మళ్ళీ వెళ్ళలేదు. ఏం అలా అడిగావు? దానితో ఇప్పుడేమవసరం వచ్చింది?' అంది నందిని.

'ఏం లేదు. ఆ రోజుల్లో జయపాలుడుకూడా వస్తూ ఉండేవాడు. అక్కడే అతనితోనూ పరిచయం కలుగుతుంది కదాని యోచించాను.'

'లేదు. రేపు మనం ఒక పని చేద్దాం. సరాసరి జయపాలుని యింటికి వెళదాం. అవంతిలోని ధనవంతులలో అగ్రశ్రేణి వాడు కదూ? అతని భవనం చూడాలని కూడా ఉంది. వెళదామా?' అంది నందిని.

'మీ యిష్టం. దానికేం! వెళదామంటే వెళదాం!' అంది చతురిక.

'వెళ్ళాలి. తప్పదు! అతడెలా మాటాడతాడో చూడాలి,' అంది నందిని.

'ఎలా మాటాడతాడు? గడపెక్కుతున్నాం గాబట్టి మర్యాదగానే మాటాడవచ్చు! నా అభిప్రాయంలో వారి వంశంలో అతనొక్కడే అలాటివాడు. మిగిలినవారంతా ఉత్తమోత్తములు,' అంది చతురిక.

'వారితో మనకేం పని?' అంది నందిని.

'నిజమే! వారితో పని లేకపోయినా వారి ఇంటికి వెళ్తున్నాం కదా?' అంది చతురిక. ఇద్దరూ అలా మాటాడుకుంటూనే మందిరం చేరారు.

మందిరం వెన్నెలలో అందంగా కలకల లాడుతూ ఉంది. నందిని తన మందిరాన్ని తను చూచి, తనలో తాను ఆనందంలో మునిగి పోయింది.

మందిరంలోనికి అడుగు పెడుతుండగా 'అధ్యక్షుల వారొచ్చారమ్మా!' అని దాసీది చెప్పింది. ప్రయత్నం లేకుండా నందిని అడుగులు వేగిరించాయి. సరాసరి అధ్యక్షు లున్న గదిలోనికి వెళ్ళి ఆసనమ్మీదున్న అధ్యక్షులను చూచి నమస్కరించింది. చాలా కాలంగా ముభావంగా ఉంటు న్నాడతడు. అధ్యక్షుడు ప్రతి నమస్కారం చేశాడు అచేతనంగా, ఆలోచనా రహితంగా ఆమెను చూస్తూ.

'ఎంత సేపయింది వచ్చి? చాలా జాగయ్యిందా?' అంది నందిని ఆప్యాయంగానే.

'ఆఁ! ఏమంత సేపు కాలేదు. ఇంతకు ముందే వచ్చాను. అడిగి ఇలా కూర్చున్నాను. అంతలో నీవు రావడం దూరాన కనిపించింది. అంతే' అన్నాడు అధ్యక్షుడు.

'కూర్చోండి ఇదిగో వచ్చేస్తాను,' అంది నందిని లోనికి వెళ్తూ.

'నీతో మాటాడాలని వచ్చాను. త్వరగా రా!' అన్నాడు అధ్యక్షుడు-లేకుంటే రానన్నట్టుగా. నందిని లోనికి వెళ్ళేది ఆగి, వెను దిరిగి వచ్చి, 'రాక రాక వచ్చారు. అంత తొందరగా.

'ఆదేం లేదు. నీవు వెళ్ళిరా!' అన్నాడు. అధ్యక్షునిలో మునుపటి చొరవ కనిపించడం లేదు. ఏదో ముభావంగా మాటాడుతున్నాడు. ఆ విషయం గ్రహించింది, లోనికి వెళ్ళి

బట్టలు మార్చుకొని 'తు ణాల్లో తిరిగి వచ్చింది. అధ్యక్షుని కెదురుగా ఉన్న ఆసనమ్మీద కూర్చొని —

'మధూ! మధూలికా!' అన్నది నందిని.

'ఎందుకూ సవం తేవడానికేనా?' అని, తల అడ్డంగా ఆడించాడు అక్కర లేదని.

ఆశ్చర్యంగా చూచి ఊరుకుంది నందిని.

'నేనొకటి అడగాలని వచ్చాను.' అన్నాడు అధ్యక్షుడు.

'అదేమిటలా మాటాడుతున్నారు? మనమేదో దూర దూరాలకు సాగిపోయినట్టుగా! అసలు మీరు అదొక విధంగా కనుపిస్తున్నారు. నాకు తెలియకుండా నేనేదేనా పొర పాటు చేశానా?' అంది నందిని చాలా సాత్వికంగా, భయ పడుతున్నట్టుగా.

'ఏం లేదు. నీవు రాధానాధునితో ఏకాంతంగా ఎప్పు డైనా మాటాడావా?' అనడిగాడు అధ్యక్షుడు.

'అంతేకదా? ఏమో అనుకున్నాను. చాలా కాలం క్రితం ఒకసారి మాటాడాను. అప్పుడు సిప్రాలో నీరు లేదు. వాహ్యాళికి వెళ్ళాం నేనూ, మధూలికా! అతడు మమ్ము చూచి, నాతో మాట్లాడాలనే తలంపుతోనే తారస లాడాడు. అప్పుడు మాటాడాను' అంది నందిని.

'అది చాలదా? చాలు. అనాడు నీవు గ్రహించలేదు. రణవర్మ మిమ్ము వెంటనంటి ఉన్నాడు. మీకు తెలియకుండా ఆ విషయం పురస్కరించుకొని అవాకులూ చవాకులూ కల్పించాడు. మొన్న సభకు నీవు రాలేదు. సభంతా నీమీదనే జరిగింది. అంటే బహిరంగ సభ మామూలుగా అయ్యాక, అంతరంగిక సభ అని అంతా కలసి మాటాడాం. అందులో నీవు సభ్యురాలుగా తగవని, నీవు చాలామందితో

సంబంధాలు పెట్టుకున్నావు అని. దానికి నిదర్శనంగా నన్ను మొదట, ఆ తర్వాత తను, ఆ తర్వాత రాధానాథుడు నీతో బంధాలు పెట్టుకున్నట్టుగా అడిగించాడు. అందువల్లనే నేను రావడంలేదు. ఈనాడుకూడా నామీద చాలామంది నా వెనుక వేగుగా తిరుగుతున్నారు. ఈ సారి సభలో నిన్ను నిలవేసి అడుగుతారట. ఆ తర్వాత నీ కులవృత్తిని నీచేత ఈ అవంతిలోనే పెట్టించాలని ఒక తీర్మానం చేయాలని సభ్యులందరనూ కూడకట్టుకొన్నారు. నీ నా బలం చాలదు. ఆలోచించుకో. నేను తడవుండరాదు' అన్నాడు అధ్యక్షుడు చాలా బాధగా - అది నిజమైనదో, అలా నటిస్తున్నాడో ఆమె కర్థం కాకుండా!

నందినిగుండె లవసిపోయాయి. ఒళ్ళంతా కంపరంలో వడవడ వణకి పోయింది. ఆమెలో ఆవేశం లేచింది. కానీ సమయంకాదని తమాయించుకొని పనిలోపని తేలిపోవాలని-

'ఆఁ హాఁ! అందుకే మాలి ఇందాకనంత తూలి మాటాడాడు,' అంది.

'ఏఁవిఁటీ! మాలితోకూడా మాటాడావా? యింకనేం,' అన్నాడు.

'ఇప్పుడే. ఇంతకు ముందే. అదీ సంధ్యలోనే. ఉత్తర దిక్కుగా నీప్రాపైపు వెళ్ళాం నేను, చతురిక. అటునుండి వస్తున్నాడు. ఎదురుపడ్డాం, మాటాడకుంటే బావుండదు- తోటి సభ్యుడు కనుక మాటాడడంకోసం నమస్కరించాను. చాలా చాలా తూలాడు. అవంతి సభ్యుడు అంత నీచంగా, అంత తక్కువగా దిగజారి మాటాడతాడనుకోలేదు. ఆఖరుకు మిమ్మల్నీ నన్నూ కలిసికూడా అన్నాడు. ముసలిజంబుకం లాటి అశ్లీలాలు వాడాడు. చతురిక కైజారు తీసింది,

అపాను నేనే. లేకుంటే ఏం జరిగేదో!' అంది నందిని, టూకీగా నాలుగు ముక్కల్లో అంతా ఇమిడ్చి.

'ఈసారి సభలోని గందరగోళాని కిదొకటన్న మాట. నీవు చేసేవన్నీ వెలికి కనిపిస్తున్నాయి. వారు చేసేవేవీ కనుపించడం లేదు. నీకు అవంతిలో రక్షణ చాలా తగ్గిపోయింది. ఏదో ఏహ్యాభావం తలెత్తింది. దానిని వారు సరిగా వాడుకుంటున్నారు. దానికి తగినట్లు నీవు వీరమల్లును నీ యింటికి రప్పించావుట. ఆడదానివి ఒంటరిగా ఉంటావు. ఏది ఏ క్షణాన జరుగుతుందో చెప్పడం కష్టం. కాస్త జాగ్రత్తగా ఉండు. ఇంతకన్న నేను చేయగల్గిన సాయం లేదు. ఆ నల్గురూ ఒకటయ్యారు - రణవర్మ, జయపాలుడు, మాలి, రాధానాధుడు-మరచిపోకు,' అన్నాడు అధ్యక్షుడు ఆసన మ్మీదనుండి లేస్తూ.

'అప్పుడే వెళ్ళిపోతారా!' అంది నందిని.

'ఎక్కువసేపిక్కడ ఉండకూడదు. నేను వెళ్ళాలి. నీవు కొంచం జాగ్రత్తగా ఉండు. నాలుగైదు నాళ్ళల్లో సభ పెట్టాలి, అన్నారు. అందులో ఎవరు ఎలా ఎటు మాటాడతారో తెలియదు.' అని, అధ్యక్షుడు నడక సాగించాడు. ఒక్కసారి తల విసరి చూపులు పరిపి చూచింది వెళ్తున్న అధ్యక్షుని నందిని.

ఆ రేయి ఆమె కాహారం సహించలేదు. ఏమిటీ సమస్యలు? ఏమిటీ మాటలు? అధ్యక్షుని నమ్మవచ్చునా! నమ్మకూడదా! ఆమెకు నిద్రలేదు. అర్ధరాత్రయింది. నా మనుష్యుల్లో ఎందరు వారి వారున్నారో - అనుకుంది. జరజర క్రిందికి వచ్చింది. మిద్దిమీదనుండి క్రింద దొడ్డి దగ్గర కిటికీలోనుండి చూచింది. తిరిగి మందిరంపైకి వెళ్ళింది. ప్రతి కిటికీ దగరా నిలచి నాల్గుప్రక్కలా పరికించింది. చదీ

చప్పుడూ లేదు. అంతా చీకటి! వెలుగులేదు. పరీక్షగా చూస్తే గాని ఏదీ కనిపించదు. పాన్పు మీద పడుకుంది. నిద్ర పట్టడంలేదు. రెప్పలు బరువుగా ఉన్నాయిగాని మూతలు పడడంలేదు. ఏమిటీ నా జీవనం? నేనిలా ఎందుకు తయారయ్యాను. నాకేం కావాలి? నేనేం చెయ్యాలి? నా ధ్యేయమేమిటి? ఏ ధ్యేయంతో ఇలా మసలుతున్నాను? నేనెవరి కొరకు బ్రతకాలి? కావలసిన జయదేవుడు అలా దూరమయ్యాడు. కావాలని వచ్చినా గెంటి వేశాను. రోజూ ప్రాణభయంతో ఎన్నాళ్ళిలా బ్రతగ్గలను? వారివారి ఉచ్చులు వారువారుగానే బిగించుకుంటున్నారు. ఇక నా జాగు కూడదు. కానీ! ఏది ఎలా జరగాలనుందో అలా జరిపివేస్తాను-అనుకుని కళ్ళు మూసుకుంది. నిద్ర ఆవరిస్తూంది. కనులు బాగా మత్తుకు లొంగిపోయాయి.

'చఫ్'మని మ్రోతవచ్చింది. తన శయ్యాకువచ్చి గుచ్చుకున్నదొక అంబు. ధన్‌మని మ్రోత వచ్చింది. వెలుపల ఏదో చెట్టు ఆకులు గలగల లాడాయి. శయ్యమీదనుండి లేచింది. చేతులు చరచింది. నాల్గు ప్రక్కలనుండీ అడుగుల సవ్వడయ్యింది. నలుగురు మహాకాయుల ద్వారాలవద్ద నిలిచారు. క్షణాలలోనే.

'మీరంతా ఏం చేస్తున్నారు? కొద్దిపాటులో తప్పింది. ఇదిగో!' అని శయ్యకు గుచ్చుకున్న అంబును లాగి ద్వారం లోనికి విసరంది, విసరుగా.

'అమ్మగారూ! మీరునిద్రిస్తుంటారు-మీకు నిద్రాభంగమని ఊరుకున్నాం. వీడే బాణం వదలినవాడు. అని వేసినవానిని ముందుకు నెట్టారు. వాడు ద్వారం తెరలోనుండి వచ్చి బోరగిల పడ్డాడు. అంతా రెప్పపాటు-వాడి అంబు రావడం-వాణ్ణి పట్టుకోడం జరిగిపోయింది.

ఆ క్రింద పడిన వానిని దివ్వె వెలుగులో నఖ-శిఖ పర్యంతం పరికించి 'ఎవరు నీవు?' అంది నందిని. వాడు మాటాడ లేదు.

'అతని చేత నిజం చెప్పించండి' అంది నందిని.

మహాకాయుడొకడు లోనికి వచ్చి రెండు రెక్కలూ విరచి బిగించాడు. వెలుపలున్న ఒకడు, 'వాడు జయపాలుని మనిషమ్మా!' అన్నాడు.

'వాడిచేత నిజం చెప్పించండి' అంది నందిని.

పట్టుకున్న రెక్కల బాధను ఓర్చుకుంటున్నాడుగాని వాడు చెప్ప లేదు. 'సరే వాడికి చేయవలసింది చెబుతాను. వాడు జయపాలుని మనిషని మీకు బాగా తెలుసా?' అంది నందిని.

'తెలుసు' అన్నారు. 'సరే మీరంతా వెళ్ళండి. ఒక్కరు రండి ఇటు' అంది నందిని.

అంతా వెళ్ళిపోయారు. ఒక్కడు మాత్రమే మిగిలాడు.

'రేపు ఈ వేళకు-కాదు, ఇంకొక జాములో సిప్రా నది ఒడ్డున అలగాచే మైదానంలో - కాదు... నా తోటలో అంటే పూర్వం జయదేవుని తోటలో మామిడి చెట్ల క్రింద నేనుంటాను. జయపాలుని అక్కడికి చేర్చాలి. నలుగురు చాలు. నోట మాట రాకుండా చూడండి. అంతే' అంది నందిని కోపంగా, గంభీరంగా.

'చిత్తం. మీకు తోడు?' అన్నాడు ఆగంతకుడు.

'నాతో వీరమల్లు వస్తాడు. వెళ్ళండి' అంది నందిని. అతడు వెళ్ళిపోయాడు. అటూ ఇటూ నాల్గుసార్లు తిరిగింది. ఆమెకు కాలూ చేయీ ఆడడం లేదు. నిదుర పట్టడం లేదు

నిలువు నా కోపం దహించేస్తూంది. జయపాలుడు! అతని బంటు! తిరిగి చప్పట్లు చరచింది. కొన్ని క్షణాల తర్వాత ద్వారం దగ్గర ఆకారం నిలచింది.

'నిజం చెప్పాడా?' అంది.

'లేదు' అన్నది ఆకారం.

'కొన్ని క్షణాలు చూడండి. వాణ్ని హింసించండి గాని చంపకండి' అంది. ఆ ఆకారం వెళ్ళిపోయింది. తిరిగి ఆమె అటూ ఇటూ పచారు చేసింది. అంతలో ఒక ఆకారం తెర దగ్గర నిలచింది.

'ఏమిటి?' అంది నందిని.

'అధ్యక్షులవారు, జయపాలుడూ కలసి నూరు మొహరీలిస్తామన్నారట మిమ్మల్ని హత్య చేస్తే. వాడు జయపాలుని మనిషి.' అన్నదాకారం.

'మంచిది. వాడి నాలుక కోసి వదలి వెయ్యండి. ఒక మాట. వాడికి చదవడం రాయడం వచ్చునేమో అడగండి. వచ్చునంటే...ఉండు వస్తున్నాను' అని లోనికి వెళ్ళి ఒక సంచీలో డబ్బు, ఒక చేతిలో రెండు మాత్రలూ తెచ్చి 'చదువు రాదంటే నాలుక కొయ్యండి. చదువు వచ్చునంటే ఈ రెండు గుళికలూ మింగించి ఈ సంచీ ఇచ్చి పంపండి. వాడికి తెల్లవారాక వాడు తిరుగుతున్న లోకంతో సంబంధం లేకుండా ఉంటాడు. ప్రాణానికేం భయం లేదు, వెళ్ళు' అంది నందిని.

'చిత్తం.' అని వెళ్ళిపోయిందా ఆకారం.

మా మా కక్షల మధ్య అమాయకులూ, డబ్బుకు పనిచేసే వారు కూడా అన్యాయమవుతున్నారు. వారికా విధమైన శిక్ష చాలా అవసరం. లేకంటే... లేకంటే... ఏముంది?

ఏమీ కాదు. వాడు కడుపున లేక లేక దా, నన్ను హత్య చేయాలనుకున్నాడు. చేయమనగానే లొంగాడు. న్యాయా న్యాయాలు విచారిస్తే కార్యం సాధించలేను. ఇలాగే జరిగి పోనీ!

అధ్యక్షులు ఎంత జిత్తులమారి! నా జాగ్రత్తలో నేను న్నానని తెలిసి, తను కూడా కలసి హత్యా ప్రయత్నం చేస్తూ, ముందుగా వచ్చి నాకు హెచ్చరిక చేసి పోతాడా! సరే కానీ! చూస్తాను. అధ్యక్షా! నిన్ను. చిత్రవధ చేయి స్తాను. అందరికీ శిక్ష చెప్పినా నీకు మాత్రం శిక్ష నీయ కుండా వదలుదామనుకున్నాను. ఇందులో నీ పాత్ర మిక్కిలిగా ఉందా! సరే: జయపాలుడు ఈ రేయి అయి పోతాడు. ఉదయం ఎలా ఉంటుందో అతనికి తెలియదు. పాపం జయపాలుడు! అనుకుంది. ఘూము కాలం ఎలా నెట్టాలి? సరే నిద్ర పోతాను. నిద్ర పట్టదు. మంచిది. బయలుదేరి ఆ తోటలోనే ఉంటాను - అనుకొని అటూ ఇటూ తిరగింది. రెండు క్షణాలు దొర్లిపోయాయి. త్వరి తంగా వెళ్ళడం దేనికనుకొంది. తిరిగి క్రింది అంతస్తుకు వచ్చింది. నాల్గు వంకలా జాగరూకతగా ప్రతి జాగాలో నిలచి పరికించింది. తనకెక్కడా అనుమానం తోచలేదు. వెళదామని తిరిగి మందిరోపరితలానికి వెళ్ళింది. బట్టలు మార్చుకుంది. కారు నలుపు వస్త్రాలు ధరించింది. క్రింది నుండి పైదాకా నల్లని వస్త్రం కప్పుకుంది. అడుగు ముందుకు వేసింది. ద్వారం పరజాల మాటున నీడలు నిలచాయి.

'ఎవరది? ఏమయింది?' అంది నందని.

'మేము వెళ్ళేప్పటికి జయపాలుడు లోకాన్ని వదలి పోయాడమ్మా!'

'ఏమిటీ?' అంది నందిని తన నీలి దుకూలాలు తొలగించి తెరవంకకు చూస్తూ.

'జయపాలు నెవరో హత్య చేశారు. మేము లోనికి వెళ్ళి శయ్యమీద ఉన్న అతన్ని కదిపాం. నెత్తురోడుస్తున్న శరీరంతో శయ్యంతా నెత్తురుతో నిండి పోయింది.'

'మందిరంలో ఎవరికీ తెలియదా? మందిరంలోని కావలి వారెవ్వరూ దానిని గురించెరుగరా?' అంది నందిని ఆశ్చర్య పోతూ.

'నోటికి గుడ్డలు కట్టి ఉన్నాయి. గుండెల్లో బాకు గృచ్చుకోనుంది.'

'మీరు వెళ్ళేప్పటికి దివ్వెలేమైనా వెలుగుతున్నాయా, అతని శయన మందిరంలో!' అంది నందిని.

'ఒక్క దివ్వె మాత్రమే ఉంది.'

'మీరు చూచేటప్పటికి యింకా నెతురోడుతూ ఉందా అతని కళేబరం? బాకు అలానే ఉందా?'

'ఆ! మా చేతులకుకూడా అయ్యింది. బాకును మేము కదలించలేదు.'

'వాన్ని మీరేమీ కదలించలేదుగా?' అంది నందిని.

'అదే! త్రిప్పి ఎత్తుకోవాలనుకొని ప్రయత్నంలో ఉండగా తెలిసింది.'

'మంచిది. మీరిక వెళ్ళవచ్చు. ఒకరు వెళ్ళి గుప్తంగా అధ్యక్షు లేమిచేస్తున్నారో. ఈ రాత్రికంతా పరికించండి. ఆఖరు రంగం మొదలయ్యింది. ఎవ్వరినీ నమ్మకండి. వెళ్ళండి' అంది నందిని. నీడలన్నీ వెళ్ళి పోయాయి. తన నీలి అంబరాలన్నీ తొలగించి తెల్లబట్టలు కట్టుకొని అలసిన తీరుగా శయ్య

మీద తనువు వాల్చింది. జయపాలుని ఎవరో హత్య చేశారు? ఎవరు చేసుంటారు? నడిరేయి దాటింది. జయపాలుడూ, అధ్యక్షుడూ కూడబలుక్కొని నన్ను హత్య చేయాలను కున్నారు. జయపాలుకు హత్యగావించబడినాడు. ఎవరి కార్యమిది? జయపాలునికి నాకన్న శత్రువు లెవరున్నారు? అతని మందిరంలో అతని శయ్యమీద బాకుతో పొడిచి చంపారు. అవంతిలో రక్తపాతం మొదలయ్యింది. ఇక నెవ్వరూ రక్షించలేరు. నాకు ఎవరో ఘటికుడైన ప్రత్యర్థి ఉన్నాడు. అతడెవ్వరై ఉంటాడు? రణవర్మ కాదు. అతనికి తెలివిలేదు. బలంతప్ప తెలివిగా చేయలేడు. ఇది బుద్ధి బలంతో చేసిన పని. అటు జయపాలుడు, ఇటు నేనూ వదలి పోవాలనుకున్నారు? ఎవరు? బహుశా అధ్యక్షులు. అతనికి నేనేమీ హాని తలపెట్టలేదు కదా? ఎందువల్ల అలా జరిగింది? దానికి కారణం ఏదో ఉండాలి, తెలుసుకుంటాను.

ఆమెకు నిద్ర రావడంలేదు. అయినా శయ్యమీద అలాగే మేనువాల్చి కన్నులు గట్టిగా మూసి నిద్రకోసం అలమటిస్తూంది. జయపాలుడు ఎదురుగా నిలచి 'నందినీ దేవీ! చూచావా! నిన్ను హత్యచేయ తలపెట్టిన నాకు... నాకు... నేనే బలైపోయాను' అంటున్నాడు.

నందిని తత్తరంతో కనులు విచ్చింది. ఎదురుగా ఏరూ లేరు. ఇదంతా భ్రమ! అనుకుంది. తిరిగి శయ్యమీద అలాగే పడుకుంది.

ఆమెకింకా నిద్ర పట్టలేదు. మత్తుగా, మగతగా నిద్ర వచ్చీ రాకండా ఉంది.

తన శయన మందిరానికి దక్షిణంలో ఉన్న కిటికీలో నుండి పెద్దగా 'అమ్మా!' అన్న ఆక్రందన వినిపించింది.

హఠాత్తుగా వినిపించిన ఆ ఆక్రందన చాలాదూరం విని పించింది. వాతావరణం నిశ్శబ్దంగా ఉంది. ఈ ఆక్రందన విని చుట్టుపట్ల ఉన్న దాసదాసీలంతా మేల్కొన్నారు. దూరాన ఉన్న మందిరాల వారంతా నిద్రలేచి నందిని మందిరం దాపుకు వచ్చారు. ప్రకృతంతా చీకటిగా ఉంది. నందిని గబాలున శయ్యామీదనుండి లేచింది. దక్షిణ దిక్కు కిటికీవంక చూచింది. కిటికీదగ్గర ఒక ఆకారం అలాగే కరచుకొని అంటుకు పోయిన రీతిలో ఉంది.

అంతలో దాసీలు చతురిక, మధూలిక అంతా ఆమె శయన మందిరంలోనికి వచ్చారు. వారందరినీ చూచి నందిని 'దివ్వెలు వెలిగించండి' అంది. పరిచారికలు దివ్వెలు వెలిగించే కార్యంలో మునిగిపోయారు. క్షణంలో మందిరమంతా వెలుగుతో నిండిపోయింది.

వాడలోని వారంతా ఆ మేడచుట్టూ చేరారు. కొందరు బాగా నందినితో పరిచయమున్నవారు - 'ఏమిటీ? ఏమిటీ?' అంటూ మందిరోపరితలానికి వచ్చారు.

'అంతా అటు వెళ్ళకండి. ఏమి జరిగిందో ఏమో నాకూ తెలియదు. ఆక్రందన విని నేనూ లేచాను. మనంగా ఏమీ పట్టించుకోడం భావ్యంకాదు. నగర పెద్దలున్నారు. చతురికా! నీవు వెళ్ళి అధ్యక్షులవారిని పిలుచుకొని రా. మధూ! నీవు వెళ్ళి రణవర్మగారిని, కాపాలకా! నీవు వెళ్ళి మాలిగారిని, జయపాలునీ పిలు. చతురికా! నీవు వస్తూ వస్తూ రాధానాధులను పిలచి రా. కళ్యాణీ! నీవు వెళ్ళి మిగిలిన సభ్యులందరనూ పిలుచుకొని రా. త్వరగా క్షణాల్లో రండి!' అంది నందిని. అంతా వెళ్ళారు తన పరిచారికలు. తనవారు చుట్టుపట్లలేరు—

వచ్చినవారూ, ఆమే కిటికీకి కొంచం దూరంలో నిలచి పరికించారు. ఎవరో పూర్తిగా మోముకు నిండుగా ముసుగు కప్పుకొని కిటికీకి కరచుకొని ఉన్నారు. వెనుకనుండి అంబు అతని వెన్నునుండి కిటికీకి ప్రక్కనున్న చెక్కలోనికి గ్రుచ్చుకొని ఉంది. ఆ మూర్తి ప్రాణాలతో లేదు. ఆ కళేబరం మాత్రమే ఉంది. మందిరంలో చేరినవారిలో ఒకరు పరీక్షగా దానిని చూచి—

'ఎవరో ఆ తల ముసుగు తొలగించి చూద్దాం,' అన్నారు.

నందిని 'వద్దు. పెద్దలు వచ్చాక వారు తొలగించిన పిదప చూడవచ్చు. మనంగా ఏదీ స్వతంత్రించరాదు. అతడెవరో, ఏమిటో, ఎందుకు వచ్చాడో! ఎవరతన్నలా బాణంతో కొట్టారో! మనకెందుకు? ఐనా యిది నా మందిరంలో జరగడమేమిటి? ఎంత అప్రతిష్ట!' అంది నందిని విచార వదనంతో అక్కడ చేరిన వారందరినీ పరీక్షిస్తూనే. ఒక వంక - ఈ రాత్రి యిది రెండో ప్రయత్నమా? తెలుసు కుంటారు! ఎవరు తీసిన గోతుల్లోనికి వారినే నెడతాను. ఓ అవంతీ సభ్యుల్లారా! మీ గోతులు మీరే తీసుకుంటు న్నారు. నేనింతకాలం చేతగానిదానిగా ఊరుకోలేదు. రంగంలోనికి దిగడమెలాగా అన్న యోచనలో ఉన్నాను. అని లోలోన అనుకొని, 'చతురికా! కాసిని నీళ్ళివ్వు. దాహంగా ఉంది.' అని, 'ఎవ్వరూ లేరుగా! నేనే వెళ్ళి రావాలి కాబోలు!' అంది అక్కడివారికి వినిపించేలా. ఆమె ద్వారంవద్ద వేచివున్న ఆకారాన్ని చూస్తూనే ఉంది. తెర తొలగించి ఆకారం దాపుకు వెళ్ళగానే ఆకారం ఆమె కన్నులలోనికి చూచింది. 'మీరంతా నిశ్శబ్దంగా ఎక్కడి వారక్కడ ఉండండి. ఏమీ పెదవి విప్పకండి. వచ్చిన

వారి మాటలన్నీ ఆలించండి. కొట్టింది మనలోనివారేగా!' అంది మెల్లగా.

ఆ ఆకారం చూపులు నేనే అన్నట్టు చూస్తూ సైగ చేశాయి. 'మంచిది. ఏం పర్వాలేదు. తొణక్కుండా మసలుకో!' అంది నందిని తిరిగి పెదవులు తుడుచుకుంటూ లోనికి వెళ్తూ.

తొలికోడి కూసింది. తూరుపు రేఖలు విచ్చుకుంటున్నాయి. తెల్లవారడానికింకా అట్టే వ్యవధిలేదు. పరిచారికలంతా వచ్చారు. అవంతి పౌరులలో సగమ్మంది ఆమె మందిరంలోనికి చేరారు. సభాసభ్యులంతా వచ్చారు.

అధ్యక్షులు అందరివంకా చూస్తూ, 'దారివ్వండి!' అంటూ లోనికి వస్తున్నారు. అంతలో కాపాలిక వచ్చి 'అమ్మా! మాలిగారు యింటలేరు. జయపాలుగారి నెవరో ఆయన శయన మందిరంలో హత్య చేశారు!' అన్నది.

నందిని 'ఆఁ!' అన్నది భయం భయంగా. 'జయపాలుని హత్యా!' అన్నారధ్యక్షులు.

నందిని ఓరగా అధ్యక్షుని చూచింది. చేరిన వారిలో ఆశ్చర్యం ఎక్కువైంది.

'కాపాలికా! నీవు సరిగా విన్నావా?' అంది నందిని తిరిగి అందరూ ఆ మాట వినాలని.

'వినడం కాదమ్మా! ప్రత్యక్షంగా చూచాను. మందిరంలోని వారంతా గగ్గోలుగా చుట్టూ మూగిఉన్నారు. అదైనా నేను వెళ్ళాకనే వారా శవాన్ని చూచారుట. భటునితో కబురు పెట్టాను. వాడు లోనికి వెళ్ళి ఎంతకూ రాకపోతే నేనూ లోనికి వెళ్ళాను. ఆయన శయన మందిరంలో బాకు

గుండెల్లో గుచ్చబడి నోటికి గుడ్డలు కట్టబడి ఉన్నాయి.' అంది కాపాలిక.

'అయ్యో! ఎంతపని జరిగింది. స్వామీ! ముందు ఈ విషయం చూడండి. అంతా వారి యింటికి వెళదాం.' అంది నందిని దిగులుగా బిక్కపోయి.

'మందిరంలో నీవేం చేస్తున్నావు?' అన్నాడు అధ్యక్షుడు.

'నిద్రిస్తున్నాను. పెద్దగా 'అమ్మా' అన్న కేకవిని లేచాను. నాల్గు ప్రక్కలా చూశాను. నాకేమీ కనిపించలేదు. అంతలో నా పరిచారికలంతా వచ్చారు. ఆ తర్వాత ఆ కేక చాలా దూరం వినిపించింది. చాలామంది చేరారు. అంతా వచ్చాక ఈ కిటికీ వంకకు ఎవరో చూచి 'ఏమిటిది?' అన్నారు. అదుగో అంబుతో ఆ వెన్నునుండి ఆ చెక్కకు నాటబడిన అంబు, ఆ ఆకారం - అది చూచి మీ యందరకూ కబురు పెట్టాను.' అంది నందిని తనకు తెలిసిన దిది అన్నధోరణిలో.

అధ్యక్షులవారితో సభ్యులూ అంతా కలిసి క్రిందికి దిగారు. వారివెంటనంటే నందిని, చతురిక, సుధూలికా అంతా వచ్చారు. భవనమంతా తిరిగి దక్షిణ దిక్కుకు చేరారు.

భవనానికి దక్షిణంగా పొగడచెట్టు కొమ్మలు భవనానికి తగులుతూ ఉన్నాయి. అధ్యక్షులూ, చేరినవారూ అంతా పరికించారు. చెట్టు మొదట్లోనికి వెళ్ళి ఆగారు. అక్కడ అడుగులు కనిపిస్తున్నాయి. ఎక్కినట్టుగా ఆరాబులుకూడా ఉన్నాయి. అంతలో బాగా తెల్లవారింది. పగటి వెలుగు నలుదిశలా ఆవరిస్తూంది. ఎవరు ఎవరైందీ అందరకూ ముఖాలు బాగా తెలుస్తున్నాయి.

అవంతి అధ్యక్షులూ, సభ్యులూ అడుగుల జాడతో నడక సాగించారు. ఆ అడుగులు దొడ్డిత్రోవకు వెళ్ళాయి. ఆ జాగాలో అంతకు ముందు నీరు నిలచిన తావులో ఆ నడచిన అడుగులు బురదగూడా ఉన్నది. 'సరే! ఇటునుండి వచ్చాడా పైకి ఎక్కిన వ్యక్తి,' అని-'ఎవరైనా రండి. అదిగో ఆ మందిరంపైనున్న ఆ ఆకారాన్ని దించండి.' అన్నాడు అధ్యక్షుడు. ఎవరూ ముందుకు రాలేదు. ప్రక్కనున్న రణవర్మవంక చూచాడు. రణవర్మ అతని ప్రక్కనున్న మనిషిని చూచి తలసాడించాడు. ఆ భటుడు మెల్లగా చెట్టుమీదకు ఎక్కి గోడప్రక్కగా ఆ కిటికీని పట్టుకొని, త్రాళ్ళందించమన్నాడు. క్రిందినుండి త్రాళ్ళందించారు నందిని పరిచారికలు. రణవర్మ తిరిగి మిద్దెమీదకు వెళ్ళి మరికొన్ని త్రాళ్ళు తీసుకొని పైన గట్టిగా పట్టుకోమని అక్కడి వారికి అనుజ్ఞ లిచ్చి, క్రిందికి దిగి వచ్చాడు. ఆ శవానికి గట్టిగా త్రాళ్ళుకట్టి త్రాళ్ళ సహాయంతో ఆ శవాన్ని లాగాయి. రాలేదు. ఆ పైనున్న భటుడు ఆ గ్రుచ్చుకున్న అంబును విరచివేశాడు. శవం మెల్లగా త్రాటి సాయంతో క్రిందికి వచ్చింది.

ఆ శవం చుట్టూ చాలామంది చేరారు. పుర రక్షకులు వారిని దూరంగా ఉండమని తొలగ ద్రోశారు.

ఆ తర్వాత అవంతి సభ్యులు చుట్టూ చేరారు. అధ్యక్షులు 'ఆ తల ముసుగు తొలగించండ'న్నారు. గట్టిగా బిగుసుకున్న ఆ తల ముసుగు తొలగించాడు భటుడు.

అంతా ఒక్కసారే నిర్వెర బోయారు. అందరూ ఒకరికి తెలియకుండా ఒకరు ఎదటివారి ముఖంలోనికి చూచారు. అలా చూస్తున్నామని ఎవరికి వారికి తెలియదు కూడాను. నందిని చతురికవంక, చతురిక నందినివంకా, మధూలిక

మరొకరివంకా మాన్నూ సంభించి పోయారు. అధ్యక్షులు, 'మాలి! మన అవంతి సభ్యుల్లో ఒకరు!' అన్నాడు.

'ఆయన స్వయంగా అక్కడికెందుకెళ్ళాడు?' అన్నాడు రణవర్మ.

'చెట్టునెక్కి, చెట్టుమీదుగా గోడ పట్టుకొని ప్రాకి కిటికీ దాపుకు ఎందుకు వెళ్ళినట్టు? అతడు చిత్రకారుడు. అతని బొడ్లో ఆ కైజారేమిటి?' అన్నాడు రాధానాథుడు.

'నీకు అతనితో ఏదైనా వైరం ఉందా?' అనడిగాడు నందినిని అధ్యక్షుడు.

'మాలిగారితో నాకు వైరమా? ఏమీలేదు. అతడు నాతోటి సభ్యుడుగదా! మీతో నాకెంత వైరమో అతనితోనూ అంతే!' అన్నది నందిని. అది పౌరుల కెవ్వరికీ అర్థం కాలేదు. రాధానాథుడు, రణవర్మ, అధ్యక్షులు ఒక్కసారి గుండె గుభేలుమని ఒకరినొకరు చూచుకున్నారు. అంతేగాని మరుమాట రాలేదు వారి పెదవులనుండి. అది-ఇద్దరయ్యారు, మీ ముగ్గురున్నారన్న తీరులో ఉంది.

'మాలి అసలు మీ మందిరానికెందుకు వచ్చినట్టు?' అనడిగాడు అధ్యక్షులు నందిని.

'నాకేం తెలుసు, వారి అభిప్రాయం!' అన్నది నందిని.

'అక్కడ ఉన్న మాలిని గురి తప్పకుండా అంబులో ఎవరు కొట్టారో!' అన్నాడు రాధానాథుడు.

'అది బాగా నిద్రవేళ. నా ఇంట అడంగులు తప్ప మరొకరు లేరుకదా? పరీక్షించుకోండి. నేనెలాటి దాననో మీ అందరకూ తెలుసు. చాలా ఏళ్ళక్రితం కూరసేనం వదలి ఈ ఊరు చేరాం. ఆశ్రయమిచ్చింది అధ్యక్షులవారే. పుర

వాసులందకీ తెలుసు. నగరులో తెలియనివారే లేరు. ఆ మధ్య మీరు 'అవంతి పౌర సభాసభ్యులుగాబట్టి మీ ఇంటికి కూడా ఒక భటవర్గాన్ని, ఒక ద్వందాశ్వాల శకటాన్ని ఇస్తానన్నారు. నా కెందుకు? నాకు భటులతో పనేమిటని వలదన్నాను. మీకు తెలియనిది కాదుగదా? అలాంటి నా ఇంట ఇలాటి సంఘటన జరగడం చాలా చిత్రంగా ఉంది. ఇలాగైతే నేనీ అవంతిలో ఎలా బ్రతగ్గలను? నాకు తెలియకుండానే నా శాత్రవకూటం ఉందన్న మాట. ఈ నాటికి తెలిసింది. ఇన్నాళ్ళబట్టి ఉంటున్నా ఒక పోరూ పొచ్చం ఎరుగను. నాతోటి సభ్యుడు అర్ధరాత్రి నా యింటికి చాటుగా కత్తులతో కటార్లతో వచ్చాడంటే నాకు రక్షణేమిటి? మీదయ! మీకోసం మిమ్మల్ని నమ్ముకొని ఈ అవంతిలో ఉంటున్నాను. మీ దయ! నన్నెలా బ్రతుకనిస్తారో!' అన్నది నందిని పయ్యెదతో కన్ను లొత్తుకొంటూ. అందరూ ఆమెను జాలిగా చూచారు. ఒక్క అధ్యక్షుడు మాత్రమే సరిగా సూటిగా ఏ అర్థమూ రాని చూపు చూడగలిగాడు.

'సామాన్యు డెవ్వడూ అంబునలా విడువలేడు. ఆ అంబు ఎంతో వేగంగా వచ్చి ఉండాలి. లేకుంటే అది మనిషిలో నుండి దూరి ఆ కొయ్యకంత గాటంగా నాటుకున్నదంటే అది మామూలు అంబు - మామూలు విలువిద్దెకాడు వేసిన అంబయ్యి ఉండదు. ఆ అంబు నాటిన వాడు అవంతి వాసి మాత్రంకాదు' అని తన నిర్ణయాన్ని చెప్పేకాడు రణవర్మ.

'ఎవరు ఎవరిని కొట్టుకున్నా అతడే ఊరువాసియైనా నేనూ, ఊరూ నిద్రపోతున్నప్పుడు జరిగింధది, నాకు మాత్ర

మేం తెలుసు? అన్నింటికీ మీరే ఉన్నారు. వారెవరో! ఎందుకలా జరిగిందో! నేను నిమిత్త మాత్రురాలను కాబట్టి నిర్ణయం మీరు, ఈ అవంతి ప్రజలూ చేయాలసిందే. నే నబలను. ఏదో తింటూ మీ అవంతిలో ఉంటున్నాను. అంతే!' అన్నది నందిని కనుల నీరు గ్రక్కుతూ.

చేరిన ప్రతి పౌరుడూ అన్నది - 'ఆడకూతుర్ని చంప డానికా డెవడో వచ్చాడు. అది చూచి ఎవడో బాణంతో కొట్టి వెళ్ళి పోయాడు. దానికి ఆమేం చేస్తుంది పాపం!' అన్నారు, అనుకున్నారుగాని ఏ వొక్కరూ మరో మాట అనలేదు, ఆలోచించలేదు.

'ఇక్కడ ఈ సంఘటనకు, అక్కడ జయపాలుని హత్యకూ ముడిపడుతుందేమో చూడాలి. అదీయిదీ ఒక్క రాత్రి జరిగాయి. చిత్రంగా ఉంది' అన్నారు అధ్యక్షుల వారు.

'ఆc! అదీ నిజమే. ఆలోచించవలసిన విషయమే' అన్నాడు రాధానాధుడు.

'సరే! అక్కడకు వెళ్ళి ఆ విషయమూ ఆలోచిద్దాం,' అన్నాడు రణవర్మ.

'ఆలోచిస్తాను నందినీదేవీ! నీకేమీ భయం లేదు' అన్నాడు అధ్యక్షులు.

'ఆడదానను. మీ దయ!' అన్నది నందిని.

'పరవాలేదు. మేమంతా లేమా?' అన్నాడు రణవర్మ. అంతా వెళ్ళిపోతూ ఆ శవాన్ని సభాభవనానికి చేర్చ మన్నారు. అధ్యక్షులతో, 'అధ్యక్షులవారికో మనవి. ఈ పొగడ చెట్టు కొమ్మను కొట్టివేయిస్తాను.' అంది నందిని.

'ఆఁ ఆఁ! ఆ మాటే చెప్పాలని చూస్తున్నాను' అన్నాడు రాధానాథుడు.

'అప్పుడప్పుడు పెద్దలు దర్శన భాగ్యం కలుగజేస్తూ ఉండండి' అంది. అది ఎవరినన్నదోనని ముగ్గురూ అనుకున్నారు. ఎవరికి వారు తమని కాదనుకున్నారు.

వారితోపాటు నందిని కూడా ఇలు వదలి వెలికి వచ్చింది. చతురికను పిలచి జయపాలు నింటికి పల్లకీ పంపమన్నది. చతురిక సరేనన్నది. పౌరులూ, అధ్యక్షులూ, సభ్యులూ అంతా కలసి జయపాలు నింటి దిక్కుగా నడచారు.

అవంతిలోని పౌరులంతా ఊరేగింపు వస్తున్నారా! అన్న తీరులో అంతా గుంపుగా బయలుదేరారు. వారిలో నందిని కూడా ఉన్నది. ఆమె వారితోపాటు నడవడం వలన సమూహానికే ఒక నిండుదనం, అందం వచ్చింది. అంతా అలా ఏవేవో మాటాడుకుంటూ, ఆలోచిస్తూ అంతా కలసి జయపాలుని మందిరానికి చేరారు.

జయపాలుని మందిరం చాలా విశాలమైనది. దాదాపు అందమైనది కూడాను. అలాంటి భవనాలు అవంతిలో నాలుగో అయిదో ఉంటాయి. ప్రస్తుతం నందిని ఉంటున్న మందిరం, అధ్యక్షుని మందిరం, జయపాలుని మందిరం మరో ఇద్దరు వ్యాపారస్తులున్నారు. వారి భవనాలు ఒక తీరుగా ఉన్నతంగా కట్టడం జరిగింది.

ప్రాకారం దాటి మందిరంలోకి దారి తీశారంతా. సభ్యులను గౌరవనీయులను లోనికి వదలి, మిగిలిన వారిని మందిరంలోనికి పోనీయకండా ఆపారు భటులు. దాదాపు ఒక పది మంది మాత్రం భవనంలోనికి వెళ్ళి ఆ లోపలున్న సోపానా లధిరోహించి జయపాలుని శయన మందిరం

చేరారు. అప్పటికి గదిలో చాలా మంది జయపాలుని శవాన్ని తాకకుండా కొంచం ప్రక్కగా నిలచి పరికిస్తున్నారు.

అధ్యక్షులు అక్కడికి రాగానే అంతా దారి వదలారు. అధ్యక్షులు, రణవర్మ, రాధానాధుడు, నందిని, మిగిలిన కొందరు అక్కడికి చేరి నిలచారు.

'ముందుగా శవాన్ని ఎవరు చూచారు?' అన్నాడు అధ్యక్షుడు.

జయపాలుని భార్య గోడు గోడున యేడుస్తూ, 'నేనే చూచాను. ద్వారం వద్ద భటుడు వచ్చి, నందినిదేవిగారింట్లో ఏదో గొడవైందిట-ఊరులోని పెద్దలందరినీ పిలుస్తున్నారు-అయ్యగారిని కూడా పిలుచుకు రమ్మని వాళ్ళ దాసీది వచ్చింది - అన్నాడు. నేను లేచి వారి గదిలోకి వచ్చి చూచాను. నాకు ఏమీ తోచింది కాదు. ఆ దివ్వె వెలుగులో రక్తసిక్తమైన వారిని......'తర్వాత ఆమె మాటాడ లేక పోయింది.

'రాత్రి మీరేమైనా గలబా విన్నారా?'

'లేదు.'

'సద్దుగాని ఏమీ వినలేదా?'

'లేదు.'

'కావలి వారు సక్రమంగా ఉన్నారా?'

'రోజూ ఉంటారుకదా? అలాగే ఉన్నారు.'

'వారిని విచారించారా?'

'నేనెవ్వరినీ ఏమీ అడుగలేదు. మామయ్యగారేదో - వారినీ వీరినీ పిలచి ప్రశ్నించారు. ఎవరుమాత్రం ఏం చెప్పగలరు?' అన్నది జయపాలుని భార్య.

నందిని పరిసరాలన్నీ పరికిస్తూంది. నాలుగు గోడల వంకా దృష్టి సారించింది. కిటికీలు, ద్వారాలు పరికించింది. ఆమెకేమీ తోచలేదు - తోచిందికాదు.

రణవర్మగాని, రాధానాధుడుగాని ఏమీ మాటాడడం లేదు.

'హత్య చేసినవాడు ఎటునుండి వచ్చి ఉంటాడో!' అన్నారు అధ్యక్షులు.

'నిర్భయంగా ఉంటాం, హాయిగా తలుపులు తెరచి... ఎవరికి భయం? అవంతిలో ప్రతి పౌరుడూ నిర్భయుంగా ఉంటాడు. ప్రతి కుటుంబం గుండెలమీద చేతులు వేసుకుని పడుకుంటూరు. ఎన్నడు జరిగిందిలాటి విడ్డూరం, భయపడడానికి - ఈ రోజిది క్రొత్తగాని!' అన్నది జయపాలుని ధార.

'నాకూ చాలా ఆశ్చర్యంగా ఉంది. మీరన్నట్టు యిది విడ్డూరమే. విడ్డూరం కాకుంటే అవంతి పాలక వర్గంలోని మాలి అర్ధరాత్రి దొంగచాటుగా నందినీదేవి యింటి దొడ్లోని చెట్టునెక్కి గోడమీదుగా ప్రాకి కిటికీలో నిలచి ఉంటాడా! ఉండగా బాణం అంబు దెబ్బతిని ప్రాణాలు వదలుతాడా! తొమ్మిదిమంది సభ్యుల్లోనూ - యిద్దరు ఒక్కరాత్రే మరణిస్తారా?' అన్నారధ్యక్షులు పరిశీలనగా పరికిస్తూన్న నందినీదేవివంక చూపులు నిగిడ్చి. ఆ మాటతో నందిని తన చూపులతో శవానికి గ్రుచ్చుకొనున్న బాకును పరీక్షించడం మానుకుంది.

'ఏఁవిఁటి! మాలి మరణించారా?' అంది అంత బాధలోనూ, సానుభూతిగా, ఆశ్చర్యంగా జయపాలుని భార్య.

'అక్కడనుండే వస్తున్నాము!' అన్నాడధ్యక్షుడు.

'ఏమిటో యిది అర్థం కావడంలేదు. రాత్రి హాయిగా నిద్రపోయారు. తెల్లవారడం చూడలేకపోయారు,' అని ఏడ్వడం మొదలెట్టింది జయపాలుని ధార.

ఆమెను వారిస్తూ, అధ్యక్షుడు ఏదో ఓదార్పు మాటలు పలికాడు. ఏ భార్యమాత్రం తన భర్త ఘోర మరణం చూస్తూ ఓదార్పు మాటలు విని ఊరుకోగలదు? ఎందరు అధ్యక్షులు ఆమెను ఓదార్చగలరు? ఆ దుఃఖం ఓదార్పుకు శాంతినిస్తుందా? శాంతి ఎలా లభిస్తుంది? జయపాలుని భార్యకు ఆమె లోకం చీకటిలో కలిసిపోయింది. ఆమె ఆనందం ఆనందంగా ఉండదు. మిగిలిపోయేది ఆమె ఒక్కతే! శాంతిలేని జీవనం ఈడ్వవలసిందే ఆమె యిక. ఆమె జీవితానికి తెల్లవారడమంటూ లేదు. జయపాలునికి కాదా బాకుపోటు - జయపాలుని తనువులో దిగిన బాకు, ఆమె జీవితంలో నాటుకుపోయింది. ఆ తడిసిన రక్తం జయపాలునిది కాదు. ఆమె జీవిత కాసారంలోని అమృతం ఆ బాకు నాటిన జాగాలోనుండి కారిపోయింది.

జయపాలుని ధార విలాపం చూచి నందిని గుండె నీరయ్యింది. తోటి ఆడది-సాటిది విలపిస్తూంది. తన బ్రతుకు కన్నా అన్యాయమైపోయింది - అని తనలో అనుకుంటుండగా, ఆమెకు ఆనాటి పున్నమి రేయి తనకు జరిగిన అన్యాయం, అన్యాయానికి కారణభూతులై మిగిలిన ఆ ముగ్గురు భూతాలూ కనిపించారు. ఆగ్రహంతో వణకిపోయింది. అలా వణకుతూనే ఆ పరిసరాలన్నింటినీ పరికించింది. ఇది తను చేసిందికాదు. క్షణాల్లో మిగిలిపోయింది. లేకుంటే ఈ శోకం తన మూలాన, తన చేతులతో జరుగవలసినదే! కానీ, తప్పిపోయింది. తనుగా చేయలేదు.

నందిని జయపాలుని ధార ప్రక్కన కూర్చొని 'చెల్లీ! విలపించకు. జరిగినదానికందరకూ విచారంగానే ఉంది. ఎవరు చేశారో తెలుసుకుని శిక్షిద్దాం. శిక్షించగలంగాని నీ పతిని నీకు అప్పగించలేం తల్లీ! మా చేతగాని తనానికి విచారిస్తున్నాం. ఆ బాకుపోటు నాటబడింది నీ భర్తమీద గాదు తల్లీ, ఈ అవంతి పౌర సభా సభ్యులమీద!' అంది. అంటూనే అందరివంకా చూచింది. ఎవరి ముఖాల్లోనూ ఏ కాంతీ కనిపించడంలేదు.

ఆ తర్వాత జయపాలుని కళేబరానికి కావలసిన గౌరవ మర్యాదలతో దహన సంస్కారాల కనుజ్ఞ యీయడం జరిగింది.

అవంతి శోకంలో మునిగిపోయినట్లుగా సభా కార్య క్రమాలు, పాలక వర్గ సభలూ ఆపివేశారు. ఆ రోజు మాత్రం - ఈ హత్యలకు మూలం తేల్చాలని ఒక రేయే యిద్దరు సభ్యులు హత్య గావింపబడడం వలన అందరకూ ఆశ్చర్యంగానే ఉన్నదని రహస్య సభలో చర్చించారు. కార్యక్రమాలు నిర్ణయించారు.

ఆ మరునాడు సాయంత్రం అధ్యక్షులు నందిని భవనానికి వచ్చారు.

నందిని శోకదేవతవలె విచారంతో, తన శయ్య దిగడం లేదని, శయన మందిరం దాటి వెలుపలకు రావడంలేదని పరి చారికలు చెప్పారు.

అధ్యక్షులా మాట విని, సరాసరి మిద్దిమీది ఆమె శయన మందిరానికి దారి తీశారు. ఆయన వెళ్ళి చూచే వేళకు నందిని శయ్యమీద అటు తిరిగి పండుకొని ఉంది.

అధ్యక్షులు లోనికి వచ్చి నాల్గువంకలా చూచి, 'నందినీ దేవీ!' అన్నాడు.

'ఎవరూ!' అంటూ, ఆమె శయ్యామీదనుండి లేచింది.

'నీ వెందుకు విచారిస్తావు? నీకేం హాయిగా తింటూ తిరుగుతూ ఉండరాదా?' అన్నారు అధ్యక్షులు.

'నే నెందుకు విచారించాలా? మీకు తెలియదా, నేను విచారించే దెందుకో? నా యింటకదా మాలిగారి హత్య జరిగింది. అలా అర్ధరాత్రి మాలిగారు దొంగచాటుగా రావడమేమిటి? సరిగ్గా ఆ సమయానికే ఎవరో వింటితో కొట్టి పారిపోవడమేమిటి? ఇన్నాళ్ళుబట్టి అవంతిలో ఉంటున్నాను కదా! నా యింట అలా జరిగిందంటే ఏమిటి? మాలిగారు లోకంలోనుండి పోవచ్చు. పోవడం నా యింట కదా? దీనిని కారణం నా యిల్లయినది కదా? ఎవరు ప్రశ్నించుకున్నా, ఎవరు దానినిగూర్చి అనుకున్నా ముందుగా నా పేరు, నా యిల్లు కాదా వారిమాటల కాధారం? నేను కదా, వెలికి వచ్చేది? అలాంటప్పుడు విచారించకండా ఎలా ఉండేది చెప్పండి,' అంది నందిని విచారంతో నే కళ్ళ నీళ్ళు గ్రుక్కుకుంటూ.

'నీ వంటున్నది నిజమే. కానీ, ఈ నాడు చేయగలిగిందేమిటి? విచారం వలన ప్రయోజనం,' అన్నాడు అధ్యక్షులు పరీక్షగా ఆమెను చూస్తూ. అది నిజమైన ఏడుపు కాదని, నటన చేస్తుందని, తనను నమ్మించాలని వ్యర్థ ప్రయత్నం చేస్తూంది - అని లోలోన అనుకుంటూనే వెలికి ఆ మాట అన్నాడు.

అతడు నమ్మడు. నమ్మడంలేదని నందినికి తెలుసు. అయినా తప్పదు. ఇద్దరం యిద్దరమే. ఒకరికన్నా మిన్నగా ఒకరు చరించాలి. నిజంగా ఈ ముసలి జంబుకమే! ఏనాడూ ఈ వేళప్పుడు రాడు. ఈ రోజు ఎందుకు వచ్చినట్టు? రానీ! రావడం ఒకందుకు లాభమేలే అనుకొని—

'చేయగల్గింది లేనిమాట వాస్తవం. ఆడదాన్ని - దిక్కూ మొక్కూ లేక పడివున్నాను. ఏ క్షణం ఏం జరుగుతుందో తెలియదుకదా? అంత మంచివాడూ, లోటిసఖ్యుడూ అయిన మాలి నన్ను హత్య చేయడానికి స్వయంగా అంత ఎత్తుకు ఎక్కాడంటే నేనేమనుకోవాలి, చెప్పండి?' అన్నది నందిని.

'అంటే, మాలి నిన్ను హత్య చేయడానికే వచ్చాడంటావా?' అనడిగాడు అధ్యక్షుడు.

'అలా అడుగుతున్నారేమిటి? అర్ధరాత్రి చాటుగా ఎందుకు వస్తాడు? అదేకాదు. అంతకుముందు ఒక విఘడియకో ఘడియకో - సరిగ్గా చెప్పలేను, నిద్రపోతున్నాను. ఒక అంబు నా మంచానికి నాటుకున్నది. వెంటనే లేచి నలువంకలా పరికించాను. ఎవరూ కనిపించలేదు. తిరిగి భయంభయంగానే పడుకున్నాను. నిద్ర పట్టీపట్టకుండా ఉంది. అప్పుడీ ఘోరం జరిగింది. ఈ ఉద్దేశం మొదట మాలి ఎవరినో పంపి నన్ను హత్య చేయమని ఉండాలి. అది నిర్ధారణ చేసుకోడానికి అతడు కిటికీయెక్కి చూస్తుంటే అతన్ని బాణంతో అతని మనిషే కొట్టివుండాలి అని. అదెంత నిజమో మనమెలా చెప్పగలం? నేనలా అనుకుంటున్నాను,' అన్నది నందిని.

అమ్మా! ఎంత కథ కల్పించిందిరా ముండ! ఒసే నందినీ! నేను నాకు తగిన వారితోనే తగాదా పెట్టుకున్నాను. మంచి ఉజ్జీయే లే! ముందు హత్యా ప్రయత్నం చేసిన వాణ్ని పిచ్చెక్కించి వీధుల వెంట తిప్పుతూ, వాడే మాలిని చంపాడంటున్నావా? నీ తెలివే తెలివి! నేనూ, వాడూ పంపామని తెలిసేకదా, వాడికా పని చేశావు!

నీ ఇంటనున్న మనుష్యులు నాకు తెలియరనేగా! కానీ కానీ!-అనుకొని—

'అంటే అంతకు ముందు ఒక అంబు నీ మంచానికి తగిలిందా?' అన్నాడు అధ్యక్షుడు.

'తగిలిందా ఏమిటి? అది కాస్త పైకి వచ్చినట్లయితే నేనీనాడు మీతో మాటాడడానికి మిగిలి ఉండేదానను కాదు' అంది నందిని. నిజంగా అంబు వచ్చిన విషయం నీకు తెలియదా, అధ్యక్షా! రా, రా! నీవెంత దూరం నాతో వస్తావో అదీ చూచుకుంటూగా. నిన్ను చిత్రవధ చేయకపోతే అప్పుడను-అనుకుంది తనలో తాను.

చస్తే పీడా వదిలేది. చావకపోయినావు. వెధవ లక్ష్యం సరిగా చూడకుండా వదలి తప్పు చేశాడు. సరిగ్గా తగిలి చచ్చి ఉంటే అవంతి పీడ విరగడయ్యేది - అనుకొని—

'అరె! చాలా ఆశ్చర్యంగా ఉంది' అని ఆశ్చర్య పడ్డాడు అధ్యక్షుడు.

'అందుకే బిక్కు బిక్కుమంటూ బ్రతుకుతున్నాను.' అంది నందిని.

నువ్వు బిక్కు బిక్కుమంటూ బ్రతుకుతున్నావా? నీ సంగతి నాకంతా తెలుసు. నీ చర్యలన్నీ బట్ట బయలు చేయడానికి సాక్ష్యాలు లేవు. ఆ సాక్ష్యాలు సేకరించిన మరుక్షణం నిన్ను కాకులకూ గద్దలకూ వేయిస్తాను. అలా వేయించకపోతే నే నవంతీ అధ్యక్షుణ్ణే గాదు-అని లోలోన అనుకొని, వెలికి—

'నీకేం భయంలేదు నందినీదేవీ! నీ విషయం నాకు వదిలెయ్యి' అన్నాడు.

నిన్ను నమ్మి నా విషయం నీకు వదలితే నే నన్యాయం గానా? ఓ ముసలి నక్కా! నిన్ను కుక్కను చేసి ఆడించే రోజు వస్తుంది. నాకు భయమేమిటి? నా భయానికి నీ హామీ ఏమిటి బోడీ? పరాయివాడు నా ఆవరణలో అడుగు పెడితే వాడి శవం సిప్రాలో కలిసి పోతుంది. ఒదలక ఒదలక నా విషయాలు నీకు ఒదలాలా! ఒదులుతాను, ఒదులు తాను. త్వరపడకు-అనుకుంది. వెలికి మాత్రం—

'అన్నింటికీ మిమ్మే నమ్మాను. మీలాంటి వారుండగా నాకేం భయం? నేను ఉన్నదే మిమ్ము నమ్ముకొని కదా స్వామీ! మీ యండ లేకుంటే నే నేమైనా అయిపోతాను,' అంది నందిని.

నన్ను నమ్ముకొని నా కోసం ఉన్నావా? ఆసి నీ సిగ తరగా! నా కోసం ఉన్నావుగాని నన్ను నమ్ముకొనా! ఇంకా నిన్ను నమ్ముతాననేనా? రా, రా! ఎంత దూరం వస్తావో, సాగనీ నీ ఆటలు-అనుకొని—

'ఆ విషయం వదలు. ఆరోజు మాలీ, నీవూ ఏమ్మాట్లా డారు?' అనడిగాడు అధ్యక్షుడు.

లక్ష మాట్లాడాం. నీకెందుకవన్నీను. నీకు నిజం చెప్పు తానా? అందులో వాడు చచ్చాడు-అనుకొని—

'ఏముందీ! అదే, నమస్కరించాను. ఆ తర్వాత అతనేదో అన్నాడు. అలాగే మాటలు పెరిగాయి. తర్వాత మీ విషయం ఎత్తి...ఏముందిలెండి, మన సంబంధం ఎత్తి, ఎత్తి పొడుపుగా మీరు వృద్ధజంబుకాలని, మీవల్ల నాకు కొమ్ము లొచ్చాయని, నేను కులటనని అన్నాడు,' అంది నందిని.

పాపం చచ్చేక్కడున్నాడో! అన్నాడో లేదో ఎవడు విన్నాడు? చచ్చినవాడు సాక్ష్యమీయలేడు. ఇన్ని చెప్పినా

వాడన్నవి చెబుతుందేగాని ఇదన్నదొకటైనా చెప్పిందా? ఎంత ఘటికురాలవే! అనుకొని—

'తర్వాత చతురిక కత్తి దూసింది అన్నావుకదూ!' అన్నాడు అధ్యక్షుడు.

ఆఁ! అలాటివన్నీ గుర్తుంచుకో, నీకూ చూపుతాం కత్తి! అనుకొని—

'అతడనే అవాకులూ చెవాకులూ విని కత్తి దూసింది. నేనే చతురికను లాక్కువచ్చాను. బహుశా ఆ కత్తితోనే ఈ పనికి పురికొన్నాడని అనుమానం' అంది నందిని.

ఊరక ఎవడన్నా అవాకులూ చెవాకులూ పేలతాడా? ఇదేదో వాణ్ని అని ఉంటుంది. చూస్తూనే ఉన్నాగా, దాని వ్యవహారాలు! అని లోలోన ఆలోచించుకుని ఐనా ఒప్పుకుందాం దాని పద్ధతినని—

'కారణాలు బాగానే ఇముడుతున్నాయి నందినీదేవీ! బహుశా ఆ కోపంతోనే నియమించి ఉంటాడు మనిషిని. తర్వాత వాడిమీద నమ్మకంలేక మళ్ళీ కిటికీ ఎక్కి మాడబోయి ఉంటాడు. అది తెలిసినవాడే బాణంతో కొట్టి ఉండవచ్చు. అది సరేగాని, జయపాలుని హత్యలో నీకేమైనా అనుమానంగాని, తెలిసిగాని ఉన్నదుందా?' అన్నాడు అధ్యక్షుడు వెలికి.

తెలుసు. నీవూ, వాడూ కూడబలుక్కొని నన్ను చంపమని మనిషిని పంపాక తెల్లవారితే ఆ జయపాలుడు నిన్నెదిరించి తగాయిదా పెట్టుకొనో, పెట్టుకుంటేనో ఈ విషయాలు బయట పెడతాడని దడిచి రాత్రికి రాత్రి వాణ్ణి చంపించావు. ఆ చంపిన వాడు ప్రస్తుతం నా అధీనంలోనే

ఉన్నావ్! త్వరపడకు. అదీ వెలికిలాగుతాను. నన్ను బయట కీడ్చినాడు అవంతిలో నీవు అండ అంటూ ఉండదధ్యక్షా! అనుకొని, పైకి మాత్రం--

'నా కివరిమీదా అనుమానంగాని, అనుమానించడానికి గాని కారణం కనిపించడంలేదు. ఆయన మొగవాడు. నా నెత్తిన పడినదానికే నేనెంతో విలపిస్తున్నాను. ఇంక ఆయన విషయంలో నేనేం ఆలోచించగలను చెప్పండి' అంది నందిని.

అలా అని ఆ విషయం పట్టించుకోకుండా ఊరుకుంటే ఇంక కావలసిన దేముంది? నువ్వా ఊరుకుందేది? నీ సంగతి నాకు తెలియదూ? అనుకున్నాడు. తర్వాత మాటలు లేక-

'సరె వస్తాను నందినీదేవీ!' అన్నాడు.

నీ రాకపోకలు చాలా అవసరం. రా, రా! అని అనుకుంటూ వెలికి వినిపించడం మాత్రం—

'ఏదో అబలను. దిక్కు లేకుండా ఉంటున్నాను. మొగ దక్షత లేదు. తోచినప్పుడు కాస్త వస్తూపోతూ ఉండండి' అంది నందిని.

ఎంత మర్యాద! తేనెబూసినకత్తి! తడిగుడ్డలతో గొంతులు కోస్తుంది. దీని సంగతి తెలియదా! అనుకొని—

'అలాగే!' అన్నాడు లేస్తూ.

నీదయతో కాక పోయినా నీతో నాకు పని ఉంది! అనుకొని—

'పూర్వంలా తమరసలు నా గడపకు రావడం లేదు. నేనేమైనా తెలియక తప్పు చేశానా?' అంది నందిని.

అమ్మ బాబో! తెలియక నీగడ పెక్కానుగాని తెలిస్తే ఎక్కేవాడినా? అవంతిలో ఉండనిచ్చే వాడనా? అనుకొని-

'ఏది నందినీదేవీ! పనులు తీరి చావడంలేదు. వస్తుంటాలే!' అన్నాడు అధ్యక్షుడు.

నీ పని నాకు తెలియదా! బోడిపని. గొంతులు కోయడం! అనుకొని—

'ఏదో తమ దయ!' అంది నందిని.

'అలాగే!' అని వెళ్ళి పోయినాడు అధ్యక్షుడు. వెళ్తున్న అధ్యక్షుని చూస్తూ: నీ వెంతో కాలం ఇంక అవంతిలో ఉండలేవు. నే నెందుకని ఊరుకున్నాను. నన్ను రెచ్చ గొట్టావు. అవసరమైతే నవ్వుతూ పచ్చినెత్తురు త్రాగగలను. ఈయగలను. ఆడదాన్ని ఆడదానిలా ఉంచాలి. మించిన కార్యం చేసిననాడు అది శక్తిస్వరూపిణి. ఆ శక్తి స్వరూపం ఎత్తకండానే మానుకోవాలి. అంత దూరం లాగాక ఇక దాని నాపగలశక్తి ఎవరికీ లేదు. మహామహులు ఆడదాని అడుగులకు మడుగులొత్తారు. ఇంక నీలాంటి వాళ్ళ దేమిటి? నీచేత ఆకులు మేయిస్తాను.

నేను, మొదట అండచూపిన వాడవే అని ఆలోచించాను. ఆఖరుకు నేనేం చేశానని అర్ధరాత్రి అపాళంగా హత్య చేయించ నెంచావు? నా ధనం, నా వజ్రాల హారం, నా దగ్గరున్న ఆ రత్నాలు కాజేయాలనా? అవి అవంతికే ఇస్తానన్నాను కదా? యింకా దేనికొరకు నీవు నాతో విరోధం పూనినట్లు! మీగంతా కలసిచేసిన కార్యం మీ కళ్ళల్లో కనిపిస్తూ, నీకు నిద్ర పట్టకండా చేసి ఉండాలి! ఎంత కఠినత వహించి నన్ను కటికురాలను చేస్తున్నావు. అవంతి జనసత్తాకగా ఎంతో కాలం నిల్వదింక. నేను కోశాంబీలో అంధ భిక్షువుతో అన్నట్టు, సర్వనాశనం చేయక తప్పదేమో! అనుకుంది నందిని. ఆమె అసలు అధ్యక్షులు

రావడం మూరాన్నుండిచూచే తన శయనమందిరానికి చేరింది. తనపరిచారికతో ఆ మాటలు చెప్పి అలా ఉండగా అధ్యక్షులు వచ్చి మాచి కొంత నటన, కొంత నిజం అనుకొని వెళ్ళి పోయాడు.

# 12

అవంతి జయపాలుని, మాలినీ మరచిపోయింది. అవంతి మరచిపోయినా అధ్యక్షుడు మరచిపోలేదు. అధ్యక్షుడు నందినిమీద కత్తికట్టి ఉన్నాడు. నందిని అధ్యక్షుడు తూలితేగాని తనుగా తూలకూడదనుకుంది. ఈ మధ్య చాలా సార్లు నందిని సభ్యత్వంమీద చర్చ జరిగింది. అధ్యక్షుడే తనకు తెలియకుండా నందిని మీద ఏదో జరుగుతున్న రీతిలో సభ్యత్వంమీద ఆమె వద్దని, కావాలనీ పెట్టించాడు. ప్రజాభిప్రాయం నందిని ఉండాలని. మిగిలిన యేడుగురు లోనూ తనుగాక నలుగురు ఆమె ఉండాలన్న అభిప్రాయాన్నే యిచ్చారు. దానితో యిది పనిగాదనుకున్నాడు అధ్యక్షుడు. ఆమెకు తను యిచ్చిన బలమంతా క్రమంగా తను తీసుకోవాలన్న తలంపు బాగా పెరిగిపోయింది. పైకి మాత్రం నందిని చాలా మంచిదని అంటుంటాడు. ఆంతర్యంగా ఆమె అంటే ఈర్ష్య పెరిగిపోయింది. మొదట అధ్యక్షుడిచ్చిన బలంతో ఆమె చాలా బలం కూడ కట్టుకుంది. ఈ నాడు అధ్యక్షుని బలం అతడు తీసుకున్నా, అవంతిలో ఆమె మాత్రం మిగిలిపోతుంది. మిగిలిన అవంతి అంతా ఏకమైనా ఆమె ముందు కనిపించరు. ఆమే కనిపిస్తుంది. అంత బలగాన్ని, అంత మర్యాదనూ సేకరించి రంగంలోనికి దిగడానికి సిద్ధంగా ఉన్న గ్లోజున అధ్యక్షుడు

ఆమెకు ఎదురు పడ్డాడు. ఆమె నేదో చేయాలను కుంటు న్నాడు. ఎత్తుకు పెయెత్తులు ఎత్తుతూ, గుండె గుభేలు మనిపిస్తూంది, నందిని.

ఆ నాడు ఏం జరిగిందో ఇటు చతురికకు, అటు మధూ లికకు కూడా తెలియదు. అర్ధరాత్రి జరగడంతో అనుకో కుండా జరగడం వల్ల చతురికకు కూడా జరిగింది అర్థం కాలేదు. ఆ సాయంకాలం మాలి మాటలు, రేపు నిన్ను సభకీడుస్తానని నందిని అన్న మాటలూ సమన్వయ పరచుకొని భయపడి ఆ రాత్రికి రాత్రే నందినిని హత్య చేయవచ్చాడు. తెలిసిన వారు అడుగున కాపు కాస్తున్న వారిలో ఎవరో అంబుతో అతన్ని చంపారని-అంతే గాని, జయపాలుని హత్యకూ దీనికీ ఉన్న బంధం గాని సంబంధం గాని తెలియదు. అంతకు ముందు అంబు సంగతి పరిచారికా జనానికసలే తెలియదు. దాదాపు సూర్యుడు పశ్చిమానికి తరలపోతున్న సమయంలో, వీరమల్లు పరుగు పరుగున రావడం మిద్దెమీద ఉన్న నందిని చూచింది.

'చతురికా!' అని పిలిచింది. చతురిక ఎక్కడో ఉంది. దాపులో ఉన్న మధూలిక 'పిలవమంటారా, అమ్మా!' అన్నది.

'ఒద్దు. నిన్ను పిలవాలనే చతురికను పిలిచాను. అదిగో వీరమల్లు వస్తున్నాడు. లోనికి తీసుకొనిరా మధూ!' అంది నందిని.

మధూలిక అటు చూచింది. వీరమల్లు రావడం కనిపించి మరు మాట లేకుండా, వెళ్ళింది వీరమల్లును వెంటబెట్టుకు రావడానికి. మధూలిక క్రిందికి దిగి ద్వారం దగ్గర నిల్వడం, వీరమల్లు అక్కడికి రావడం జరిగింది. మధూలికను చూచి—

'నందినీదేవిని చూడాలి,' అనీ అనకముందే—

'ఆమె నీకోసమే, నీవు వస్తున్నట్టు తెలిసి పైకి పిలుచుకు రమ్మన్నారు,' అంది మధూలిక. వీరమల్లు నివ్వెరపోయాడు.

'నేను వస్తున్నట్టు ఆమె కెలా తెలుసు?' అన్నాడు.

'ఆమెకు చాలా తెలుసు. రా! లోనికి వెళదాం,' అంది మధూలిక.

ఇద్దరూ కలిసి, మిద్దెమీద గది లోనికి వెళ్ళారు. నందినీదేవి శయ్యా మీదనుండి లేచి, వీరమల్లును క్రిందినుండి పైదాకా చూచింది. వీరమల్లు ఏవో అనబోయినాడు. అనకండా మధ్యలో అందుకొని, 'ఆ తగాయిదాలో నీ తప్పులేదు,' అంది నందిని.

వీరమల్లు ఇందాక పడిన ఆశ్చర్యంకన్న మిన్నగా తల క్రిందులై పోతూ—

'అది కాదమ్మా! నేను చాలాసేపు కల్పించుకోలేదు. ముందు ఎంత సేపటినుండో వాడిష్టమొచ్చినట్లు వాగాడు. ఆ తర్వాత నే నూరుకోలేక చేయెత్తి కూడా ఆగాను' అన్నాడు.

'మంచి పని చేశావు. చేయెత్తి చాచి వేసినా తర్వాత చూసుకుందే వాళ్ళం' అంది నందిని.

'రణవర్మ మీద చేయి చేసుకోడం అంత మంచి దంటారా?' అన్నాడు వీరమల్లు.

ఒక్కసారి అలా తొణికి, తనను తాను సంబాళించుకొంది వెలికి తెలియనీయకండా! ఆమె ఊహ - ఏదో తగాదా దానిదే వీరమల్లు ఆ వేళప్పుడు రాడని, తెలిసినట్లు మాటాడి

రాబట్టాలని, వీరమల్లును ఆశ్చర్యంలో ముంచాలని అనుకొంది. అదేవిధంగా పాచిక వేసింది. ఇంతసేపూ అవతలివాడు జయసింహుడని ఆమె అభిప్రాయం. వీరమల్లు కొరుకుపడేవాడు అవంతిలో అతడొక్కడే. అంతేకాక సాయమర్థించ వచ్చి ఉంటాడు. పర్వాలేదందామనుకుంది. అది మ్రింగలేని రాయని తెలిసి కూడా 'ఐతేయేం? తప్పు నీది కానప్పుడు?' అంది ఇంకా రాబట్టాలని. విషయాలన్నీ తనకు తెలిసినట్టుగా అతడనుకోవాలి-అంతా అతడి నోట చెప్పించాలని పథకం ఆలోచిస్తూ.

'అదే మరొకరైతే అంత పనీ చేసేవాడనే! కానీ...' అన్నాడు వీరమల్లు.

'వేరేవాడంటూవు. అక్కడ అంత మందీ చేరారుగా! అందులో...'అని ఆపింది. ఆలోచిస్తున్నట్టు నటించి, 'ఎవరు చేరినా నిన్నెదిర్చేవారెవరున్నారు కనుక?' అంది నందిని. ఎన్నో మాటలు తూలి ఉంటాడు. లేకుంటే రణవర్మ మీదికి చేయెత్తడమంటే సామాన్యమా! అవంతి యుద్ధ వీరులందరి మీదికీ చేయెత్తినట్లే. మనిషి ఉత బలం కల వాడు మాత్రమే గాదు. కాస్త యోచన సేయగల సూక్ష్మగ్రాహి. తెలివి కూడా ఉందనుకుంది.

'చేరారు. అప్పటికి జయసింహుడు కూడా వచ్చాడు!' అన్నాడు వీరమల్లు.

'అతడు వచ్చినా ముందుకు రాలేదు. చాలా దూరంగా ఉన్నాడు కదా? పోనీలే జరిగినదానిని గూర్చి యోచనెందుకు?' అంది నందిని-అతడు దాపులో ఉంటే, మొదటి నుండీ ఉంటే కల్పించుకుందేవాడని, తగాయిదా అయ్యాకనే వచ్చి ఉంటాడని లోలోన ఆలోచించుకొని.

'జరిగినదంతే. ఐనా మీకు ముందుగా చెపుతున్నాను - రణవర్మ చేయి చేసుకుంటాడేమోనని. ఆ తర్వాత మళ్ళీ రణవర్మ కనిపించకుండా చేసి తిరిగి నేను ఎటన్నా పోతాను.' అన్నాడు వీరమల్లు.

'అంత దూరం రాదులే వీరమల్లూ! ఒక వేళ వస్తే అప్పుడు దానికి తగిన ఏర్పాటు చేద్దాం! ఒక వేళ మాకు తెలియకుండా జరిగినా నీవు మధూలికను వదలి వెళ్ళకు. వెంట తీసుకొని ప్రయాణం కావడానికి సిద్ధంగా ఉండు,' అన్నది నందిని.

'చూద్దాంలెండి' అన్నాడు వీరమల్లు.

'డబ్బును గురించి, బ్రతకడాన్ని గురించి నీవెన్నడూ బెంగ పడకు,' అన్నది నందిని.

'ఆఁ! డబ్బు...బతుకు!' అన్నాడు నిర్లక్ష్యంగా వీరమల్లు.

'సరేలే! అసలు రణవర్మకూ, నీకూ ఏమైనా తగాయిదా ఉందా?' అన్నది నందిని.

'అబ్బే! లేదండి. పూర్వం అతను నేనంటే చాలా మర్యాదగా మంచిగానే ఉండేవాడు. అదైనా అధ్యక్షునికి ఆయనకూ ఆ రోజుల్లో పడేదిగాదు. అందువల్ల నన్ను మంచిగా చూచేవాడు. అదెందుకో నాకు తెలుసు. జయసింహుడు అధ్యక్షుని మనిషిగదా! అతగాడికి సరైన జోడు ఈ పరగణాలో నేనే. మరొకడు లేడు. అందుకే అలా చూచేవాడనుకుంటాను. లేకుంటే నన్నెందుకు చూస్తాడు?' అన్నాడు వీరమల్లు.

పర్వాలేదు వీరమల్లు. తను స్వయంగా ఆలోచించి కూడా ఒక నిర్ణయానికి రాగలడు, ఈనాడు తన దగ్గరున్న

వారిలో అదిలేదు. ఎంతవరకు చెబితే అంతవరకు కళ్ళు మూసుకొని చేయడమే వారి పని. ఇతన్ని తయారు చేసుకుంటే నమ్మకం గలవాడుగా ఉండిపోతాడు. మధూలిక కూడా కూడానే ఉంటుంది. బావుంటుంది. వీరి అండ వలన చాలా కార్యాలు చక్కదిద్దుకోవచ్చు ననుకుంది.

'ఇప్పుడుమాత్రమేం వచ్చింది? జయసింహుడు అధ్యక్షుల సేవలోనే ఉన్నాడుగా!' అంది నందిని మిగిలిన విషయాలు రాబట్టాలన్న తీరులో.

'ఆనాటిలా నేనతని తరఫున ఉంటాననీ, వస్తానని నమ్మకం ఈనాడులేదు. నేను రావడం పోవడం మీ దాపునుండి కదా? వాడి మంటకూడా అదే! ఇందాక మాటల్లోకూడా అదే వ్యక్తపరచాడు. నేను మీకు తోత్తునని, మీరాడించి నట్లల్లా ఆడతానట! అన్నాడు అతను. నాకు చాలా కష్టం కలిగింది. ఐనా చేయగలిగింది లేదు. ఊరుకున్నా,' నన్నాడు వీరమల్లు.

'నేనన్నా ఇదివరకు చాలా మంచిగానే ఉండేవాడే-మొన్న మొన్నటివరకూ! నాతో మంచిగా ఒకసారి మన మందిరానికి కూడా వచ్చాడు. బహుశా అధ్యక్షులు మార్చి ఉండవచ్చు. దానికేంలే! చెయ్యనియ్యి - ఆ పెద్దలు చేసే వన్నీ! చూద్దాం!' అంది నందిని.

'చూడ్డమేమిటండీ! మీరు 'ఊఁ' అనండి, ముత్తాన్ని ఊది మీ కాళ్ళదగ్గర పారేస్తాను ఈ రాత్రికి రాత్రి,' అన్నాడు రోషంతో వీరమల్లు.

'అఁ అఁ. అప్పుడు వాళ్ళూ, మనం ఒకటిగామా వీరమల్లూ! శాంతంగా జరుపనెంచినది జరిపివేద్దాం. ఆవేశ పడకు!' అంది నందిని.

'అంతేలెండి! ఆ తర్వాతే ఆలోచిద్దాం!' అన్నాడు వీరమల్లుకూడా.

'సరే, నీ పనులు నీవు చూచుకో! ఆ తర్వాత కలుసుకుందాం. నీకెప్పుడు రావాలనుంటే అప్పుడు రా! దానిని గూర్చి నీవేమీ ఆలోచించకు!' అంది నందిని.

'అఁ అలాగే లెండి!' అని బయలుదేరాడు వీరమల్లు. అప్పటికి బాగా ప్రొద్దుపోయింది. చీకటి అలముకుంటూంది. వీరి మాటల్లోబడి దివ్వెలు వెలిగించడంకూడా వారు పట్టించుకోలేదు. వీరమల్లు అలా కదలగానే మధూలిక కూడా కలుసుకొని తోటలోనికి దారితీసింది. వీరమల్లు వెంటనంటి వెళ్ళాడు. తోటకు అవతల అంచులవరకూ యిద్దరూ వెళ్ళారు. పైన నక్షత్రాలు మెరుస్తూన్నాయి. చెట్లు దట్టంగా ఉండడం వలన తూరుపున ఉదయించి అపరిపూర్ణంగా ఉన్న చంద్రుడు, తన చల్లని చూపులను వారిమీదకు ప్రసరించ లేకపోతున్నాడు. ఒక విశాలమైన శాఖలుగల చెట్టుక్రింద, మధూలిక తన చేతులను ఎత్తుగా ఉన్న వీరమల్లు భుజాలమీద వేసింది. వీరమల్లు తన బలంగా చురుగ్గా ఉన్న చేతులను మధూలిక సన్నని నడుముకు చుట్టి మృదువుగా తనలోని కిముద్చుకున్నాడు. ఆ బంధనలో ఉండి మధూలిక,

'నా అన్న అడ్డంవస్తే చంపేస్తావా?' అంది.

'పిచ్చిమొహమా! వాణ్ణెప్పుడూ చంపను. అంత అవసరమొస్తే కాలో చెయ్యో తొలగదీసి వదిలేస్తాను,' అన్నాడు వీరమల్లు.

'అదిమాత్రం బాధగాదా? అలా అవిటివాడై ఎలా బ్రతుకుతాడు? ఇంక వాణ్ని అవంతిలో ఎవరు లెక్క చేస్తారు?' అంది మధూలిక.

'మరెలా! వాడు తడవ తడవకూ ఎదురుపడుతున్నాడు కదా?' అన్నాడు.

'మనం ఎటన్నా వెళ్ళిపోదాం!' అంది మధూలిక.

'ఆలోచిద్దాం. వాడికి దడచి మనం ఊరొదలడం దేనికబ్బా!' అన్నాడు.

'ఈ ఊర్లో ఉంటే వాడు మనను ఎలాగూ బ్రతకనీయడుగా?' అంది మధూలిక.

'అందుకేగా ఒక్కసారి ఏదో వొకటి విరిచి పారేస్తే మనం చెప్పినట్లు పడివుంటాడనడం! అదీ కాదంటావు. ఎలా నీతో? పోనీ, మీ అమ్మగారినడుగు సలహో, ఏం చేయమంటే అది చేస్తాను,' అన్నాడు వీరమల్లు.

'పాపం తలమునగా ఆలోచనల్లో ఉన్నదామె-మనకేం సలహో ఆలోచించి చెప్పగలదిప్పుడు?' అంది.

'ఎందుకూ, ఆమెకంత ఆలోచన?' అనడిగాడు వీరమల్లు.

'అవన్నీ చాలా పెద్ద వ్యవహారాలు. ఇప్పుడెందుకవి లెద్దూ!' అంది.

'ఏం నేను వినకూడనివా?' అన్నాడు వీరమల్లు.

'ఆమె నడిగినా చెప్పేస్తుంది. మన అధ్యక్షులు-రణవర్మ-రాధానాథులు కలసి చాలా అన్యాయం చేశారామెకు. ఇంకా అన్యాయం చేస్తున్నారు. పైకంత పెద్ద మనుష్యుల్లా ఉంటారా! నీతిమాలిన కార్యాలు చేస్తారు! ఆ ముగ్గుర్నీ

ఏదో ఒకటి చెయ్యకుండా ఆమె ఊరుకోదు. ఈనాడు కాక పోయినా ఒక నాటికి వాళ్ళకు ఆమె చేతుల్లో కీడుతప్పదు. పగపట్టిన పాములాగా ఉందామె!'

'అసలువిషయం చెప్పకుండా నీ వెప్పటిదో చెపుతున్నావు. ఇప్పుడామెకేం ఠక్కువ?' అనడిగాడు నిలదీసి వీరమల్లు.

'ఆ ముగ్గురూ ఆమెను చంపెయ్యడమో, ఈ ఊరునుండి తరిమెయ్యడమో చెయ్యాలని చాలా ప్రయత్నాలు చేస్తు న్నారు. ఆమె వాటిని సాగనీయడం లేదు.'

'అదా సంగతి! ఐతే ఆ ముగ్గురి సంగతీ తేల్చి పార వేస్తా!' అన్నాడు వీరమల్లు.

'నీలాంటి వాళ్ళు ఆ పనికి చాలామంది ఉన్నారు. అంతే కాదు. వాళ్ళు ఎక్కడనుండి ఎప్పుడు ఎటునుండి ఎటు వస్తారోకూడా తెలియదు. ఆనాడు చూచావుగా! బాణం ఎక్కుపెట్టి వదలితే ఆ మనిషిలోనుండి దిగి, తలుపుకు గుచ్చు కుంది. అలాంటి వాళ్ళు వాళ్ళు. ఎంత చీకటిలోనైనా చూడగలరు. ఎంత దూరాన ఉన్నా చూడగలరు. ఒక్కోరూ నీకన్న ఎత్తు. నీకన్న లావు. నీకన్న బలంగలవాళ్ళే!' అంది మధూలిక.

'వాళ్ళు మనకగుపించరేం?'

'కనిపించరు! ఆమె తలచుకున్నా, చప్పట్లు కొట్టినా ఎదట నిలబడతారు. కావలసినపని చేస్తారు. మన చుట్టూ కూడా ఉండి ఉంటారు. కాని మననేం చేయరు! వాళ్ళం దరికీ అందరూ తెలుసు' అంది మధూలిక. అదంతా మాయగా ఉంది అతనికి.

అది కడుపులో ఉంచుకోలేక, 'ఇందాక వాళ్ళతో తగాదా ఆడి సరాసరి వచ్చాను. నేను ఎక్కడా ఆగను కూడా లేదు. ఆమెకెలా తెలిసిందంటావు?' అనడిగాడు.

'అదే ఆమెలో ఉన్న విచిత్రం! ఇక్కడ మనం ఎవరికీ తెలియకుండా ఉన్నామా! ఇప్పుడు నేను వెళితే ఏమంటుందో తెలుసా?' అని ఆగింది మధూలిక.

'ఏమంటుంది?' అన్నాడు ఆత్రుతగా వీరమల్లు.

'పో! నాకు సిగ్గుగా ఉంది' అంది.

'చెప్పవే!' అన్నాడు బ్రతిమాలుతున్నట్టు గడ్డం క్రింద చేయి పెట్టి పైకెత్తుతూ మధూలికను వీరమల్లు.

'ఓర్నాయినో! ఇవి చేతులా, ఉక్కు ముక్కలా యింత గట్టిగా ఇలా ఉన్నాయి!' అంది మధూలిక.

'చూశావా! మాట మారుస్తున్నావు. ఎన్నిసార్లు ఈ చేతుల్లో ఉన్నావు ఇంతకుముందు? నేనా మాట అడిగేప్పటికి తప్పించడానికి మాటలు పెంతుతున్నావా?' అంటూ పిరుదులు క్రింద చేయివేసి ఆమెను సునాయాసంగా ఎత్తి బుగ్గమీద ముద్దు పెట్టుకున్నాడు వీరమల్లు.

'ఏముంది! ఏమీ అనదు. ఇవన్నీ చెప్తుంది. పైగా అంటుంది-వీరమల్లు నిన్ను ఏనాడో తన చేతులతో నలిపి పారేస్తాడే అంటుంది' అంది మధూలిక.

'ఇవన్నీ ఆమె కెలా తెలుస్తాయి?' అనడిగాడు.

'అదే మరి ఆమెకూ, మనకూ తేడా! ఇంట్లో ఆ మేడ మీదనుండి కదలదు. అన్నీ తెలుసుకుంటుంది. ముందు రోజుల్లో ఏమో అనుకున్నాను. అసలు మా అన్న, అధ్యక్షులూ కలసేగా నన్ను ఆమె మీద వేగుగా ఉండమని

నియమించారు! అలాటిది, నే నెన్నిసార్లు అధ్యక్షుల వారింటి కెళ్ళిందీ, వారితో మాటాడిందీ, ఏఁమ్మాట్లాడిందీ కూడా చెప్పి, 'పిచ్చిదానా! అలా చేయడం మంచిది గాదు. నేను మిమ్మల్నందరినీ నమ్మాను-మీరు మోసంచేస్తే మీ పాపాన మీరే పోతారు. నాకేం నష్టంలేదు. ఒకవేళ నేను చేయ దలిచింది మీ కెవరికీ తెలియకుండా చేసుకోగలను. మీ రన వసరంగా నా మంచితనాన్ని పాడుచేస్తున్నారు,' అంటుంది, అన్నది కూడాను,' అంది మఘూలిక వీరమల్లుతో.

వీరమల్లు విని, 'అలాంటి మంచిదాన్ని మోసంచేయ కూడదే!' అన్నాడు.

'ఆ పొరపాటు యిదివరకు చేశాను గాని, యిక నెందుకు చేస్తాను?' అన్నది మఘూలిక.

'కావలిస్తే ఏ పని చెప్పినా చేస్తాను. ఆమెకోసం నా ప్రాణాలిమ్మన్నా యిస్తాను అవసరమైతే. నేను మొన్ననే అనుకున్నా-ఈ చంపుకోడాలన్నీ ఆమెకోసమేనని, అక్కడ జయపాలుడు-ఇక్కడ మాలి! యిద్దరూ చావడం. ఆఁ అది సరే, అక్కడ జయపాలుణ్ణి ఎవరు చంపారంటావ్?' అని అడిగాడు వీరమల్లు.

'ఎక్కడా జారబోకు. అధ్యక్షులు చంపించాడు.'

'అతని కేమవసరం?' అన్నాడు వీరమల్లు.

'అదే! అమ్మగార్ని చంపమని నూరు మొహరీ లిస్తామని జయపాలుని మనిషిని పంపారు. ఆ తర్వాత అధ్యక్షులు ఆలోచించారు. ఏ నాటికైనా జయపాలుడు తనకు ఎదురు తిరిగితే కష్టమని, రాత్రికి తన మనిషిని పంపి జయపాలుని చంపించాడు. ఆ జయపాలుని చంపిన మనిషిని ప్రొద్దున కాబోలు పట్టుకొని, వాడికి చేయవలసిన పని వాడికి చేసి

సిప్రానదికి అవతల ఉన్న పహార్ గడ్‌లో వాణ్ణి ఉంచారు-ఏ నాటికైనా అవసరమని. అధ్యక్షులు పనిమీద పంపారని, వాడు ఉజ్జయిని వెళ్ళాడని, అమ్మగారు కొంత సొమ్ము వాడి సంసారానికిచ్చారు, తెలుసా?' అంది మధూలిక.

'అబ్బా! చాలా కథ జరిగిందే మొన్న! ఐతే ఆమె వాళ్ళ కుటుంబం బాధ పడకుండా సొమ్మందిస్తుందన్న మాట?' అనడిగాడు వీరమల్లు.

'అదేమిటి, మొన్న ఆమెను చంపడానికి వచ్చిన వాడి కుటుంబానిక్కూడా ధనం యిచ్చిందిగా? ఐతే నిజం వెలికి వస్తుందని వాణ్ణి పిచ్చివాణ్ణి చేసింది.'

'అది కొంత నయంకాదా పనయ్యాకనో, చిక్కాడనో చంపిపారెయ్యకుండా. ఈమె చేస్తున్నవన్నీ మంచిగానే ఉన్నాయి. అసలు ఆమెకూ వారికీ విరోధ మేమిటి?' అనడిగాడు.

'అదంతా ఒక పెద్ద గాథ. ఆ తర్వాత ఎప్పుడన్నా మాటాడుకుందాం! ఇప్పటికే చాలా ఆలస్యమైంది, వస్తాను.' అంది మధూలిక.

'వెళతావా? సరే వెళ్ళు. ఆమెకేదన్నా కావాలంటే అంది యివ్వాలిగా,' అన్నాడు.

ఆఖరి ముద్దు గట్టిగా పెట్టుకొని, ఒకసారి గట్టిగా తన గుండెల కదుముకొని వదలివేశాడు, మధూలికను. మధూలిక వీరమల్లు కౌగిలిని వదల లేక వదల లేక వదలి వెళ్ళింది వెను దిరిగి చూస్తూ! ఆ బాధ చాటుగా కలసుకుందే వాళ్ళకే తెలుస్తుంది. ఆ కౌగిళ్ళ బలమే వేరు. అది మరచిపోలేరు. మామూలు భార్యాభర్తల కౌగిళ్ళలో ఆ సుఖం, ఆ ఆనందం ఉండదు. యాంత్రికంగా జరుగుతుంది. పట్టువిడుపులున్న

కౌగిళ్ళలో యాంత్రికం పోయి వలపు, మనస్సు, ఆత్మీయత పెరుగుతుందా విరామకాలంలో.

అందుకే పెళ్ళిగాని ప్రేమికులు, ఒకరి కొరకు ఒకరు తహతహలాడుతుంటారు. వారి పెళ్ళయాక ఎందుకొచ్చిన కాపురంరా ఇదని, మొఖాలు మాడ్చుకొంటూ చీకటి గదుల్లో బంధనంలేని, వలపులేని యాంత్రిక బంధనకు దాస్యం చేస్తుంటారు.

కౌగిలి వదలి కాళ్ళాడక మందిరం చేరిన మధూలికకు నందిని క్రింద గదిలో ఎవరితోనో మాటాడుతున్నట్టు చూచాయగా తెలిసి, ద్వారం వద్ద నిలచి ఆలించింది. లోపలనుండి రణవర్మ కంచు గొంతు—

'తర్వాత ఏమనుకొని ప్రయోజనం ఉండదు నందినిదేవీ!' అంటూంది.

'మీరు మరోలా ్రావించకండి. మీరు అవంతి సర్వ సైన్యాధ్యక్షులు. మీకు తెలియనిదేముంది? వీరమల్లు మొరటువాడు. మొరటుగా మాట్లాడి ఉండవచ్చు. ఏను గును చూచి కుక్కలనేకం మొరుగుతుంటాయి. ఏనుగు లెక్క చేస్తుందా? అంతే! అంతకన్న మిమ్మల్ని నేను కోరేదేమీ ఉండదు,' అంది నందిని. ఆ మాటలు వింటున్న మధూలిక ప్రాణాలు పైవి పైనే పోతున్న తీరుగా అయ్యాయి.

'ఈ రోజు నా మీద తిరుగ బడినవాడు రేపు అధ్యక్షుని మీద తిరుగబడడా? ఈ రోజు సైన్యాధ్యక్షుడు, రేపు అవంతి అధ్యక్షుడు. ఎవరి బలం చూచుకొని వాడలా మిడిసి పడుతున్నట్లు?' అన్నాడు రణవర్మ.

'మీకు జరిగిందొకటి, నాకు జరిగిందొకటిగా నేను భావించడం లేదు. ఈసారికి మనందరం అతన్ని క్షమిద్దాం! అతడు తెలియని వాడు. మొరటువాడు. అంతే. అతనికి ఒకరి బలం ఏమిటి? నిజంగా విషయం తెలిసిన వాడైతే మీ రెక్కడా? తనెక్కడా? ఎవరి బలం ఉంటే మాత్రం మీ బలంతో సమానమవుతుందా? మిమ్మెదిర్చాడంటే అది మిమ్మ్మగాదు. అవంతి సర్వ సైన్యాన్ని ఎదిర్చినట్లేగదా? అన్నట్లు మీరు మాటల్లో ముంచేశారు.' 'చతురికా! చతురికా!' అని కేక వేసి, 'ఆఁ! మన జయపాలుని వ్యవహారం గాని, నా ఇంట మాలిని వింటితో కొట్టిన వారి విషయం గాని ఏమైనా తెలిసిందా?' అనడిగింది నందిని. అంతలో చతురిక వచ్చి 'పిలచారా అమ్మా!' అంది.

'ఆఁ పిలచాను. మీకు రాను రాను మతులు పోతున్నాయే! సైన్యాధ్యక్షులవారు వచ్చి ఎంత సేపైంది? ఒక్క గుక్కెడు ద్రాక్షాసవం ఈయాలన్న జ్ఞానం కూడా లేదు లేటే? నన్ను వారు మాటల్లో దింపారు. వాటిల్లోబడి నేను మరచాను. మీరున్నారంటే ఎవరికి వారు తమది కాదన్న రీతిలో ఉంటారు. అలా నిలబడతా వేమిటే! వెళ్ళి ద్రాక్షాసవం పాత్ర తీసుకొని రా!' అంది నందిని విసురుగా లేని అప్యాయతనంతా చూపుల్లో సవంకన్న మిన్నగా మత్తు కలిగించే తీరులో ఒలకచూస్తూ.

'ఒద్దులే నందినీదేవీ! వెళతాను. ఆ విషయం తేల్చుకోవాలనే వచ్చాను.' అన్నాడు. రణవర్మ ఆ చూపులను వదలి లేవడానికిష్టం లేకపోయినా, కష్టంగా!

'బాగు బాగు. ఇంటికి వచ్చిన వారికి నందినికి మర్యాద చేయడం కూడా రాదనడానికా! ఏదో నా శక్తికి కొలది-కొండంత దేమునికి కొండంత పత్రి ఎలానూ తేలేను.

ఉడుతా భక్తిగా' అంది జారే పయ్యెద తొలగి పోకుండా వేసుకుంటూ. సైనాధ్యక్షుడు మానసికంగా చాలా బల హీనుడు. అది ఆ నాడు కోవెలలోనే తేల్చుకుంది. అంతలో చతురిక చీనా పాత్రలోని ద్రాక్షాసవాన్ని విసుగ్గా చిరాగ్గా ఈ చండాలుని కందీయాలసొచ్చినదే అనుకుంటూ చిన్న గాజు పాత్రలోనికి వంచి అక్కడున్న ఒక ఆసనం మీద ఉంచింది. వెంటనే నందిని వచ్చి దానిని తీసి రణవర్మ కందించింది.

రణవర్మ ఒక్క గుక్కలో దానిని ఖాళీచేశాడు. 'మరో పాత్ర త్రాగండి' అంటూ బల్లమీద ఉన్న పెద్ద పాత్రలోనిది ఒలక బోసింది చిన్ని పాత్రలోనికి. అదీ త్రాగేశాడు. ఆ పాత్ర అతని చేతిలోనే ఉంచి పెద్దపాత్ర తిరిగి వంచింది. అదీ అంతే! ఆమె అమృతం పోస్తున్న మోహినిలా పోయడం, అతడు త్రాగడంగా చాలా పాత్రలు త్రాగి 'ఇక చాలు' అని చేతితో వారించాడు. ఆసనమ్మీద ఆ పాత్రనుంచి తిరిగి రణవర్మ కెదురుగా ఉన్న ఆసనమ్మీద కూర్చుంది నందిని. చతురిక మొదటి పాత్రలోనిది త్రాగుతుండగనే తప్పుకుంది. ఆ గదిలో వారిద్దరే ఉన్నారు.

'ఆఁ, ఏమిటీ! నందినీదేవీ! యింతకుముందు జయపాలుని సంగతి ఎత్తావు' అన్నాడు. కొద్ది కొద్దిగా వచ్చినప్పుడున్న ఆగ్రహం తెలివి కోలుపోతూ - ద్రాక్షాసవం మత్తు నెత్తు కొంటూ ఉన్నాడు. నందిని గమనించింది.

'ఏం లేదు. ఆనాడు జరిగిన అల్లకల్లోలం తాలూకు మనుష్యులు-మా యింట మాలిని వింటి తెచ్చి కొట్టినవాడు, జయపాలుని బాకుతో పొడిచినవాడు ఎవరైందీ తేలిందా? అని. అంతే, అంతకన్న ఏంలేదు' అన్నది నందిని.

'చేసినవారు తేలలేదుగాని చేయించినవారు తేలారు' అన్నాడు మైకంలో పడుతున్న రణవర్మ! నందిని త్వరపడ కూడదనుకుంది. కానీ ఆగిపోయాడని—

'అంటే దీనికి వెనక నాటకంఆడే నాథులు వేరే ఉన్నా రన్న మాట. అబ్బా! నేనేదో పొరపాటున జరిగిన దను కున్నాను సుమండీ!' అంది.

'ఏం కాదు. అంతా కావాలనే! అధ్యక్షుడు చేయిం చాడు జయపాలుని హత్య. మాలి హత్య నీమీదకు నెట్టాలని ప్రయత్నిస్తున్నాడు' అని చేతులతో సహా కదుపుతూ మాటాడి తెప్పరిల్లి 'ఆఁ ఏమన్నాను నందినిదేవీ! ఏమన్నాను' అన్నాడు ఎక్కుతున్న కైపును దించుకోవాలని ప్రయత్నిస్తూ.

'నే నెవ్వరితోనూ అనను లెండి. ఈ విషయం వెలికి పోదు' అని, తను లేచి తిరిగి పాత్రనిండా సవం అందించింది. దానిని కూడా అందుకొని కాళీ చేశాడు. తిరిగి పోసింది. అలాగే నాలుగు పాత్రలు త్రాగి—

'ఆఁ! అదీ సంగతి. నీవింత మంచిదానవా? ఎప్పుడో ఏదో ఆడేదో తోటలో చేశావుట. దాన్ని నీవు కడుపులో పెట్టుకొని వారిద్దరినీ చంపావుట. ఆ తర్వాత నన్ను, వాడు లేడూ—రాధానాథుడు—వాణ్ణికూడా చంపుతావుట. తర్వాత అతన్నిగూడా చంపుతావని అధ్యక్షుడంటాడు. ఇదెవరైనా నమ్మేదేనా? తాత బట్టతలకూ అవ్వగడ్డానికీ ముడి వేయడం కదూ—ముసలి వెధవ' అన్నాడు రణవర్మ.

'అయినా తోటలో జరిగిందేమిటి?' అంది నందిని ఇంకా లోతుకు పోవాలని.

'నీకు తెలియదులే నందినీదేవీ! చాలా కాలం క్రితం. అబ్బో! అది జరిగి ఏళ్ళయిందిలే! నిన్ను మేము చాలా మందిమి బలాత్కారంగా అనుభవించాం. అది నీకు గుర్తు లేదు, బహుశా తెలియదులే నీకు! ఆ సంగతి యెత్తితే మాటి మాటికీ భయపెడతాడు. నాకేం భయం? నేనెప్పుడూ భయ పడను. ఐనా ఆ త్రాగుబోతు చెప్పే ప్రతిమాటకూ విలు వేమిటి? ఎంత అధ్యక్షుడైతే మాత్రం అన్నీ వింటామా? అన్నీ చేస్తామా!' అన్నాడు. పూర్తిగా మత్తుకు లోనయ్యాడు రణవర్మ.

'ఐనా నామీద వారికెందుకంత కక్ష! మీ నీడలో బ్రతుకుదామనికదా వచ్చాను? నన్ను వెళ్ళమంటే ఎటో వెళ్ళి బ్రతకనా, చెప్పండి?' అంది జాలిగా చూస్తూ నందిని. చాలా విషయాలు చెప్పావురా తండ్రీ! ఇంక ఆడే నాటకం చూడు' చాలా గొప్పగా ఉంటుంది, అని లోలోన అనుకొని.

'అదే పనికిరాదు. నేనింత వాడనుండగా వాడెవడు? ఆ ముసలిపీనుగుదేముంది? రేపీపాటికి గల్లంతు చేయగలను. నువ్వు ఊరు వదలడమా! ఛీ-ఛీ, అలా ఏడవకూడదు. నందినీదేవీ! నీవు నవ్వుతూనే ఉండాలి. నీ కళ్ళల్లో నీళ్ళసలు రాకూడదు. నా మాట విను. నీకు వచ్చిన భయం ఏమీ లేదు,' అన్నాడు రణవర్మ.

'ఏమో బాబూ! ఆడదానను. ఏ రాత్రి ఏం చేసినా నా బ్రతుకు నాశనమవుతుంది. అయినా, రాధానాధుడూ కలసి ఏమైనా చేయగలరు!' అంది నందిని.

'వాళ్ళెతల! వాళ్ళేం చేయగలరు? వచ్చే పున్నమినాటికి, నిన్ను జయదేవుని తోటకు రప్పించి, చెట్టుకు వేళ్ళాడ

దీయించే ఏర్పాటు చేశాడు. నే వద్దన్నాను. వినలేదు. అది కాదని రాధానాథుడూ అన్నాడు. సరిగ్గా ఆ రాత్రి నడి జాముకు - ఎంత పిచ్చి! నేనూ, వాడూ, రాధానాథుడూ ఉండాలట ఆ వేళకు తోటలో!' అని పక పక నవ్వాడు రణవర్మ. నవ్వి 'ఇది పిచ్చికదూ నందినీదేవీ! పిచ్చా, కాదా?' అన్నాడు నందినివైపు తిరిగి ప్రశ్నిస్తూ.

నందిని గుండెలొకసారి ధన ధన కొట్టుకొని తిరిగి మామూలు స్థితికి వచ్చాయి. పున్నమి ఎల్లుండి. అబ్బా! ఎంత ఎత్తువేస్తాడు! రాత్రి నడి జాముకంతా - అధ్యక్షా! నీ పుచ్చెమాపుతాను. సరా! అనుకొంది నందిని.

'ఎందుకో అంత కక్ష?' అంది నందిని మళ్ళీ.

'కక్షా-పాడూ లేదు నందినీదేవీ! ఒకటేమో నీవంటే భయం. రెండోది-నీదగ్గరున్న ఆ హారం, ఆరత్నాలు అతనికి దక్కాలట! అవెక్కడుంటేయేం? వాటి నెవరైనా కొన గలరా? అవంతిలో ఉంటేయేం? నీ దగ్గరుంటేయేం? గౌరవం మన ఊరుకేకదా? అది కాదట - అధ్యక్షులవారి అధీనంలో ఉండాలి. వెధవ కోరికలు నందినీదేవీ!' అన్నాడు రణవర్మ.

'వాటిని మీకిస్తాను. మీరు పట్టుకెళ్ళి వారికివ్వండి. అదేమంత గొప్పపని కనుక! ఆ రోజు మీ దగ్గరే ఉంచండని చెప్పానుకదా? నాకు యెందుకిచ్చినట్లు? ఏనాడుమాత్రం కాదన్నాను? ఆడదాన్ని అవంతి పాలకులింత అన్యాయం చేస్తారనుకోలేదు. పులి నోట్లో తల పెట్టాను. నేనెటన్నా పారిపోతాను,' అంది నందిని.

'అబ్బే! అది పిచ్చి! పారిపోకూడదు. నువ్విక్కడే ఉండాలి. ఆ తర్వాత అధ్యక్షు పదవి నీది. వాడు ఎలాగూ చస్తాడు,' అన్నాడు.

'నాకా పదవెందుకులెండి! మీరున్నారు, రాధానాథులున్నారు. ఇంకా తదితరులున్నారు. నేనెవ్వెతను మధ్య అవంతి అధ్యక్ష పదవికి?' అంది నందిని.

'మేం దానికి పనికిరాం. నాకు తెలుసు. ముసలి నక్క సగం వణకిపోతుంది ఈ విషయంలో నే నందినీదేవీ!' అన్నాడు రణవర్మ. హాయిగా తాగినదంతా మెదడుకు పట్టింది. మెదడులో చేరిన దానినంతా వెలికి గక్కుతున్నాడు.

నందిని 'నా కెందుకు? నా కెందుకు?' అంటూనే తనకు కావలసిన దానినంతా హాయిగా అందుకొంటూంది. అంతా చెప్పేశాడు, ఇంక మిగిలిందేమీ లేదనుకుంది. ఆమెకు మరీ పున్నమి నడిజాము—ఆదే తలపులో తిరిగి పోయింది. నందిని మౌనం చూచి రణవర్మ 'భయపడకు నందినీదేవీ! నీకేం భయం లేదు. నేను వెళ్ళివస్తాను,' అని లేచాడు.

'మీ దయ' అంది. రణవర్మ తూలుతూ తూలుతూ, నందిని మందిరం వదలి, తడబడే అడుగులను సరిగా వేసుకుంటూ బయలుదేరాడు. ఆకసాన చందమామ కొరవబోయిన చందనం బిళ్ళలా ఉన్నాడు తన కాంతి పుంజాలు ప్రకృతి మీదికి విరజిమ్ముతూ! అవి అన్ని వంకలకూ సమంగా పడి ఏదో తెల్లని పిండి ప్రకృతి దేవత ఆరబోసిన తీరుగా ఉంది. చెట్ల నీడలన్నీ ఆ పిండిని ఎవరేనా తీసుకెళతారేమో జాగ్రత్తని, కాపుంచిన పనికాయాల్లా ఉన్నాయి నిలచి కదలకండా. ఆ పిండి మీద నడుస్తూ, చెట్లకాపును పరీక్షిస్తూ తన భవనానికి బయలుదేరిపోయాడు రణవర్మ. తనకు సరిగా తెలియని స్థితిలో అడగవచ్చింది మరచి, అడిగిన వాటికి సమాధానమిచ్చి.

అతడా విధంగా మారిపోతాడని అధ్యక్షునికి తెలిసే, చాలా అవస్థపడి పట్టుకొస్తున్నాడు. అయినా మించిపోయింది. అనుకోకుండా సాయంత్రం నందినిని తిట్టి, నందిని మనిషిని రెచ్చగొట్టి, నీ బంటిలా చేశాడని చెప్పడానికి వచ్చి, అతన్ని దండిస్తానని నానా గలాబా చేసి, ఆఖరుకు ప్రాణంగా దాచుకోవలసిన రహస్యాలు ఆమెకు చెప్పి, తూలుతూ ప్రయాణం కట్టాడు. ఈ విషయాలలా చెప్పినట్టు నందిని కబురు చేయాలనుకుంది రహస్యంగా. కానీ, తనకు తెలిస్తే ప్రమాదమైన దానిని కూడా రణవర్మ చెప్పడంతో కబురు పెట్టడం మానుకుంది. లేకుంటే రణవర్మ పనిగూడా అధ్యక్షునిచేతనే చేయించేదే...

రెండవనాటి రాత్రికి నానా గలాబా జరుగుతుంది. జరగాలి. తప్పదు. ఎలా జరుగుతుందో చూడాలి. దీనికి తగిన ప్రతిక్రియ చేయాలనుకుంది నందిని. ఆమె కేమీ భయంలేదు. తన మందిరంలో రాత్రిళ్ళు చీమ చిటుకుమన్నా నలిపి వేస్తారు. అర్థరాత్రి తనకు తెలియకుండా తనయింట తనకేం జరగదు. అసలు అధ్యక్షులవారు ఈ పథకం పారుతుందని ఎలా ఊహించాడు? ఇదెలా సఫలమవుతుంది? అతని ఊహను ఎలా నిర్వర్తించగలడు? చూద్దాం. అదీకాక, యిదేమైనా నటనా? మరేదేనా ఉన్నదా! రణవర్మకూడా అధ్యక్షుని మనిషి. దీనిని నమ్మడం ఎలా? అతను త్రాగి మత్తులో మాటాడాడు. దానిని నిజమని నమ్మడం ఎలా? అన్న ఆలోచనతో గడుపుతూంది.

రెండు రోజులూ గడచాయి. ఆ నాటి ఉదయం అధ్యక్షులవారు తన పరిచారికను నందిని యింటికి పంపి, మధూలికను తను పిలుస్తున్న రీతిలో పిలిపించాడు. మధూలిక

వెళ్ళింది. మధూలిక అన్న జయసింహుని వెలికి పొమ్మన్నాడు. జయసింహుడు వెలికి వెళ్ళాడు.

అధ్యక్షుడు చాలా గోముగా, మర్యాదగా మధూలికను పలుకరించాడు.

'మధూలికా! నీవు నందినియింట ఎందుకుంటున్నావో తెలుసుగా? నేను నిన్ను నందిని యింటిలో నిన్ను ఉంచినది అక్కడి వ్యవహారాలు ఏనాటి వానాడు అందించమని కానీ, ఈ నాటి వరకూ ఆ అవసరం రాలేదు. నీ వేమీ సాయపడలేదు. నీకు తెలుసుగా,' అన్నాడు.

'అదేమిటలాగంటారు? ఆ మధ్య-ఆమె చాలా మంచిది-ఆమె మీద వేగు అనవసరం - అన్నది మీరే కదా? మీ మాటను కాదని నే నే నాడు నడచాను? మీరు చెప్పిన పని నేనేం చేయలేదు?' అన్నది మధూలిక బిక్క మొహం పెట్టి భయభక్తులతో!

'అది నీ తప్పని, నీవు తప్పు చేశావని అనడంలేదు మధూలికా! ఇంతవరకూ ఆ అవసరం రాలేదని మాత్రమే అంటున్నాను. విను చెపుతాను. ఈ రోజు రాత్రికి నీవేం ఎక్కువగా చేయవలసిందిలేదు. పెద్ద ఘనకార్యం అంత కన్నా కాదు. ఉత్తరదిక్కు ద్వారం తెరచి ఉంచు. అదీ ఒక ఝాము ప్రొద్దు పోయాక. అంతకన్న నీవు చేయవలసిన సాయంలేదు' అన్నాడు అధ్యక్షుడు.

'ఎందుకో అడుగకూడదనుకోండి - తెలుసుకోడాని కడుగుతున్నాను' అంది మధూలిక.

'అదంతా ఇప్పుడు చెప్పను. ఈ విషయం రెండోకంటికి, చెవికి తెలియకూడదు. తెలిసిన మరుక్షణం నీవు లోకంలో ఉండవు. ఈ పని సక్రమంగా చేశావా, నీ అన్నకు తైలియ

కుండా నీకు కొంతడబ్బిస్తాను. దానిని తీసుకొని వీరమల్లుతో ఎటన్నా వెళ్ళిపోవచ్చు. లేదా-వీరమల్లుకు మంచి ఉద్యోగ మిస్తాను. నీ అన్నను ఒప్పించి నీకు వీరమల్లుతో పెళ్ళి జరుపుతాను. ఆలోచించుకో.' అన్నాడు అధ్యక్షుడు.

'మీరంత ఖచ్చితంగా, నిష్కర్షగా చెప్పాలా! మీ దాసీదాన్ని. మీరేపని చెపితే చేయను? మా అన్నతో చెప్పి ఒప్పించండి. చాలు. మీ పాదాలచెంత పడివుంటాం అందరం-డబ్బు దేనికి?' అంది మధూలిక.

'సరే! అలాగే గుర్తుపెట్టుకో! ఉత్తర దిక్కు ద్వారం... రాత్రి జాము ప్రొద్దు పోయాక...మరొకరికా విషయం తెలియరాదు. తెలుసా? ఆఁ! నందిని ఎలా ఉంది?' అన్నాడు.

'ఆ మధ్య ఏదో దిగులుగా ఉన్నారుగాని మళ్ళీ మామూలైంది. బాగానే ఉంది' అన్నది మధూలిక.

'మంచిది. నీవిక వెళ్ళవచ్చు. ఉత్తరదిక్కు ద్వారం తెలుసుగా! ఉండు, ఎందుకైనా మంచిది. ఈ మాత్రలు తీసుకొని వెళ్ళి నందిని ఇంట్లో రాత్రికి మేల్కొంటే అపకారం జరుగుతుంది. అందరూ త్రాగే నీళ్ళల్లో కలుపు' అని రెండు ఘుళికలు యిచ్చాడు.

'తోటి ఆడవారి ప్రాణాలు తీయమంటారా?' అంది మధూలిక జాలిగా చూస్తూ.

'ఆఁ పిచ్చిదానా! ఇది విషంకాదే! మత్తుమందు. రాత్రికి మా పని సక్రమంగా జరగాలంటే అందరూ నిద్ర పోవాలి. అందుకిస్తున్నాను' అన్నాడు.

'ప్రాణాలు పోవుకదా?' అంది.

'పోవు. హాయిగా నిద్ర పోతారు. తెల్లవారాక లేస్తారు. అలాటిదైతే నీ చేత నెందుకు చేయిస్తాను?' అని, ఎందుకైనా

మంచిది దాని దృక్కులు మార్చాలని, 'ఎవరితోనూ చెప్పకు. రాత్రికి నందినిఇంట్లో దొంగతనం. అదీ ఏదీ ఎత్తుకు పోరు - ఆమె గదిలో ఉన్న ఆ నగలపెట్టె మాత్రమే! తెలుసా?' అన్నాడు.

'అందుకా! అదైతే ఏ రాత్రో మీకు నేనే తెచ్చిస్తానే' అంది మధూలిక.

ఒక్కసారి దిమ్మరపోయి, తేరుకొని అధ్యక్షుడు, 'అప్పుడు మీ మీదికే వస్తుంది. మీరు చేశారని తేలిగ్గా అది అనుమాన పడుతుంది. అలా ఎందుకు? దొంగలు పడినట్టు కథ నడిపితే పోదూ! అలా ఎందుకులే!' అన్నాడు అధ్యక్షుడు.

'మీ ఇష్టం. ఇదందరూ త్రాగాలిసిందేగా?' అంది మధూలిక.

'ఆఁ! పరిచారిక లందరూ త్రాగేట్టు. నందినికూడా!' అన్నాడు.

'అలాగే చేస్తాను' అంది.

'సరే వెళ్ళు! చెప్పానుగదా? ఏ అవకతవక జరిగినా నీ ప్రాణాలు తీయిస్తాను జాగ్రత్త! సక్రమంగా జరిగితే వీరమల్లుతో పెళ్ళి!' అన్నాడు అధ్యక్షుడు.

'ఎంత మాట-మీ ఉప్పుతింటున్న దాన్ని' అంది.

'ఊఁ, జాగ్రత్తగా వెళ్ళి పని మాడు! జాగ్రత్త!' అని మాటిమాటికీ వెళ్ళేముందు జాగ్రత్త చెప్పి పంపాడు. నందిని మందిరానికి నిదానంగా దారి తీసింది మధూలిక.

మందిరం చేరగానే నందిని 'మధూ! వెళ్ళినపని సక్రమంగా చేసుకొచ్చావా?' అంది.

'నేనెక్కడికి వెళ్ళానమ్మా! ఏం పనిమీద వెళ్ళాను?' అంది మధూలిక.

'అధ్యక్షులవారి పరిచారిక పిలుచుకొని వెళ్ళింది కదా!' అన్నది నందిని.

'మా అన్నయ్య పిలిస్తేను, వెళ్ళానమ్మా' అంది మధూలిక.

'ఆఁ అంతేలే - అదే! వెళ్ళిన పని అయ్యిందా అంటున్నాను.' అంది నందిని

'అన్నయ్య లేడు. అందుకని వచ్చేశాను.'

అధ్యక్షులు లోపలున్నప్పుడు మీ అన్నయ్యెలా లోపలుంటాడు? తలుపులూ ద్వారాల విషయంకదా?' అంది నందిని.

'అమ్మా! మీరు...' అంది మధూలిక ఆశ్చర్యంగానే.

'పర్వాలేదులేవే! వారు చెప్పినట్లే చెయ్యి! నాకేమీ చెప్పకు' అంది నందిని.

ఆ తర్వాత ఇద్దరూ మందిరలో పరితలానికి వెళ్ళారు. జరిగినదంతా చెప్పింది. ఆ ఇచ్చిన రెండు ఘుటికలూ నందినికిచ్చింది మధూలిక.

'వారిష్ట ప్రకారమే తలుపు తీసి ఉంచు. ఆ తర్వాత విషయాలు నేను చూచుకుంటాను' అంది నందిని. అంటే ఆ రోజు త్రాగి చెప్పినా రణవర్మ నిజాలే చెప్పాడన్నమాట-అనుకుంది.

* * *

అర్ధరాత్రి-నడి జాము. నిండు పున్నమి. నిండుచంద్రుడు-దండి వెన్నెల. అది పండు వెన్నెల రేయి చంద్రుని చుట్టూ గూండు కట్టుకొనుంది.

నందినీదేవి మందిరం నిశ్శబ్దంగా ఉంది. ఎక్కడా ఏ సద్దూ లేదు. ఆకు కదలినా సద్దు వినవస్తూంది. నందినీ మందిర మంతా నిద్రలో ఉంది. ఐదుగురు మనుష్యులు ఆ ఇంటి ఆవరణలోనికి వచ్చి రెండు క్షణాలు తారసలాడారు. ఎక్కడా ఏ సద్దూ లేదు. లోకమంతా గాఢ నిద్రలో ఉంది. కొన్ని క్షణాలలా అటూ ఇటూ తారసలాడి, ఉత్తర దిక్కు ద్వారం దగ్గర నిలచి తలుపు నెట్టారు. తలుపు తెరచుకుంది. లోనికి వెళ్ళారు ఐదుగురున్నూ. ఒక గది చూచారు. ఆ గదిలో ఇద్దరు పరిచారికలు పడుకొని నిద్ర పోతున్నారు. మరో గదిలోనికి వెళ్ళారు. అక్కడ ఎవరో ఒకరు పడుకొని ఒంటి మీద బట్ట తొలగడం కూడా తెలియకుండా నిద్రలో మునిగి ఉన్నారు.

అంతా కలసి సద్దు చేయకుండా మెల్లగా మందిరం మెట్లు నెక్కారు. అక్కడ ఒక గదిలో చతురిక, మధూలిక ఒక శయ్యమీద పడుకొని నిద్రిస్తున్నారు.

ఆ గదికి ప్రక్క గది. ఆ గదిలో ఒక దివ్వె సన్నగా వెలుగుతూంది. ఒక తల్పం మీద నందిని నిద్ర పోతూంది. ఆమెకే చింతా లేదు. నిండా ముసుగు పెట్టుకొంది. మోము మీద మాత్రం కప్పుకోలేదు. ఆ సన్నని వెలుగులో ఆ గది లోని ప్రతి వస్తువూ అంత స్పష్టంగా కనిపించడం లేదు. ఒక మనిషి తల దగ్గర చేరాడు. రెండవ మనిషి కాళ్ళదగ్గ రున్నాడు. అటొకరూ ఇటొకరూ ఉన్నారు. ఒకరు ద్వారం దగ్గర కాపు కాస్తున్నారు - అలికిడైతే జాగ్రత్త అనడానికి. మోము దగ్గరున్న వ్యక్తి తన చేతిలో ఉన్న

గుడ్డను మోముకు కప్పాడు. నోరు గట్టిగా మూశాడు. కాళ్ళూ, చేతులూ తన్నుకుంది నందిని. ఎంత గింజుకున్నా వదల లేదు. వారు కాళ్ళూ చేతులూ కట్టివేశారు. ఒక బలిష్ఠ దేహం నందినిని ఎత్తుకొని నడక సాగించాడు. వారలా నడచి దొడ్డి దోవగుండా ఆ చెట్ల నీడల నాసరా చేసుకొని నిశ్శబ్దంగా, వేగంగా ఒకరినంటి ఒకరు నీడల్లో నీడల్లా దూర దూరాలకు వెళ్ళి పొలాలబాట పట్టి జయ దేవుని తోట చేరారు. తోట ఈ పాపం చూడలేక చీకటి నలుముకొంది. లోపలంతా గాఢమైన చీకటి. అక్కడ ఎవరు ఏరో తెలియడం లేదు.

ఆ ఐదుగురులో ఒకరు, 'జయసింహా! మీ ఇద్దరూ వెలుపలుండండి. రణవర్మా! ఈ చెట్టుకు తాడు వెయ్యి!' అన్నదొక గొంతు.

'రాధా నాధా! దాన్ని దించు. నోటికట్లు వదలు చేయకు,' అన్నది మరో గొంతు. కాలి తాళ్ళు విప్పుతూ 'రణవర్మా! ఒక మాట' అని ఏవో చెప్పాడు రణవర్మ చెవులో.

'అధ్యక్షుల నడుగు' అన్నాడు రణవర్మ.

అధ్యక్షునడిగాడు రాధానాధుడు. అధ్యక్షుడు 'సరే' నని తల ఊపాడు.

ఏముందామె బలగం? ఏమయ్యారు - ఆమె సొమ్ము తిని కాయాలు పెంచిన మహాకాయులంతా. అది మృగాల్లో లేదు. మృగంనుండి ఆకారం మార్చుకున్న మనిషి, ఎంత ఛండాలుడు! ఎంత నికృష్టుడు!! నీచాతినీచుడు!!! ఆ జరగ బోయే కార్యాన్ని చూడలేక మసక మసగ్గా వెలుగు నిస్తూన్న చంద్రుడు మబ్బులకోసం వెదకాడు అవ స్థపడు తూన్న నందిని సహాయమర్థించిన రీతిలో. చంద్రునికైతే

ముబ్బులు సాయపడ్డాయిగాని, నందినికా వనంలో ఎవరి సాయమూ దొరక లేదు. రాక్షసులు-నీచులు-క్రూరులు ఉరి తీయడానికి తెచ్చారుగదా తీసిపోగూడదా! తిరిగి ఎన్ని వత్సరాలనాడో జరిపిన తంతు - రాక్షసత్వం - మృగాల కన్నా నీచం!

ఆ దేశంలోనే ఆడదాని శీలం కాపాడడం కొరకు మగజీవాలన్నీ రాలిపోయాయి. ఆ గడ్డలోనే కాంతల మాన ప్రాణాలకొరకు ఎంతోమంది నవ్వుతూ ప్రాణా లిచ్చారు. ఆ ఊరులోనే 'ఐహికాల మీద వాంఛ వదలండి' అన్న బుద్ధదేవుని మాట పాలించారు. ఒక్క ఆడదాన్ని- అక్కడ కొన్నాళ్ళక్రితం ఐదుగురు కలసి నానా హింసగా కామంతో కానిపని చేశారు. ఈనాడు అదే తోట - అదే వనరు-అదే ప్రకృతి - అదే వెన్నెల-అదే మనిషితో ముగ్గురు! ఛీఛీ! వాళ్ళు మనుష్యులా? రాక్షసులా? ఎంత ఘండాలం? ఎంత అపకృతి? ఎంత నీచం? మానవులెంత అతలానికి వెళ్ళిపోతున్నారు? అసహాయ ఆమె - కానిపని చేయవచ్చు. నిజంగా కులట కావచ్చు. ఆమె ఎక్కడ కులటయ్యింది? ఎవరు చేశారు? ఎంత పాపం! ఎంత దారుణం! ఎంత దుర్మార్గం? దానికంతులేదా? సిరికి నిష్కృతంటూ ఉన్నదా? ఆమె నేదేవుడూ రక్షించదేం? ఆపదల్లో వచ్చి కాపాడిన సందర్భాల నేకం ఉన్నాయికదా? లోకంలో ఎవరికన్న పాపం చేసిందామె? ఎవరికన్న నీచంగా తిరిగిందామె? ఎవరికన్నా హీనంగా తిరిగింది? ఎవరికి హాని చేసింది? ఎవరికన్న మిన్నగా పాపాత్మురాలు?

ఒకోరి జీవితంలో ఎప్పుడూ ఒకే రకం సంఘటనలే జరుగుతాయి కాబోలు. ఆమెను ఆ తోటలోనే ఆనాడు

అలాటి సంఘటన జరిగింది. తిరిగి కాళాంబిలో అలాటిదే ఒక దుర్మార్గం ఎదురయ్యింది. తిరిగి ఈనాడు అంత్య దశలోనూ అలాటి కార్యంతోనే అసువులాదలవలసిన గతి పట్టింది. ఇలాంటి పరిస్థితిలో కానరాని దైవం ఉంటేనేం, ఊడితేనేం? ఏమయ్యాడా ధర్మ సంరక్షణార్థం సంభవామి? ఏడీ, కానరాడేం? ద్రౌపదికి వలువలిచ్చినవాడు - ఆర్త త్రాణ పరాయణుడు? రాడేం? వయ్యాలించ - ఆమె కూయడానికి నోటికి గుడ్డలు కట్టారని, ఆమె అలజడి చేయ లేదనీ ఊరుకున్నాడు కాబోలు. ఆ ముగ్గురూ ఒకరి తర్వాత ఒకరు శవంతో, కళేబరంతో, చేతనారహితమైన శరీరంతో, అచేతనంగా ఉన్న ఆమెతో, అబ్బా! మానవుడా! నీవెంత దుర్మార్గుడవు!

నడుముల్లో సత్తువలేక, నడువలేక, లేపి నిలిపినా పడి పోతున్న ఆమెను, ఆమె గళాన్ని తాటికి కట్టి వేలదీశారు. చీకటిలో చెట్ల నీడలో ఒక కొమ్మకు గట్టిగా కట్టి ముగ్గురూ బయలుదేరారు. ద్వారంవద్దనున్న వారిని కలుసుకున్నారు.

'రణవర్మా! రేపు పంచాయితీకి మనమే తగులబడాలి కదూ! పెందరాళ లేవయ్యా,' అన్నాడు అధ్యక్షుడు ఏది జరిగినా తమకు తప్పదన్నట్టు.

'ఆఁ తప్పదుగా! నీకూ కబురు వస్తుంది రాధానాధా! నీవు కూడా సిద్ధంగా ఉండవయ్యా!' అన్నాడు రణవర్మ రాధానాధునితో.

'శేయ్! మీ యిద్దరూ జాగ్రత్త! ఈ విషయం వెలికి పొక్కిందా మీ తలలుండవు. ఇదంతా యిక్కడే ఇప్పుడే మరచిపోవాలి సుమా! ఎక్కడా ఏమీ అనరాదు. జాగ్రత్త!' అన్నాడధ్యక్షుడు.

'మాకు తెలియదా? మేమెంగుకంటాం!' అన్నారిద్ద రున్నూ.

అంతా ఎవరి ఇళ్ళకు వారు చేరారు. తాము చేసిన పాపాన్ని తామే కప్పిపెట్టాలని ఆ రాత్రంతా నిద్రరాక, నిద్రలేక, తెల్లవారేవరకూ జాగారం చేసిన రీతిలో మేలు కొనే ఉన్నారు.

లోకం పూర్తిగా తెల్లరేఖలు విచ్చుకోలేదు. కోళ్ళు కూస్తున్నాయి. లోకం చీకటినుండి తేరుకోలేదు. పశ్చిమాన చంద్రుడు ఏడుపు ముఖంతో పడమటి కొండల మాటుకు వెళ్తున్నాడు. తూరుపుదిక్కు చీకటినుండి తేరుకొంటూంది.

చేలల్లోనికి పనులకు వెళ్ళేవారు వెళ్ళిపోయారు. నందినీ దేవి తోటలో పని చేసేవాడు పరుగు పరుగున వచ్చి నందినీ దేవి మందిరం ముందు నిలచి 'అమ్మగారూ! మన తోటలో ఎవరో ఉరిబోసుకొని చచ్చిపోయారని' అరిచాడు.

ఒక పరిచారిక మిద్దెమీదకు వెళ్ళి చూచి వచ్చి, 'అమ్మ గారు లేరు. వెళ్ళు అధ్యక్షులవారితో, ఊరి పెద్దలతో చెప్పు. అమ్మగారు రాగానే పంపుతాను' అంది.

అది విని వాడు పరుగు పరుగున ఎదురుపడిన వారందరితో చెప్పి, అధ్యక్షుల వారితో చెప్పడానికి వెళ్ళాడు. ఆ వార్త కోసమే కాచి ఉన్నట్టుగా నాలుగువీధుల కూడలికి చేరి వారినీ పిల్వనంపి, తాపీగా నడక సాగించాడు అధ్యక్షుడు. నాలుగడుగులు వేయడంతో ఇటునుండి రణవర్మ, అటునుండి రాధానాధుడూ మరో ప్రక్కనుండి మిగిలిన సభ్యులు ఒకోరుగా కలసి ప్రవాహంలా తయారయ్యారు. అంతా తెప్ప తిరుణాలకు వెళ్ళేరీతిలో, అంతా కలసి పాత జయదేవుడు - నేటి నందిని తోటకు చేరారు. అప్పటికి

పూర్తిగా తెల్లవారింది. అరుణ కిరణాలు తోటను తూర్పు నుండి తరుముకొనివచ్చి ఆక్రమిస్తున్నాయి.

గొడ్డూ గోదా రాకండా అడ్డుగా ఉంచిన పుల్లలు దారి కడ్డంగా పడివున్న వాటినితీసి ప్రక్కకు వేసి ఒకరి తరువాత ఒకరు తోటలోనికి వరుసగా వచ్చారు. సరిగ్గా శవం వ్రేళ్లాడుతున్న దానికి దాపుగా ఊరి పెద్దలూ, రణవర్మ, రాధానాథుడు, అధ్యక్షుడు మిగిలిన సభాసభ్యులు చేరారు. అధ్యక్షులు దగ్గర ఉండి 'శవాన్ని దించండి' అన్నారు.

చెట్టు మొదటికి కట్టిన తాటిని విప్పి మెల్లగా జార వదిలారు. శవం నేలమీద కాలు మోపి మెల్లగా వాలి పోయింది. ఆ శవం ముఖానికి నిండుగా గుడ్డ చుట్టబడి ఉంది. మూగిన వారిలో—

'ఆమే ఉరి వేసుకోలేదు. ఎవరో వేశారు.'

'అదిగో కనిపించడం లే! నోట గుడ్డలు కుక్కి ఉరి వేశారు.'

'అడుగుల జాడ కట్టండి!'

'ఇంకా ఏం అడుగుల జాడా! అందరం చుట్టూ నడచాంగా!'

'ఆ ముహాన గుడ్డలు విప్పండి!'

'ఎవరదీ? ఏమిటీ తొందరా? ఉండండి.' అన్నా రధ్యక్షులు. ఎవరో ఆయనకు తెలుసుగా! అంతానిశ్శబ్దంగా ఉన్నారు. తోట కాపలావానిని పిలచి—

'నీవు తోటలోనికి ఎప్పుడు వచ్చావు?' అన్నారధ్యక్షులు.

వాడు వణకి పోతూ, 'ప్రొద్దున మసక చీకటిలో' అన్నాడు.

'నీవు వచ్చేప్పటికిలా నే ఉందా వెళ్ళాడుతూ!' అన్నా రధ్యక్షులు.

'ఆఁ.'

'ఆ తర్వాతేం చేశావు?' అన్నారధ్యక్షులు.

'సరాసరి అమ్మగారి భవనానికి వెళ్ళి పిలిచాను. దాసీది వెళ్ళి మిద్దెనంతా కలయదిరిగి వచ్చి, 'అమ్మగారు లేరు. ఎక్కడికి వెళ్ళారో! రాగానే పంపుతాను' అంది. ఆ తర్వాత పరుగున తమదగ్గరకు వచ్చి చెప్పాను' అన్నాడు కావలివాడు.

రాధానాధుడు, రణవర్మ, అధ్యక్షులూ ఒకరిముఖాలొకరు చూచుకున్నారు - సరిగ్గా అమ్మగారు ఇంట్లో లేరని తోట మాలి చెపుతుండగా.

అధ్యక్షులు 'ఆ ముఖానికున్న గుడ్డ ఊడదీయండి!' అన్నారు.

ఒక భటుడు ముఖానికి, నోటికి గట్టిగా కట్టిన ఆ గుడ్డలన్నీ ఊడదీశాడు.

అంతా ఒకరి ముఖాలొకరు చూచుకున్నారు. అధ్యక్షులకు, రాధానాధునకు, రణవర్మకు ముఖాల్లో నెత్తురు చుక్క లేదు.

రణవర్మ 'ఆఁ!' అని పెద్ద కేక వేసి కూలిపోయాడు. అంతలావు యుద్ధ వీరుడూ, ఎంద రెందరినో రణంలో తన చేతులతో నరికి పోగులు పోసిన రణవర్మ వణకిపోతూ నేల కూలాడు. అక్కడ చేరిన వారిలో—

'ఆ ఉరిపోసి చంపిన ఆమె ఎవరూ?' అన్నారు.

ఆమెను తెలిసినవారు కొందరు—

'రణవర్మగారి భార్య' అన్నారు.

అధ్యక్షునికేం చేయాలో తోచింది కాదు. నర నరం ఆవేశంలో ఉడికి పోయింది. ఏదో బాధ, తెలియని దిగులు! రాధానాధుడు వణకి పోతున్నాడు.

అంతలో దూరాన ఉన్న వారు 'నందినీదేవి వస్తూంది' అన్నారు. 'దారి వదలండ'న్నారు. నందిని, చతురిక, వీరమల్లు అక్కడికి చేరి ఆ శవాన్ని చూశారు.

'ఎవరూ ? రణవర్మగారి భార్యా!' అంది ఆశ్చర్యంగా నందిని.

'ఔనమ్మా!' అన్నారు జనంలో.

'ఎవరు చేశారా పని? ఏమేనా తేల్చారా? ఏమిటీ, అవంతి ఇలా తయారవుతుంది. నీచులు, ఛండాలురు, పాతకులు! ఆడదాని మాన ప్రాణాలు తీస్తుంటే ఏమీ చేతగాని వారిలా చేతులు కట్టుకొని ఊరుకోడమేనా? అవంతిలో ఆడదానికి రక్షణ లేదా? ఆ ఘాతకులెవరో ఆచూకీ దొరకిందా అధ్యక్షులవారూ?' అనడిగింది నందిని. ఎవ్వరూ మాటాడలేదు.

'అంతఃపురంలో నిద్ర పోతున్న అబలను, నా తోటదాకా లాక్కు వచ్చి ఉరి పోశారంటే, వారెంత గుండెలు తీసిన బంట్లయ్యుండాలి! ఆడదాన్ని ఉరెయ్యడానికి సిగ్గులా లేదు వారికి? వారు కూడా ఇక్కడే ఎక్కడో ఉంటారు. వారిని వెలికి లాగి చిత్రవధ చేసినా పాపం ఉందా?' అన్నది నందిని.

అధ్యక్షులు ఇంకా నందినిని మాటాడిస్తే వ్యవహారం ముదిరి పోతుందని, అప్పటి కామెను ఆపే నెపంతో, 'నందినీదేవీ! ఆవేశ పడకండి-విచారిద్దాం' అన్నాడు.

'మీకేం, మీరు పురుషులు. ఆ నాడు నా ఇంట హత్యా ప్రయత్నం-ఈ నాడు అవంతి సర్వ సైన్యాధ్యక్షుని అర్ధాంగికి జయదేవుని తోటలో ఉరి! ఏమిటీ అన్యాయం? మీకు భార్య లేదు కాబట్టి మీరూరుకోగలుగుతారు. ఇక్కడ చేరిన అవంతి పౌరులకు కూడా భార్యలు లేరా? వారి మాన ప్రాణాలకు రక్షణేమిటి? ఈ రోజు ఆమె కయింది. రేపు నాకు కాదా? చెప్పండి?' అంది నందిని.

చేరిన ప్రతి పౌరునిలోనూ ఆవేశం పెల్లుబికింది. ఒక్క ముక్క-రాత్రి జరిగినదానిలోని ఒక్క ముక్క నిజం వెలికి వస్తే, ఆ ముగ్గురూ లిప్త మాత్రం బ్రతుకుతారు. జనమంతా 'నందినీదేవిగారు అడుగుతున్న ప్రతి మాటా మనకు సంబంధించిందే - నిజమే'నని అంతా అనుకున్నారు. ఆమె మీద ఎంతో సానుభూతి పెరిగిపోయింది వారిలో.

'అదే నేనూ ఆలోచిస్తున్నాను నందినీదేవి! దీనికంతా కారణం ఏదో ఉంది!' అన్నాడు అధ్యక్షుడు.

'ఏముంటుంది? ఉబ్బో - ఆడదో - అధికారమో - అంతేగాని మరొకటిగాదు. దీనికంతటికీ ఆడించేవారెవరో ఉన్నారనిపిస్తూంది. ముందు అది తేల్చాలి!' అంది నందిని.

నాయనా! ఇది అవకాశాన్ని సద్వినియోగం చేసుకుందే రీతిలో ఉంది. ఇంక త్వరగా తేల్చకపోతే బ్రతకనీయదని-పైగా దాని అందం, దాని చందం, దాని మాట తీరూ జనాన్ని ఆకర్షించింది. ఇంక తనేం చెప్పినా ఆ చుట్టూ చేరిన జనం ఊరుకోరు. ఎవరో ఎముకలు ఏరేస్తారు అది మాట తూలిందంటే, ననుకొని—

'సరే, యిక ఏమనుకొని లాభంలేదు. రక్షణకు రేపు ప్రయత్నాలు జరుపుదాం. ఆ తెలివి కోలుపోయి పడివున్న

రణవర్మనూ, ఆమెనూ యింటికి చేర్చి, దహన కార్యాలేర్పాటు చేయండి. 'అంతా తర్వాత ఆలోచిద్దాం. నందినీ దేవీ! సాయంత్రానికో, రేపో సభా సమావేశం ఏర్పాటు చేస్తాను,' అన్నాడు అధ్యక్షుడు.

దడిచాడు. బెదరినవాడిని యింకా బెదరిస్తే, ఎదురు తిరుగుతాడు అనుకొని—

'అలాగే! మీకు తెలియనిదేముంది? అవంతిలో ఏది జరిగినా తమ చేతులమీదుగానో, సలహాతోనో జరగాలసిందే. అలాగే రండి!' అంది నందిని చాలా నమ్రతగా.

ఎవరన్నా అర్థం చేసుకున్నారా అని, నాలుగువంకలా పరికించాడు అధ్యక్షుడు. ప్రతి మాటా గుండెల్లో బాకు పోటులా నాటింది అధ్యక్షునికి, అతని గుండెలకు.

నిలువలేక రాధానాధుని వెంటబెట్టుకొని అతడు సాగి వచ్చేశాడు. నందినికూడా చతురికను, వీరమల్లునూ వెంట బెట్టుకొని, అధ్యక్షులవారిని వెన్నంటింది. అధ్యక్షునికి వెనుక నందిని వస్తూంటే, శక్తి తనను వెంటనంటి వస్తూన్న తీరుగా అనిపించింది. దాదాపు తరుముతూంది. ఈ అవంతిని వదలేంతవరకూ తరుముతుందేమోననిపించింది. అలా అనుకోగానే అధ్యక్షుని కాళ్ళు వేగిరించాయి. దాదాపు వెనుక నెవరో తరుముకొస్తూన్న తీరులో రాధానాధుడు, తనూ చాలా త్వరితంగా నడక సాగించారు. కొంతదూరం వెంబడించి, ఆ తర్వాత ప్రక్క వీధినుండి తన మందిరానికి వెళ్ళిపోయింది నందిని. తనవారితో లోనికి వెళ్ళుతుండగా: వీరమల్లు—

'నందినీదేవిగారూ!' అన్నాడు.

'రా వీరమల్లూ! రా, లోనికి రా!' అన్నది నందిని.

'నేనలా వెళ్ళి వస్తాను!' అన్నాడు.

'ఏం ఏదేనా అవసర కార్యమున్నదా?' అనడిగింది.

'ఏమీ లేదనుకోండి. ఐనా అలా వెళ్ళివద్దామని,' అని నసిగాడు.

'ఏంలేదు. గిల్లి కజ్జా పెట్టుకుంటారు. ఓర్పు చాలా అవసరం. ఆ విషయం మరువకుండా నడుచుకో, చాలు. నీవెక్కడ తిరిగినా పరవాలేదు. సరే, వెళ్ళిరా!' అంది. వీరమల్లు వెలుపలనుండి వెలుపలకు వెళ్ళిపోయాడు. వీథుల్లో జనసంచారం అనుకుంటున్నదంతా: రణవర్మ భార్యను జయదేవుని తోటలో ఉరి వేశారు - అన్నదే సమస్యగా, సంచలనంగా ప్రతివారూ దానినిగూర్చే చర్చిస్తున్నారు.

'రణవర్మకు విరోధులెవరు?'

'ఎంత విరోధమైతే మాత్రం, ఇంట్లోఉన్న యిల్లాలేం చేసింది?'

'ఏది ఏమైనా ఇది చాలా అన్యాయం.'

'ఇంత అన్యాయం అవంతిలో ఇంతకుముందు లేదు.'

'అసలు అవంతి పాడైపోయింది.'

'ఎంత పాడైనా యింత చేటా?'

'దీనికేదో మార్గం చూడాలి.'

ఈ విధంగా ఒకరనుకుంటున్న తీరులో ఒకరనకుండా ఎవరిష్టమొచ్చిన తీరులో వారనుకున్నారు. అన్నారు. అవంతిలో నలుగురు కలిశారూ అంటే ఆ విషయాన్ని గూర్చి చర్చించినట్లే, చర్చించుకుంటునట్లే భావించవచ్చు.

అలా అంతా మాటాడు కుంటున్నారు. అంగడివీధి చాలా రమ్యంగా ఉండేది. కానీ, ఆ నాడు ఎక్కడి

వారక్కడ ఈ విషయం మాటాడుకొంటూ అంగళ్ళు తెరవలేదు. దాదాపు జాము ప్రొద్దెక్కింది. అంగడి వీధి కావలున్న మలుపులో అల్లరి చెలరేగింది. ఏమిటాని అంతా మళ్ళారు.

రణవర్మ బట్టలు చింపుకొని, పెద్దగా అరుస్తూ, పెద్దగా నవ్వుతో కేక లేస్తూ వస్తున్నాడు. 'నన్ను నాశనం చేశారు. నిల్వినా నరికి పాతేస్తాను. నేను యముణ్ణి. ఒక్క యముణ్ణి కాదు-కాలాంతకుణ్ణి! సూర్యుణ్ణి నా చేత పట్టుకుంటాను. నా వల్లకాని దీ లోకంలో లేదు. చంద్రుడున్నా దే చంద్రుడు! వాడు దుర్మార్గుడు! ఎండలు మండిస్తాడు. వాడు లేకపోతే లోకం నిల్వదు.

అమ్మా! వాడిమాట వినకండి. సర్వం నాశనమై పోతుంది. నన్ను నాశనం చేసిందే వాడు. అబ్బో! ఒక ప్పుడు - చాలా యేళ్ళక్రితం - మీకు తెలియదు. అందమైన చిన్నది. గోధుమ పొలాల్లోకి ద్రాక్ష తోటల్లోకి వెళ్ళింది. దాన్ని ... దాన్ని వెన్నెల్లో—

అందమైనా చిన్నదీ! కనువిందు చేసే చిన్నదీ!
పందిలాంటి వాళ్ళురా! మందిగా చెరచారురా!
జమ్మచక్క జాం జాం! జాం జాం జమ్మచక్క!

చిందులు ద్రొక్కుతున్నాడు. కాసేపు అలా ఎగిరి ఎగిరి అలసి పోయాడు. ఒకచోట కూలిపోయాడు.

నా భార్య పోయింది కదూ! పోయింది. ఎగిరిపోయింది. అబ్బా! రాత్రి ముగ్గురం పరాయాడదనుకొని, చాచ్చాచాచ్చా! అన్యాయం! అసలా ఉరి వేసించి నేనేలే! మంచిపని జరిగింది.

ఒకరికోసం గోయితీసీ గోతిలో పడదోయదలచీ
తీసినాదే గోతిలోనను తీసుకున్నాడోయ్ తనువునూ
లాలి లల్లరి లాలిరీ లలి లారి లల్లరి లాలరీ!

అయిపోయిందా! అంతా అయిపోయిందిగా? యింకే ముంది ఈ అవంతికి? నిప్పు పెడతాను. నా కెవరున్నారు? అంతా ఐపోయిందిగా! మంటూ! ఒళ్ళుమండుతూంది. ఓరే అధ్యక్షుడూ! గుంటనక్కా! నిన్ను నరకాలిరా! నా చేతిలో కత్తి! ఏదీ? ఏమయింది? ఎవరు తీసుకున్నారు? చెప్పండి. ముందు ఆ మాట చెప్పండి. నా భార్య నీకేం అపకారం చేసిందిరా! నందిన్ని ఉరితీస్తానని నా పెళ్ళాన్ని తీశావు? అధ్యక్షుడూ! నమ్మినవాళ్ళని మోసం చేయకూడదురా? దాని వజ్రాలహారం నా పెళ్ళానికిస్తానని మాట నిచ్చావుగా? ఈయవా? ఈయవా? బలే! రాధానాధుడూ నీవైనా చెప్పరా! ఆ రత్నాలు వాణ్ణి తీసుకోమను. ఆ హారం - అబ్బ! దానికి ఖరీదు కట్టేవాడు ఇక్కడెక్కడా లేడురా! నిజం నాకు తెలుసు.

ఇదిగో చెపుతున్నా! దాన్ని చంపే భారం నాకు వదులు. నేను చేస్తాగా! నీ కెందుకూ వదలి వెయ్యి.

సభా సభ్యులందరికీ నేనధ్యక్షుణ్ణి. అదే సైన్యాధ్యక్షుణ్ణి. ఆడది ఈ అవంతిలో ఎప్పుడూ సభ్యురాలుగా లేదు. సభ్యత్వం ఈయలేదు. ఈనాటికి ఇచ్చాం. కాని ఆమె చేయగలిగిందేమిటి? ఏమీ చేయలేదు. ఆడది ఏం చేస్తుంది? చేయలేదు.

ఓ! సరే సరే! ఆఁ ఆఁ హరి భగవాన్! రాత్రి మన ముగ్గురం చెరచి ఉరివేసింది నా భార్యనా! అబ్బా! ఎంత అన్యాయం జరిగింది! ఈ పాపం, ఈ అన్యాయం ఎక్కడైనా

ఉందా? ఎవడి భార్యనైనా, ప్రక్కనుండి చెరిపిస్తాడా భర్త! అయ్యో! అన్యాయం, అక్రమం! రక్షించండి నాతల పగిలి పోతూంది. నా క్రింద భూమి కదలి పోతూంది. ఆకసం నా నెత్తిమీద పడుతుంది. అయ్యో పడింది. ఇంతకుముందే పడింది. పడిపోయింది. హా!'

అంగడి వీధి వదలి వెళ్ళి పోయాడు రణవర్మ. రణవర్మకు మతి తప్పిపోయింది. ఎప్పటెప్పటివో, ఏమిటేమిటో అంటున్నాడు. అవి ఎవ్వరికీ అర్థంకావు. ఆ వూరుకు, ఆ జనసత్తాకకు సర్వసైన్యాధ్యక్షుడు అలా వీధులవెంట ఆ జనసత్తాకలోనే తిరుగవలసిన స్థితి కలిగింది! అతనికి మతితప్పకేం చేస్తుంది? ఒక్కసారి ఆలోచించుకుంటే ఏముందిక?

తన భార్యను, తను తాళికట్టి అగ్ని సాక్షిగా వివాహమాడిన అర్ధాంగిని, తనతో కష్టసుఖాల్లో భాగం పంచుకుంటున్న ఇల్లాలిని అలా అక్రమంగా అర్ధరాత్రి తను ఉండి, మరి యిద్దరు - హారి హారీ! వారితో పాటే చాచ్చా! బలవంతంగా నోరు మూసి మోసుకొచ్చి తోటలో అలా తన చేతులతో ఉరితాడు బిగించి ఉరివేసి, మరునాడు తెలుసుకుంటే మతి తప్పుతుంది. గుండె ఆగిపోతుంది. అలా వీధుల పాలయ్యాడు రణవర్మ.

అదంతా చూస్తున్న వీరమల్లుకు అతనిమీద జాలి కలిగింది. జాలికలిగి అతనేం చేయగలడు? ఏమీ చేయలేదు. వారి గోతిని వారే తీసుకున్నారు. తన చేతితోనే తనకన్ను పొడుచుకున్నాడు. తన మంట తనే వేసుకున్నాడు. నాశనమయ్యాడు. ఈ మాట వెళ్ళి చెప్పాలనుకొని వీరమల్లు బయలుదేరికూడా ఆగిపోయాడు. నందినీదేవి విషయాన్ని తెలుసుకొనే ఉంటుందీ పాటికి. నేను వెళ్ళి చెప్పాలా?

అనవసరం. అసలు రణవర్మ ఎక్కడికి వెడతాడో చూడాలి-అని అతన్ని వెంటనంటి బయలు దేరాడు.

రణవర్మ దాదాపు అధ్యక్షుని భవనం దాపులో ఉన్న కూడలిలో నిలచాడు. అతని చుట్టూ చాలా మంది పోగయ్యారు. రణవర్మ అందరి మధ్యా నిలచాడు. నిలచి అంటున్నాడు. 'అసలు అధ్యక్షుడంటే గుంటనక్క! వాడంత ఘండాలుడు మరొకడు లేడు. కానీ, వాడు తప్ప మరొకడు మనకు లేడు. నా సర్వస్వం నమ్మించి నాశనం చేశాడు. నందిన్ని ఉరేస్తానని వాడు రాత్రి నా పెళ్ళాన్ని నా చేత ఉరేయించాడు.' చేరిన జనానికిది ఏమిటో అర్థం కావడం లేదు.' నిజమో, అబద్ధమో అది తేలే దెలాగో తేల్చుకోలేక కొందరు నమ్మారు,కొందరు నమ్మలేదు. కానీ అతని మాటలన్నింటినీ అందరూ వింటున్నారు. అక్షరం బీరుపోనీయకుండా అంతా వింటున్నారు. ఎవరికి వారికి ఇది నిజమేమోననిపిస్తుంది. అందరికీ అవి పిచ్చి మాటలు. అందరూ రణవర్మ భార్య చావుతో పిచ్చివాడై పోయాడు - అతని మతి చలించింది. ఇది మాత్రం మూక ఉమ్మడిగా మొత్తం అంతా కలసి అనుకుందే మాట. దాదాపు నగ్నంగా కనిపిస్తున్న సత్యం. అతడు ఆ మాటలే ఉన్మాదావస్థలో లేకండా చెపితే అధ్యక్షునికి ఉరి-నడి బాటల కూడలిలో పడుతుంది. వేస్తారు ప్రజలు. కాని అతడు ఉన్మాది. ఇది అందరి నిర్ణయం.

ఎప్పుడూ నిజా నిజాల విలువ చెప్పే వాణ్ని బట్టి ఉంటుంది. వారిని బట్టి ఆ పలుకులకు బలం వస్తుంది. ఎదటి వారు నమ్మగలుగుతారు. రణవర్మ మాటల్లోనూ అంతే జరిగింది. అతని మాటకు హడలి పోయిన చోట ఈ వాడు

విలువ లేదు. లేకుండా పోయింది. కారణం? అంతా మతి చలించిందని నమ్మారు. అతనికి చలించిన మాట వాస్తవమే ఐనా, నిజాలు చెప్తున్నాడే! ఎవరికి పట్టిందా సంగతి? ఎవరి కేం? అతడు నిజం చెపితే యేం, అసత్యం చెపితే ఏం! చెప్పవలసిన తీరు అది కాదు. అంతే!

అంతలో అక్కడికి జయసింహుడు వచ్చాడు.

వాడిని చూడగానే రణవర్మకు తిరిగి ఆవేశం వచ్చింది. 'రాత్రి నా భార్యను మోసింది వీడు. జయదేవుని తోట దాకా వీడొక్కడే మోశాడు. వాడికి తగిన వాడేవీడు' అంటున్నాడు.

'అతని మాటలకేం లెండయ్యా! మీకేం పనులు లేవూ? వెళ్ళండి. ఏమిటీ? ఇలా పోగయ్యారు. కదలిపొండి' అన్నాడు జయసింహుడు. తన యజమాని ఆజ్ఞ ఏదైతే అది తూచా తప్పకుండా పాలించడమే వాడు నేర్చింది. ఆ మాటే అనేశాడు. జనాన్ని తరముతున్నాడు-తంమాలి. అది ఎలాగో తెలియదు. కటువుగా ఈ మాట లనగానే-

కూడిన వారిలో ఎవడో ఉండి,

'అవున్లే! అయ్యగారి బ్రతుకంతా బయటేస్తున్నాడు కదూ?' అన్నాడు.

'ఎవడ్రా, ఆ మాటన్నది? ఇలా నా ముందుకువచ్చి అనండి' అన్నాడు గంభీరంగా నలువంకలా పరికిస్తూ. జనం మనకెందుకని కొందరు తప్పుకుంటున్నారు.

వీరమల్లు ముందుకు వచ్చాడు.

'నేనూ అన్నది. రా!' అన్నాడు.

'ఒరే! వీరమల్లూ! నీకూ, నాకూ అసలుపడదు. ఆ తర్వాత అనుకొని ప్రయోజనంలేదు. జాగ్రత్త!' అన్నాడు జయ సింహుడు.

'పేరు చూడండి జయసింహుడు - వాడు గాజులు తొడుక్కొని ఇంట్లో కూర్చోరాదు!' అన్నాడు వీరమల్లు.

'నీవూ ఒక మొగాడివే! ఆడదాని క్రింద బ్రతుకుతున్నావ్!' అన్నాడు జయసింహుడు.

అంతే మాటలు. ఆ తర్వాత మాటలు లేవు. ఇద్దరూ చేతలే. ముష్టాముష్టి-బాహాబాహీ రెండు ఏనుగులు పోరాడుతున్న రీతిలో-ఒకరినిమించిన బలం ఒకరిది. ఇద్దరూ మల్లులే. అటు ముష్టియుద్ధం, ఇటు మల్లయుద్ధంలో ఆరితేరిన వారు. ఆ రెండూ కలిపి కొట్టుకొంటున్నారు. చుట్టూ జనం వలయాకారంగా కూడారు. అంత మతిచలించివున్నా రణవర్మ ఉత్సాహంగా ఆ ఇద్దరి తగవూ చూస్తున్నాడు.

జయసింహుడు వీరమల్లు పొట్టలో గ్రుద్దాడు.

వీరమల్లు పెడరెక్కలు విరచి పట్టుకుని ఉన్నాడు, ఆ దెబ్బ తిని సరాసరి రణవర్మ. దాపుకువచ్చి మొహంమీద కొట్టి, 'చేతగాని కుంకా! పోట్లాటలో పొట్టమీద గ్రుద్దుతార్రా! గాడిదా! కుక్కా!' అని తిట్టి మళ్ళీ వలయం లోనికి వెళ్ళి నిలచాడు.

వీరమల్లు ఆ పెడరెక్కలలా విరచిపట్టుకొని అంత లావు జయసింహుని యెత్తి కూలేశాడు. నడిబాటలోపడ్డ జయ సింహుడు బంతిలా లేచి మళ్ళీ చేతులు కలిపాడు. చేతులూ కాళ్ళూ కలుపుతూ పోరాడాక కాలు మెలికవేసి వీర మల్లును కూలవేశాడు జయసింహుడు. వీరమల్లు రెచ్చిన కోపంతో సరాసరి వచ్చి జయసింహుని నడుముచుట్టూ

చేయి వేసి మెలిత్రిప్పి కాలుకొట్టి ఊరుకున్నాడు. జయసింహుడు వెల్లికిలా పడిపోయాడు. పడినవాడిని లేవనియ్యకుండా మొహంమీద రెండు చరచి తన దారిన తాను వెళ్ళిపోయాడు వీరములు.

చుట్టూ చేరిన జనమంతా చప్పట్లు కొట్టారు.

అంతలో పురపాలకులు వచ్చి రణవర్మను బంధించి వెంటబెట్టుకొని అధ్యక్షుని యింటిముందునుండి కారాగారానికి తీసుకొని వెళ్లారు. లేచి దుమ్ము దులుపుకొని బయలుదేరాడు జయసింహుడు.

అవంతిమీద సర్వాధికారాలూ తనకున్న రీతిలో అప్పటికప్పుడు కారాగారానికి ఒక లేఖ రాశాడు అధ్యక్షుడు.

రణవర్మ - అంటే మన గౌరవనీయుడైన అవంతి వర్వ సేనాని మతితప్పి ఉన్నాడుగాన అతను పేదదిరి తిరిగి కోలుకొనేవరకూ. అతన్ని కారాగారంలో ఉంచవలసినది.

ఇట్లు,
అవంతి.
అధ్యక్షుడు.

ఆ తాటియాకును తీసుకొని జయసింహుడు కారాగారాధికారి కందజేశాడు. అతడు అప్పటివరకు వెలుపల ఏదో మాటాడుతున్న రణవర్మను లోనికి తీసుకొని వెళ్ళమన్నాడు. రణవర్మకు మతి చెదరినదని ఊరుకంతా తెలిసిపోయింది.

ఎంత జనసత్తాక ఐనా కొన్ని అవసర కార్యాలు అధ్యక్షుల చేతిమీదుగానే జరిగిపోతాయి. రణవర్మ కారాగారంలో నానా రభసా చేశాడు. అక్కడివారికి కూడా

పిచ్చివాడని నమ్మకం కుదిరింది. అతనికింక విడుదల అంటూ ఉండదేమో!

* * *

ఈ వార్తలన్నీ నందిని మందిరానికి చేరాయి.

నందిని వీరమల్లుతో 'నేను వెళ్ళేప్పుడే నీతో అన్నాను కదా? తొందరపడ్డావు!' అంది.

వీరమల్లు తల వాల్చాడు.

'ఊఁ కానీ, జరిగిపోయింది జరిగిపోయినట్టే. దానినిక పట్టుకొని ఊగిసలాడి లాభంలేదు. మనం కొన్నాళ్ళపాటు జాగ్రత్తగా మసలుకోవాలి. తప్పదు! ఇంక ఏ క్షణం ఏం జరుగుతుందో ఎవరూ ఊహించలేం. వారి పనులన్నీ బెడిసి కొట్టాయి. కాబట్టి వారికి ఆక్రోషంగా ఉంటుంది. ఇక పోతే, రాధానాథుడు, అధ్యక్షులూ ఉన్నారు. వారి కార్యం నిదానంగా చూద్దాం,' అంది నందిని.

'నిదానమెందుకండీ? వేడిమీదే తేలిక కదా?' అన్నాడు వీరమల్లు.

'తేలికేగాని యిబ్బందులొస్తాయి. మనంగా ఏమీ చేయరాదు. వారే వస్తారు. చూద్దాం,' అంది నందిని ఏదో ఆలోచిస్తూ.

'ఈ సారి ఎలా చేస్తారో మరి!' అన్నాడు.

'రానీ - రానీ చూద్దాం. తొందరేమిటి? మనదాకా వచ్చేవరకూ ఊరుకుందాం. వచ్చాక దానికి తగిన యేర్పాటు మనం చేసుకుందాం. నష్టమేముంది, జాగ్రత్తగా ఉన్నంత మాత్రంలో? ఏది ఏమైనా అంటుకున్న నిప్పు రాజక మానదు. అదిసరే వీరమల్లూ! రంగవర్మ భార్యకు దహన సంస్కారాలు ఏర్పాటు చేశారా?' అనడిగింది.

'నాకు తెలియదమ్మా! వెళ్ళి చూచి కబురందిస్తాను,' అని లేచాడు వీరమల్లు.

'మంచిది. త్వరపడకు. అంతే నేనిచ్చే సలహా నీకు. అవసరంవస్తే దడవాలసిన పనిలేదు!' అంది లేచి వెళ్ళుతున్న వీరమల్లుతో నందిని.

వీరమల్లు వింటూ వెళ్ళిపోయినాడు.

వీరమల్లు తోటకు వెళ్ళేప్పటికి తోటలో ఎవరూలేరు. కాపలావాడుమాత్రం ఉన్నాడు. వాడినడిగాడు వీరమల్లు. 'అంతా చాలాసేపయ్యిందండీ, వెళ్ళి' అన్నాడు.

'రణవర్మ ఎప్పుడు వెళ్ళాడు?' అనడిగాడు.

'ఆయనకూడా వారితోపాటే వెళ్ళాడండీ!' అన్నాడు.

'సరే అయితే!' అన్నాడు వీరమల్లు.

'ఆయనకెట్లా ఉంది? మన ధోరణిలోనికి వచ్చాడా?' అనడిగాడు తోటమాలి.

'ఊఁహూం! రాలేదు. అతన్ని బంధించారు - ఖైదులో ఉంచారుగా!' అన్నాడు వీరమల్లు.

'అయన్నెందుకండీ బంధించడం, పాపం! ఆయన భార్యకైనదానికే వెర్రెత్తిపోతుంటేను. అంత ధైర్యంగల ఆసామికదా? అలాగైపోయా డెందుకనో?' అనడిగాడు కాపలా మనిషి.

'ఏమో పాపం!' అన్నాడు వీరమల్లు తోటలోనుండి వెలికి వస్తూ. ఆ తర్వాత మెల్లగా, రణవర్మ గృహంముందు చేరాడు. రణవర్మ గృహంలోనూ ఏమీలేదు. ఎవరో యిద్దరు ముగ్గురు ఏడుస్తున్నారు. వారిని కొందరోదారుస్తూన్నారు. అదంతా చూచి తిరిగి వస్తూ అనుకున్నాడు-

ఇలాగే నేనూ తిరగడం జరిగితే నాకూ పిచ్చెక్కేట్టుగా ఉంది. ఏమిటో! అనుకున్నాడు.

నందిని మందిరంలో మధూలిక హడలిపోతూ ఉంది. కాని పైకేమీ కనిపించనీయకుండా నవ్వుతూంది. నందిని ఆ విషయం గమనించి—

'మధూ! లేని సంతసంతో ఎంతసేపు నటించగలవే?' అనడిగింది.

'ఆదేమిటమ్మా, అలాగంటారు? నాకు నటన దేనికి?' అంది తిరిగి నందిననే ప్రశ్నించుతున్న తీరులో మధూలిక.

'పిచ్చిదానా! ఎంతకాలం అలా కప్పిపెట్టుకు తిరగ గలవు! నాకు తెలుసు! అధ్యక్షుడు పిలుస్తాడు. నిన్నడుగు తాడు–అని, నీలో నీవు బెంబేలు పడుతున్నావు. అదేం జరగదు. అంతకుముందు రెండు రోజులనాడు రణవర్మ రావడం, సవం త్రాగి చేసిన గోలా, చెప్పిన మాటలూ అనక్కోరేపో అతనికందుతాయి. అంతకుముందే అందాల సింది. ఎందుకందించలేదో మరి! లేక అందినా అన్నీ చెప్పినా ఈ విషయం చెప్పి ఉండడని పిచ్చి నమ్మకం ఉండైనా ఉండాలి. కాబట్టి మధూ! నీవు బెంబేలు పడకు. నీకెందుకులే ఊరుకో!' అంది నందిని.

'అది సరేగానమ్మా, మీరు రణవర్మ భార్యనే ఎందు కెన్నుకున్నారు?' అనడిగింది మధూలిక.

'దానికి కారణం మరొకటిలేదు. రాధానాథుని భార్య పుట్టింట ఉంది. అంటే మనం మధురకు వెళ్లాలి. అధ్యక్షు లకు భార్యలేదు. పోతే ఉన్నది రణవర్మ. అతడుకూడా భాగస్థుడేకదా? అందుకల్ల, ఎవరైతేనేం అని తెప్పిం చేశాను,' అంది నందిని.

'భార్యంటే రణవర్మకంత మమకారం ఉందని అనుకో లేదమ్మా! ఆమె చావగానే పిచ్చెక్కి వీధులు పట్టడం ఆశ్చర్యం కలిగిస్తూంది.'

'ఆశ్చర్యమేమీ లేదు. రాత్రి జరిగిందటువంటిది - అతని యెదుట! మనకెందుకు? దరిద్రులు! నీతిమాలినవారు! అందు వల్ల పిచ్చెక్కింది. ఆమె చావువలనమాత్రం కాదుసుమా! అలా జరగడమంటూ పడితే ఎవరికైనా పిచ్చెక్కుతుంది. ఆధ్యాత్మికులకైనా సరే! అప్పుడే ఏమైంది? ముందింకా ఉంది,' అంది నందిని.

'అదేమిటి?'

'తెలుసుకుంటావు. నాలుగైదురోజుల్లో రణవర్మ ఆ యిద్దరిలో ఏ ఒకడినో స్వాహా చేస్తాడు. తప్పదు!' అన్నది నందిని మధూలికను చూస్తూ.

'ఏమో ఏం చేస్తాడో! రణవర్మ ఖైదుకుకూడా వెళ్లాడు. ఎంత అవమానమని?' అని అంటుండగా చతురిక వచ్చింది.

'ఏమిటే మహా అవమానమంటున్నావు?' అనడిగింది.

'రణవర్మ ఖైదులో ఉండడం అవమానమట!' అంది నందిని.

'వాణ్ణసలు ముక్కలక్రింద నరికి కాకులకూ గద్దలకూ వేయాలి. మాద్దాం. ఇంకా వాడు పిచ్చెత్తి దార్ల వెంట రాళ్ళ దెబ్బలు తినాలి!' అంది చతురిక చాలా కక్షతో.

'మరీ అంత కక్ష పనికిరాదు చతురికా! జరిగేదెలాగూ జరుగుతూంది. చాలా కాలమైంది చతురికా! వీణ తీసుకురా, ఒక పాట పాడు. నేను వాయిస్తాను,' అంది.

'ఊరంతా ఏడుపులో ఉంటే మనం గానంలో ఉందా మంటారా అమ్మా! చూచేవాళ్ళేమనుకుంటారు?' అంది మధూలిక.

'అనుకుంటారు. మనమేం చేయగలం దానికి? నీవు వెళ్ళి తీసుకొని రా!' అంది నందిని.

చతురిక వీణ తెచ్చి పెట్టింది. నందిని శృతి చూచు కుంటూంది. మధూలిక వెళ్ళిపోయింది. చతురికకు కళ్ళతో చెప్పింది మధూలిక సంగతేమిటో చూడమని.

చతురిక వెళ్ళి కొన్ని క్షణాలయ్యాక వచ్చింది. 'అది పడకకోసం వెళ్ళింది.' అంది.

'నమ్మవచ్చంటావా?' అంది నందిని.

చతురిక తల ఊపింది.

'అవుతే యిక పాటందుకో!' అంది నందిని.

చతురిక—

అందగత్తెల మేలుబంతీ!
సుందరాంగీ ఆలకించుము

పంచవన్నెల చిలుకలైదును
పంచుకున్నవి పంజరమ్మును
జంట చిలుకలు తప్పిపోయెను
పెంటి చిలుకకు గుందమొచ్చెను ॥ అంద॥

ఆకసమ్మున ఆ విహంగము
శోకమందున మునిగి తిరగెను
లోకమంతయు చీకటాయెను
లోకులెల్లరు నీచులయ్యిరి ॥అంద॥

మదపుటేనుగు మత్తులోబడి
మన్ను తలపై చల్లుకొనుగా
మిడుత గర్వముతోడ తిరిగిన
పడుసు దివ్వెను భగ్గురనగను .... ॥అంద॥

'చాలా బావుంది చతురికా పాట!' అంది నందిని.

'ఏమోలెండి' అంది చతురిక. ఇద్దరూ మిద్దెమీదకు వెళ్ళారు.

# 13

మూడు రోజులు జరిగింది రణవర్మకు పిచ్చి ఎక్కి. అవంతి మర్వలేదింకా. అందరూ అతన్ని గూర్చి అనుకుంటున్నారు. అతని పరిస్థితి ఏమీ బాగుపడ లేదు. ఇంక బాగుపడుతుందన్న ఆశ కూడా లేదు. అంతకు ముందు అతని క్రింద పని చేసే జయచంద్రుడు రణవర్మ స్థానానికి వచ్చాడు. అతడు రావడం ప్రజలనుంచి కాదు. అతనికున్న ఒకే మార్గం రణవర్మ క్రింద పనిచేయడం. ఆ తర్వాత అధ్యక్షుడు తనకు తానుగా కల్పించుకొని ఎన్నిక చేయించడం. అంతకన్న అతనికి మరో యోగ్యత లేదు.

ఆ నాడు ఆ సంఘటన జరిగిన నాటినుండి అధ్యక్షులు గాని రాధానాథుడుగాని అవంతిలో వీధుల వెంట తిరగడం మానుకున్నారు. మరుగునే ఉంటున్నారు. ఆ విషయంలో అవంతి ప్రజలంతగా పట్టించుకోలేదు. ఎవరికి పట్టిందిలే? అందరూ లోపలి విషయాల గూర్చి ఆలోచించగలరా? వెలికి కనిపించే వానిని పట్టుకొని గుంజుకుంటున్నారుగాని, లోపలి విషయాల జోలికి పోలేదు.

అవంతిలో అందరికీ నందినీదేవి, ఆమె మందిరం కనిపి స్తూంది. అధ్యక్షుడెంత ప్రయత్నించినా నందినీదేవి ఉన్న తిని కూలద్రోయలేక పోయాడు. రోజు రోజుకూ ఆమె అందరికీ పరిచయురాలుగా, సద్వర్తనరాలుగా, ఊరుకు ఉప యోగపడే కార్యాలు చేస్తున్న రీతిలో తల మానికంగా కనుపించ సాగింది. దీనితో అటున్న అధ్యక్షుడు నేలనుండి ఇంకా అతలానికి లాగబడుతున్నాడు. అది జనసత్తాక కావడంతో జనంతో నాయకులకు, నాయకులతో జనానికీ సన్నిహితం ప్రతి విషయంలోనూ అవసరమై పోయింది.

ఆ మధ్య అన్ని విషయాల్లో ఐకుగురూ కలసి తామే అధినాథులమన్న తీరులో ఉండేవారు. అది రాను రాను ఏ చిన్న కార్యం కావాలన్నా జనం 'నందినీదేవి నడుగుదాం' అనడంతో అధ్యక్షులుగా ఉన్నా ఆయనను అర్ధించేవారు లేకపోయారు. ఈ విషయాలిలా జరుగుతుండగా, సిప్రాలో వెల్లువ వచ్చింది. ఆ వెల్లువ పైనున్న పంట కాలువను కూడ కట్టుకొంది.

పంట కాలువకు ఇటు ప్రక్కనంతా ఊరు పెద్దలూ, యోగ్యులు, అధ్యక్షులు, రాచకార్య ధురంధరుల పొలా లున్నాయి. కాలువకు అటు ప్రక్క ఊరువారి పొలాలు ఉన్నాయి. ఉన్నతుల పొలాలు గాబట్టి ఉన్నతంగానే ఉన్నాయి. సన్నకారు పొలాలన్నీ మన్ను కనిపించకండా వెల్లువలో దాదాపూ మునిగి పోయాయి. పైనుండే ఒక పాయ తీసి పంట కాలువలో నీటిని తిరిగి సిప్రానదిలోనికి దిగువ కలసేలా ఏర్పాటు చేయాలి. అలా చేయడం జరిగితే అవలున్న నీరు రెండు వంతులు ఈవలకు వెళ్ళిపోతాయి. పొలాలు దెబ్బ తినకుండా దక్కుతాయి.

ఆ విషయం సంప్రతించటం కూడా సరాసరి నందిని దాపుకే వచ్చి సన్నకారడిగారు. ఆమె వెంటనే వీరమల్లును వెంట బెట్టుకొని బయలుదేరింది స్వయంగా. అలా వెళ్ళి ఆ గట్లు, ఆ పొలాలూ చూచి 'ఈ నీరంతా ఎటు పోవాలి?' అంది.

'ఆవలి ప్రక్కవారు దారిస్తూ అటునుండి దిగువకు వెళ్ళి సిప్రాలో కలిసే ఏర్పాటు చేయవచ్చు' అన్నారు రైతులు.

'ఆ చేలు పాడుగాదా?'

'కాలువ ప్రక్కనున్నది ఒకరిది పాడవుతుంది.' అన్నారు

'నా చేనులోనుండి దారిస్తే పనికి వస్తుందా?' అనడిగింది.

'పనికి వస్తుంది కానండీ, మీ భూములన్నీ దెబ్బ తింటాయి. ఆ ప్రక్కనున్న అధ్యక్షుల చేలోనుండి ఐతే ఏదో నీరు పారినమేర పాడై, మిగిలింది బాగానే ఉంటుంది' అన్నారు.

'వారి చేలలో ఒద్దు. నాదంతా పాడైనా పర్వాలేదు. నా చేను గట్టు కొట్టివేయండి. దిగండి చేలోకి' అంది కాలువను దాటి తన చేల దగ్గరకు వచ్చి నందిని.

నలుగురు దిగారు. వెంటనే తలో సారమన్నూ లాగే శారు. కొంచం గండి పడగానే నీరే కొసేసింది మొత్తాన్ని. చూస్తూ చూస్తూ ఉండగనే నందినీదేవి భూము లన్నీ నీటి మయమయ్యాయి. రైతులు ఎంత సంతోష పడ్డారో, అంత దిగులూ పడ్డారు.

'రా! వీరమల్లూ వెడదాం పద!' అంది దారి తీస్తూ నందిని.

వీరమల్లు వెంట నడిచాడు. మళ్ళీ కొంచం దూరం వెళ్ళి, ఆగింది.

'ఏంవిటమ్మా! ఆగారూ?' అనడిగాడు వీరమల్లు.

'వాళ్ళల్లో ఎవరినన్నా పిలూ!' అంది

వాళ్ళి లే చూస్తున్నారు. వీరమల్లు చేయి ఊపగానే ఒక రైతు దాపుకు వచ్చాడు.

'నా భూమంతా పాడైనా పర్వాలేదు. ప్రక్కవారి భూముల్లోనికి నీరెక్కకండా కట్టుదిట్టం చేయండి,' అంది నందిని.

'చిత్తం! చిత్తం!' అన్నాడా రైతు. నందిని నడక సాగించింది.

వీరమల్లు వెంట నడుస్తూ 'నందినీదేవిగారూ! మరి మీ పంటంతా నాశనమై పోయినట్లేకదా - మీకెట్లా?' అన్నాడు.

'వీరమల్లూ! ఒక ప్రక్కనుండి నా నాశనం ముంచుకొస్తూంది సిప్రానది వెల్లువలా. నా భూముల సంగతి చూస్తావేం? పోనీ! అదీకాక నా భూములు పోతే నాకు తింటానికున్నది. అవతల ఉన్నదంతా పేదలు. అంతేకాదు. ఎన్నో కుటుంబాలు నాశనమై పోతాయి. ఎంత నష్టం వచ్చినా ఈ ఏటిదేకదా? పైగా ఈ ఏటికి ఓర్చుకుంటే వచ్చే ఏడు ఇబ్బడిగా పండుతుంది. నష్టమేముంది? గతంలో నేను సేద్యం చేశాను. పైరు నష్టమంటే నాకు తెలుసు. ఈ నాటికీ వారితోపాటు పని చేయగలను. నన్ను చేయనీయరు. అదేమిటి వీరమల్లూ? నీ వెరుగవా? కొన్నేళ్ళనాడు కొడవలి, తట్టా పట్టుకొని అవంతి వీధులగుండా పొలాలకు వెళ్ళే దాన్ని. ఆ నాడే ఎంతో హాయిగా ఉండేదాన్ని, ఆరోగ్యమూ, ఉత్సాహమూ - ఇష్టమొచ్చినట్లు రాత్రీ పగలనక

కష్టం. ఆ జీవితం వేరు. అదంతా నాకు తలపులో మెరుగులు తూనే ఉంటుంది. అందువల్లే సన్నకారు రైతు పడే బాధ నాకు తేలిగ్గా అర్థమైంది. పోతుంటి కూడాను' అంది నందిని నడుస్తూ.

'ఏమో తల్లీ! నిన్ను చూస్తుంటే నాకు...' అని 'ఏమ నేది?' అన్నాడు వీరమల్లు

'నన్ను పొగడకుండా, ఏమన్నా పరవాలేదు-అను' అన్నది నందిని.

'పొగడకుండా ఎలా ఉండేది చెప్పండి? నేనొక టడుగుతాను. మీరు ఏమీ అనుకోరుగా?'

'అడుగు. లోకం అడిగినదానికన్న ఎక్కువ అడుగు తావా? పైగా నీవు నేను బాధపడే మాట ఏమీ అడగవు. అడగలేవు. అడుగు వీరమల్లూ!' అంది నందిని.

'ఏం లేదు. నేను చాలా మొరటువాణ్ని. చదువూ సంధ్యా లేనివాణ్ని. ఏనుగును చూపి పోరాడమని పురి గొల్పితే పోరాడుతాను. నాకు హృదయం, ఆలోచనా లేదు. తెలియదు. అలాంటి నాకు మీ మీద ఎందుకో తెలి యదు-ఒకోసారి జరిగేదాన్ని చూస్తుంటే ఎక్కడ లేని ఆప్యాయతా పెచ్చు పెరుగుతుంది. మీరు నాకు స్వంతం గావాలి. మీరు నా వారని నేను చెప్పుకోవాలి. అందుకని మిమ్మల్ని, 'అక్కా!' అని దాపుకు లాక్కుంటాను,' అన్నాడు వీరమల్లు.

నందిని తెలివి తప్పే పరిస్థితికి వచ్చింది. అతను మొరటు వాడా? అతని హృదయం మొరటుదా? ఏమిటీ ఇలా మాలిమై పోయాడు? ఇతన్ని చూస్తే ఇతనిలో కరుణగాని, త్యాగంగాని, దయగాని, దాక్షిణ్యంగాని ఉంటుందను

కుంటూరా? ఈతడింత గంభీరుడైనా ఇతని హృదయం ఎంత నవనవో న్మేషం! ఎంత కోమలం! ఎంత జాలి కాలవాల మైనది? అనుకుంటుంది. అంతలో —

'పోనీలే నందినీదేవిగారూ! ఇంత మొరటు వానికి అక్కగా ఉండడానికి నిజంగా మీకు ఇష్టముండదు. ఎందు కంటే నన్ను చూచి మా అక్క అని ఎవరితోనన్నా అంటే, ఓరి నాయనో! వీడే ఇలా ఉన్నాడు - వీడి అక్క అదెలా ఉంటుందో, అనుకుంటారు. తమ్మునిగా నాకు గౌరవం వద్దు. బాధ్యత వద్దు. అలా పిలవాలనిపిస్తుంది. ఇప్పుడు కాదులే. ఎప్పుడన్నా అణచుకోలేని ఆనందం వచ్చినప్పుడు పిల్వడాని కనుజ్ఞ ఈయండి. నాకు తెలియ కుండానే అనేస్తాను,' అన్నాడు వీరమల్లు.

నందిని కళ్ళ వెంట ఆనంద బాష్పాలు రాలాయి.

'తమ్ముడూ! నిజంగా నేను ఒక మనస్సును-అంత స్వార్థ రహితమైన వాంఛకూ, కాంక్షకూ లోను చేయగలిగానా? నన్ను చూచిన వారందరూ నా పిలుపును కోరరయ్యా! వారు కోరేది వేరు. వారు పిలచేది వేరు. నాకు మగవారి మీద ఉన్న మనస్సును, ఆలోచనను మార్చి వేశావు. నీ లాంటి నిష్కల్మషాత్మునికి అక్కను గావడం నా అదృష్టం. నేను కులటను. చెడిపెను. నానాటికీ దిగజారి పోతున్న హృదయంతో తల్లడిల్లి, దరిలేని కాల ప్రవాహంలో నీచాతి నీచమైన కోరికలతో దూర దూరాలకు వెళ్ళిపోతున్న నాకు నీ హృదయం, నీ నిర్మల అంతస్సు - నాకో పడవ. లోకంలో ఇక ముందు మంచి ఏదేనా చేయగలిగితే అది నీ ముఖం చూచాకనే అనుకో. నీ అంత మంచివానికి నేను అక్కగా నిజంగా తగను. నిన్ను తమ్ముడూ అనడానికి నా

కులం, నా వంశం, నా గౌరవం పనికి రానిది. కానీ మన హృదయాలు వేరు. ఆ హృదయాలకు కుల గోత్రాలు లేవు. వాటితో సెలుదుకుందాం. ఎంత మంచి మాట. ఎంత ఖరీదైన మాట నా దగ్గరున్నదయ్యా!'

'అక్కా!' అన్నాడు. తిరిగి అనలేక, చాలా తటపటాయించాడు తర్వాత మాటల కోరకు. ఇంతవరకూ అతడు నందినిని అమ్మగారిలానే మాచాడు. ఒక్కసారిగా ఎలా మార్చి సోదరత్వం, ఏకోదరత్వం సాధించగలడు! ఆడదాన్ని మగవాడు - అందులోనూ అందమైన ఆడదాన్ని ఆ వరసలో ఆ సన్నిహితంగా చూడడం చిన్న చిన్న మనస్సులకు చేతగాని పని. అది చేయబోయి తిరిగి ఆగి మళ్ళీ అనబోయి అనలేక ఆగిపోయాడు.

'ఇంకా అంత అవసరం, అదనూ రాలేదులే వీరమల్లూ! వస్తుంది. ఆ నాడు నీవు మనస్ఫూర్తిగా అనగలుగుతావు,' అంది నందిని.

'కాదమ్మగారూ!' అని నాలుక కరచుకొని, 'అది కాదు. అలవాటు, మీ అంతస్తు నన్ను కట్టివేసింది. ఇంతకు ముందు, అంటే కొన్ని క్షణాల ముందు నాలో అలా పిల్వాలనిపించింది. అది మీరు చేసిన కార్యం యొక్క బలం! దాని ప్రతిభ అది చూపింది. తిరిగి మీ ముఖం చూస్తుంటే నేను మల్లుడైన వీరమల్లునూ, మీరు అవంతి సభ్యులైన నందినీదేవిగారిలానే కనిపిస్తున్నారు,' అన్నాడు.

'నేను సాధించ వలసిన దదే! సాధిస్తానయ్యా! తప్పకుండా సాధిస్తాను,' అంది నందిని. అన్ని యేళ్ళల్లోనూ నందిని ఆనాడు మాత్రం వీరమల్లు దగ్గర నిజాన్ని నిజంగా తన హృదయంతో మాటాడిన రీతిగా మాటాడగలిగింది.

ఎందరితో యింతవరకు మాటాడినా కృత్రిమంగా మనస్సులోని విషయాలు లాగాలని, తను కొన్ని దాచుకోవాలని ప్రయత్నించేది. కానీ, అతనితో మాటాడుతూ నడచినంతసేపూ ఆ ఊహే ఆమెకు రాలేదు. లేదు కూడాను. పూర్తిగా నందిని వీరమల్లుకు లొంగిపోయింది. కపటం లేని హృదయాలు కఠినులను కర్కశులను మారుస్తాయనడంలో వింతేముంది? వీరమల్లు లాంటివాడు నందినిని ఆ స్థితికి లాగగలిగాడంటే, ఉత్తమోత్తములైన సుహృమహులు రాక్షసులను మానవులుగా మారుస్తారనడం వింతగాదు - అందులో విశేషం కూడా ఉండదేమో ననిపిస్తుంది.

ఇద్దరూ అలా మాటాడుకుంటూ మందిరం చేరారు. నందిని 'రా, వీరమల్లూ!' అన్నది. వీరమల్లు 'వస్తానమ్మా!' అని క్రింది గదిలోనికి వెళ్ళిపోయాడు.

వీరమల్లు గదిలోనికి వెళ్ళగానే మధూలిక వచ్చింది.

'ఎక్కడికి వెళ్ళారు, మీ రిద్దరున్నూ?' అన్నది మధూలిక.

'చేలు చూడ్డానికి,' అన్నాడు.

'వరద వచ్చిందటగా?' అనడిగింది.

'వచ్చింది.' అని జరిగినదంతా చెప్పి, 'మీ అమ్మగారు చేసిన దానికి వచ్చే యేటివరకూ పస్తులుండండి,' అన్నాడు.

'ఆమె గారలా చేస్తుంటే నీవైనా చెప్పలేక పోయావా?' అంది మధూలిక.

'పిచ్చిదానా! మనందరం పస్తులుండి చస్తేయేమే? అందరు హాయిగా తినగలిగిన పని! మనం కొందరం అవస్థపడ్డా ఎందరో సంతోషపడ్డారు. లోకంలో ఎందరు చేయగలరే, అంత మంచిపని? ఆమె కాబట్టి చేయగలిగింది. ఆ తర్వాత

ఆమె చెపుతుంటే నా ఒళ్ళు పులకరించింది. నన్ను నేను మరచిపోయాను,' అన్నాడు వీరమల్లు.

'భలే భలే! ఈ నాటికి నీవు కూడా ఒకడివి ఆమెకు తోడు వచ్చావు, బాగుంది.' అంది.

'ఆమెకు నేను తోడేమిటి? ఆమెకు తోడయ్యే వాడెవడున్నాడు లోకంలో? ఆమెకు ఆమే! ఈ లోకమంతా గాలిస్తే ఆమెలాంటి వాళ్ళు ఏ కొందరో దొరకవచ్చు.'

'పడిపోయావే బుట్టలో! ఇంక నీ పని సఫా! ఐపోయింది. ఆమె మగజాతి మీద కక్ష తీర్చుకోడానికి పుట్టింది. మరొకందుకు కాదు. తెలుసుకో!'

'పోనీ ఆమె లాటి దాని చేతిలో చచ్చినా అందముంది. రామాయణ భారతాల్లో గొప్పవాళ్ళు, మంచివాళ్ళూ ఐనవాళ్ళ చేతుల్లో చచ్చినా పుణ్యమని అంటారే! అంతే! కానీ, ఆమెను వచ్చిన దగ్గరనుండీ చూస్తున్నాను. ఏం తెలివి? అంతా విన్నాలే, ఆమె యెందుకు వారంటే కక్ష కట్టిందిన్నూ! చాలా తెలుసుకున్నాను. నిజంగా ఆలోచించి చూస్తే దేనికదే-మంచిని మంచిగా, చెడును చెడుగా ఒప్పుకుందాం. మనదేం పోయింది. మనలాటి వాళ్ళు అవునన్నా, కాదన్నా, మంచిగాని, చెడుగాని మారదుగా! ఇంట్లో కూర్చుని వీధుల్లో జరిగేది చెపుతుంది. వీధులోని కెళ్ళినా యింటి విషయాలూ అంతే. అసలు మనుష్యుల్లో చాలా నీతులు చెప్పేవాళ్ళుంటారు గాని, చేసేవాళ్ళెక్కడున్నారు? ఆమె కూడా రైతులొచ్చి పిలవగానే వెళ్ళింది. తనదంతా నాశనమవుతున్నా సరే చూస్తూ 'గండి కొట్టండి. మీ పొలాలు బాగా చేసుకోండి. నా పొలం ప్రక్క వారి దానికి దెబ్బ తగలకుండా చూడండి' అంది. ఆ ఒక్క ముక్క చాలదూ? ఇంకేం కావాలి ఆమె మంచితనానికి? తర్వాత లక్ష చేయనీ!

ఆ ఒక్క మంచి చాలు జన్మకంతా! అదంతా నీకు తెలియదు లే! నీకూ, నీ అన్నకూ తెలిసిందంతా నమ్మిన వాళ్ళని నాశనం చేయడం,' అన్నాడు వీరమల్లు. యింక అతన్ని మార్చగలిగినవారు లోకంలో లేరు.

అలాటి వాళ్ళు ఒక నిర్ణయానికి రాకుండానే ఉండాలి. వచ్చాక వారిని మార్చడం ఆ పుట్టించిన బ్రహ్మకైనా చేత గాని పనవుతుంది. వీరమల్లు గూడా అంతే! మారిపోయాక ఇక మార్పు, చేర్పు రానే రావు. నందిని ఆ క్షణం వీరమల్లు ఎదుట ఒక అమాయకుని కత్తితో పొడుస్తున్నా ఎదురుగా ఉండి చూస్తున్నా, దీనికేదో కారణమున్నదని, ఉంటుందని అనుకుంటాడు గాని, ఆమె తప్పు చేసిందని చస్తున్నా కూడా అనలేడు. ఆ పునాది రాళ్ళు పాతివేసింది నందిని. ఇక ఆమె చేసే ప్రతి కార్యం దాని మీద జరగాలిసిందే! ఇక అతనికి రెండో చూపుగాని, మార్గంగాని కనిపించదు.

మఘాలికకీ విషయాలన్నీ అర్థం చేసుకోడం చాలా సేపు పట్టలేదు. ఆమె వసుధా కొంచెం తెలివైనది. అందులో వీరమల్లును బాగా అర్థం చేసుకొన్నది. అతడు అన్నను గానీ, తన్ను గాని ఎత్తిపొడచిన మాటను గురించి పట్టించుకోలేదు. అందులో తన ప్రియుడుకదా? ఏ మాటన్నా మంచిగానే సరిపుచ్చుకు పోతారు ఆడవారు. ఆమె మరోలా ఎలా ఉండగలదు? అదే జరిగింది. ఏ ఆడదైనా అంతే—

తను మనసిచ్చిన వాడు కోతిలా ఉన్నా, కురూపైనా సరే చాలా అందగాడని భావిస్తుంది. వానికన్న అందంగా క్ళ్ళందరున్నా, తన వాని ముందు తీసికట్టే! తనకు నచ్చిన వాడు ఈల వేసి పిలిస్తే అది చిలిపిచేష్ట. నచ్చనివాడు అదే ఈల వేసినప్పుడు అది కొక్కిరా కార్యం! కొంటెతనం! వాడు

దుర్మార్గుడు! తనకు నచ్చినవాడు నాలుగక్షరాలు రాసినది పాటలో అందిస్తే అది ప్రేమలేఖ. అతడు ఉత్తమ పురుషుడు. అదే నచ్చనివాడు రాస్తే, అది గడుగ్గాయిపని, పొగరు మోతుతనం! ప్రతిదానికీ అంతే. తనకు నచ్చినవాడు ఏది చేసినా తనకు యిష్టమే. తనకు నచ్చనివాడు ఏది చేసినా వాడిది దుర్మార్గం! అది సహజమైన గుణం. దానిని ప్రతివారూ పుట్టుకతో తెచ్చుకుంటున్నారు. దానికి ఆక్షేపణ తెలుపడం, తెలిపి నెగ్గడం ఎప్పుడూ జరగదు. అలా జరిపితే అది వ్యర్థ ప్రయత్నం మాత్రమే.

మధూలిక కూడా ఆ న్యాయ రీత్యా తన అన్నను, తన్నాశ్రయించిన వారిని నాశనం చేస్తారంటే నిజమే నేమో అని పించింది. ఆత్మ కూడా-నిజం గానిదే ఎందుకంటాడు, అనుకుంది కొద్ది క్షణాలతనితో గడిపి. అంటే ఆ లెక్క వారిద్దరి మధ్య మాత్రమే. అది మూడో వారికి జాములలో ఉంటుంది. వలపుల మలుపుల్లో ఏళ్ళు రోజుల్లా, రోజులు క్షణాలులా జరగిపోతాయి. తనివితీరని ఆనందం, సుఖం అందులో ఉంది. దాని రుచిగాని, రంగుగానీ ఇంతవరకూ ఎవరికీ తెలియదు. తెలుసుకోవాలన్న ప్రయత్నం యింతవరకూ జరుగ లేదు. అనుభవించడం వరకే ఆ వలపు రీతి. అందుకోడం వరకే దానిలో మిగిలేది. అదొక మత్తు, అదొక మంత్రం, అదొక మాయ. ఆ మాయ అర్థం గాదు. తెలియదు. తెలిసినట్టే ఉంటుంది. ఏమీ తెలియదు. దానిలో మునిగిపోవడమో, లయ గావడమో తప్ప మరో కార్యం, కర్జం సాధించింది ఇంత వరకూ లేనేలేదు-ఆ నాడూ అంతకుముందూ, ఆనాడూ-ఆ నాటి తర్వాతా, ఎప్పుడూ దాని దరిదాపులు తెలియవు. తెలుసుకున్న వారు ధరలో, 'నభూతో నభవిష్యతి'. కానీ, దానికి దూరంగా ఉన్నారా! లేదు. 'చర్విత చర్వణ' మే!

చేసిందే చేయడం! చూసిందే చూడడం! అన్నమాటే అనడం! అంతే.

మధూలిక మిద్దెమీదకు వెళ్ళి పోయింది. వీరమల్లు ఒళ్ళు విరచుకొని ఆలోచిస్తూ అక్కడున్న ప్రక్కమీద బలమైన కాయాన్ని పారవేశాడు. నంబిని యింటికి ఆ అద్దమురేయి ఐదుగురు వచ్చి పోయాక ఆ గదిలో తను ప్రవేశించాడు. ఆ తర్వాత తను అక్కడే ఉండిపోయాడు. రెణ్నాల నుండి అతని రాకపోకలన్నీ అక్కడినుండే. అంతకుముందు రోజుల్లో అంగడి వీధిలో ఉండేవాడు. ఇలాంటి వారికంతా నాలుగు రొట్టెలు కాల్చి పెట్టే దిక్కులేని అవ్వ ఉంది. అక్కడ మెక్కడం, ఏ సత్రమో, ఏ గుడో, ఏ ఆరామమో! ఏ క్షణాని కెక్కడో అతనికే తెలియదు. అలాగే గడచి పోయింది అతని జీవితం. ఈనాడు మారిన మార్పుకు అతడూ ఆశ్చర్యపోతాడు...

* * *

రాధానాథుడు రణవర్మను చూడడానికి ఖైదువద్దకు వచ్చాడు. అప్పటికి రణవర్మకు ఉన్మాదం తగ్గింది. ఏదో బాధగా మాటాడుతున్నాడు. విషయాలేవీ చెప్పలేక పోతున్నాడు. నిరంతరం దేనినిగూర్చో ఆలోచిస్తుంటాడు. రాధానాథుడు రాక ముందు రోజున—

ఖైదీ అధికారి ఆ వార్తను అధ్యక్షునికి అందజేశాడు. 'ఇంక విడిచివేస్తాను. అనవసరంగా రణవర్మ ఖైదులో దేనికి?' అని.

అది విన్న అధ్యక్షుడు 'బందిఖానానుండి రణవర్మను వదలకు. ఆ తర్వాత విషయాలు నేను చూచుకుంటాను' అని తెలియపరచాడు.

అది విన్న అధికారి చరచర అధ్యక్షుని ముందుకు వచ్చి నిలచి—

'అయ్యా! జనానికి ఏం సమాధానం చెప్పాలి? చెర సాలలోని వారంతా రణవర్మ మామూలు మనిషయ్యాడని లోకులందరకూ తెలియ చేస్తున్నారు. ఇది ఎలా కుదురుతుంది! పోనీ ఏదేనా సభ నేర్పరచి రణవర్మ నెందుకు గాను చెరలో ఉంచవలసి వచ్చినదని చట్టరీత్యా నాకు అనుమతి దయ చేయించండి' అన్నాడు.

దానికి అధ్యక్షుడన్నది ఒకటే మాట.

'నేను అవంతి అధ్యక్షుణ్ని. నీకు బంధించవలసినదిగా పత్రం అందజేశాను. మిగిలిన విషయాలతో నీకు అనవసరం. నేనే నాకు తిరిగి అనుజ్ఞ యిస్తానో ఆనాడు ఆ అనుజ్ఞా పత్రం అందుకొని విడుదల చేయవలసిందే!' అన్నాడు.

'అలాగే. తమరందించిన పత్రంలో 'అవంతి సైన్యాధ్యక్షులు మతి చలించి ఉన్నారు. వారు తిరిగి కోలుకుందేవరకూ ఖైదులో ఉంచాలసింది' అని ఉంది. ఆయన ఈనాడు కోలుకున్నారు కదా? అందువల్ల మాట రాకండా చూడండని తమ సముఖానికి వచ్చాను' అన్నాడు అధికారి.

'ఇంకా కోలుకోలేదు - అని ప్రచారం చెయ్యవయ్యా!' అన్నాడు అధ్యక్షులు.

'తమ చిత్తం! ప్రజలు నమ్మరని - ఐనా ప్రయత్నిస్తాను,' అని వచ్చేశాడు అధికారి. అది జరిగిన మరునాడు రాధా నాధుడు రణవర్మను చూడాలని వచ్చాడు. అతడు సభా సభ్యుడు గాబట్టి, ఆదేమని అడిగే అధికారం తనకు లేదు కాబట్టి అధికారి లోనికి వదలాడు. రాధానాధుడు సరాసరి

కారాగారంలోనికి రణవర్మ ఉండే తావుకు చేరాడు. రణవర్మ చాలా వికృతంగా ఉన్నాడు. గడ్డం మీసాలు పెరిగి పోయాయి. ఒడలు కండలు కరగిపోయాయి. ముఖాన నుదురుమీద ముడుతలు ఏర్పడ్డాయి. కళ్ళ క్రింద నల్లని చార ఒకటి బయలు దేరింది. తలంతా చిందర వందరగా ఉంది. ఏదో ఆలోచిస్తూ ఎటో చూస్తున్నాడు. అతనికి సంకెళ్ళు లేవు. ఉన్నా లేకున్నా ఒకటే! అడ్డగావున్న కటకటాల తలుపును నెట్టుకొని రాధానాథుడు లోనికి వచ్చాడు.

రాధానాథుడు రావడం చూచాడు. కానీ చూడనట్లే ఊరుకున్నాడు.

రాధానాథుడే సరాసరి వచ్చి, రణవర్మ ప్రక్కన నిలచి 'రణవర్మా! కులాసాగా ఉన్నావా?' అన్నాడు.

రణవర్మ తలనెత్తి పరకాయించి చూచి 'నీవా? రాధానాథా! రారా!' అన్నాడు.

రాధానాథుడు అక్కడ రణవర్మ పడుకుండే అరుగుమీద కూర్చున్నాడు. కూర్చుని, 'ఆనాడు నిజంగా ఎంత అన్యాయం జరిగింది! అలాగవుతుందని మనం ఊహించలేదు కదా?' అన్నాడు.

రణవర్మ వణకి పోయాడు. అతని కళ్ళు కోపంతో కెంపులయ్యాయి. ఎక్కడలేని బలం వచ్చింది అతని చేతులకు. చివాలున తిరిగి రాధానాథుని గొంతు పట్టుకున్నాడు. రాధానాథుడు గిలగిలలాడి పోయాడు. అతని నోట మాట రాలేదు. రావడానికి వీల్లేదు. అరవడాని కవకాశంలేదు. నొక్కివేశాడు రాధానాథుని గొంతు రణవర్మ. 'ఆ రోజు ఆ రేయి! నాభార్యను నీవూ, ఆధ్యక్షుడు, నేనూ! ఏంరా! ఎంత నీచంరా! తెలియక చేశాంకదూ! వాడికి కూడా ఈ పని

తప్పగు' వదలివేశాడు. వదలగానే రాధానాథుడు పడి పోయినాడు దరుగుమీద. రణవర్మ పకపక నవ్వాడు. ఆ నవ్వుకు చెరసాల ప్రతిధ్వనించింది. చెరసాలపై కప్పు కుప్పగా కూలి పోతుందా అనిపించింది.

ఆ నవ్వువిని, చుట్టుపట్ల ఉన్నవారంతా చెరసాల అధి కారితో సహా అక్కడ చేరారు. అందరినీ చూస్తూ రణవర్మ రాజసంగా నిలచి-

'వీణ్ణి తీసుకుపోండి.' అని వెలికి వచ్చాడు. కైగు అధికారి 'రణవర్మను పట్టుకోండి' అన్నాడు. 'ఎక్కడా వాడు, అవంతి సర్వ సైన్యాధ్యక్షుణ్ణి బంధించేది?' అంటూ ప్రక్కనున్న భటుని నడుముకు వేళ్ళాడుతున్న కరవాలం సర్రున లాగి నిలచాడు.

అంతే! అంతా క్షణం స్తంభించి పోయారు. చెరసాల అధికారి నమ్రతగా చేతులు జోడించి, 'అయ్యా! నాతప్పు లేదు. ఇదిగో అధ్యక్షులవారు రాసిపంపిన పత్రం. తమ బానిసగాణ్ణి. తమరి అనుజ్ఞల పాలించే వాణ్ణేగాని మరొకటి లేదు.' అంటూ రణవర్మను గురించి రాసినపత్రాన్ని తెచ్చి, రణవర్మ కందించాడు. అది తీసుకొని చదివి, 'అధ్యక్షు డెవడు? అతనికీ అధికార మెక్కడిది? నేను మతి చలించి ఉన్నప్పటిది కదా అది? ఈనాడు మతిలో ఉన్నాను. నా అధికారంతో నేను వెళ్ళుతున్నాను. ఈ రాధానాథుడి శవాన్ని అధ్యక్షుని మందిరానికి చేర్చండి' అని ముందుకు అడుగు వేశాడు.

రెండు యీటెలు ఎదురు వచ్చాయి.

రణవర్మ ఉరిమి చూచాడు. అవి వెనుకకు తగ్గలేదు. తిరిగి మళ్ళీ చూచాడు. ఊఁ హుఁ! అవి అలాగే ఉన్నాయి.

కత్తిని రెండుసార్లు విసరాడు. ఈ వేటు పట్టుకున్న తలలు దొర్లిపోయాయి. అతడు తక్షశిలలో అస్త్ర విద్య అభ్యసించాడు. అతని కత్తికి ఎదురులేదు. చెరసాలలో కాపున్న ప్రతి పౌరుడూ కత్తులతో ముందుకు వచ్చారు. రణవర్మ ఖైదు ద్వారం వెలుపలున్నాడు. వారంతా లోనుండి ముందుకు వస్తున్నారు. తిరిగి రెండుసార్లు కత్తి విసరాడు. రెండు గొంతులు 'అమ్మా! అబ్బా!' అన్నాయి. రెండు కళేబరాలు నేల రాలాయి.

'చెప్తున్నాను. వృథాగా బంధించ తలపెట్టకండి. ఆ తర్వాత విచారించి ప్రయోజనం ఉండదు. ఇంకా నా సర్వ సైన్యాధ్యక్షత పోలేదు. అధికారం సంగతి వదలండి. నా చేతిలో కరవాలం ఉంది. అది నా చేతిలో ఉన్నంత కాలం...' అంతలో వెనుకనుండి ఒక కత్తి విసరు అతని మీదకు రాబోయింది. 'నాకు తెలుసు' అని తప్పుకొని, కత్తిని ముందుకు చాచాడు. పడే కత్తివేటు ద్వారానికి తగిలింది. వేటు వేస్తున్న మనిషి ముందుకు వాలాడు. వాడి పృష్ఠం మ్మీద కొట్టాడు. వాడు లోపలున్న సైనికుల కత్తుల కడ్డు పడ్డాడు. వారందరూ వెనుకకు అడుగు వేశారు. రెండు తలుపులూ చెరో చేతితో లిప్త మాత్రంలో మూసివేసి, అడ్డుగా వేసే యినుపబద్దెని తగిలించి, కత్తి చేత బట్టుకొని నడక సాగించాడు. వీథుల్లోని జనమంతా ఆశ్చర్యంగా చూచారు. అంతకుముందు ఏనాడూ అవంతి వీథుల్లో రక్తసిక్తమైన కరవాలాన్ని బట్టుకొని, రణవర్మ రాజమార్గానికి రాలేదు. అదే మొదలు. రణవర్మ అలాగే చరచర నడచి అధ్యక్షుని మందిరం ముందు ఆగాడు. ఎవరూ కనిపించలేదు. లోనికి వెళ్ళాడు. పరిచారిక మాత్రం ఉంది.

'అధ్యక్షులెక్కడ?' అన్నాడు. అది గంభీరంగా మేఘ నిస్వనంలా ఉంది.

పరిచారిక అదరిపోయింది. అతనిగడ్డం, మీసాలు, ఆ కళ్ళ ఎఱ్ఱదనం దాన్ని వణకచేశాయి. మెల్లగా కంపిత స్వరంతో, 'లేరు. వెలుపలి కెక్కడికో వెళ్ళారు,' అన్నది.

'ఎంతసేపైంది?' ఆ పలుకూ అలాగే ఉంది.

'చాలా సేపైంది, బహుశా వస్తూ ఉండవచ్చు,' అన్నది.

'ఎక్కడకు వెళ్ళాడు?'

'తెలియదు. ఏదో ఉదయం కారాగార విషయాలు మాటాడారు,' అంది.

'ఊఁ, రానీ!' అని అక్కడున్న ఆసనంమీద కూర్చు న్నాడు అధ్యక్షునింట్లో! అధ్యక్షుని కొరకు!

అప్పుడే అధ్యక్షుడు కారాగారానికి చేరాడు. అతడక్క డికి చేరగానే అక్కడ అంతా లోపల బంధింపబడి ఉండడం చూచి, అడ్డుగా ఉన్న ఆ యినుపబద్దని తీసి తలుపులు తీశాడు. తీసీ తీయగనే అతనికి కనిపించింది మొత్తం ఆరు శవాలు. ఒకటి గొంతుపిసికి, రెండు కత్తులతో తలలు వేరు గావింపపడినవి, మిగిలిన మూడూ కత్తి పోట్లతో కూల్చబడి నవి. అతని కళ్ళనతడు నమ్మలేక, దిగ్భ్రమతో చూస్తుండ గానే కారాగారాధికారి వచ్చి నమ్రతగా, 'రణవర్మగారు చేసిన కార్యమిది,' అన్నాడు.

'ఎక్కడికి వెళ్ళాడు?'

'తెలియదు. తమరింటికే వచ్చి ఉంటాడని అనుకున్నాం,' అన్నాడు కారాగారాధికారి.

'పదండి' అని అధ్యక్షుడు దారి తీశాడు. అంతాకలిసి అధ్యక్షుని యింటిముంగుకు వచ్చారు.

పరిచారిక వచ్చి, 'ఇప్పటి వరకూ ఉండి యింతకుముందే వెళ్ళారు. వెళ్ళుతూ వారన్నారు - 'వీడు వచ్చేలోగా ఆ నందిని పని ముగిస్తాను,' అన్నారు, అంది.

'సరే పదండి నందిని మందిరానికి,' అన్నాడు అధ్యక్షుడు. అంతా ఊరేగింపులాగా ఉంది - అవంతి వాసులకు, ముసలి అధ్యక్షులు వెళ్తున్న తీరు.

వీరంతా నడచి వెళ్తున్నారు. నందిని మందిరం కను చూపు మేరలో ఉండగా, నందిని మందిరంలోనుండి, నందినిని, దుశ్శాసనుడు ద్రౌపదిని కొప్పు పట్టుకొని లాక్కొస్తున్న తీరుగా పట్టపగలు నడివీధికి ఒక చేత నందిని కొప్పులో వెలిక వస్తున్న దృశ్యం చూచి-ముందు దానిని చంపనీ-అనుకొని___

'చూచారా! వాడి వాలకం! ఎదురుపడితే మననూ నరికేస్తాడు. ఇక్కడ ఆగుదాం, రాని వాణ్ణి,' అన్నారు.

జనంలో, 'ఇందరం ఉన్నాంకదా?' అన్నారు.

'ఉంటేయేం, వాడు శివమెక్కి ఉన్నాడు,' అన్నాడు అధ్యక్షుడు. అతనికి కావలసింది - నందిని రణవర్మ చేతిలో అవమానపడి చావడం. వారిలా మాటాడుకొంటుండగా ఎక్కడనుండి వచ్చాడో వీరమల్లు! సత్వరన వచ్చాడు. ఆకర్ణాంతం లాగి వదలిన అంబులా అంత లావు మనిషీ అంత తేలిగ్గా అంత ఊపుగా వచ్చి రణవర్మ మెడమీద చేయి వైచి, రెండో చేత్తో నందిని కొప్పు పట్టుకున్న చేతిని వదలించి, ఎత్తి క్రింద కూలేశాడు.

దూరంనుండి చూస్తున్న అధ్యక్షునికి నిరాశ కలిగింది క్షణంలోనే.

కూలబడిన రణవర్మ చేతిలోని కత్తిని గాలిలోనికి విసరాడు కూలిపోయి కూడా. వీరమల్లు నిరాయుధుడుగా ఉన్నాడు. రణవర్మ తిరిగి లేచి కత్తిని గురిపెట్టి వీరమల్లు మీదికి దూకాడు. వీరమల్లు మెల్లగా ప్రక్కకు తొలగాడు. రణవర్మ గబాలున ఆగి కత్తిని ప్రక్కకు విసరాడు. ఆ కత్తి ఎత్తుతుండగానే విసరీ విసరక ముందు వీరమల్లు ముంజేతి దాపుకు తన చేయి పోనిచ్చాడు. కత్తి విసురు గాలిలో తేలిపోయింది. రెండవ చేతితో రణవర్మ చేయిని మెలిత్రిప్పి కత్తిని క్రింద పడేలా చేసి గడ్డం దాపులో తగిలేలా గుద్దాడు. ఆ గుద్దుకు రణవర్మ దూరంగా బంతిలా పడిపోయాడు. వీరమల్లు క్రింద ఉన్న కత్తి తీసుకున్నాడు.

నందిని బెదరిపోతూ నిలచినది కాస్తా, 'వీరమల్లూ!' అన్నది భయం భయంగా.

వీరమల్లు నవ్వుతూ, 'నిరాయుధుణ్ని ఆయుధంతో చంపడం ధర్మం కాదమ్మా! నాకు తెలుసు' అని ఆ కత్తిని రెండు ముక్కలుగా విరచి దూరంగా పారవేశాడు.

ఈలోగా రణవర్మ లేచాడు. 'ఒరే దున్నా! ఒరే ఏనుగా!' అంటూ ముందుకు వచ్చాడు. అతనలా వస్తుండగా మిగిలిన సేన, జనం, అధ్యక్షులూ అక్కడికి చేరారు.

రణవర్మను దాపుకు రానిచ్చి, రణవర్మ ఒక గుద్దు గుద్దాక, ఆ చేతిని మెలిత్రిప్పి మనిషిని మొత్తం వెనుకకు త్రిప్పి, గూడు మీద ఒక గుద్దు గుద్దాడు వీరమల్లు. ఆ గుద్దుతో రణవర్మ కుడి భుజం జారిపోయింది. దానిని వదలి రెండవ చేతిని పట్టుకొని ఒక్క కుదుపు కుదిపాడు, 'ఈ చేయేగదురా - నందినిదేవి జుట్టు పట్టుకుంది!' అంటూ, ఆ

చేయీ జారిపోయింది. బాధ భరించలేక కేకలు పెట్టడం మొదలు పెట్టాడు రణవర్మ.

ఇదంతా అయ్యాక అధ్యక్షులు 'ఇద్దరినీ బంధించండి' అన్నాడు.

వీరమల్లు అలాగే నిలచి 'ఎవడ్రా అంత మగాడు? అదిగో వాణ్ని చూచారుగా! జాగ్రత్త! నా దాపుకు చేరారా ఎముకలు హులాణం చేస్తాను. వాణ్ని పట్టుకెళ్ళండి' అన్నాడు.

నందిని ముందుకు వచ్చింది. 'ఇద్దర్నీ ఎందుకు బంధించాలి?' అంది ఆవేశంతో.

'రణవర్మను కారాగారంనుండి ఆరుగుర్ని చంపి పారిపోయి వచ్చినందుకు - వీరమల్లును అతని బుజాలు తొలగ వేసిన నేరానికి!' అన్నాడధ్యక్షుడు.

నందిని పెద్దగా పకపక నవ్వి, 'ఓ. అవంతీ పౌరులారా! విన్నారుగా మన అధ్యక్షుల వారి మాటలు!' అంటుండగా వీరమల్లు రణవర్మ బాధ చూడలేక రణవర్మ మీదికి వంగి, అతని రెండు గూళ్ళూ మెల్లగా తోముతూ జారిన గూళ్ళు సరిచేస్తున్నాడు. అటు చూస్తూనే నందిని తన మాట లాపకుండా—

'ఈ అధ్యక్షుల అధీనంలో ఉన్న సైన్యం రణవర్మను పట్టుకోలేక పోయింది. కారాగారంలో ఉన్న నేరస్థుడు తప్పుకున్నాడని, కావలి వారి నారుగురను చంపి పారి పోయాడని చెప్పుకోవడమే అవంతి సేనకు సిగ్గుచేటు. ఆ సిగ్గుచేటుకు అవంతి పౌర సభాసభ్యురాలుగా, ఈ అధ్యక్షుల వారి క్రింద సభాంగణంలోని నాకూ చిన్నతనమే! ఆ

పారిపోయిన రణవర్మ నా మందిరంలో జొరబడి, నా జుట్టు పట్టుకొని వీధిలోనికి లాగుతుండగా కాపాడలేని ఈ పెద్దమనిషి - అంతా అయ్యాక 'తగుదునమ్మా' అని ముందుకువచ్చి, ఇద్దరినీ బంధించమనడం సిగ్గుచేటు కార్యమా? మంచి కార్యమా? అడగండి. మీరంతా కలసి ఏది న్యాయమని నిర్ణయిస్తే దానికి కట్టుబడి వీరమల్లును బందీగా పంపుతాను. ఎవర్ని బంధించాలి? అవంతిలో ఆడదానను, అందులోనూ సభా సభ్యురాలను, నన్ను వీధికి కొప్పు పట్టుకొని ఈడుస్తుంటే దూరాన చూస్తూ ఊరుకున్న ఈ గౌరవనీయుడైన అధ్యక్షుని అనుజ్ఞ నెరవేర్చ మంటారా? చెప్పండి. మీ అందరికన్న వీరమల్లు నాకు కావలసిన వాడేం కాదు. కానీ నా ప్రాణాలు కాపాడాడన్నది మరచిపోలేను. మీరంతా జనసత్తాకలోని మనుష్యులు. మీకు ఏది చేయడానికైనా స్వతంత్ర ముంది. చెప్పండి. భయంలేదు. సజం నిజంగా చెప్పండి. దీనిని రాజసభకు, న్యాయసభకు ఎలాగూ లాగుతాను' అంది నందిని.

అధ్యక్షుడు సమాధానం చెప్పలేదు. నాల్గువంకలా పరికించాడు. తన బలం ఏమీ లేదు. ప్రజాబాహుళ్యం ఎక్కువగా ఉంది. వెంటనే గమనించి అందుకుంది నందిని -

'మీ వంకకు చూచి వారుకూడా న్యాయాన్నడుగుతున్నారు మన అధ్యక్షులు. వారు న్యాయాన్ని, మీకోరికను కాదనలేరు. వారు చూచిన దానినిబట్టి ఇద్దర్నీ బంధించమంటే బంధించమని అని ఉండవచ్చు. న్యాయాన్ని, ప్రజాభిప్రాయాన్నీ కాదనలేరు చెప్పండి. బాబూ! చెప్పండి. ఇదిగో నేనున్నాను. ఈ తల చూచారుగా? రణవర్మ నా మందిరం సోపానాలమీదుగా లాక్కువచ్చాడు. మీరంతా

చూచారు కదా! చూచినవారు వారికి చెప్పండి. ఈ అరంతిలో ఆడదానికా మాత్రం సాయం చేసేవారు లేరా? మీ ధర్మం మీరు నిర్వర్తించలేరా? మీకు నేను చేసిన అపకారమేదేనా ఉన్నదా?' అన్నది.

యువకులందరిలోనూ నెత్తురు వేడెక్కింది. చాలామంది ముందుకు త్రోసుకొని వచ్చారు. 'వీరమల్లును! బంధించడం న్యాయంగాదు' అన్నాయి గొంతులు. ఏది ఎవరిగొంతులో అర్థంకాలేదు ఒక్కసారే చాలా గొంతులు రేగి మాటాడడంవలన. అధ్యక్షులకేమీ అర్థంకాలేదు చేతగాని వానిలా చూశాడు.

'మీరంతా కొంచం ఆగండి! అధ్యక్షులవారేదో శల వీయబోతున్నారు' అంది. పాపం! అధ్యక్షుడు ఏమాటా ఆడాలనుకో లేదు. ఏమీ తెలియనట్టు, అమాయికయిన ఆడుదానిలా ఎంతలేసి మాటలడిగింది! ఇది ప్రజల్లో ఎంత సానుభూతి సంపాదిస్తూంది! దీనితో అనవసరంగా కత్తుకట్టానే అన్న ఆలోచనలో ఉన్నాడు అధ్యక్షుడు. ఊరుకోడం చూచి, తిరిగి నందిని, 'తమ దయ! తమ ఇచ్ఛవచ్చిన రీతిగా చెప్పండి! మీరు మాకు అధ్యక్షులు. మీమాట మేమాలించక తప్పదు. మిమ్మ్మ కాదని నిలచే బలం మాకు లేదు,' అన్నది. తేనెబూసిన కత్తిరా ఇది! తడిగుడ్డరా భగవాన్! దీని చేతిలో పడ్డాను. నిలవేసి అడుగుతూ ఎంత మెత్తగా ఉరి బిగిస్తూంది! ఇంతమంది మగవాళ్ళల్లో అది నిలచి నన్ను సవాలు చేస్తుంది-కదా అని, లోలోన కుమిలిపోతూ, పైకి—

'మీ ఇష్టం. మీ యిష్ట ప్రకారమే, ఒక్క రణవర్మను మాత్రం బంధించి కారాగార బద్ధుణ్ణి చేస్తాను' అన్నాడు. అంతలో రణవర్మ చేతులు రెండూ గూటిలోనికి నెట్టి

వేశాడు వీరమల్లు. చేతులు బలంగా ఎత్తలేను. బాధ పూర్తిగా తొలగలేదు. కాని ముందుకన్న చాలా నయం. ఎంతో బాధ ఉపశమించింది. రణవర్మను వదలి ప్రక్కన నిలచాడు వీరమల్లు.

జనమంతా అనుకున్నది: 'నందినీదేవి ఎంత తెలివైనది, ఎంత మంచిది.'

'నిజమే మరి! ఆ రణవర్మ ఆమెను కత్తితో నరికి నట్లయితే?'

'ఆఁ! చంపేస్తే ఏం చేసేవాళ్ళం?'

'అసలందరినీ అధ్యక్షుడు అక్కడ ఆపలేదా?'

'మన్ని వెళ్ళవద్దన్నారుకదూ?'

'పాపం! వీరమల్లు రాకపోతే ఆమె గతేమిటి?'

'అంగులో రణవర్మ చేతిలో కత్తి ఉండగా!'

'ఆ వీరమల్లు మొరటువాడు. కాబట్టి ముందుకు తూలగలిగాడు.'

'ఎంత ప్రమాదం తప్పింది?'

'ఎంత మేలు జరిగింది!'

ఇలాని ఒకరన్నరీతిలో మరొకరనకుండా అంతా అనుకున్నారు. నందిని ఆడిన నాటకం వారికేం తెలుసు? 'వీధిలో అవమానమైనా, ప్రజలు మనతట్టుకు తిరగాలి. తర్వాత కార్యాలకిది పునాదిగా ఉంటుంది. వీధిలోనికి వెళ్ళేవరకూ ఊరుకోమంది' వీరమల్లుతో. లేకుంటే ఆమె కొప్పు తాకడానికి రణవర్మవల్ల నయ్యేదా? ఆ చెయ్యి అక్కడకు రాగానే అక్కడే జారేదికాదా? వీధిదాకా యెందుకూరుకుంటాడు?

నందిని అనుకున్నది సాధించింది. ప్రతి పౌరుడూ సానుభూతి చూపాడు. రణవర్మనూ, అధ్యక్షునీ లోలోన నానా విధాలుగా ఆడిపోసుకున్నారు.

రణవర్మ- 'నందినీదేవి! మనిషివంటే నీవే! నీలాటి మనిషి యిక లోకంలో ఉండదు. ఈ అధ్యక్షుడు! వీడికి, వీడి పాపాలకు అంతులేదు. వీడేమైపోతాడో తెలియదు! ఆ రోజు రాత్రి వీడు-ఈ గండాలుడు, నిన్ను నీ తోటలో ఉరి వేసి చంపుతానని, నా పెళ్ళాన్ని వీడు - యీ రాక్షసుడు అయ్యో! ఏం చెప్పను? ఆ రోజు - అబ్బా! తల-తల,' అని తల పట్టుకోడానికి చేతులెత్తి, ఆ చేతులు బాధపెట్టి, కూర్చున్న వాడు కూర్చున్నట్టు కూలిపోయాడు. ఆ తర్వాత అతని నోట మాట రాలేదు. నందిని లోలోన అతని జీవితం చూచి, బాధనూచి జాలిపడింది. కానీ అలా పడకూడదనుకొని, దిక్కు తెలియక ల్లాడుతున్న అధ్యక్షుని చూస్తూ 'అధ్యక్షులవారూ! తిరిగి ఉన్మాదం తిరగపెట్టింది కదూ?' అన్నది. అంత బాధలోనూ అధ్యక్షుడు 'కాదూ-' అనలేక, 'అఁ, ఔననుకుంటాను!' అన్నాడు తన అసమర్థతను తనలో మ్రింగలేక, క్రక్కలేక —

'తలవిప్పితే నేను వెళ్ళిపోతాను. ఇలా ఈ వేషంతో సైంధవుని చేతబడిన పాంచాలిలా వీడిన కేశాలతో యింతమంది సభ్యతె నెరిగిన మగవారిలో నిల్చబడడం ఆడతనానికి అవమానం కాదా?' అంది.

జనం 'ఎంత మంచిది' అనుకున్నారు లోలోన.

అధ్యక్షుడు-ఎంత జాణవే! నందినీ! నీవు చేయదలచుకున్నదంతా చేసి నా బ్రతుకు బజారుపాలు చేసి నీవు నీ గౌరవాన్ని దక్కించుకుంటూ! అబ్బా! రాక్షసీ' అనుకుని

లోలోన - వెలికి, 'అలాగే వెళ్ళిరా నందినీదేవీ! తర్వాత మాటాడతాను' అన్నాడు అందరూ వినేలా.

నీ జేజేలు తిరగాలి నా ఇంటి చుట్టూ, అనుకొని—

'వస్తానండి!' అంది నందిని కదులుతూ.

జనం దారి ఇచ్చారు. ఆమె, ఆమె వెంట వీరమల్లూ కదిలారు. ఎంత మంచిదండీ నందినీదేవి! అనుకున్నారు అంతా ఎటు వాళ్ళటు వెళుతూ.

అందరినీ దాటి ద్వారం దాపుకు వెళ్ళుతుండగా వీరమల్లు 'నన్ను ఒదలరేమో అనుకున్నాను' అన్నాడు. వీరమల్లు అన్న మాట విని నందిని—

'పిచ్చివాడా! నిన్ను వదులుతానా! వదలి నేను వస్తానా! పద. వెళ్ళి స్నానం చేసి ఆహారం తీసుకో!' అన్నది.

నందిని మిద్దె మీదకు వెళ్ళింది. లోనికి వెళ్ళగానే పరదాలన్నీ కదలాయి.

'ఏమిటీ?' అన్నది.

'ఇందరం ఉండగా చేతగాని వారివి చేశారు. అసలు మేము చేయలేమా! వీధదాకా లాక్కుపోతుంటే చేతగాని వాళ్ళల్లా చూస్తూ ఊరుకోవలసి వచ్చింది!' అన్నారు.

'వీరమల్లును మీరే ద్వేషిస్తున్నారా?' అంది నందిని.

'అయ్యయ్యో! ఎంత మాటన్నారు? అతడు చాలా మంచి వాడమ్మా! మమ్మల్నీ, మా చేతులనూ ఎందుకు కట్టి వేసినట్లాని!' అన్నారు.

'నేను ప్రయోజనం లేనిదే ఒక పని చేయను. దానివలన నాకెంత... నాకూ అనడంకన్న మనకు ఎంత లాభం జరిగిందో తెలుసా? మీరున్నట్టు, అధ్యక్షుడు తర్వాత గగ్గోలు పెట్టినా నమ్మరు. అదీకాక మీరు మీరుగానే ఉండవచ్చు.

పైగా వీరమల్లు నా ఇంట ఉంటున్నట్టు అవంతిలోని అంద రికీ తెలుసు. ఇంతవరకూ అతడు ఉత్త ఛండాలుడని, పొగరుమోతని, క్రూరుడని పేరు పడిపోయి ఉంది. అది ఈ దెబ్బతో మాసిపోయింది. ఒక ఆడదాని ప్రాణం కాపా డిన వాడి క్రింద జమ! పోతే ఇక ఇక్కడేదైనా జరిగితే అది వీరమల్లువల్ల జరిగిందనుకుంటారు. మీరున్న తీరు కూడా తెలియదు.' అంది నందిని.

'ఇంత దూరం మేమాలోచించ లేదు. మిమ్మల్ని వాడు జుట్టు పట్టుకొని లాక్కు వెళ్ళాడే అన్న బాధలోనే ఉన్నా మమ్మా!' అన్నారు.

'వెళ్ళిరండి. పర్వాలేదు,' అన్నది నందిని.

నీడలన్నీ దూర దూరాలకు వెళ్ళిపోయాయి.

మేడ మీదనుండి చూచింది. రణవర్మను రాజభటులు లాక్కు వెళుతున్నారు. అతడు వారి వెంట వెళ్తున్నాడు. అతన్ని చూస్తూ, రణవర్మను బ్రతికిద్దామా అనుకుంది. కాదు, చావాలిసిందే. చావనీ! నా రక్షణ దేనికి? ఇంక అధ్యక్షులెంతకరున్నారు. ఆఁ చూస్తాను. అతనికి చేయాలసిన పథకం అతనే తెచ్చుకొంటాడు. నేను త్వరపడకూడదు. కానీ! అనుకొని శయ్యమీద నడుం వాల్చి ఆలోచించింది. ఏమిటీ నా బ్రతుకు! ఇంతేనా? కానీ! చూస్తాను. మార్చు కోవాలి. అది ఎలాటి మార్పు? ఆలోచించి తేల్చుకోవాలను కుంది. చతురిక వచ్చింది.

వచ్చీరావడంతో 'ఎంత అవమానం పాలయ్యారమ్మా!' అంది.

నందిని చిరునవ్వు నవ్వింది.

'అదేఁవిఁటమ్మా! అలా నవ్వుతారు?'

'చతురికా! నేను కొన్నేళ్ళముందు ఉన్న తీరులో ఉంటే యింకా ఎన్నో అవమానాల పాలయ్యేదాన్ని! చాలా అవమానాలు నా మనసులో ముద్రపడి ఉన్నాయి. వాటితో ఈ అవమానాన్ని పోల్చినప్పుడు యిది అవమానంగా అనుకోలేవు!' అన్నది.

ఆ తర్వాత చతురిక మాటాడలేదు. కొన్ని క్షణాలయ్యాక—

'చతురికా! ఆ చదరంగం తీసుకురావే, కాసేపు ఆడదాం!' అంది.

'ఎందుకమ్మా! ఎప్పుడూ ఓడిపోవడమేగా!' అంది చతురిక.

'ఓటమీ గెలుపుల సంగతేమిటే? నాకు తెలుస్తున్నదాకటే! నీవు కాయలను చంపడానికే ఆడతావు. నేను రాజును పట్టుకోడానికాడతాను. నాకెంతసేపూ నీ రాజుమీద చూపుంటుంది. నీవు ప్రతి బంటునూ చంపుకుంటూ కూర్చుంటావు. నా ఉద్దేశంలో బౌద్ధులే ఈ యాటకు నాందివేశారన్నట్టనుకుంటాను. కారణమేమంటే వందలఏళ్ళనాడు, ఈ రాజులంతా చంపుకోడానికి మనుష్యులను వెదకి వెదకి నానా రభసా చేస్తూన్న రోజుల్లో, అహింసను గురించి ఆలోచించే బౌద్ధ పండితులు దాన్ని కనిపెట్టి అవగల పాలేశారేమో - మీ మీ రక్త దాహం దీనిలో పంచి తీర్చుకోండని; ఆ తర్వాత సంతతి అంతకన్నా మిన్నగా దాని అభివృద్ధి పరచిందీ అని. అందుకే అందులో చతురంగబలాలు, వ్యూహాలు అన్నీ ఉన్నాయి. అదంతా ఎందుకులే గొడవ. రా! ఆడదాం!' అని ఆటకూర్చున్నారిద్దరునూ.

* * *

రాత్రి బాగా ప్రొద్దుపోయింది. చంద్రుడప్పుడప్పుడే వచ్చే స్థితిలో లేడు. లోకమంతా కారు చీకటిలో మునిగి పోయి ఉంది. నక్షత్రాలు మిల మిల మెరుస్తూన్నాయి. సిప్రానది వెలుగు నీయాలని ప్రయత్నం చేస్తూంది. కానీ, దరులకంటి ఉన్న తరువులు ఆ వెలుగును దిశలకు వెళ్ళనీయకుండా అడ్డుకొంటున్నాయి. ఆ నీడలో నీడలా ఏవో ఆకారాలు జర జర వచ్చి, అటూ యిటూ చూచి విసరి వేశాయి. నీళ్ళల్లో ఏవో చప్పుడయింది బరువు వస్తువు పడిన రీతిలో. ఆ సద్దు విని వాటికి రెండు తరువులు దిగువనున్న రెండు ఆకారాలు గభాలున నీళ్ళల్లోనికి దుమికి, ఆ పడ్డ వస్తువును వెదకి చాలాసేపు ఈదులాడాయి. ఈలోగా ఒడ్డున తరుచ్ఛాయల్లోని ఆకారాలు తలపడి పోరాయి. అలా ఎంతసేపు పోరాడాయో చాలా ఆకారాలు ఉమ్మడిగా పోరాడాయి. ఆ తర్వాత ఒక వర్గం మరో వర్గాన్ని ఓడించి, అందరినీ కాళ్ళూ చేతులూ కట్టి ఒక ప్రక్క పారవేశాయి. నీళ్ళల్లో దిగిన ఆకారాలు ఈలోగా ఆ పారవేసిన వస్తువును చేజిక్కించుకొని ఒడ్డుకు చేరాయి. ఒడ్డుకు చేరాక అది ఒక మానవాకారం! ఆ ఆకారాన్ని వెలికి లాగి పొట్టమీద కాలువేసి తొక్కి ఊపిరి పీల్చుకుందే స్థితికి తెచ్చాయి మిగిలిన ఆకారాలు. వారలా ఉండగా ఒక ఆకారం దాపుకు చేరింది.

ఆ ఆకారాన్ని చూచి, 'అంతా చిక్కారు. ఏ ఒక్కరూ తప్పిపోలేదు,' అన్నదో గొంతుక.

'గాలి వాలుగా ఉన్నది కదా, నావ వెళ్ళడానికి?' అన్నదా వచ్చిన ఆకారం.

'ఆఁ! అన్నదో గొంతు.'

'రణవర్మ బ్రతుకుతాడా?'

'ఏం పర్వాలేదు. బ్రతికినట్లే భావించవచ్చు.'

'మంచిది. నావలో ఎక్కించుకొని ఊరు దాటేవరకూ తెడ్లు వేయండి. ఆ తర్వాత కావాలంటే తెరచాప నెత్తి వచ్చు ఈ రాత్రికే తిరిగి రావడానికి. వీలైతే ఈరేయేరండి. లేదా రేపు మళ్ళండి. ఊఁ! వెళ్ళిరండి' అన్నదా ఆకారం.

'చిత్తం! అలాగే,' అన్నదో గొంతుక.

'వెళ్ళండి.' అన్నది ఆకారం.

కట్టిన వాళ్ళందరినీ నావమీదకు చేర్చి నీటిలో పడిన ఆకారాన్నికూడా నావ చేర్చారు. నావ నిప్రానదిలో మెల్లగా కదలి పోయింది. ప్రవాహం కొంచం సాయపడింది. నావ సాంతం కనుమరుగయ్యేవరకూ చూచి, కొన్ని ఆకారాలు ఊరులోనికి పొలిమేరవరకూ వచ్చి, ఎక్కడి ఆకారాలక్కడ చీలి పోయాయి. ఒక పెద్ద ఆకారం, ఒక చిన్న ఆకారం మాత్రం నందినీదేవి మందిరంలోనికి వెళ్ళాయి. లోనుండి రెండు ఆకారాలు ఒకటి చతురిక, ఒకట్ మధూలిక వెలికి వచ్చి, మధూలిక పెద్ద ఆకారాన్ని వెంట బెట్టుకొని క్రింది భాగానికీ, చతురిక చిన్న ఆకారాన్ని వెంట బెట్టుకొని మందిరోపరి తలానికీ వెళ్ళారు.

లోనికి వెళ్ళాక 'రణవర్మ బ్రతికినట్లేనా, అమ్మా!' అంది చతురిక.

'ఆ! బ్రతికినట్లే!' అంది ఆకారం తన కుస్తులను తీసి నందినిగా మారుతూ!

'మీరెందుకు రణవర్మను బ్రతికించినట్లు?'

'నీ కోసమే! నీవు బావతో పోదుస్తానన్నావు కదూ? అందుకని!'

'నిజంగానా! అమ్మా!' అంది చతురిక.

'ఊఁ నిజంగానే!' అంది నందిని.

'నన్ను ఎప్పుడు చేరుస్తారు, అతనిదగ్గరకు?' అంది చతురిక.

'నిజంగా నీకు చంపే ధైర్యమున్నదా, చతురికా?' అంది నందిని.

'అదే ఆలోచిస్తున్నాను' అంది చతురిక.

'చతురికా! మనుష్యులను చంపడం చాలా తేలిక. కానీ, బ్రతికించడం ఎంత కష్టమో తెలుసా? ఈ రోజు రణవర్మను కాపాడడానికి ఎంత కష్టపడ్డామో నీకేం తెలుసు! చాలా బాధ! మనవాళ్ళంతా ఆ ప్రాణం కాపాడడానికి సిప్రాలో దూకి వెదకి నానా అవస్థపడి ఒడ్డుకు చేర్చారు. కానీ చతురికా! అదే చంపదలిస్తే క్షణం పట్టదు. రక్షించడం ఎంతో కష్టం! బ్రతికించడంలో ఉన్న ఆనందం చంపడంలో లేదే! ఈ క్షణమే తెలిసింది నాకు. పగవాని చంపడం కన్న బ్రతికించి, క్షమించడం చాలాకష్టం. నేనెందుకు రణవర్మను బ్రతికించానా అని ఇప్పుడు విచారిస్తున్నాను. రెండు నాళ్ళయ్యాక మనం అక్కడకు వెళదాం! నీకు అవకాశం ఇస్తాను. ప్రయత్నించు చంపడానికి' అంది నందిని.

'తప్పకుండా చంపుతాను' అంది చతురిక.

'బాగా ప్రొద్దు పోయింది. నిద్రపో, పద. ఆలోచించు ఎలా చంపాలో!' అని నందిని తను వెళ్ళి శయ్యమీద మేను వాల్చింది.

## 14

సంధ్య ప్రవేశించింది. ముసలి సూర్యుని కిరణాలు తూర్పు కొండమీద పడుతున్నాయి. ప్రకృతి బంగారం రంగు పూసుకుంది. వాడల మేడలన్నీ మెరసిపోతున్నాయి. బంగారు నీరద్దిన రీతిగా ఉంది లోకమంతా.

అందరూ ఎవరి పనులు వారు సర్దుకొని, ఇళ్ళకు పోవాలని చూస్తున్నారు. ఇల్లాళ్ళు దివ్వెలు సరిచూచుకుంటున్నారు.

అధ్యక్షుని యింట్లో అతడొక్కడూ కూర్చొని, ఏదేదో ఆలోచిస్తున్నాడు. అతడు ఆడదాని చేత ఓటమి కలిగిందే అని బాధపడుతున్నాడు. ఆమె జీవితమంతా ఒకసారి తలపులో మెదలింది. నందిని! అబ్బా! నా ప్రాణానికి పగను నా అంతట నేను తెచ్చుకున్నాను. దారేపోయే కనిని అవంతికి పిలిచి, జాగా యిచ్చాను. సూరసేనం వారితో తగాయిదా రాలేదు గాని, వస్తే ఆ రోజు పోరాడకా తప్పేది కాదేమో దీనికోసం. తల్లీ బిడ్డా కనిపించగానే నందిని అందం కన్ను చెదరగొట్టింది, ఈ నాటి లాగానే. అందుకే ఆశ్రయమిచ్చింది కూడా. ఆ తర్వాత, అబ్బా! ఎన్ని పనులు జరిగాయి. ఈనాడు మానై ఏ అవంతిలో బ్రతకాలని వచ్చిందో ఆ అవంతిలో సభాసభ్యురాలై-అదీ నేనిచ్చిందే కదా? దానిని కూడా అందుకొని - ఈనాడు ఈ అవంతిలో తన మాట అనుజ్ఞగా చెల్లించుకొంటూంది. వారం నాడు ఎంత రభస జరిపి నడివీధులో నిలిపి ప్రశ్నించింది? ఎంత మందిని తన వైపుకు లాక్కుంది! దానికీనాడు అవంతిలో ప్రజా బలం ఉంది. దానినోడించడం కష్టం. రాజీ పడనా! ఆఖరుకు నా అంతట నేను రాజీకి పోవాలా? ప్రాణాలు పోతున్నా పోకూడదు. అయినా వెళ్ళి ఆ నయవంచకురాలిని కొంచం పరీక్షించాలి. ఏం చేస్తుందో, ఏం చేయాలనుకుంటుందో చూడాలి. తెలుసుకోడానికైనా వెళ్ళాలి. ఎవరైనా పంపితే అది వారు వెళ్ళగానే సవంయిచ్చి, శివం ఎత్తించి, వారిలోని నిజం లాక్కొని, పొమ్మంటుంది. ఎంత జాణ! రణవర్మ-పాపం రణవర్మ వెళ్ళి ఏదో చేయాలని, అంతా అభాసు చేశాడు. ఆ సంగతెంత కట్టుదిట్టంగా దాచింది!

రణవర్మను ఏటిలో పారవేయుమని పంపిన వాళ్ళు ఏమయ్యారో, వెళ్ళిన వారిలో ఏ వొక్కరూ రాలేదు. ఇదింత కోరకరాని కొయ్యగా తయారయ్యిందేమిటబ్బా! దాని మనుష్యులెవరో చాలా నమ్మకమైన వారున్నారు. లేకుంటే దాని నాటకాలిలా సాగవు. అవంతిని ఆడది ఆడిస్తుందే! జనసత్తాకనే యిలా ఆడిస్తుందే! ఇది ఏకసత్తాక అయి ఉంటే కిరీటం తన నెత్తికి తెచ్చుకుందేది. ఇక్కడ మాత్రం ఏం తక్కువ చేస్తూంది? కిరీటం లేని రాణిలానే ఉంది కదా?

ఒక విధంగా, దీనికి మేమూ అన్యాయం చేశాం. అది అన్యాయమే. నాశనమే చేశాం. అందుకే అది అంత రెచ్చిపోయి కక్ష తీర్చుకుంటూంది. ఆనాడు ఆ అక్రమం జరిపిన వారిలో నలుగురు ఐపోయారు. నేనొక్కణ్ణే మిగిలివున్నాను. నన్ను బ్రతుకనిస్తుందా? ఏమో! ఆ మాట అనుకోగానే అతని ఒళ్ళంతా వణకిపోయింది. గుండెలు వేగంగా సిప్రానదీ తరగల్లా పొంగాయి. యెడద దడదడ లాడింది. అలాగే ఆసనమ్మీద వణకిపోయాడు. అధ్యక్షుని తల తిరిగి పోయింది. ఏమీ తోచలేదు. ఏదో ఆవేదన, భయం తనకు తెలియకుండా తాను ఎవరికో లోబడి పోతున్నాడు. తనకు శాంతి కావాలి. అండగావాలి. ఎవరైనా చేయూత నీయాలి. ఆ చేయూత సామాన్యులు ఈయరాదు. వీరులు, గొప్పవారు ఈయాలి. ఎవరిస్తారు? ఏమిస్తారు? ఏమిటీ భయం? అవంతి అధ్యక్షునికి భయమా? అక్కడ నిల్వలేక - ఏదైతే అదే అవుతుంది, నందిని యింటికి బయలుదేరతాను, వెళ్ళి చూస్తాను అందమైన నాగుబామును - దీనితో అది పట్టిన మార్గంలో నయవంచనతో మంచితో దాని కోరలు పీకి పారవేయాలి. అంతే, మరో మార్గం లేదు.

ఆ మాట అనుకోగానే ఏదో శాంతి, ఏదో తృప్తి కలిగింది. బయలుదేరాడు. ప్రొద్దు సాంతం వాలిపోయింది.

* * *

నందిని తన ఇంట్లో ఉన్న గోపాలదేవుని విగ్రహంముందు దివ్వె వెలిగించింది. ఆ గోపాలదేవునిలో ఆమెకు కొన్ని ఏళ్ళ నాడు శాంతి సందేశం అందించిన గౌతమ బుద్ధుడు కనిపించి, శాంతంగా 'ఓ! అంగనా! నీవు రక్తంలో తడుస్తున్నావు. రక్తం వదలి మంచిలో తడవడానికి ప్రయత్నించరాదా! మిగుల్చుకో! మనస్సును మిగిలేలా చూచుకో! మనిషిని మనిషి వంచించదలచినపుడు ముందుగా తనను తాను వంచించుకోవాలి. మంచికార్యాలు ఎన్నయినా చేయవచ్చు. చెడ్డవి కొన్ని మాత్రమే చేయగలవు. చెడులో నీ ఆత్మ సంతృప్తి నందదు. తాత్కాలికంగా సంతృప్తి నందినా, నీవు శాశ్వత సంతృప్తిని అందుకోలేవు.' నందిని కలా ఏదో అదృశ్యశక్తి వినిపిస్తూంది. ఆ వాణిని వింటూ అలాగే కూలబడి ఉంది. మందిరాంతర్భాగంలో చతురిక గొంతెత్తి పాడుతూ ఉంది. ఆమెకూ తెలియదు తను పాడే దానిలోని భావం. ఏదో పాడాలి గనుక, ఉత్సాహంగా ఉంది గనుక పాడుతూంది. అదేదో వేదాంతం-తనకు తెలియని భావం. తనకు తెలుసనుకుంటున్నట్లు నటన.

ఎందుకయ్యా! నీ పరీక్ష!
ఏమి చేసితి ననుచు కక్ష!

అరువు దెచ్చిన నీదు అసువుల
తిరిగి యిచ్చెద పుచ్చుకొమ్మా!
పరువు కొరకై లోకమందున
అరువు బ్రతుకిక బ్రతుకలేను ॥ఎం॥

అడుగు అడుగున భయపు మడుగున
పడుచు లేచుచు నడువజాలను
ఇడుము లనియెడి కడలి నడుమను
పడితి నేనిక యీద జాలను ॥ఎందు॥

అంతు కొరకని చింతలందున
ఎంతకాలం వంతలందను?
ఇంతకాలం నీదు అప్పుల
కెంత జాగో తెల్పవయ్యా? ॥ఎందు॥

పాల బాకీ తల్లి యడుగను
నేల బాడుగ భూమి యడుగను
కాలు డెదుటను నిలచినప్పుడు
గాలి లెక్కది తేలిపోవును ॥ఎందు॥

దివా రాత్రుల తెరలు గట్టి
రవిచంద్రుల మింట వెట్టి
నీవు నడిపే నాటకమ్మది
చావు బ్రతుకుల మధ్యనేగా ॥ఎందు॥

నన్ను లోకము లోని కనుపవి
నిన్ను నేనెపు డడిగినానూ?
ఉన్న వానను ఉండనీయక
నన్ను మాటికి పిలతు వేటికి? ॥ఎందు॥

నిన్ను అడిగేవారు లేరని
ఇన్ని పనులను చేయుచుంటివి

అన్నియూ నీ ఇష్టమేనా?
నన్ను నన్నుగ బ్రతుకనీవా? ॥ఎందు॥

నీవు యిచ్చిన అసుల నిల్పగ
చావు బ్రతుకుల మధ్య జీవులు
నిన్ను మరచిటు తన్నులాడగ
కన్ను మూసుక యుందువేలా! ॥ఎందు॥

నీవు కన్నులు విప్పి చూచిన
నిఖిల లోకము నిలచిపోదా?
మనిషి పాపము చేయనేలా?
మరల పాపము తీర్పనేలా?

ఎందుకయ్యా ఈ పరీక్ష!?
ఏమి చేసితి మనుచు కక్ష?....

నందిని లేచి 'చతురికా! చతురికా!' అన్నది.

చతురిక పాటనాపి పరుగున వచ్చింది, 'పిలచారా అమ్మా!' అంటూ.

'ఆఁ పిలచాను. ఏమిటా పాట? ఎక్కడిదో లాక్కొచ్చి పాడుతున్నావు? ఈ మనస్సు నీ పాటలోని పదాలకు సన్యసించాలసిన గతి పట్టేలా ఉంది. కొన్నాళ్ళ వరకూ పాట లాపు. ఆ తర్వాత పాడుదువుగాని. అదిగో వీధిలోనికి చూడు. అధ్యక్షులవారొస్తున్నారు. చూచి, మన ఇంటికే ననుకుంటూ - పిలుచుకొనిరా! వెళ్ళు,' అని నందిని పూజా మందిరం వదలి క్రిందికి దిగి వచ్చి మామూలుగా అందరితో మాటాడే అంతరంగిక మందిరం చేరింది. చతురిక అధ్యక్షులను వెంట బెట్టుకొని ఆ మందిరంలోనికి వచ్చింది.

నందిని ఆసనమ్మీద కూర్చున్నది లేచి, 'రండి రండి. చాలా కాలానికి దర్శన మిచ్చారు' అన్నది ఆసనం చూపుతూ.

'వస్తున్నాను. రాకేం చేస్తాను నందినీదేవీ! నీవు గెలుస్తున్నావు. నేను ఓడిపోతున్నాను. నీవు చాలా తెలివైనదానవు,' అన్నాడు. నందిని చతురిక వంక చూచింది. చతురిక లోనికి వెళ్ళిపోయింది. ఈ ఎత్తు దేనికి ఎత్తుతున్నాడో అని లోలోన అనుకొని—

'నేను కొంచం ఆవేశం గలదానను. మిమ్మల్ని నొప్పించకూడదనుకుంటూనే ఉంటాను. కానీ నొప్పిస్తాను. నా గెలుపేమిటి? మీ ఓటమేమిటి? నాకేం తెలుసు, గెలుపు ఓటములు?' అన్నది నందిని.

'నందినిదేవీ! కపటం వదలి వెయ్యి! నేను ఈ రోజు ఎదటబడి నిజాలు నిజాలుగా తేల్చి వేసుకోవాలనుకొని వచ్చాను. ఈ రోజు నీ నయవంచకాలు మాని ప్రశాంతంగా మాటాడు. చాలు' అని, అధ్యక్షులు ముసలి కనులెత్తి మెల్లగా నందిని కన్నులలోనికి చూచాడు. నందిని కూడా పరీక్షగా అధ్యక్షుని కన్నులలోనికి చూచింది. అందులో నందినికి కనుపించింది నిస్సహాయత, వ్యథ, అధ్యక్షుని క్షుభిత హృదయపు చిహ్నాలు. అవి కనిపించగానే నందిని జాలి పడింది. ఐనా ఆ చూపులు ఆపలేదు అధ్యక్షుడు. తల వాల్చాడు. అది తన ఓటమిని అంగీకరిస్తున్న రీతిలోనే ఉంది.

'మీ రేదో బాధతో వచ్చినట్లున్నారు. నేను మీ బాధను శాంతింప చేస్తాను. ఈ నందిని మంచికి మంచిని, వంచనకు వంచననూ అందిస్తుంది. అసలు నందిని ఆకారమంటూ ఒకటి

ప్రమేయం లేకుండా అతడంతట అతడే, నన్ను చంపాలని వచ్చి చచ్చిపోయాడు. అయినా నాయింట నా కిటికీలో జరిగింది కాబట్టి, [illegible] నామీద వేసుకుంటాను. అదీ ఎలా? నన్ను చంపాలని వచ్చినవానిని చంపడం జరిగిందని మాత్రమే. మిగిలిన ముగ్గురునూ మీ స్వార్థంకొరకు మీరే చంపించారు. మీరే వాటికి బాధ్యులు, నాకేం సంబంధం లేదు. వాటిని నామీదకు నెట్ట ప్రయత్నించకండి. మీరు చేసిన వాటన్నింటికీ కారణాలు కనిపిస్తున్నాయిగాని, ఒక్క రాధానాథుని హత్యకు నాకు కారణం దొరకడం లేదు!' అంది నందిని.

'అన్నింటికీ కారణాలు తెలుసా?'

'తెలుసు. కారణాలు మాత్రమే గాదు. సాక్ష్యాలుకూడా ఉన్నాయి. నన్ను చంపనెంచి పంపిన జయపాలుని మనిషి విషయం తెలుసుకదా? పిచ్చివాడై తిరుగుతున్నాడు. ఆ లోగా జయపాలుని చంపిన మనిషి చేతులు విరుగదీయబడి, మిమ్మల్ని రాజ సభకు లాగగానే సాక్ష్యమీయ సిద్ధంగా ఉన్నాడు. రెండవసారి జరిపిన ప్రయత్నంలో రణవర్మకు హాని కలిగింది! మీకు నిజంగా నా మాటమే ప్రధానమైతే ఆ కామాన్ని నేనెప్పుడు తీర్చనన్నాను, చెప్పండి? అది ద్రాక్షాసవంతో పాటు అందుతుందికదా? ఇదేమైనా భోజనమా? విందా? ఒక్క ఆడదాన్ని ఉమ్మడిగా అనుభవించాలన్న ఛండాలపు కోరిక మీకు దేనికి పుడుతుంది? పశువులొప్పుకోవుగదా ఆ కార్యానికి? మనుషులు, తెలిసినవారు, ఊరకున చెప్పవలసినవారు మీకెందుకా తృష్ణ? ఆ నాడు, ఆ రేయి శవంతో భోగించినట్లుగా మత్తులో, ఒళ్ళు తెలియకుండా పడివున్న రణవర్మ భార్యను......ఎంత నీచం......'

'నందినీ దేవీ!'

'ఉండండి, పాపం కడుక్కుంటే క్షాళనమౌతుంది. సాంతం వినండి. దానితో, ఆ జరిగినదంతా కన్నులకు పొడకట్టి రణవర్మ పిచ్చివాడై వీధులవెంట నిజం చెప్పాడు. ఆ నిజాన్ని ఉన్మత్త ప్రలాపాలుగా ప్రచారం చేయించారు. అతన్ని చెరసాలలో బంధించారు. అక్కడే నాకు తెలియకుండా ఉంది. ఆ సమయంలో రాధానాథుని చెరసాలకెందుకు పోనిచ్చారు? రాధానాథుడు మీకు అపకారం తలపెట్టే మనిషి కాదు కదా? ఆ విషయం మీకు తెలుసు కదా? ఎందుకు చేసినట్టు?'

'నేని వేమీ ఈ క్షణం చెప్పలేను,' అన్నాడధ్యక్షుడు.

'అంటే మీరింకా నిజానిజాల ప్రసక్తికి రావడం లేదన్న మాట. ఏదో నా చేత నిజాలు చెప్పించాలన్న ఆశయంతో మీరు మీ కపటంతోనే సంచరించాలని యింకా ప్రయాసలో ఉన్నారు. అంతే కదా?' అంది నందిని.

'నందినీ దేవీ! కాదు,' అన్నాడు అధ్యక్షుడు.

'పాపం ఉన్మత్తుడైన రణవర్మ మీకేం అపకారం చేయగలడు? అతన్ని అర్ధరాత్రి సిప్రాలో పారవేయవలసిన అవసరం, అగత్యం ఏం వచ్చింది?

'ఆఁ! అతనేమయ్యాడు? నేను పారవేయించానా?' అన్నాడు.

'మీరిన్నింటికి సమాధానం చెప్పలేదు. నేనన్నింటికీ చెపుతున్నాను. మనం ఆడే చదరంగంలో మీ అంత మీ బలగాన్నంతా నాశనం చేసుకున్నారు. మీ రాజు ఒక పావు. ఆ పావు ఏ నాటికీ మరో అంత్యగడి నందుకొని జంతువుగా మారలేదు. ఆపావే జయసింహుడు. ఆ పావుతో మీరింక

ఏం ఆడగలరు? ఏ క్షణాన కావాలంటే ఆ క్షణాన నేను మీ ఆట కట్టించగలను. కానీ, నా కోరిక అదికాదు. మిమ్మల్ని, మీ తరపునున్న ముప్పైరెండు గడులూ నలుపు తెలుపుల భేదం తెలియకుండా నా ముప్పైరెండులకు రాలేరు - త్రిప్పాలనుకున్నాను. త్రిప్పుతాను. నా బలగం లోని ఏ బంటు గడ వదలి బలైనా, మీ రాజుపని సంక టమే! ఆటకట్టే! ఆలోచించండి. ఇందాక రాగానే మీ రన్నారే - వంచన వదలి మాటాడమని, అలా వంచన లేకుండా నే మాటాడుతున్నాను. రణవర్మను బ్రతికించాను. బ్రతికిస్తాను. అతనికి నే ననుకున్న దానికన్న శిక్ష ఎక్కువే ఇచ్చాను. అతని కళ్ళయెదుట అతని భార్యను అతడూ, మరో యిద్దరూ చెరచారు. అతనంతట అతడే ఉరితోడిగి, తాడు లాగి చంపివేశాడు. ఆ సంఘటన నాలో జాలిని చిగిర్చింది. బ్రతికించాను. అతన్ని మార్చి నా వంకకు తిప్పుకుంటాను. అంటే నా పావును, మీ ఆఖరుగడి, అదే యేనుగు గడికి తెస్తాను. అప్పుడు ఆ యేనుగు నాది. అర్థమవుతుందా, అధ్యక్షులువారూ?' అంది నందిని.

'అంటే వాడిచేత నా ప్రాణం తీయిస్తావన్న మాట! కానీ, నందినీదేవీ కానీ!' అన్నాడు.

'మీ ప్రాణం అతనిచేత తీయించడం చేతగాని పని గాదా? ఆ ప్రయోగం అయిపోయిందికదా? మీ మనిషిని మీ చేత ఉరేయించానుగా! క్రొత్తపద్ధతి కావాలి. అదే ఆలోచిస్తున్నాను. ఆలోచిస్తాను. అవకాశంకోసం చూస్తున్నాను.'

అంతలో చతురిక ద్రాక్షాసవం తెచ్చి పెట్టి వెళ్ళిపోయింది.

చిన్న పాత్రలోనికి వంచి, నందిని 'త్రాగండి,' అని అందించింది నందిని.

'ఇంకా నీ యింట తాగుతానా! అందులో ఏం కలిపావో ఎవడు నమ్మగలడు?' అన్నాడు.

నందిని కలకలనవ్వి, 'ఎంత పిచ్చివారండీ, మీకు కొత్తదనం ఉంటుందన్నాను కదా? లేదా మిమ్మల్ని వదలి వేస్తాను. మీ యంత మీరు కుళ్ళికుళ్ళి కృశించి నశించి పోతారు. అంతే మీరు చేసిన పాపాలు మిమ్మల్ని కట్టి కుడపాలి. అది మంచిదికదూ! ఇదిగో చూడండి. నేనలా మంగులతో విషప్రయోగాలతో ప్రాణాలు తీయను. అది పిరికి వారిపని,' అంటూ తను ఒక గ్రుక్క త్రాగి, 'నే నింత వరకూ ఎప్పుడూ ద్రాక్షాసవం త్రాగలేదు. మీ కొరకు, మీకు నమ్మిక కలిగించాలని త్రాగాను. త్రాగండి,' అని అందించింది.

'అది ఎంగిలి పాత్ర,' అన్నాడు.

'నా యెంగిలి మీ పెదవుల కెప్పుడూ తగలలేదని సరిగ్గా నా వంక చూస్తూ, మీ గుండెల మీద చేయి వేసుకొని చెప్పండి,' అంది నందిని.

అధ్యక్షుడు మాటాడలేక పోయినాడు.

'ఐనా ఉచ్ఛనీచాల కతీతంగా ఒక్క ఆడదాన్ని ఐకు గురనుభవించే పంచములు మీ కెంగిలేమిటి? త్రాగండి,' అన్నది. ఆ మాట అంటుండగా గొంతులోనికి అస్వాభావికమైన స్వరం వచ్చింది. అధ్యక్షుడు మాటాడకుండా త్రాగాడు. అతని ప్రాణానికది చాలా హాయినిచ్చింది. తిరిగి మరో పాత్ర అందించింది. అదీ త్రాగాడు. ఆ పెద్ద పాత్ర దగ్గర ఆ చిన్న పాత్ర ఉంచింది. తిరిగి మరో పాత్ర ఇవ్వమన్నట్టుగా చూచాడు. ఆమె తల నాడించింది ఈయు నన్నట్టు.

తరువాత అధ్యక్షులను చూస్తూ, 'మీకు సవం ఇచ్చి మతులో ముంచవలసినంత అవసరం నాకు లేదు. తిరిగి మరొకసారి నాట్యమందిరం లోనికి వస్తారా? ఇంక జీవితంలో నేను ఆడే రోజు రాదు. పాడే రోజులున్నాయి. అవి దైవ సంకీర్తనలు. వస్తారా?' అంది నందిని.

'నందినీదేవీ! మన ద్వంద యుద్ధంలో నీవే గెలుస్తావని నీకు బాగా నమ్మకం ఉందా?' అనడిగాడు.

'ఉన్నది. జయం నాకే. కారణం - నా వంక ధర్మం ఉంది. ధర్మం జయించి తీరుతుంది. లేకుంటే లోకానికంతో అపకీర్తి చుట్టుకోదా? కనీసం లోక మర్యాదకైనా జయం నాకు సిద్ధించాలి. అందుకే నేను ధైర్యంగా ఉన్నాను. ఉంటున్నాను. ఒక్కసారి ఆలోచించండి- నాకు మీరు చేసిన అన్యాయం ఎంతటిదో! అలాంటి అన్యాయం వలన ఏం జరుగుతుందో మీకు చేసి కూడా చూపాను కదా! అదే రణవర్మ వ్యవహారం. ఇంక ఈ గోల, ఈ గొడవా మరచిపోయి అలా వెళదాం పదండి నాట్య శాలకు. నాకు చాలా ఉత్సాహంగా ఉంది. ఎంత కాలమో అయింది నాట్యం చేసికూడా! ఆనాడు మీ ముందు ఆడిందే. తిరిగి ఆ ప్రదేశానికి పోలేను కూడాను. ఇంక దానితో నాకు పని కూడా ఉండదు,' అన్నది నందిని.

'నందినీదేవీ! నీలోనూ ఏదో నిరాశా, నిస్పృహ కలుగుతున్నాయిలా ఉంది' అనడిగాడు. అతనికి ఆమె నిజాలే చెపుతున్న రీతిలో ఉంది. నమ్ముతున్నాడు.

'ఈ నాడు కాదు. నే నేనాడో మారిపోయాను. నా మార్పు - పున్నమరేయి సిప్రానది ఒడ్డున అంధభిక్షువు

సందిట. కానీ దానిని తెంచుకొని, విజృంభించాను. నాలో కరుణను అణచి మారణం సల్పాలని ఎగురు తిరిగింది కాళాంబిలో. ఆనాడూ వున్నమే. పవిత్ర బౌద్ధ ఆరామంలో శాంతి వాచకాలు చదివిన చోట నాలో క్రాంతి బయలు దేరింది. ఆఁ! అవన్నీ వదలండి, రండి.' అన్నది నందిని.

'నందినీదేవీ! నిన్ను నమ్మమంటావా?' అన్నాడు.

'నేను నమ్మించి మోసగించలేను.' అంది.

'నీవు తేనె బూసిన కత్తివి.'

'కావచ్చు. తడి గుడ్డలో గొంతులు కోసేవారిని అలాగే చేస్తాను. కానీ మీరు నన్ను నమ్మండి. మిమ్మల్ని వంచించలేను. వంచించను. నమ్మిన వారిని మోసం చేయడం మానవ కార్యం కాదు. రండి. వెళదాం,' అని నాట్యశాల లోనికి దారి తీసింది. అధ్యక్షుడు కూడా వెంట నంటి వెళ్ళాడు. ఇద్దరూ కలసి నాట్యశాలలోనికి వెళ్ళారు. ఆ అపురూప మండపంలో ఒక ఆసనం మీద అధ్యక్షుని కూర్చుండ చేసి, ఆమె మాత్రం వలయాకారంగా ఉన్న ఆ వలయంలోనికి వెళ్ళి నిలచింది. ఆమె అలా నిలచిన మరు క్షణం వాయిద్యాలు మ్రోగాయి. అక్కడ నిలచి క్షణం ఉండి తిరిగి, 'చతురికా!' అంది. చతురిక వచ్చింది. ఆ పిలుపు మందిరమంతా మ్రోగింది. 'నాట్యశాలలో ఉన్న దివ్వెలన్నీ వెలిగించండి' అంది. దివ్వెలు వెలుగుతున్నాయి. పరిచారికలు తలా ఒక దివ్వె వెలిగించారు. అంతలో నందిని వెళ్ళి బట్టలు మార్చుకు, నాట్యానికి సరిపడే దుస్తులు ధరించి నిల చింది. ఆమె 'రంభ'-ఆమె 'మేనక'-ఆమె 'ఊర్వశి'. అది పురందర మందిరం. అది అమరావతి. అది స్వర్గంగా మారి పోయింది. నందిని అవయవాలన్నీ కన్పిస్తున్నాయి ఆచ్ఛాదన

లేనట్టు. కానీ అవయవాలన్నింటినీ మరుగు పరుస్తున్నాయి. ఆమె వివస్త్రలా ఉంది. కాదు ఆమె కట్టిన పుట్టాలు కని పిస్తూనే ఉన్నాయి. ఆమె ఒంటి రంగుకు సరిపోయాయి. అది ఆమె మేని రంగో, దుకూలాల వన్నో అనూహ్యం. ఆ నర్తనశాలంతా వెలుగుతో నిండిపోయింది. పట్టపగల్లా ఉంది. ప్రతి దివ్వె వేయి దివ్వెలలా పాలరాతిమీద వెలిగి పోతు న్నాయి. వాటిమధ్య ఆమె అపురూపంగా నిలచింది. ఆమె స్వర్ణ పాంచాలికలా ఉంది. అధ్యక్షుని కనులకు దేవతలా, మోహినిలా కనిపించింది. ఈమె నేనా, ఆనాడు మేమనుభవిం చిందికూడా ఈమె నేనా? ఇలాంటిదాని చేతిలో చచ్చిపోతే మాత్రమేం? నిజంగా మోసగించి, ఈ యింద్రభవనం లాటి మందిరంలో ఈ అందాలరాసి చేతుల్లో మరణం ఎందరికి దక్కుతుంది? అసలు ఇంత అందగత్తె మనుష్యులను చంపు తుందా? ఆ మోములో అంత అమాయికత కనుపిస్తుందే! అవంతిని కదిపి కుదుపుతూంది ఈ నందినియేనా? ఛా! ఈమె అలాటి కార్యాలు చేయదు. ఆ చేతులందుకు పనికిరావు. ఆ అందం అంతపని చేయలేదు. నేనేదో భ్రమపడ్డాను. నేనే కాదు. అవంతి అంతా భ్రమకు లోనయ్యింది. ఈ అందాన్ని అనుభవించాక ఇంకా బ్రతకడం దేనికి? ఈ అందం అందు కోకుండా బ్రతకడం దేనికి? అని తనలో తాను వితర్కించు కుంటున్నాడు. అంతలో తిరిగి ఒక్కసారి వాయిద్యాలన్నీ మందరంనుండి పంచమంవరకు మ్రోగాయి. వీణ తగ్గునుండి హెచ్చుకు మెట్లమీద స్వరాలు పలికింది. మృదంగం అలానే కంగు కంగున మ్రోగింది. ఘటంకూడా ఒకసారి సద్దయ్యింది. వేణువు కోవెలలా పలికింది. మ్రోగ గలిగినవన్నీ మ్రోగి, వాటి వాటి స్థాయిల్లోనికి వచ్చి ఆగాయి. చతురిక గొంతు-

వన్నెలు చిన్నెలు - కన్నుల సన్నలు
నిన్ను చూచిరా। నీ కొరకేరా।

ఎన్నినాళ్ళనీ - తెన్నులు చూచుట
చిన్ని మనసులో - వెన్నెల విరసెను
ఎన్నో మారులు - నిన్నే తలచితి
వన్నెకాడ నా - తెన్నుకు రారా। ॥వన్నెలు॥

తరుగని పరువము - తిరుగని మనసును
అరుదుర దొరకుట - తిరుగకు తెరవుల
సరగున పరుగున - సరసకు చేరర।
తిరిగి దొరకదు - తిరిపము కోరెర। ॥వన్నెల॥

ఎవ్వరికీయని - యవ్వన మధువిది
పువ్వులలోనిది - నవ్వులతో నిద
నవ్వరి సేయక - చివ్వున రమ్మనె
నొవ్వనాడితే - అవ్వల దొరకదు ॥వన్నెం॥

పడతుల ఎదలు ఒడబడి పిలచిన
యిడుముల కడలల యెడదతో నీదెడి
పడతులు అరుదుర - నడువుర ముందుకు

వన్నెలు చిన్నెలు - కన్నుల సన్నలు
నిన్ను చూచిరా। - నీ కొరకేరా। ..

పాట కనువైన రీతిలో నాట్యం చేసింది. అధ్యక్షుడు ముగ్ధుడై పోయాడు. 'చాలా బాగుంది సంగినీదేవి! ఇక నీవు నన్ను చంపి వేయవచ్చు' అన్నాడు.

'మీరు నాకు దడుసున్నారు. నేనంటే మీకు భయంగా ఉన్నది. అంతేకదూ?' అంది నందిని.

'నాకు ప్రాణం పోతుందన్న భయం, నేను చచ్చి పోతానన్న భయంలేదు. నాకు చావంటే భయంలేదు. కానీ ఏదో వెరపు నన్ను పిశాచంలా పట్టుకోనుంది. నాకు తెలియదు నందినీదేవీ! నాకు తెలియదు. ఏదో భయం, ఏదో ఆవేదన, అది వదలడంలేదు. వదలదేమో?' అన్నాడు అధ్యక్షుడు.

'దానికి కారణం మీరొనరించిన కార్యాల ఆరాబులు మీ మనసులో పడివుంటాయి. వాటిని మీరు పున్నపాళంగా ఎలానూ వదలించుకోలేరు. ఎలాగూ బాధపడక తప్పదు.' అన్నది నందిని.

'ఏమో! ఏదో! జరుగనీ! ఈ రోజు విచారించలేను. వెళ్ళి వస్తాను నందినీ, వెళ్ళివస్తాను!' అన్నాడు అధ్యక్షుడు బాధగా. అధ్యక్షుని బాధ నందినికి అర్థమైంది. అతడా వ్యథతో మృత్యు భయంతో ఎంతోకాలం బ్రతకడు. నా పేరు సింహస్వప్నమైందాతనిలో. జరుగనీ - ఎన్నాళ్ళు జరుగుతుందో. నిజానికింకా అతనిలోని అసలు బాధ చెప్పకుండా మభ్యపెడుతున్నాడు-అనుకొంది.

అలాగే మెల్లగా నర్తనశాల వదలి అడుగులు వేస్తూ నందిని మందిర ప్రాంగణంలోనికి రాగానే 'ఈ రేయి నా మందిరంలో ఉండి పోగూడదా, తమరు?' అన్నది.

అధ్యక్షుడు తల త్రిప్పి నందిని ముఖంలోనికి చూశాడు.

'ఏమిటలా చూస్తారు?' అన్నది నందిని.

'మనస్ఫూర్తిగా ఆహ్వానిస్తున్నావా?' అన్నాడు.

ఆమె తల ఊపింది 'ఔన'న్నట్లు.

'వస్తాను. ఈ నాడు కాదు. మరొక నాడు' అన్నాడు. అని, 'బ్రతికి ఉంటే - నన్ను నీవు బ్రతకనిస్తే!' అని చర చరా వెళ్ళిపోయాడు. ఆ వేళ్ళ అధ్యక్షుని చూస్తున్న నందినిలో - కాలి మిలకలేసి, పాపం! అధ్యక్షుని గర్వం, అహం, అధికారం అంతా లాగేశాను. ఇంక అధ్యక్షునిలో భయంతప్ప మరొకటిలేదు. అది నిజమైన భయమా లేక నటిస్తూన్నాడా? కొంత నటన ఉంది. కొంత నిజం ఉంది. అందులో నిజం పాలు యెంతో తెలియడంలేదు. తెలుసుకో డానికి ప్రయత్నించాలి. ముసలి నక్కకు పదునులు జారాయి. అధ్యక్షుని ఎలా చేయాలి? ఏం చేయాలి? ఏం చేసినా ప్రయోజనం ఏముంటుంది? లొంగిపోయాడు. లొంగి పోయిన వాణ్ణి; కాదు నాకు జరిగిన అన్యాయానికి కారకుడు. పైగా నన్ను చంపాలని ప్రయత్నించాడు. తప్పదు - నాశనం చేయకలసిందే! మార్గం వెదకాలి. మరో మార్గం చూడాలి. ముగ్గురయ్యారు. ఈ యిద్దరుమాత్రం ఎందుకు మిగలాలి?

అంతలో చతురిక అక్కడకు వచ్చి—

'ఏమమ్మా! వేళ్ళ అధ్యక్షులవారిని అలా పరీక్షగా చూస్తూన్నారు?' అనడిగింది.

'ఏంలేదు చతురికా, నా కక్షనెలా సాధించడం, అని ఆలోచిస్తున్నాను,' అంది నందిని.

'అన్నట్టు యివాళ రణవర్మ దాపుకు చేరదామన్నారు. నా కక్ష?' అంది చతురిక.

'ఆఁ! వెళదాం పద!' అని నాల్గువంకలా చూచింది. ద్వారాల దగ్గర ఆకారాలు కనిపించాయి. 'వీరమల్లూ!' అన్నది. వీరమల్లు ముందుకు వచ్చి నిలచాడు.

'నీవూ, మధూ యింట్లో ఉండి కనిపెట్టుకోనుండండి. మిగిలిన వారిలోనూ అంతా ఉంటారు. నేనొక పదిమందిని తీసుకొని వెళతాను. ఈ రాత్రికి బయలుదేరి, పహారీగడలో ఉంటాను. బహుశా రేపటికి రానేమో! రాకపోతేయేం? మీరుండి, ఎవరు వచ్చినా యింట్లోనే ఉన్నానని, ఆరోగ్యం సరిగాలేదని చెప్పాలి. మీరు మామూలుగానే ఎవరికీ కని పించకుండా ఉండండి. వీరమల్లూ! ఎవరితోనూ తగాయిదా పెట్టుకోకు!' అంది.

వీరమల్లు నవ్వుతూ 'ఇంకా నాకెందుకమ్మా తగదాలు?' అన్నాడు.

నందిని, చతురిక సిప్రా చేరారు రాత్రికి రాత్రి. వీరు వెళ్ళేటప్పటికి నావ సిద్ధంగా ఉంది. ఇద్దరూ నావలోనికి వెళ్ళి కూర్చున్నారు. నావ మెల్లగా బయలుదేరింది. సిప్రా నది దాటింది. నీరుంది కనుక సిప్రానది అడ్డుత్రోవ షుమారుగా క్రోసు క్రోసున్నర ఉంటుంది. అక్కడినుండి ఒక రెండు క్రోసులు నావలోనే అటుగా వెళ్ళాలి పహార్ గడకు వెళ్ళాలంటే. అందుకని నావలో నివారు కోసు మార్గాన్ని ఏటవాలుగా తీసుకుని ప్రయాణం చేస్తారు. ఆ ఒడ్డుకు చేరి నాలుగడుగులు వేస్తే, పహార్ గడ తగులుతుంది. పహార్ గడ కూడా అవంతిలోనిదే - ఒక పల్లె. సిప్రాలో నీరు లేనప్పుడు ఎక్కువగా అంతా అవంతిలోనే ఉంటారు ఆ ఊరువారు. నీరుంటేమాత్రం అంత ఎక్కువగా రాకపోకలుండవు. వత్సరానికి ఆరు మాసాలు నీరుంటుంది సిప్రాలో. తర్వాత అంతా గుట్టలు మెట్టలుగా లంకలు తయారవుతాయి.

నావలోనే మెత్తని ఆసనాలు పడుకోడానికి వీలుగా ఏర్పాటు చేశారు. దానిలో ఒక దానిమీద నందిని వాలుగా

పడుకొని ఉంది. మరో ఆసనమ్మీద చతురిక కూర్చుని ఉంది. ఇద్దరూ ఏమీ మాట్లాడడం లేదు. యిద్దరి ఆలోచనలూ ఒక విషయాన్ని గూర్చి! నందిననుకొంటుంది - చతురిక రణవర్మమీద కక్ష కట్టింది, చంపేసుంది కాబోలు. దాని కక్ష అది తీర్చుకోవాలికదా? తీర్చుకొనీ! ఈ భాగ్యానికి రణవర్మను బ్రతికించడం దేనికి? ప్రొద్దున వచ్చిన వార్తనుబట్టి, రణవర్మ ఆరోగ్యంగా ఉన్నాడు. ఉన్మాదం లేదు. మామూలుగా మాటాడుతున్నాడు. జారినగూళ్ళు బాధపెడుతున్నాయి. ఆ బాధితుణ్ణి చూస్తూ చూస్తూ దగ్గరుండి చంపించాలి—

ఎన్నాళ్ళనాటి పగ ఈ నాటికి తీరబోతూంది. నా ప్రియుని శ్యామసుందరుని యుద్ధానికి పంపి, దొంగచాటుగా చంపేసాడా! గుండె ధైర్యం గలవాడైతే యెదటబడి పోరాలి. నరుకుతాను. ఒకే ఒక బాకుపోటు! చచ్చి స్వర్గానున్న శ్యాముని కలసుకొనీ ఈ దెబ్బతో! - ఇలాగే ఆలోచిస్తూ యిద్దరూ చెరో ఆసనంమీద నిద్రపోయారు. దాదాపు తెల్లవారు జాముకు కొంచం ముందుగా నావ పహార్ గడకు చేరింది. ఓడలోని వారంతా దిగి ఓడను ఒక చెట్టుకు కట్టివేసి రెండు క్షణాలు చూచారు. ఓడ సాగడం లేదని గ్రహించినట్టుగా నందిని లేచి, 'చేరవలసిన చోటుకు చేరామా! మధ్య నేల తగిలిందా?' అంది నందిని.

'చేరామమ్మా!' అన్నారు. చతురికను నిద్రలేపింది. చతురికను తట్టి లేపగానే త్రుళ్ళిపడి లేస్తూ, 'చంపుతాను. ఏమైనా చంపుతాను. తప్పదు,' అంటూ లేచింది.

'ఏం చతురికా! కోలుకొంటున్నావా?' అంది నందిని నవ్వుతూ.

'ఆఁ... లేదు - కాదు,' అంది చతురిక.

ఇద్దరూ కలిసి నావ దిగి, దరికి వచ్చారు. నాలుగడుగులు వేయగానే పొలిమేర తగిలింది. మొత్తం ఊరంతా కలిస్తే వంద ఇళ్లు లేవు. ఒక అంచులో ఒక తోట, ఆ తోటకు చుట్టూ కంచె ఉంది. ఎన్నో ఎకరాల తోట అది. దానిలో దాదాపు పదిళ్ళున్నాయి. ఆ తోటలోనికి దారి తీశారు. వచ్చిన వారిలో తొమ్మిదిమంది, వీరిద్దరున్నూ. ఒకడు నావను చూస్తూ ఒడ్డునున్నాడు. అంతా అతికాయులు. అప్పుడే తూరుపు రేఖలు విచ్చుకుంటున్నాయి.

'చాలా ఆలస్యంగా చేరినట్లున్నాం,' అంది నందిని.

'ఎదురుగాలమ్మా! లేకుంటే యింతసేపు పట్టదు,' అన్నారు.

'సరే,' అన్నది.

ఒకడు ముందుగా పోయి అక్కడ తోటకు కాపున్న వానితో, 'అమ్మగారొస్తున్నది,' అన్నాడు.

వాడు దారికడ్డుగా ఉన్న కఱ్ఱలను తొలగించి దారి ఏర్పరచాడు. రెండు కాగడాలు వచ్చాయి. ఆ వెలుగు లోలోనికి వెళ్ళారంతా. తిరిగి అడ్డుకఱ్ఱలు వేసి ఆ కాపలా వాడక్కడే కూర్చున్నాడు.

వీరంతా లోనికి వెళ్ళగానే—

'రణవర్మను ఏ యింట్లో ఉంచారు?' అన్నది.

'ఆ మూడో యింట్లో,' అన్నారు ఒకరు.

'సరే వెళదాం పద!' అన్నది నందిని.

'రాత్రంతా ఆయనకు నిద్ర లేదమ్మా! గూళ్ళు ఒకటే పోటు. యమ బాధపడి, పడలేక 'విషం ఈయండిరా,

మీలో ఎవరన్నా! అవొచ్చి...' అని నాలుక కరచుకొని, 'మీ రొచ్చినా, ఎటు తిరిగీ చంపడానికేరా!' అన్నారండి. అన్నాడు.

నందిని వాడి తడపాటుకు, తిరిగి మాట మార్పుకు లోలోన నవ్వుకొని—

'అంటే చాలా బాధ పడ్డానన్న మాట.'

'ఆఁ! అవునమ్మా!'

అని ఒక ఇంటి ముందు ఆగి మెల్లగా తలుపు తీశాడు. లోపల రెండు కాగడాలు వెలుగుతున్నాయి. ఆ కాగడాల వెలుతురులో ఆ ఇద్దరూ లోనికి వెళ్ళి చూచారు. రణవర్మ మోము మోముగా లేదు. చాలా వికృతంగా ఉంది. గూడులు రెండూ వాచిపోయి ఉన్నాయి. అతని శరీరమంతా బాగా చిక్కిపోయి ఉంది. గడ్డం, మీసాలూ వికృతంగా ఉన్నాయి.

చతురిక వంక చూచింది నందిని.

చతురిక నందిని వంక చూచింది.

'రా!' అని తల ఊపి వెలికి వచ్చింది నందిని. ఇద్దరూ వెలికి వచ్చారు. అక్కడ కాపున్న మనిషి తలుపు దగ్గరగా వేసి అతడక్కడే కూర్చున్నాడు. 'మిగిలినవారు?' అంది నందిని.

'అంతా ఆ ఆఖరు పెద్దింటిలో ఉన్నారు.'

'కాపు బాగా ఉన్నది కదా?' అన్నది నందిని.

'ఆ! దానికేమమ్మా! వారు కూడా పారిపోవాలని ప్రయత్నించడం లేదు.' అన్నారు వారు.

'మంచిది. నాకు ఎక్కడ?' అన్నది నందిని.

'మీరు ఈ నాలుగో ఇంట్లో ఉండండమ్మా - శుభ్రంగా ఉంచాం.' అన్నారు.

'సరే పద!' అన్నది నందిని.

ఒక ఇంటి ముందు నిలపి తలుపు తీసి వెలికి వచ్చాడు. నందినీ, చతురికా లోనికి వెళ్ళారు. అది పైన ఆకులు - ఆ ఆకుల మీద ఏదో కాలువ ప్రక్క పెరిగే గడ్డి దర్భ పరచి ఉంది. ఒకటే పెద్ద గదిగా ఉన్నట్టు నాలు ప్రక్కలా నాలుగు వెలుగు రావటానికి వీలుగాను, వెలు పలికి వెళ్ళడానికి వీలు లేకుండా ఇనుప కమ్ములు గోడకే కూర్చారు. వాటికి తలుపులు లేవు. రెండు ద్వారాలున్నాయి. ఒక ద్వారం బంధించబడి ఉంది. దానిలో రెండు శయ్యలున్నాయి. ఆ మంచాలకు నార పేని బిగించబడి ఉంది. ఆ నార చాలా మెత్తగా ఉంది. ఒకో గోడకు ఆరుగులున్నాయి. నాలు ప్రక్కలా నాలుగరుగులు, మధ్య ఈ మంచాలు. ఒక మంచం మీద నందిని కూర్చొని 'ఏం చతురికా! ఇంక నీ కార్యమే మిగిలి ఉంది,' అంది. నందిని అన్నమాట విని చతురిక-ఇప్పుడే వెళ్ళి చంప మంటుందా? అని లోలోన అనుకొని,

'అమ్మా! అతనేమిటీ, అలా ఉన్నాడు?' అంది

'చచ్చేవాడు ఎలా ఉంటేనేం? కానీ!' అంది నందిని. నందిని పని గట్టింది. చతురిక చంప లేదు. అలా చంప గలిగినదైతే అతన్ని చూడగానే ఆవేశం రావాలి. అదీకాక అతడు నిస్సహాయంగా ఉన్నాడు. అలా నిస్సహాయ స్థితిలో ఉన్నవారిని ఎవరూ చంపలేరు. ఇంక రణవర్మ బ్రతికినట్లే! రణవర్మను చతురిక చంపలేదు - అనుకొని నిశ్చయించుకొనే అడిగింది.

'అది కాదమ్మా! అతడా స్థితిలో ఉండగానే చంప మంటారా?' అంది చతురిక.

'నీ ఇష్టం. నీకు ఎప్పుడిష్టమైతే అప్పుడే చంపు' అంది నందిని. తర్వాత చతురిక మాటాడలేదు.

'కాసేపు నిద్ర పోతావులే చతురికా!' అంది

'మీరు?' అంది చతురిక

'నేను కాస్త నడుం వాలుస్తాను' అని ఆ మంచంమీద మేను వాల్చింది. అలా వాల్చిందో లేదో ప్రక్క ఇంటిలో గోల గోలగా ఏడుపులు వినిపించాయి. గబాలున లేచి కూర్చుంది.

'వెలుపలెవరు?' అంది నందిని.

ఒక ఆకారం లోనికి వచ్చింది, 'పిలచారామ్మా?' అంటూ.

'ఆఁ! ఏమిటా గోల? ఏడుపు?' అన్నది.

'రణవర్మ ఇప్పుడే నిద్ర మేల్కొన్నట్టున్నాడు. ఇంతకు ముందుదాకా ఏడ్చి గోలపడి నిద్రపోయాడు. తిరిగి అప్పుడే లేచాడు,' అన్నాడు.

'వెళ్ళి చూద్దాంపద! చతురికా! నీవుకూడా వస్తావా?' అంది.

చతురిక మారాడకుండా లేచింది. ఇద్దరూ కలసి ప్రక్క యింటిలోనికి వెళ్ళారు. రణవర్మ శయ్యామీద నిల్వలేక, లేచి కూర్చోలేక, గోల గోలగా అరుస్తూన్నాడు. నందినీ, చతురికా వెళ్ళి నిల్వగానే, రణవర్మ వారిని చూచి—

'ఒసే నందినీ! ఎందుకు బ్రతికించావే సిప్రాలోపడిన వాణ్ని! చంపడానికేకదా? చంపరాదుటే?' అన్నాడు విసురుగా.

ఆ మాట వినగానే ఒక యీతె గర్భాలున లోనికి వచ్చింది. నందిని దానిని చేతితో పట్టుకొని 'త్వరపడకు' అని రణవర్మ ప్రక్కకు చేరి, రెండు గుళ్ళూ చూచి ఒక గూడుమీద నిదానంగా రాస్తూ, 'రణవర్మా! త్వరపడకు. ఆవేశం తెచ్చుకోకు. నీకు మందులేమీ వేయడంలేదా?' అన్నది. రణవర్మ రోషం తగ్గలేదు.

'వాడెవడో వచ్చి పసరులు రాసి పోతున్నాడు,' అన్నాడు.

'ఆ పసరు రాస్తే బాధ తక్కువగా ఉంటూందా?' అనడిగింది.

'వాడు దాన్ని మర్దన చేయమన్నాడు. ఇక్కడెవడు చేస్తాడు? ఎవడికేమవసరం? చంపడానికి నన్ను బ్రతికించడం దేనికి?' అన్నాడు రణవర్మ.

'పనుంది!' అని, 'ఎక్కడుందా పసరు?' అని వెలుపలి వానినడిగింది. వాడు వచ్చి లోపల ఒక మట్టి పాత్రలో ఉన్న దానిని అక్కడుంచాడు. దానినందుకొని రణవర్మ భుజాలకు రాసి, తన బలంకొలదీ అతనికి బాధ కలుగ కుండా రాయడం మొదలుపెట్టింది. రణవర్మకు హాయిగా ఉంది కాబోలు-'అమ్మా! అమ్మా!' అని మెల్లగా మూలుగు తున్నాడు. క్షణాలయ్యాక రణవర్మ, 'నందినీ! నీ చేతులతో నాకు పరిచర్య చేస్తూన్నావా- కటికవాడు మేకను పెంచిన రీతిగా!' అన్నాడు.

నందిని నవ్వింది. ఆ వేదనలోకూడా ఆ మెకు మోము మీద కెమ్మ ఊరింది. అది చూచి రణవర్మ, 'నందినీ!' అని

ఆమె ముఖంమీది స్వేదబిందువులు తుడుద్దామని చేయి నెత్తబోయి 'అబ్బా!' అని ఊరుకున్నాడు.

నందిని మెల్లగా తన మోమునున్న చెమ్మబొట్లు తుడుచుకొని, తిరిగి మర్దనచేయ మొదలు పెట్టింది.

రణవర్మ 'నందినీదేవీ! చాలు. నీవు నాకు పరిచర్య చేయకు. ఒద్దు నందినీదేవీ-ఒద్దు,' అన్నాడు. అప్పటివరకూ చూస్తూన్న చతురిక ఈ వ్యవహారమంతా చూచి, ఊరుకోలేక ఊరుకోలేక ఊరుకుంటూంది.

నందిని వదలకుండా అలాగే మెల్లగా అదుముతూ ఉంది.

'నందినీదేవీ! నీవు పనులు చేయించుకుందేదానవేగాని చేయవలసినదానవుగాదు. నందినీ! చాలు చాలు నందినీ!' అన్నాడు జాలిగా చూస్తూ.

చతురిక ఊరుకోలేక, గభాలున వెళ్ళి నందినిని తొలగించి, తను మర్దన చేయడం మొదలుపెట్టింది. నందిని 'ఎందుకులే చతురికా!' అంటూనే లేచింది. చతురిక భుజాలు తోముతుంటే ఏమీ మాటాడకుండా అలాగే ఊ(కొడుతూ కళ్ళు మూసుకొని పడుకున్నాడు. నందిని ప్రక్కనే కూర్చుంది. చతురిక పరిచర్య చేస్తూంది.

తెల్లగా తెల్లవారింది. నందినికి పాలు తెచ్చి యిచ్చారు. చతురికకుకూడా ప్రక్కనుంచారు. చతురిక ఏదో ఆలోచిస్తూ అతని బుజాలు రాస్తూంది. రణవర్మకుకూడా పాలుతెచ్చి ఇచ్చారు. నందిని ముఖం కడుక్కుంది లేచి వెళ్ళి.

రణవర్మ 'వెళ్లు-నీవూ వెళ్ళు' అన్నాడు కళ్ళు మూసుకొనే-

'నీవుకూడా లే రణవర్మా!' అన్నది నందిని.

అంత బాధలోనూ రణవర్మ చిరునవ్వు నవ్వి, 'నందినీదేవీ! నిన్ను నేనరం చేసుకోలేక పోతున్నాను. నేను నీచుణ్ణి, చండాలుణ్ణి, నిన్ను సార్వనాశనం చేసినవాణ్ణి! నన్ను చంపాలని, నీపగ తీర్చుకోవాలనే నా అభిప్రాయం. నేను కాదనను. హాయిగా ఆ పని చెయ్యి. నన్ను బ్రతికించి, బాగుచేసి చంపడం దేనికి?' అన్నాడు.

'అవసరం లేనిదే నేనే పనీ చేయను. నీవు ఎంత పాపం చేసినా, ఎంత అపకారం జరిపినా నీకు తెలియకుండా ఒక మేలు చేశావు. మరో మేలు చేయాలనున్నది. అందుకు బ్రతికిస్తున్నాను. చావడం ఎలానూ తప్పదు. నేనూ చస్తాను గదా? మంచిచేసి తర్వాత చావు!' అంది.

'నావల్ల మంచికాదు. కానీ! నీవు చేయిస్తానంటున్నావు- చేస్తాను. ఒకటి. నీ కొప్పు పట్టుకొని వెలికి లాక్కు వెళ్ళిన నన్ను, ఆ చేతులకు పరిచర్య చేయ సంకల్పించావు. అది సామాన్యులు చేయగలిగిన పనిగాదు. నేను ఒకవేళ బ్రతికినా చచ్చిన వారిలో జమ-బ్రతికి ఉన్నాను, అంటే ఆ రణవర్మగా గాదు-రెండవ రణవర్మగా!' అన్నాడు.

'ఆరోగ్యం శరీరాన్ని మారుసుంది. పశ్చాత్తాపం మనస్సును మారుస్తుంది. నిజంగా నీవు ఆత్మను లయగలిపి పశ్చాత్తాపపడితే ఇంక కావలసిన దేముంది? రెండో జన్మ క్రిందలెక్క' అన్నది నందిని. రణవర్మ దాపుకు జరిగి 'చతురికా పట్టు; రణవర్మా కాస్త లే!' అంది.

రణవర్మ ఏమీ మాటాడలేదు. మెల్లగా అతన్ని లేపి ప్రక్క మీద కూర్చుండ చేశారు.

'వీరమల్లు ఇంత బలమైన గాయాలు చేశాడా?' అన్నది నందిని రణవర్మ వంకకు చూస్తూ-

'చేస్తే చేశాడు. నిజం తెలియక క్రూరంగా ఉన్న ఒకణ్ణి ఈ మాత్రం శిక్ష చెప్పి బాగుపరచడం అవసరం' అన్నాడు రణవర్మ.

'వీరమల్లుమీద నీకు కోపం లేదా?' అనడిగింది నందిని.

'ఎందుకుండాలి? వాడు వీరుడు. చాలా చాకచక్యంగా పోరగలిగినవాడు. మంచి మల్లుడు. వాడి మీద కోపం ఎందుకు? ఓడిపోయాననా? నాకన్న వీరునితో ఓడితే ఏం? వాడు దొంగచాటుగా ఓడించలేదు. నిజాయితీగా నిలచి వోడించాడు' అన్నాడు రణవర్మ—

'రణవర్మా! నీవు కావాలని మాటాడుతున్నావా? లేక నీలో నిజంగా మార్పు వచ్చిందా?'

'నన్ను నమ్మకండి నందినీదేవీ! నా మాటలూ నమ్మకండి. నాలో మార్పు రాలేదనుకోండి.'

'అదికాదు రణవర్మా!' అన్నది ఏదో అడగాలని.

'ఏమీ వద్దు నందినీదేవీ! ఏమీవద్దు! నేను బోళా మనిషిని' అన్నాడు. నందినికి చాలాకాలం క్రితం దేవళంలోని సంఘటన తలపులో కదలి నిజంగా నీవు బోళా మనిషి వే-కాకుంటే సవానికి నీలో రహస్యాలు దాచుకోకుండా పైకెలమీదకి తెచ్చుకుంటావా?-అనుకుని 'చతురికా! నీళ్ళు ఈయవే!' అంది. చతురికకు రణవర్మను అప్పగించింది

రణవర్మకు చేతులూ, ముఖం కడిగింది చతురిక. పాలు త్రాగించింది. అతడు తొణక్కుండా మంచంమ్మీద కూర్చున్నాడు. చతురిక తనుకూడా ముఖం కడుక్కుని తన పాల పాత్ర తను తీసుకొని నందిని ప్రక్కకు చేరింది. చతురికలో రణవర్మ అవస్థ చూస్తున్న కొలదీ ఏదో జాలి కలుగుతూంది.

ఉదయం వైద్యుడు వచ్చాడు. 'ఎలా ఉన్న' దన్నాడు. వారిద్దరూ అక్కడే ఉన్నారు. ఆమె నందిని అని వైద్యునకు తెలియదు. నందిని అంటే దేవతని, ఆమె చేసిన, చేస్తున్న కార్యాలన్నీ తెలుస్తున్నాయి-వింటున్నాడు. అందులో పల్లె వాసి, సన్నకారు వైద్యుడవడంతో చాలా ఊహించు కున్నాడు ఆమెను గూర్చి. అందువల్ల ఆమె నందిని అని ఏమీ సంకోచించలేదు. అతడామెను చూచి కూడా, కాసేపు చేతులు పరికించి, మళ్ళీ ఏవో పసరు యిచ్చి వెళ్ళ బోతుండగా నందిని, 'తాతా!' అన్నది.

'ఏమిటమ్మా! ఏంకావాలి?' అన్నాడు వినయంగానే రణవర్మ మనిషనుకొని.

'అతడెన్నాళ్ళకు బాగు పడతాడు?' అన్నది.

'సరిగ్గా యిచ్చిన మందు సక్రమంగా వాడితే నాలుగైదు రోజులు చాలు. ఈ వారంలో ఈ రోజు మాత్రమేగా మందు రాసింది!' అన్నాడు రణవర్మ బుజం చూస్తూ. ఏదన్నా అంటే అతికాయులు—

'నీకు మందు రాయడం లేదా?' అనడిగింది రణవర్మను నందిని.

'నే నిక్కడ బంధనికదా? నాకెవరు పరిచర్య చేస్తారు? చేయవలసిన అవసరం ఎవరి కుంటుంది? చేయలేదని ఎవరి నడిగేది?' అన్నాడు.

'నిజమే, నేను వెళుతూ చెప్పిపోతాను,' అన్నది.

'ఈ మాత్రం నిల్చు గల్గానంటే మీరా మందును రాయడం వల్లనే. బాధ చాలా తగినట్లుగా ఉంది. ఈ వారంలో నేను పడిన బాధ యమయాతన. అది పగవారికి కూడా వద్దు,' అన్నాడు రణవర్మ దీనంగా చూస్తూ.

'పోనీ చతురికా! నీవు రణవర్మకు పరిచర్య చేస్తూ ఉండ గలవా?' అంది నందిని.

'నేనా ?' అన్నది ఆశ్చర్యంగా వెలవెలబోతూ చతురిక.

'అలా ఒకరు అవసరం కూడా తల్లీ!' అన్నాడు వైద్యుడు.

'నందినీదేవి!' అన్నాడు ఏదో చెప్పాలని రణవర్మ. ముసలి వైద్యుడు గబాలున—

'నువ్వా తల్లీ, నందినీదేవంటే! ఎంత అపచారం చేశాను! వచ్చిన వాణ్ణి చేతులు జోడించ వద్దా? ఎవరో అనుకున్నాను,' అన్నాడు చేతులు జోడిస్తూ ముసలి వైద్యుడు.

'తాతా! అలా అనకు. నీవు పెద్దవాడివి,' అంది నందిని.

'ఏమో తల్లీ! నేను చూడలేనేమో ఈ జన్మలో నిన్నను కున్నాను. నువ్వు అవంతి కొచ్చాక సన్నకారు కెంతో మేలు చేశావు. రోజూ వింటూనే ఉన్నాను నిన్ను గూర్చి-చూడలేదు,' అన్నాడు ముసలి వైద్యుడు ఆమెను తేరి పార చూస్తూ.

'ఆఁ! నాదేముంది, అంతా మీదేగా?' అని ఊరుకుంది. వైద్యుడు కళ్ళప్పగించి అలాగే నిల్చొబడ్డాడు. 'ఏమిటీ రణ వర్మా! నీ వేదో అనబోయినావు?' అనడిగింది.

'ఏం లేదు. ఆమె నెందుకు శ్రమ పెడతావు. ఇక్క-డెవ్వడినైనా చూడమని చెప్పు,' అన్నాడు.

'సరే ఆలోచిద్దాం,' అన్నది నందిని.

'తాతా! రోజూ వచ్చి చూచిపోతూండు. కాస్త మంచి మందులు వాడు. నీకు తర్వాత కావాలంటే తర్వాత- లేదా సాయంత్రం రా, కొంత సొమ్ము యిస్తాను,' అన్నది.

'అయ్యో తల్లీ! నీవు చేసే దానిలో యిూ నొ్వంతు. నీ యిష్టంలే తల్లీ. నాకు సొమ్ముతో ఏమిటి? నీ పేరు విని

వైద్యం మొదలుపెట్టాను,' అని డబ్బు సంగతి-ఎంతా, ఏమి టని అడుగుతుందని, 'వస్తానమ్మా! వస్తాను,' అని వెళ్ళి పోయాడు ముసలి వైద్యుడు నిలువలేక, గాభరాపడు తూను—

చతురిక కొంచం మెత్తబడింది రణవర్మకు సాయపడ డానికి. నందిని మరొకమారు చెబితే ఉండి పోతుంది. రణ వర్మ బాధ ఆమెలో జాలిని రేపింది. అంతే కాకుండా; నందిని పేరు చెప్పగానే వైద్యుడు వైద్యం చేశాడు. ఊరూ వాడా 'నందినిదేవి! నందినిదేవి!' అని కలవరిస్తూంది. ఒక్క నేను నందినీదేవి 'చతురికా! నీవు రణవర్మకు సాయపడు' అని అడిగినా, సంకోచం మాపుతున్నాను. వెంట ఉండే నేనే ఆమె గౌరవాన్ని నిలుపలేకపోతే ఏమనుకుంటారు? అను కొంది చతురిక.

చతురిక పడుతున్న అవస్థ గ్రహించి-

'ఒద్దులేవే చతురికా! ఎవరినైనా చూస్తాములే. బలవంత పరచను' అంది నందిని.

'అది కాదమ్మా! మీరుండమంటే ఉంటాను. నాకేం! మీ మాట మీద సిప్రాలో దూకమన్నా దూకుతానమ్మా! నాకు గావలసింది మీ తృప్తి మాత్రమే,' అంది చతురిక తను జారిపోయిన వైనాన్ని వెలికి రానీయకుండా దాచు కుంటూ.

'కానీలే! ఎవ్వరూ లేకపోతే నువ్వే ఉందువుగాని' అంటుండగా, ఆ నాడు నావలో తీసుకొచ్చిన వారి నంద రినీ దేవి ముందుకు తేవాలని వెంట బెట్టుకొని వస్తున్నారు. వారందరినీ చూచి నందిని లేచి కిటికి వెళ్ళింది. కాళ్ళకూ చేతులకూ సంకెళ్ళు వేసి మెల్లగా నడపించుకొని వచ్చారు కొందరు బంధీలను. అందరూ దాపుకు రాగానే నందిని-

‘వాళ్ళందరికీ సంకెళ్ళు వేశారెందుకు?’ అనడిగింది.

‘లేకుంటే పారిపోరామ్మా!’

‘పోతే పోతారు. వారు మనకు చిక్కి ఒరిగించిన దేమిటి? పారిపోతే తరిగిపోయే దేమిటి? సంకెళ్ళు సడలించండి. ఈనాడు వాళ్ళు అవంతికి వెళ్ళినా ఎలాగూ బ్రతకలేరులే! వదలండి’ అని–

‘ఇదిగో, మీ రందరూ నా బానిసలేం కాదు. ఈ పరగణాలన్నీ మీవే. నాకేం వీటితో ప్రమేయం లేదు. నాకు అధికారం కావాలన్న ఆశ కూడా లేదు. ఇష్టమైతే వీరితో పాటు కలసి మీరు కూడా ఈ భూముల్లో సేద్యం చేసుకొని బ్రతకదలిస్తే బ్రతకండి. మీ పెళ్ళాలు, బిడ్డలను కూడా తెప్పించుకోండి. లేదంటారా హాయిగా అవంతికే వెళ్ళండి. మీ కిన్నాళ్ళు శిక్ష నిచ్చింది అమాయకుడూ, మనసు కోలుపోయి పిచ్చిలో ఉన్నవానిని, మీకు ఏమీ అపకారం చేయనివానిని కట్ట కట్టి నీళ్ళల్లో పారవేశారే– అందుకే మీకీ శిక్ష వేయడం జరిగింది. తిరిగి మీరంతా వెళ్ళి అవంతి అధ్యక్షులతో నేను మిమ్మల్నిక్కడ బంధించానని, నా మనుష్యులిక్కడున్నారని చెపుతారని నాకు తెలుసు. వాళ్ళంతా నా బానిసలుగాదు. మీలాటివాళ్ళే. అధ్యక్షుల అక్రమాలు తెలిసి నా పాల పడిన పశ్చాత్తాప జీవులు, తిండి లేనివారు, పొట్ట కోసం అధ్యక్షు నాజ్ఞను నెరవేర్చిన వారు. అంతే. ఇంతకన్న మీకు నేను చెప్పగలిగింది లేదు. ఈ దేవుడిచ్చిన నేలను దున్నుకొని బ్రతకదలిస్తే ఇక్కడే ఉండి సేద్యం చేసుకోండి. మీకు కొలువు కావాలి, అధ్యక్షులు కావాలంటే హాయిగా వెళ్ళండి.’ అని తనవారి వంక చూచి–

'వాళ్ళందరినీ వదలండి.' అన్నది నందిని

కూర్చున్న రణవర్మ అంతా విని చతురికను పిలిచాడు చూపులతో. చతురిక వచ్చింది. 'నన్ను కొంచెం లేవనెత్త గలవా?' అన్నాడు.

చతురిక మారు మాటాడకుండా అతన్ని లేవనెత్తింది. ఎంత అహంకారంతో కన్నూ మిన్నూ కానకుండా సంచరించిన రణవర్మకేం గతి పట్టింది? నన్నెంతో దాసీదానిలా చూచిన రణవర్మ నన్ను చూచి 'లేవనెత్తగలవా?' అంటున్నాడు-జాలిగా అనుకుంది.

రణవర్మ సరాసరి గడప లోనికి వచ్చి, వారందరినీ చూచాడు. వారందరికీ అందరూ సంకెళ్ళు ఊడదీస్తున్నారు. నందిని రణవర్మవంక చూచింది.

'నందినీదేవీ! నీ ఆశయమేమిటి? ఈ చేతికి చిక్కిన వారందరినీ వదలుతున్నావు. వారంతా రేపు అధ్యక్షునితో చేరి కక్ష కట్టరా?' అనడిగాడు.

'రణవర్మా! మనుషులను బంధించడం చంపడం, నా ధ్యేయం కాదు. అది నా ఆశయాలకు విరుద్ధం. వీరంతా అధ్యక్షునితో చేరతారనా నీ అభిప్రాయం? చేరనీ! చేరి నామీద కక్ష కడితే, ఈసారి చచ్చిపోతారు. మనుష్యులైతే మానవత్వంతో ఉంటారు. పశువులైతే నామీద కత్తికడతారు. నీవరకూ నీవు నన్ను చంపగలవా? తిరిగి అధ్యక్షుని నమ్మగలవా?' అంది నందిని.

'నా విషయం అటుంచు. నేను మనిషినిగాను, పశువును నందినీ పశువును!' అని భోరున ఏడ్వ దొడగొన్నాడు రణవర్మ.

నందిని అతని దాపుకు చేరి, 'నీవింత కష్టపడతావనుకో లేదు రణవర్మా! జరిగినది మరచిపో!' అని అతని కనులు వత్తింది. ఆమెకు తెలుసు-అతని చేతులెత్తి అతని కనులు ఒత్తుకోలేడని.

అక్కడ చేరిన వారందరూ ఆశ్చర్యపోయారు. అందరికీ తెలుసు! నందిని కొప్పు పట్టుకొని వీధదాకా ఈడ్చుకొచ్చిన వాడు ఆ రణవర్మేనని. నందిని తత్వానికి అందరిలోనూ ఆమెమీద వారికి తెలియకుండా అభిప్రాయం పెరిగింది. మంచి రెట్టింపయ్యింది.

'వారందరూ ఒకనాడు నా క్రింది భటులు. ఈ నాడు వారు నామీద కత్తికట్టి, లేవలేని స్థితిలో, నిల్వలేని గతిలో మతి తప్పిన నన్ను నీళ్ళల్లో పారవేశారు. వారికి కృతజ్ఞత, జాలి, హృదయం, ఆలోచనా ఉన్నాయంటావా, నందినీ ' అన్నాడు రణవర్మ.

'అయ్యా! ఒక్కటాలోచించండి. మేము బానిసలలాటి వాళ్ళం. మీకు పిచ్చియెక్కిన మరుక్షణం అధ్యక్షులు మామీది అధికారినన్నారు. వారిమాట వినడంకన్నా చేయగలిగినదేముంది? మా పెళ్ళాం పిల్లలకొరకు మీ కొల్వుల్లో ఉంటున్నాంగదా!' అన్నాడు వాళ్ళలో ఒక బండీ.

'ఎంత బానిస రీతిలో భటుల్లా ఉన్నా, మీకు మీ మర్యాద లేదా? మీ పిల్లాణ్ని చంపమంటే చంపుతారా, మీరు? చెప్పండి?' అంది నందిని.

'స్వవిషయం కాదుకదా, తల్లీ!' అన్నాడు.

'జరిగింది మరచిపోండి! జరగవలసినది ఆలోచించండి! మీ యిష్టం. ఆలోచించుకొని మీ యిష్టంగా బ్రతకండి!' అన్నది నందిని.

ఆమె మాటలకూ చేతలకూ రణవర్మ నివ్వెరబోతున్నాడు. ఎవరినీ అగుపులో ఉంచుకోడంలేదు. అధికారం చలాయించడంలేదు. చేతికి చిక్కిన శత్రువుల నందరినీ వదలివేస్తుందే! అంతకుముందునుండీ అంతా విన్నాడు. నందినీ దేవికి అందరూ వందనం సమర్పిస్తూన్నారు. ఏ ఒక్కరూ ఆమెను కాదనడం లేదు. ఆమె ఎవరో తెలియనివారుకూడా ఆమెకు నమస్కరిస్తున్నారు. ఎలా సంపాదించిందింత గౌరవం? - అనుకున్నాడు.

వారంతా చెట్ల క్రిందకు తమ తమ నెలవులకూ వెళ్ళిపోయారు. నందిని రణవర్మను వెంటబెట్టుకొని లోనికివెళ్ళింది. ఇదంతా చతురిక చూస్తూనే ఉన్నదిగాని, ఆమెలో ఏ భావం రాలేదు. ఏమీ తోచలేదు. నందినిమీద ఆమెకు భక్తి ఉంది. యజమాని అనే గౌరవం ఉంది. ఆత్మీయతా ఉంది. కానీ, ఇంకా ఏదో నందినికి తక్కువ చేశాననుకుంటూంది. అదేదో ఆమెకు తెలియడంలేదు.

ఆ సాయంత్రం నందిని, చతురిక, రణవర్మ అంతా కలసి కూర్చున్నారు. వారిలో వారు, జరిగిన వాటన్నింటిని గూర్చి తర్జనభర్జన పడ్డారు. ఆ తర్వాత రణవర్మ 'తిరిగి నా బుజాలు పోట్లు పేశయ్యింది-వెళ్ళి పడుకుంటాను' అన్నాడు.

'వెళుతూ ఉండండి, వస్తాము' అన్నది నందిని. రణవర్మ నడక సాగించాడు. అతడు వెళ్ళాక-

'చతురికా! నీవు నాల్గు రోజులపాటు ఇక్కడుంటావా? నేను నిన్ను ఉండమనడానికి రెండు కారణాలు-రణవర్మను ఏదో నీ యిచ్ఛవచ్చిన తీరుకు చేర్చు. ఆ తర్వాత ఇక్కడ ఉన్నవారంతా నా వారా? కాదా? అన్నదికూడా తేలిపోతుంది నీవుంటే. కాదంటే నాతోరా !' అన్నది నందిని.

'మీ ఇష్టం!' అంది చతురిక.

'అదికాదే! రణవర్మను నీ చేతులతో చంపుతానన్నావు కదూ! నీకా పనికి ఆటంకంలేదు. నేను కావాలంటే చెప్పి వెళతాను మనవాళ్ళతో. నీ కక్ష తీర్చుకో! రాత్రికి రాత్రే నిశ్రాంతిలో తోయించు. ఏం, నేననేది అర్థమైందా?' అంది నందిని.

చతురిక ఏడుస్తూంది. అది చూచిన నందిని చతురికను దగ్గరకు తీసుకొని—

'ఎందుకే ఏడుస్తావు? ఏమన్నాను?' అంది.

'నిజంగా రణవర్మను నాచేత చంపిస్తారా? చంపమంటారా?' అంది చతురిక.

'ఇందులో అబద్ధమేముంది? చంపు! నీ కోసమేగా రక్షించి ఇంత దూరం చేర్చింది!' అన్నది.

'కసాయి వాడుకూడా తను పెంచిన మేకను చంపలేడు, చంపుతుండగా చూడలేడు' అన్నది చతురిక బాధగా నందిని వంక చూస్తూ—

'అదేమి మాట! ఎందరు కసాయీలు పెంచి సొమ్ము చేసుకోడంలేదు?' అంది నందిని.

'నాకా ధైర్యంలేదు. రణవర్మను చూస్తుంటే జాలి కలుగుతూంది. ఎలాటివాడు ఎలాగయ్యాడు! అతనికా శిక్ష చాలదా? మీ కక్ష తీరిపోయింది. మాకు జరిగిన విధం అతని భార్యకూ జరిగింది. అతనికి పిచ్చి ఎక్కింది. సైన్యాధ్యక్షుడుగా ఉన్న అవంతిలోనే ఖైదీగా ఉన్నాడు. ఎవర్ని చంపాలని చూచాడో వారిచేత రక్షించబడ్డాడు. ఎవరంటే ద్వేషమో, వారి పరిచర్య అవసరమైంది. ప్రొద్దునకు ప్రొద్దున అతడు వీరమల్లును ఎంత పొగడాడో విన్నారుగా! అతని వల్లనే

అతని బుజాలు తోలగాయి. ఐనా అతడు వీరమల్లును తిట్ట లేదు. కోపించలేదు. ఈర్ష్యతో ఒక్క ముక్క అనలేదు. వెలిగారం వేసి కరగిన బంగారంలా, పుటం పెట్టిన తామ్రంలా పరిశుద్ధుడయ్యాడు. అతన్ని చంపమంటారా- అదీ నా చేతులతో?' అన్నది చతురిక-

'ఇంతేనా నీ ధైర్యం? ఇదేనా నీ పట్టుదల?' అంది నందిని.

'నేను అతనికి పరిచర్య చేయగలను. బానిసగా ఊడిగం చేస్తాను. అంతేగాని నా చేతులతో చంపలేను. మీ యిష్టం- ఆ తర్వాత మీరేం చేసుకున్నా.' అన్నది చతురిక.

'నీవన్నట్టు నా కక్షలన్నీ తీర్చుకున్నాను. అతడు ఇంక చచ్చినా, బ్రతికినా నాకనవసరం. నీవు నీ కక్ష తీర్చుకుంటావంటే ఇక్కడకు చేర్చాను. ఇక నీ ఇష్టం' అంది నందిని లేస్తూ.

చతురిక మాటాడకుండా లేచింది. ఇద్దరూ తోటంతా తిరిగి లోనికి వెళ్ళారు. ఆ ఇంట్లో రణవర్మ ఒక్కడూ ఉన్నాడు.

'ఎలా ఉంది రణవర్మా!' అంది నందిని.

'ఎలా ఏముంది? పోట్లు పుడుతుంది' అన్నాడు.

చతురిక మాటాడకుండా పసరు తెచ్చి అతని బుజాలకు రాసి మెల్లిగా పాముతూంది. అతడలా మంచం మీద కూర్చున్నాడు. చతురిక నిలచి బుజాలు తోముతూంది.

'రణవర్మా! నేను వెళ్ళిపోతున్నాను. చతురిక ఉంటుంది. నీకు కావలసినవన్నీ ఏర్పాటు చేస్తుంది, సరేనా?' అన్నది నందిని.

'నన్ను ఎందుకు ఇంత జాగ్రత్తగా బ్రతికిస్తున్నావు నందినీ దేవీ?' అనడిగాడు.

నందిని మారాడకుండా గంభీరత దాల్చింది.

'నన్ను చంపదలచే కదా, ఇంతా చేస్తున్నావు?'

'నీకు ప్రాణాలమీద ఇంకా ఆశలున్నాయా?' అనడిగింది నందిని గంభీరంగానే.

రణవర్మ నవ్వి 'ప్రాణ భయం! అది నా కేనాడూ లేదు. నేను చచ్చిపోయి చాలా కాలమైంది. నందినీదేవి! నిజం చెప్పాలంటే నేను చావడానికే ఇష్టపడుతున్నాను బ్రతకడానికన్న. నా కెంత అన్యాయం జరిగిందో నాకు తెలుసు. కాని అదంతా చేసిన దానికి అనుభవించానన్న తృప్తికూడా కలుగుతుంది. ఆఁ! మళ్ళీ జరిగినవన్నీ నెమరు కెందుకులే! కానీ! నీ ఇష్టం! నీవెలా చేసినా అడ్డేది లేదు. అడ్డేది లేదు అనడంకన్న అడ్డే శక్తిలేని హీనుణ్ణి. అంత కన్న నీకు వివరించలేను,' అని ఊరుకున్నాడు.

సంజె వెళ్ళిపోతూ తన సర్వస్వం చీకటికి అప్పగించింది. చీకటి లోకమ్మీదకు తరుముకొని వచ్చింది.

సిప్రా నది ఒడ్డున పడవ ఆగి ఉంది. చాలా మంది చీకటిలో చీకటిగా వచ్చి నావనెక్కారు. నావలోనికి నందిని వెళ్ళి చతురికను పిలచి-

'చతురికా! నీ వెలాగైనా రణవర్మను మాయచేసి మభ్య పెట్టి ఇక్కడనుండి అతన్ని తీసుకొని మాళవం చేరిపో! నీకు కావలసినదంతా రేపు, ఎల్లుండిలో సమకూరుస్తాను.' అంది.

'అంటే నా కర్థం కావడం లేదు.' అంది చతురిక

'అంతా నాలుగైదు రోజుల్లో అర్థమవుతుంది. ఇంక రణవర్మను నీ కప్పగించాను. నీ ఇష్టం అన్నానుకదా? - నీ ఇష్టం!' అంది నందిని.

'నాకు తలా తోకా తెలియని రీతిలో చెప్పకండమ్మా!' అంది.

'తలా తోకా ఎక్కడుందే? ఉన్న దొక్క తోకే. దాన్ని బట్టుకొని సిప్రానదాటి మాళవం చేరు,' అంది నందిని వ్యంగ్యంగానూ, విసురుగానూ.

చతురిక ఏదో అనబోయింది. 'దిగు దిగు. ఆలస్యమవుతుంది' అని లోనుండి వెలిదాకా లాక్కువచ్చి చతురికను వదలి, 'రణవర్మా! అందరికీ ఒకేధర్మం, ఒకే నీతి- నీ ఇష్టం, నీవు ఎక్కడకు చేరాలన్నా నేను ఆపను. నీ ఇష్టం వచ్చిన చోట, నీ ఇష్టం వచ్చిన రీతిలో నీవు బ్రతకవచ్చు. అవంతి లోనైనా, గతంలోలా సర్వ సైన్యాధ్యక్ష పదవి లోనికైనా సరే!' అంది నందిని. నావ కదలింది. రణవర్మ ఏదో అనాలని చేయి నెత్తాడు. చేయి తిరిగి నొప్పి పట్టింది అఘాటుగా ఎత్తడం వలన. 'అబ్బా!' అన్నాడు. మాట రాలేదు. చతురిక రణవర్మ బుజమ్మీద చేయి వైచింది మెల్లగా పాముడానికి. క్షణం విల విలలాడి తెప్పరిల్లాడు రణవర్మ. అంతలో నావ నీటిలోనికి వెళ్ళిపోయింది. చీకటిలో చీకటిగా రణవర్మా, చతురిక లిద్దరూ మెల్లగా అడుగులు వేసుకుంటూ కనుచూపులో కనిపిస్తున్న తోటలోనికి దారి తీశారు.

ఇద్దరి హృదయాల్లో ఏదో బాధా, ఆ బాధను మించిన తృప్తీ!

రణవర్మకు బ్రతికానని బాధ, నందిని ఎంత మంచిదీ అన్న ఆలోచనలో తృప్తి.

చతురికకు అమ్మగారి మాటలేమిటి? అన్న బాధ, రణవర్మను చంపలేనని కచ్చితంగా చెప్పాను కదాన్న తృప్తి.

ఆ బాధలు తొలగి, ఆ తృప్తి మిగిలిపోతే వారు దేవతలవుతారో ఇంకా ఎక్కువైన వారవుతారో ఎవరూహించగలరు? చతురిక క్షమించగలననుకున్నదా? రణవర్మ బ్రతుకు తాననుకున్నాడా, సిప్రా దాటక ముందు? నదికి అటూ ఇటూలో ఎంత తేడా ఉంది. జీవితమూ అంతే!

# 15

అవంతిలో అల్లకల్లోలాలు బయలుదేరాయని చాలా మందికి తెలిసిపోయింది. గణసత్తాక రాజ్యాలలో బలమైనది అవంతి. అది బలహీనమైనదని ప్రక్కనున్న ఏకసత్తాక రాజ్యాలు తెలుసుకున్నాయి. అవసరంకోసం కాచుకున్న నియంతలైన రాజుల చూపులన్నీ పడినాయి కానీ, గణసత్తాకలన్నీ కలసిపోతాయని చాలామంది సామంతులూరుకున్నారు. మాళవ రాజైన స్కంధగుప్తుని సామంతుడుగా ఉంటున్న మహాకోసలేశ్వరుడు అవంతి తన దాపునున్నదని, బాగా వీలుగా ఉన్నదని కబళించ తలచాడు. అతని కెన్నాళ్ళనుండో ఈ కోరికున్నది. కానీ, వీలుపడలేదు. ఆ తర్వాత అతని తనయుని పాలనలోనూ ఆ కోరిక తండ్రికున్నదని విన్నాడు. తన పెత్తనం వచ్చే నాటికి మాళవంలో రాజకీయాలు చాలా మారాయి. స్కంధగుప్తుడు బలహీనుడైనాడు. అతని రాజధానిలో అతను నిల్వడానికికూడా వీలుగాని రీతిగా, ఆ నాటి హూణులు చిన్న చిన్న రాజులను నాశనం చేసి సింహాసనాలు దక్కించుకొంటూ దాదాపు మాళవానికి కూడా చేటు తెచ్చే స్థితిలో ఉన్నారు. అటు నేపాళంనుండి కొందరూ, ఇటు సౌరాష్ట్రంనుండా కొందరూ వచ్చి స్కంధగుప్తుని సామంతులను బలహీనపరచి వారి వారి

బలాలను నిలుపుకొంటున్నారు. ఈలోగా సామంతులు వారిలోవారు తగాదాలు పెంచుకొని, అనుపులోనికి తేలేని రాజనిపించారు. అంతకుముందు తన భుజబలాన్ని హూణులకు రుచి చూపినా స్కంధగుప్తుడు వృద్ధాప్యంలో ఉండడంవల్ల, సామంతులుకూడా కుట్రదారులతో కలవడం వలనా హూణులను ఎదిరించలేకపోయినాడు. ఆ బలహీనతనే అదనుగా తీసుకొని కుట్రలు సాగించారు సామంతులు. వారిలోనివాడే మహాకోసలేసుడొకడు. కాచియున్న కాలం రానేవచ్చిందని, అతడు తన చేత ఉన్న రెండువేల బలాన్ని వెంటబెట్టుకొని, చెప్పాపెట్టకుండా అవంతిలోన జొరబడి, అందినవారినందిన రీతిగా నరికివేశాడు. అది హఠాత్ సంఘటన కావడంవల్ల ఏమీ జాగ్రత్తలుకూడా తీసుకోలేదు అవంతివారు.

కోసలేశుని ఎదిర్చేవారు లేకపోయారు. అనుభవంలేని జయచంద్రుడు అడ్డుకోలేకపోయినాడు. కానీ, సాధ్యమైనంతవరకూ పోరుకాడి ప్రాణాలు కోలుపోయాడు. జనసత్తాక రాజ్యం కాబట్టి, వచ్చింది రెండువేల బలం కాబట్టి, పౌరులు ఎదిర్చి పోరాడారు. ఏం పోరి ఏం ప్రయోజనం? అవంతి దక్కలేదు.

అధ్యక్షుడు పొలిమేరలో ఈ పోరు తెలియగనే, నందిని యింటికి వెళ్ళాడు నందినితో మాటాడాలని. ఆడదాన్ని - నేను చేయగలిగింది లేదన్నది. అయినా ప్రయత్నిస్తానని, పహార్గడకు కబురు పంపి నావలన్నింటినీ అక్కడకు పంపింది. వారు వచ్చినా సాయంత్రానికి రావచ్చు. సరే కానీ!- అనుకొన్నది. అధ్యక్షుడు నందినితో మాటాడి రాజ వీధిని వెళ్ళుతుండగానే కోసల సైనికులు అతడే అధ్యక్షుడని తెలిసి, నడి వీధిలో నరికిపారవేశారు. ముసలి అధ్యక్షుడు

అసువులు బాశాడు. అందరినీ బంధించాడవంతి కారాగారంలోనే. బంధించి కోసలేశుడు సైన్యంతో, ఉన్నతులైనవారి యిళ్ళన్నీ కొల్లగొట్టి, నందిని మందిరానికి కూడా వెళ్ళాడు.

ఆ రోజుల్లో నందిని దగ్గర వజ్రాల హారం, రత్నాల విషయం చెప్పుకున్నారు. ఆ సంగతి తళుక్కున మెరసింది. తన మెడలోని వజ్రాలహారం చూచుకున్నాడు. దానిలో పొదగబడిన రత్నాలు రెండు. అలాటివే ఈమె దగ్గర, అంటే ఈ మందిరంలో పది ఉన్నాయి. ఈమె చాలా ధనవంతురాలు. ఈ చుట్టుపట్ల యింత అందగత్తెగాని, యింత ధనవంతురాలుగాని లేదు. సరే చూస్తాను, ముందు మాటలతో. తర్వాత నా పని నేను మొదలెడుతాను- అనుకున్నాడు.

వీధి ద్వారంలో. తన సైన్యాన్నంతా యింటిచుట్టూ కాపుంచాడు. కవచంలో ఉన్న హారాన్ని వెలికి వేసుకున్నాడు. తన సేనానిని వెంటబెట్టుకొని లోనికి వెళ్ళాడు. ముందుగా ఎదురయ్యింది మధూలిక. నందిని తీసుకోవలసిన జాగ్రత్తలన్నీ ముందే తీసుకుంది. వీరమల్లుకూ, మిగిలిన వారికీ చేయవలసిన రీతినంతా చెప్పింది. అవసరమైతే నా రక్షణ విషయం వదలి మీ మీ రక్షణలో ఉండండి- అని తన నగలు, వజ్రాలు, రత్నాలూ ఉంచి మిగిలిన ధనాన్ని, ఖరీదైన సామగ్రినంతా సిప్రా దాటించింది. ఈ నగలూ నాణ్యాలూ కొనేవారు లేరు. కాబట్టి అమ్మ చూపలేం-ఆశజూపి ప్రాణాలు నిలుపుకో వచ్చని నందిని భావం-అల్లకల్లోల మవుతున్న అవంతి స్థితికి చాలా విచారించింది. సగం తన వల్లనే అవంతికీ గతి పట్టిందన్న భావం ఆమెకూ వచ్చింది. తన కక్షవలన అవంతి నాశనమైంది.తనూ నాశనం కాబోతూంది.

కడసారి ప్రయత్నం కూడా చేద్దామని ఆశతో ఉంది. ఇంత అవంతి, ఇంత జనం నాశనమయ్యాక తను ఒక్కతే పారిపోవడానికి ఆమెకు మనస్సు ఒప్పలేదు. లేకుంటే ఏ నావలో ఎలా సిప్రా దాటినా హాయిగా బ్రతికిపోవచ్చు. కానీ,ఆమెకా ఆశ లేదు. అసలా కోరిక రానే రాలేదు. అవంతి అధ్యక్షుని మరణవార్త విని, చాలా చింతించింది. ఏం చింతించి ఏం ప్రయోజనం-అంతా ముగిశాకనని ఊరుకుంది. వారు రావడం చూచింది. సేన ఎలా కాపున్నదీ చూచుకుంది. మధూలిక వారిద్దరనూ వెంటబెట్టుకొని మందిరోపరితలానికి వచ్చింది. వచ్చి-

'అమ్మగారూ! అమ్మగారూ! కోసలేశులు మిమ్ము చూడ వచ్చారు,' అంది.

అది విని నందిని లేని నగవు తెచ్చుకొని, 'లోపలకు తీసుకురావే! మనయింట గౌరవస్తులు నిలిచి, మాటాడవలసిన పనేమిటి?' అని తెర తొలగించి వెలికిచూచి, 'వెంట బెట్టుకొనే వచ్చావా? మంచిపని చేశావు,' అన్నది.

యువక కోసలేశుడు సంభ్రమించి పోయినాడు. అతని కనులను అతను నమ్మలేక పోయినాడు. అతడంత అందగత్తెను అంతకు ముందెన్నడూ చూడలేదు. అసలు లేరు. అందువల్లనే నందిని ఆనాడు అందగత్తెగా నిలచింది. ఆమెను మించిన అందగత్తెలుంటే ఆమె పేరెందుకు వస్తుంది? కోసలేశుడు పడిన దిగ్భ్రమ చూచింది నందిని. పరవాలేదు- పూర్తిగా అందం తెలియని, రసికత తెలియని వాడుకాదు, అనుకొని-

'రండి. ప్రభువులు మీకే ఆటంకమూ లేదు,' అన్నది.

సేనాపతి అందుకొన్నాడు అంతలో—

'వారు మహా కోసలేశ్వరులు. మీకు తెలియదేమో- అవంతిని ఏకసత్తాకం చేయ నిశ్చయించి ఉదయం ఆక్రమించుకొని అవంతీశులుకూడా ఐనారు,' అన్నాడు.

ఓరి తొత్తా! అని లోలోన అనుకొని-

'ఎవరు ఏలికలైనా, ఎవరి పాలన మారినా - అవంతి ఏకసత్తాక ఐనా, జన సత్తాక అయినా నాకేమిటి? రాజరికాల జోలి నాకేల? ఎందరో రాజులు ఈ ధర నేలారు. ఇంకా ఎందరోఏలతారు. నేను వేశ్యను. నా యిల్లు కొల్లగొట్టరుగదా? ఎందుకంటారేమో- ఎవరు ప్రభులైతే వారి సేవ చేస్తాను. అది సేవా ధర్మం. నాకు సౌమ్ము వెచ్చించగల వారందరికీ నేను సౌఖ్యం యిస్తాను. ఎవరో కటికవారు, రాక్షస ప్రవృత్తులూ వచ్చి బలవంత పరుస్తారా- లొంగిపోతాను. నీచు నీచంగా వాడుకుంటారు. కోసలేశునిలాటి మహాప్రభులు వెలయిచ్చి వెలయాలిని అంటుతారు. దేవాలయాన్ని, వెలయాలిని హూణులు తప్ప మరొకరు నాశనం చేయరుకదా? అంతగా మించివస్తే నా ధనం లాక్కొని నన్ను దేశ బహిష్కారం జరుపుతారు. అవంతి కాకపోతే కోసలం, కోసలం కాకపోతే కౌశాంబి- అదీ కాదా మరో ఊరు. నేనిలా బ్రతకవలసిన దాననే. నాకేమిటి?' అన్నది చాలా నిర్లక్ష్యంగా.

సేనాపతికి, కోసలేశునికీ తల తిరిగి పోయింది. ఆ వాగ్ధాటి ముందు ఏం చేయాలో తోచక క్షణం ప్రాన్పడి పోయారు.

'రండి ప్రభూ! అలా నిలచి పోయారేం. నా యింటిలో అందరికీ స్వతంత్రత ఉంది. మీరు పెరవారా? ఈ రోజు అవంతి పాలకులనికూడా అంటున్నారు. నా మీద మీకు సర్వాధికారాలూ ఉన్నాయి. ఏ క్షణం అవంతి మీదయిందో ఆ క్షణం నేనూ మీ దాసురాలనయ్యాను' అన్నది నందిని.

ఆ ఊపిరి సలపని ధోరణికి ఆశ్చర్య పోతూనే, 'నీ వింత త్వరగా లొంగుతా వనుకో లేదు. నేనేదో అనుకొని వచ్చాను,' అన్నాడు.

నందిని నవ్వి, 'అదంతా వ్యాపారపు బెట్టు. ఆ బెట్టు మీదగర చేసే నరికి ప్రోగులు పోయరా? అదీకాక మీరు ప్రభువులు, నేను వెలయాలిని కాదా?' అంది నందిని.

'సరే! ఈ రేయి నీయింట ఉంటాం. ప్రొద్దు వాలాక వస్తాం! మిగులున్న మందిరాలు శోధించాలి' అన్నాడు కోసలేశుడు సాధికారంగా.

'చిత్తం! ఆ చిన్ని కార్యాలకు తమరే వెళ్లాలా? తమ సేనాపతులు చాలరూ?' అంది.

'కాదు, స్వయంగా- కార్యాచరణ మా విధిగా ఎంచుతాం!' అన్నాడు కోసలేశుడు. అతనికీ కదల బుద్ధి కాలేదు నందినిని చూచాక.

'మహా! అలా చూస్తావేమే. ప్రభువులకు పానీయం సమకూర్చు. రండి ప్రభూ! కొంచం సేదదీరి వెడుదురుగాని. అలా కూర్చోకుండా వెళితే నన్నవమానించినట్లుగా బాధ పడతాను' అన్నది నందిని చూపుల అస్త్రం ప్రయోగించి.

కోసలేశుడు అడుగు వేయలేక పోయినాడు. ఆడదానిలో ఆ శక్తి ఉన్నంత కాలం ఈ మగజాతులు అల్లల్లాడి పోక తప్పదు. ఆ అస్త్ర ప్రయోగం ఎప్పుడు ప్రయోగించాలో తెలిసి ఉండాలి. అన్ని చోట్లా ప్రయోగించిన వారు తేలికవుతారు. వానిని సక్రమంగా వినియోగించిన వారు నందినిలా రాణిస్తారు.

కోసలేశుడు లోనికివచ్చి ఆసనాన్నలంకరించాడు. సేనాపతి వెలుపల కాపు నిలుచున్నాడు. మంచి ద్రాక్షరసం

తెచ్చింది మధూలిక! సేనాపతి మధూలికను ఓరగా, వారగా చూచాడు, ఆమె వెనుక ఉన్న బలగం అతనికి తెలియక. ఆమె ఒంటిమీద చేయిపడిన మరుక్షణం రెండూ, రెండూ నాలుగు కబంధ హస్తాలు-రెండు జయసింహునివీ, రెండు వీరమల్లునివీ ఏ క్షణాన్నైనా పడతాయి. రెండు తప్పినా, రెండు తప్పవు. ఆ సంగతి అతనికి తెలియడంలేదు. తెలియడం ఎంత సేపు.

నందిని కాచిన ద్రాక్షాసవం అందించింది. కోసలేంద్రుడు త్రాగాడు. చూపులతో కట్టివేసింది. ఆ తర్వాత మాటా పలుకూ లేకుండా కొంతసేపున్నాడు. ఎంత కాలమైనా, ఎన్ని జాములైనా ఆడా మగా కలసి ఉంటే కాలం సంగతి తెలియదు.

ప్రొద్దు పోయింది. సూర్యుడస్తమించాడు. చీకటి ఆక్రమించింది. నందిని మందిరంలో దివ్వెలు వెలిగించారు. నందిని మాటల్లో పెట్టింది. అవి రాజ్యాల విషయం కాదు. వ్యాపారాలు, వజ్రాలు, నగలు, నగిషీలు!

మధూలిక వచ్చింది. 'అంతా సిద్ధమైందమ్మా! చతురిక కూడా వచ్చింది,' అంది. నందిని చాలా సంతోషపడింది. 'సరే! అంతా ఏర్పాటు చేయించు' అంది నందిని.

కోసలేశుడు 'ఏమిటన్నాడు?'

'ఏముంది ప్రభూ! అతిథి సత్కారానికి కావలసినవి. గొప్ప వారు వచ్చినప్పుడు, గొప్పగా ఉండాలి కదా! తమరు స్నానం చేయడానికి సిద్ధం కండి.' అన్నది. కోసలేశుడు 'ఆఁ! అలాగే' అన్నాడు.

'మధూ! ప్రభువులవారి సేనాపతులను పిలు' అన్నది.

'అతడెందుకు?' అన్నాడు.

'తమ ఉడుపులు, శిరస్త్రాణం, తమ వస్తువులు చూస్తూ ఉండవద్దా!' అన్నది.

'ఆఁ! ఎందుకు-ఇక్కడ ఉండవా?' అన్నాడు.

'ఉంటాయి. అయినా మీ సేనాని మీ సంపత్తిని కాస్తూ ఉండాలికదా?' అన్నది నందిని. క్రిందికి వచ్చి స్నాన పానీయాలన్నీ అయ్యాక, తిరిగి మిద్దె మీదికి శయన మందిరానికి వచ్చారు ప్రభువులు. ఈ లోగా కోసలేశుని స్నానం వేళ నందిని వీరమల్లుతో కొన్ని క్షణాలు మాటాడి వచ్చింది. చతురికతోనూ మాటాడింది.

మందిరం పైకి రాగానే నందిని వీణ తీసుకొని వాయించడం మొదలు పెట్టింది. అప్పటికి మందిరంలో సగం కునుకులో ఉన్నారు.

ఊరంతా నందినిని తిట్టిపోసి అలసిపోయి నిద్ర పోతోంది. అది వేశ్య! కులట! దానికేం- అవంతి నాశనమైంది. అది కోసలేశుని వలలో వేసుకొని ఆనందంలో ముంచి అతనితో ఉంటుంది. అవంతి అధ్యక్షుడున్నంత కాలం అతనితో, అతడు చచ్చిన మరుక్షణం ఈతనితో, దానికి నీతేమిటి? న్యాయమేమిటి? గుండెలు తీసిన బంటు!- ఇలాగే ఆమెను ఆడిపోసుకోని నోరు లేదు. ఊళ్ళో అందరి సొమ్ము కొల్లగొట్టారు. ఏ చిట్కా వేసిందో కోసలేశుడు లొంగిపోయాడు- వారిష్ట మొచ్చిన రీతిలో వారు మాటాడుకున్నారు. ప్రజలో పరాభనానలం పెచ్చరిల్లి పోయింది, తమ శత్రువును తన ఇంట ఉంచినందుకు ఆమె మీద.

నందిని కిదేమీ పట్టనట్టు, వీణ వాయిస్తోంది లయగా. దూరాన ఉన్న ఒక గోడ మీదకు వంగి వెలికి చూస్తూ చతురిక పాటనందుకుంది-

పసిడి పంజరమందు
పవళించు రాచిలుక
వ్యసనాల మోజులో
వసివాడి సమసేవు!

తెల్లవారదు నీకు లోకం!
నిజముగా—
కళ్ళు మూసిన చాలు శోకం!

మధువు మీదాశతో
ఉదరాన తుమ్మెదా!
ఉదయమాయే వరకు
ఒదిగుందువా! నీవు?

తెల్లవారుట నీకు నాస్తి!
అలిమెదలో—
నల్లపూసలకింక వ్యస్తి!

నీలి మేఘాలపై
నిదురించు జాబిలీ!
తేలిపోబోకోయి
కాలమది తిరగేను

తెల్లవారిన లేదు రూపం!
యోచించు—
నల్ల మబ్బులదోయి లోపం!

రేరాజా రాకతో
రెక్కవిచ్చే కలువ!
ఈ రాజా ఈ రేయి
ఇట్టె మాయంబగును
తెల్లవారిన నీకు లేదే!
నీ సొగసు—
కల్లకానిది నాదు వాదే!

వీణ ఆగింది. ఆ చతురిక పాడే పాటకూడా ఆగింది. కోసలేంద్రుడు—

'ఎవరా, పాడినది?' అన్నాడు.

'నా చెలికత్తె చతురిక.' అన్నది నందిని.

'చాలా బావుంది, కదూ?' అన్నాడు.

'ఏం బాగు? రోజూ ఆ పాటే! ఆ కాలువను, చంద్రుని, తుమ్మెదలను, ఆ దొడ్లో ఉన్న కాసారాన్నీ చూస్తూ పాడుతుంది,' అంది నందిని.

'ఏమైనా కానీ!' అని నందినికి దాపుగా జరిగాడు. చేయి పట్టుకోబోయాడు.

మెల్లగా, చల్లగా, వయ్యారంగా, వాలుగా తప్పుకుంటూ, 'నా లాంఛనం?' అంది వాలుచూపును, చిరునవ్వును జత పరచి.

'ఏం కావాలి?' అని అడిగాడు కోసలేశుడు చిరునవ్వుతో.

'మీ దయ! అడగడం నా కులధర్మం!' అంది. అతడు గుండె తడవి చూచుకున్నాడు. మెళ్ళో వజ్రాల హారం

కనిపించింది. ఇది యిస్తే! ఆఁ మంచిది. ఇది యిచ్చి మొత్తం పట్టుకొని పోతాను-అనుకొని...

'నీకేమీయగలను! ఈ హారమా? నీనికన్నా విలువైనవి నీవద్ద ఉన్నాయని విన్నాను!' అన్నాడు ఏమంటుందోనని.

'నా దగ్గర ఉన్నది ఒక వజ్రాల హారమేం? రత్నాలు ఉన్నాయి. అన్నట్టు మీకు చూపలేదుకదూ! మందమతిని!' అని అడ్డుగా ఉన్న తెర తొలగించి, ఒక చందనపు మందసంలోని దంతపు పేటికను తెరచింది. అందులో పది రత్నాలు, వజ్రాల హారం, మరో ముత్యాల దండ ఉన్నాయి. అతని కళ్ళు కుట్టాయి. ఈ పూట యిద్దాం. రేపు మొత్తం తీసుకుందాం- అనుకున్నాడు. తన మెడ లోనిది కూడా ఆ పేటికలో జారవిడిచాడు. ఆమె పేటికను మూసి మందసంలో పెట్టి మందసంపై మూత వేసింది.

'నీకు తృప్తిగా ఉందా, ఆ కానుక?' అనడిగాడు కోసలేశుడు.

'అవన్నీ లాంఛనప్రాయాలు' అని అతనికి దాపుగా జరిగింది. ఇద్దరూ శయ్యమీదికి చేరారు. తిరిగి సందిని లేచి, తెరలు దించి, దివ్వెలన్నీ ఆర్పి ఒక దివ్వె మిగిల్చి వచ్చి శయ్యపై చేరింది. నందిని వెళ్ళడం రావడం అంతా గమనించాడు. హారమిచ్చి ఆ పేటికను చూచిన దగ్గరనుండి అతని కనులు, మనస్సు దానిమీదే ఉన్నాయి. నందిని తన శరీరం విషయం, కామం విషయం, ఆ సుంకం విషయాన్నీ వదలి వేసింది. ఏదో దాహం తీర్చుకున్నట్టు, భోజనం చేసినట్టుగా ఆ కార్యానికి విలువ నిచ్చేదికాదు. ఒకసారి చెడ్డాక ఈ తనువు ఎంత చెడితేనేం? అనుకుంది. అందులోనూ జయదేవునికీయ దొరకొన్న తన పవిత్ర హృదయంలో-ఈ కాయం వీరు మలిన పరచారు. దీనినిక జయదేవుడు తప్ప మిగిలిన

వారి కిందరికైనా ఈయవలసిందే. అసలది తనువు అన్న అభిప్రాయం ఆమెకు లేదు. ఏదో భోగవస్తువు. అనుభవిస్తుంటారు. వెళ్ళిపోతుంటారు. ఈ కార్యంయొక్క పవిత్రత ను ఏనాడో తెంచి వేసింది. అందుకే కౌశాంబిలో ఒక కాముకునికి, ఆ తర్వాత అవంతిలో అధ్యక్షునకు-రణవర్మ రాధానాధులు మ్రొక్కలేదు గాని, మ్రొక్కివున్నట్లయితే వారికికూడా తిరిగి తన కాయాన్ని అప్పగించేదే.

అద్దమరేయి లోకం అంతా నిద్రపోతూంది. దూరాన గుఱ్ఱాల సకిలింపులు కీచురాళ్ళ ధ్వనిని భ్రమింగాయి. ఆ ధ్వనే సిప్రా హోరును వినరానీయడం లేదు. మధ్యమధ్య ఆకులు కలకలమని సద్దు చేస్తున్నాయి.

కోసలేశునికి నిద్రాభంగ మయ్యింది. అసలు అతడు నిద్రపోలేదు. అతని మనస్సంతా ఆ దంతపు పేటిక మీదనే ఉన్నది. ప్రక్కకుచూచాడు. నందిని నిద్రపోతూంది అమాయకంగా. నిద్రలోనూ ఎంతఅందంగా ఉంది! అనుకున్నాడు. మెల్లగా సద్దుసేయకుండా లేచాడు. మెల్లగా తెర తొలగించాడు. మందసం దాపుకు వెళ్ళి మందసం తెరచాడు. అందులోని దందపు పేటిక తీశాడు. తెరచాడు. అందులో ఏమీ లేవు. తిరిగి మందసం లోనికి చూచాడు. మరో దంతపు పేటిక ఉంది. దానిని తీసి చూచాడు. అందులోనూ ఏమీ లేవు. మందసమంతా వెదకాడు - మోసగించింది. అమ్మా! అవంతి వెలయాలు! దీని సంగతి తెల్లవారనీ చూస్తాను. తెచ్చి యిచ్చేవరకూ ఒకో ముక్క నరుకుతాను. అనుమానించినంత పనీ జరిగింది. ఐనా అది లేవలేదే, నా దగ్గరనుండి! ఆ దాసీగి తీసిందేమో! తెల్లవారనీ చెపుతాను వేశ్యా! అని లోలోన బూతులు తిట్టుకొని, మెల్లగా పిల్లిలా అడుగులు వేసుకుంటూ వెళ్ళి శయ్యమీద కూర్చున్నాడు.

'పాపం నిరాశ కలిగింది కదూ?' అంది పాన్పుమీద నుండి ఆవలవంకకు జారిపోతూ నందిని. అతనికి హఠాత్తుగా జరిగిన ఈ సంఘటనకు ఏమీ తోచింది కాదు. తేరుకోక ముందే-

'నీచుడా! ఛండాలుడా! ఆడదాన్ని, అందులోనూ వెలయాలిని కూలిచ్చి, అనుభవించి, తిరిగి దానిని దొంగతనం చేయ నెంచావా? నీకు సిగ్గులేదూ! నీవు రాచపుట్టువు ఎలా పుట్టావు? బుద్ధభగవాముని కాలంలో ఆయనకు ఆ ఊరు రేదు, నీ వంశంవాడు, ఆ ప్రజలూ ఎంతో దానం చేశారు. కోసల వంశీయులు ఎంతో ఉత్తములు, ఉదారులూ. వారివంశంలో కుక్క గొడుగులా నీ వెలా పుట్టావు? యుద్ధమని తెలియ చేయకుండా జాడలేకుండా జనసత్తాకమీదకు హఠాత్తుగా విరుచుకు పడ్డావు తెరచినింట్లో కుక్క జొరబడిన రీతిలో! నీకు నీతీ జాతీ ఉందా? నీవు రాజువా? అందులో ఏక సత్తాక ప్రభువువా?

'ఏక సత్తాక ఏలిక ఎంత ఉదాహరణంగా, ఎంత నీతిగా ఉండాలి? ఇంత అల్పుడవు- వేశ్యకిచ్చిన దానిని తిరిగి అందుకుందే వాడవు, నీవూ రాజువేనా? వేశ్య కిచ్చిన సొమ్మూ, గోడకు కొట్టిన సున్నం తిరిగి చేతికి రాదని తెలియదా? నీ కుక్క బుద్ధి తెలిసే నేను జాగ్రత్త పడ్డాను. ఛాఛా! నీవు రాజువు అనుకుంటున్న కోసల కెంత చిన్నతనం! నీ లాటివాడు అవంతికి ఏలిక కావడమా? అది నా జన్మలో జరగని పని....' అని ఏదో అనబోయింది. అంతలో గంభీరంగా 'ఆగూ!' అని కేక వేశాడు కోసలాధీశుడు.

'నీ రంకెలకు దడచే వేళ మించి పోయింది. ఇందాక చతురిక పాట విన్నావుగా. ఐపోయింది. నీకింకా ఆయువుంది. తెల్లవారే వరకూ అవంతిలో ఉన్నావా - అవంతి

సభాభవనం మీద నీ తల ఉంటుంది. మర్యాదగా వెళ్ళి పో!' అంది నందిని.

'ఆఁ!' అని చేతులు తట్టాడు. నందిని పక పక నవ్వింది.

'ఓ, కోసల సింహమా! అంతా అయ్యాక చేతులు తడ తావేం? నీవు చేతులు తడితే ఆలించేవారు, పాలించేవారూ లేరు. ఒక్కసారి కలయ తిరిగి చూడు,' అంది

కోసలాధీశుడు అటూ ఇటూ చూచాడు. అంతా కత్తులు, ఈటెలు, ఎక్కు పెట్టిన బాణాలు! తనను తాను నమ్మలేక, కలా! భ్రమా! అని కనులు నులుముకొని చూచాడు. 'ఒక్క దివ్వె చాలదు. వెలిగించండి దివ్వెలు!' అన్నది నందిని. క్షణంలో దివ్వెలన్నీ కాగడాలతో వెలిగించారు. కాగడాలు, దివ్వెలూ చుట్టూ ధనువు పాదగరులతో నిండి పోయింది శయన మందిరం. 'ఏమిటిది? ఏం జరిగింది?' అన్నాడు దిగ్భ్రమతో కోసలేంద్రుడు బిక్కపోయి—

'ఏమీ జరగ లేదు. నీ రెండు వేల బలగం సిప్రాలో ఈదుతూంది. నీ వొక్కడవే మిగిలావు. నీ గుఱ్ఱం ఉంది. అది కాశ్మీరాశ్వంకదూ? వేగంగానే వెళుతుంది. తెల్లవారే లోపల నీవు కోసలకు చేరగలవు. లేదా, రేపు సాయంత్రానికి చేరగలవు. తెల్లవారే సరికి మధుర యేలిక- జయదేవుడు అవంతిని తన మధురలో కలుపు కోవటమో! లేదా అవంతిలో మధురను కలిపి మొత్తం జన సత్తాక కావడమో జరుగుతుంది. చూస్తారేం? తల గొరగండి. సున్నం కాటుక తీయండి. బంధించండి. పో నీచుడా! పో! నీ దిక్కున్న చోటుకు వెళ్ళి చెప్పుకో! ఈసారి అవంతి మీదకు రాగల ధైర్యం ఉంటే పాతిక వేల కాల్బలం ఏనుగులూ, దానికి తగిన బలం తెచ్చుకో. కోసలకే కళంకం నీలాటి వాడు పుట్టడంవల్ల, పో!' అంది నందిని. అతని పెడ

రెక్కలు విరచారు. తల గోరిగి సున్నం కాటుక బొట్లు పెట్టి గుఱ్ఱమ్మీద ఎక్కించి గుర్రాన్ని గదమాయించారు. అది వెళ్ళిపోయింది చీకటిలో ఒక మార్గం పట్టి.

తర్వాత నందిని చుట్టూ ఉన్న వారిని చూచి-

'అందరూ తెగి పోయినట్లేనా?'

'ఆ! అంతా తెగిపోయినట్లే. మిగులూ బాగులూ ఉంటే రేపటికి మాచుకోవచ్చు. అదేమంత ఘనకార్యం కాదు,' అన్నారు

'ఇంక వెళ్ళి విశ్రాంతి తీసుకోండి. వీరమల్లేడీ?'

'కోసలేశుని వెంట కొంత దూరం వెళ్ళి వస్తానని వెళ్ళాడు.'

'అదీ మంచి పనే. అధ్యక్షుని కళేబరాన్ని సభాభవనానికి చేర్చారా?'

'ఆ! చేర్చి అక్కడ కాపు కూడా ఉంచాం.'

'ఇంకా అతనికి కాపుదేనికి? ఊఁ. సరే వెళ్ళిరండి. చతురికా!''

'లేదమ్మా!' అన్నది మధూలిక.

'ఎక్కడకు వెళ్ళింది? రణవర్మ ఎక్కడున్నాడు?'

'రాత్రి వారితో పాటు వచ్చారట!'

'వీరమల్లు వచ్చేదాకా నీవు నిద్రపోవుకదూ?'

మధూలిక మాటాడలేదు.

'ఈ సందడిలో నీ అన్న జయసింహు దేమయ్యాడో చూచాయిగానయినా కనుక్కున్నావా?'

దానికూడా మధూలిక మాటాడలేదు.

'మాటాడవేం మధూ! వీరః  మాత్రం చంపవద్దంటావు-పరాయివారొస్తే పట్టించుకోవు. సరే తెల్లవారనీ!' అని నందిని మందిరోపరితలానికి వెళ్ళింది.

ఆమెకు నిద్ర రావడంలేదు. అటూ యిటూ శయ్యమీద కొంతసేపు దొర్లింది. మందిరమంతా దాదాపు నిద్రలో ఉంది.

ఆమె మామూలుగా రాత్రిళ్ళో ఎక్కడికన్నా వెళ్ళేటప్పుడు ధరించే నీలి దుస్తులు ధరించి బయలుదేరింది. నిద్రపోతున్న వీథులు శవాలనీడ్చి పారవేయగా బాటల్లో నెత్తురు కారి గడ్డకట్టిన జాగాల్లో అడుగు మోపినప్పుడు కాలు జారుతూంది. నేలలో దాదాపు సగంవరకూ జిగురు జిగురుగా ఉంది. దానిమీద అడుగులు మోపుతూ మెల్లగా సభా భవనం ప్రవేశించింది. సభా భవనంలో ఒక గదిలో ఒక కాగడా వెలుగుతూంది. ఆ వెలుగులో అధ్యక్షుని శవం నేల మీద పరచి ఉంది. ద్వారం డాసింది. ద్వారందగ్గర కాపున్న కావలివాడు 'ఎవరూ? మీరా!' అన్నాడు ఆశ్చర్యంగా నందినిని చూస్తూ.

'ఆఁ!' అంది నందిని.

'లోపల చతురికా, రణవర్మలున్నారు,' అన్నాడు.

నందిని సరాసరి లోనికి వెళ్ళింది. రణవర్మ ఒక ప్రక్క నిలచి అధ్యక్షుని పరికిస్తున్నాడు. అతని ప్రక్కనే చతురిక ఉంది. నందిని రావడం చతురిక చూచింది. ఐనా ఏమీ మాటాడలేదు. ఆమె కళ్ళు నీళ్ళతో ఉన్నాయి.

'ఏమే! వస్తూన్నట్టు చెప్పలేదు నాతో?' అంది నందిని.

చతురిక మారాడలేదు.

'మాటాడవేమే చతురికా?' అంది నందిని.

'ఏమ్మాటాడుతుంది, తండ్రి చావు చూస్తూ!' అన్నాడు రణవర్మ.

'చతురికా!' అంది ఆశ్చర్యపోయి నందిని.

'నీకు తెలియదు నందినీదేవీ! చతురిక అధ్యక్షుని కూతురు. జరిగిపోయింది. దానినిగూర్చి ఆలోచించవలసిన అవసరం లేదు. రేపు గౌరవంగా అతన్ని సాగనంపుదాం,' అన్నాడు రణవర్మ.

'ఒక్కనాడైనా చెప్పలేదేమే?' అంది నందిని.

'అదంతా ఒక గాథ నందినీదేవీ! ఇంతకన్నా మరో విధంగా జరిగిఉంటే బావుండేది. అః ఏది ఏమైనా జరిగి పోయిందాన్నిగూర్చి ఆలోచనేమిటి? స్వార్థపరుడు - చచ్చిపోయాడు. కాబట్టి యీనాడేమీ అతన్నిగూర్చి చెడుగా అనుకోకూడదు,' అంది చతురిక.

'నాకిది చాలా చిత్రంగా ఉంది!' అన్నది నందిని. 'మరో చిత్రంకూడా ఉంది. వీరమల్లు అధ్యక్షుని అన్న కొడుకు. వారిద్దరికీ ఆజన్మంనుండీ తగాయిదా ఉంది. వీరమల్లును ఎన్ని సార్లు అవంతిలో దొరికినా అందుకే దేశ బహిష్కారం జరిపాడుగాని, చంపించలేదు!' అన్నాడు రణవర్మ.

'నా తల తిరిగిపోతూంది. చతురికా! మీరంతా ఎందుకు దాచి నన్ను రచ్చకీడ్చారు? ఇంత సన్నిహితం ఉండి, మీరు నాచేత ఈ అపకృతులన్నీ ఎందుకు జరిపించారు?' అంది నందిని.

'ఎవరు చెప్పగలరు? జరిగినవి, జరుగుతున్నవి. నివారించ డానికి మించిపోయాయి,' అంది చతురిక ఏడుస్తూ—

నందిని రణవర్మను పిలిచింది కన్నులతో. చతురిక ఏడుస్తూనే ఉంది తండ్రి శవం వద్ద...

రణవర్మా, నందిని కొంచెం ఇవతలకువచ్చి నిలుచున్నారు. నందిని అడిగింది రణవర్మను. 'చతురికకూ అధ్యక్షునికీ ఎలా సంబంధం?' మని.

'నేను కూడా విన్నదే. మొన్నటి వరకూ చతురికకు తెలియదు. పహార్ గడలోనే చెప్పాను. అధ్యక్షుని క్రింద కార్యదర్శిగా సర్వకార్యాలూ జరుపుతుండేవాడు విష్ణుగుప్తుడు. విష్ణుగుప్తుని కూతురుండేది. పరిస్థితులకు లొంగి విష్ణుగుప్తుడు చూచీ చూడనట్టూరుకున్నాడు ఆనాటి అధ్యక్షుని కార్యాలకు. ఆ తర్వాత కొన్నాళ్ళు గడచింది. అధ్యక్షుడు విష్ణుగుప్తుని బిడ్డను చేయకూడనిదని చేశాడు. ఆమెకు గర్భమైంది. ఆ మెను వదలి అవంతిలో ఉండలేక తన కొడుకును వెంటబెట్టుకొని ఉజ్జయినికి చేరాడు విష్ణుగుప్తుడు. అధ్యక్షుడు మించిపోయినదని తెలిసి, ఆ మెను అవంతిలోనే ఉంచి కాలం వెళ్ళబుచ్చాడు. ఆ మెకు పుట్టింది చతురిక. ఆ తర్వాత చతురిక మూడవయేట తల్లి చచ్చిపోయింది. సరిగ్గా ఆ రోజుల్లోనే విష్ణుగుప్తుడు ఉజ్జయినిలో చచ్చిపోయాడు. చతురిక అవ్వ ఆ కుఱ్ఱాణ్ణి పెంచి పెద్ద చేస్తూంది. చతురికను అధ్యక్షుడు కోసలంలో ఉంచి పెంచాడు. ఆ తర్వాత చతురిక చాలా చోట్లు మారింది. నీవు అవంతికి చేరే నాటికి చతురిక అవంతిలోనే ఉంది. చతురిక అవ్వ తన బిడ్డను తక్షశిలకు పంపి, దేశాలు తిరిగి, మళ్ళీ అవంతికే చేరింది. ఆ రోజుల్లోనే చతురిక శ్యామసుందరునితో కుఱ్ఱతనపు మోజుల్లో తిరుగుతూంది. ఆ దిగులుతోనే అవ్వకూడా చచ్చిపోయింది. ఇదీ చతురిక జీవితం' అన్నాడు రణవర్మ.

'ఇంక చతురికకు ఎవ్వరూ లేరా!' అనడిగింది నందిని.

'ఆ వున్నవన్నీ నే నే! అధ్యక్షుడు పోయాడుకదా?' అన్నాడు రణవర్మ.

'విష్ణుగుప్తుని కొడుకు తక్షశిల చేరాడన్నావు?' అంది నందిని.

'విష్ణుగుప్తుని కొడుకే రణవర్మ. అందుకే శ్యామసుందరుని చంపించాను- చతురిక నా దన్న భ్రమతో. కాని ఆ వాడు నాది కాలేదు. నే నెవరో తెలుసుకోలేదు. తెలియజెప్పే అవకాశం ఈయలేదు. లేకుంటే మామూలు సైనికుడుగా చేరిన నన్ను,అధ్యక్షుడు సర్వసైన్యాధ్యక్షత యిచ్చి యింతవాణ్ణి చేసేవాడు కాదు,' అన్నాడు రణవర్మ తన కథ కూడా చెపుతూ.

'రణవర్మా!' అంది నందిని.

'అవును నందినీదేవీ! అవును. రణవర్మనే! అందుకే అధ్యక్షుడంటే కోపం-చతురికంటే నాకు మోజు. అవన్నీ ఒకనాటికి వెలికిచెప్పి అధ్యక్షుడు క్షమ నర్థిస్తాడనుకున్నాను. ఆ పని చేయకుండానే అతడు దాటిపోయాడు,' అన్నాడు రణవర్మ.

'మరి నిన్ను చంపడానికే ఎందుకు పన్నాగం పన్నాడు?' అంది నందిని.

'అందుకే అధ్యక్షుని స్వార్థపరుడనేది. తనకోసం తన స్వార్థంకోసం ఎంతలేని కార్యాలైనా చేస్తాడు. అతని మనస్సే అటువంటిది. ఇక మనం అతన్నేమీ అనరాదు. వీరమల్లుచేత అతనికి కావలసిన ఏర్పాట్లన్నీ చేయించు నందినీదేవీ!' అన్నాడు రణవర్మ.

'ఇంక నాకేమీ వద్దయ్యా! అన్నీ నీవే చేయించుకో! నీవాళ్ళందరిని నీవు ఎంచుకొని అవంతిని నడుపుకో! నేను జయదేవుని పంచకు చేరతాను.' అంది నందినీదేవి.

తెల్లవారేవరకూ వారు ముగ్గురూ అవంతి అధ్యక్షుని శవం

వద్దనే ఉన్నారు. తెలతెలవారుతుండగా వీరమల్లు, మిగిలిన వారంతా వచ్చారు.

అవంతి తెల్లవారాక చూస్తే నానా భీతావహంగా ఉంది. శవాలను ఎత్తించడం, పూడ్పించడం గలాబాలో, ఏడుపులు పెడబొబ్బల్లో ఉండగా జయదేవుడు నావలమీద తన సైన్యంతో వచ్చాడు. నందిని మందిరం చిన్న బోయి ఉంది. మిగిలిన ప్రజలు, నందినీ అంతాకలసి జయదేవుని సమక్షంలో తలలువంచి నిలచారు.

జయదేవుడు మధుర యేలికగా, అవంతి సర్వ సైన్యాధ్య క్షుడుగా అంతా విచారించి, 'అవంతిని, అవంతిగానే ఉంచు తున్నాను' అన్నాడు.

నందిని 'నా సర్వస్వం అవంతి కిస్తున్నాను. నా ఇంటినీ, నా తోటనూ వీరమల్లుకు ఇస్తున్నాను. నావద్దవున్న రత్నాలు, వజ్రాలహారాలు అవంతి గోపాలదేవునకు ఇస్తున్నాను. నా పొలాలు అవంతిలోని బౌద్ధారామానికి యిస్తున్నాను. రణవర్మకు జరిపిన అన్యాయానికి చతురికను రణవర్మను పెళ్ళి చేసుకోమని, మధూలికను వీరమల్లును చేసుకోమని చెపుతున్నాను. పహార్ గడలోని నా తోట, నా భూములు అక్కడున్న వారికే చెందుతాయి' అన్నది.

అంతకుముందురేయి తిట్టినవారంతా నందినీదేవిని పొగ డారు. అందులోని ఒక గొంతు 'మరి మీ సంగతి?' అంది.

'అది జయదేవులు-మధుర ఏలిక ఇష్టం' అన్నది నందిని.

మధుర ఏలిక ఏమీ మాటాడలేదు.

'వారు నాకే శిక్ష నిచ్చినా నేను శిరసా ధరించి ఉంటాను' అన్నది నందిని.

ప్రజల్లో 'మీరు అవంతిలోనే ఉండిపోవాలి' అన్నారు.

'నేను అవంతిలో ఇక ఉండను. కొన్నాళ్ళు జయదేవుల ఇంట ఉండాలనుకుంటున్నాను వారు నాకేమీ శిక్ష నీయకుంటే. వారు శిక్ష విధిస్తే ఆ శిక్షననుభవిస్తాను' అంది నందిని.

'ఆ శిక్ష ఏమిటో మీరే ఈయండి. ఇది జనసత్తాక' అన్నాడు మధుర ఏలిక—

రణవర్మ లేచి, 'నందినీదేవికి శిక్ష దేనికి? ఆమె తప్పుగా భావిస్తున్నదంతా అవంతి మంచిగానే భావిస్తుంది' అన్నాడు.

మధుర యేలిక 'ఇకనుండి రణవర్మ అవంతి అధ్యక్షుడు. జయసింహ, వీరమల్లులు సర్వసైన్యాన్ని చూచుకుంటారు. మిగిలిన వారిని మీరే నిర్ణయించుకోండి' అన్నాడు.

'నందినీదేవి విషయం!' అన్నారు.

ఆమె నావెంట మధురకు వస్తుంది. తీసుకొని వెళతాను. మధుర ఆమెకు పుట్టినిల్లవుతుంది. అవంతి అత్తగారిల్లవుతుంది' అన్నాడు. సభ ముగిసింది. అంతా చింతలోనే సంతోషాన్నందుకున్నారా సాయంతనం-సందె కాంతుల్లో.

## 16

దాదాపు యాడాది జరిగి పోయింది. హూణుల దండయాత్రలు ఘోరంగా సాగుతున్నాయి. కుతంత్రులు పెచ్చు పెరిగి వారితో చేతులు కలుపుతున్నారు. చిన్న చిన్న రాజ్యాలన్నీ బెదరి పోతున్నాయి. ఏకసత్తాక రాజ్యాల్లో ఎవరికి వారే మహారాజులుగా కావాలన్న తలపు ప్రబలిపోయి, జనసత్తాకలన్నీ ఒకటిగా కలసి ఒక నిర్ణయానికి వచ్చాయి. ఏది ఏమైనా యిక ఎవరి రాజ్యం వారికి దక్కదని అందరికీ భయంగా ఉంది. నాశానికి సరైన ఏలిక లేదు. అరాజకం ప్రబలింది. అదీ దేశ స్థితి.

నందిని మధురలోనే ఉంటూంది. ఆమె కానాడు రాజ్యాలతో, రాజులతో పని లేదు. ఏదో ఆలోచిస్తూ ఏహో

చెయ్యాలన్న తలపు- అది పరుల కపటాగియైనది కాదు, తనకు తాను చేసుకోవాలని నిరంతరం అసంతృప్తితో ఆవే దనతో నిండి పోయింది ఆమె మనస్సు. ఈ మధ్య ఒకసారి ఆమె మాళవంలో ఉంటున్న అంధభిక్షువు వద్దకు వెళ్ళి వచ్చింది. అక్కడా ఆమెకు సంతృప్తి అందినది కాదు. అది కాదని తిరిగి మధురకే వచ్చి మధురలోనే ఉండి పోయింది. దేనిమీదా మనస్సు నిలుపలేక పోతూంది.

ఆ రోజు ఆమె వనంలో అటూ ఇటూ తిరిగి ఒక చోట ఒక తరుచ్ఛాయలో కూర్చుని ఆలోచిస్తూంది. అక్కడకే జయదేవుడు వచ్చాడు. వచ్చి, ఆమెకు కొంత దూరంలో నిలచి 'నీ కోసం అంతఃపురమంతా వెదకి వస్తున్నాను. నీ విక్కడున్నావా?' అన్నాడు.

'ఏం? అంత అవసరంగా వెదకావు. ఏదేనా విశేషమా?' అంది.

'విషయం లేనిదే వెదకడం దేనికి పడుతుంది?' అన్నాడు.

'ఏమిటీ, ఏదేనా రహస్యమా?' అనడిగింది నందిని.

'లేదు. అంత త్వరగా ఎలా చెపుతాను!' అన్నాడు.

'నాకు ముసలితనం, నీకు కుఱ్ఱతనం వస్తుంది జయదేవ్!' అంది నందిని నవ్వుతూ.

'లోనికి వెళదాం పద! చెపుతాను' అన్నాడు జయ దేవుడు. నందిని లేచింది. ఇద్దరూ కలసి లోనికి వెళ్ళారు. లోనికి వెళ్ళాక చెరొక ఆసనమ్మీద కూర్చున్నారు.

'నందినీదేవీ! మన సేనాని విజయుని కూతురు నీకు తెలుసా?' అన్నాడు

'చూచాను. మొన్న ఆలయంలో కనిపించింది. ఏం?' అన్నది.

'ఏం లేదు. ఆమెను మొన్న...అలా కాదులే!' అన్నాడు జయదేవుడు.

'నా దగ్గర దాపరక మేమిటయ్యా! చెప్పక ఏదో తడ బడతావు. ఆమెను పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నావు. అంతేగదా?' అంది నందిని చిరునవ్వుతో.

'ఆఁ! మొన్న మాటల సందర్భంలో అడిగించాను. సరే నన్నాడుట. నీవు వెళ్ళి అతనితో మాటాడి ఒప్పించాలి. సరేనా?' అన్నాడు.

'జయదేవ్! నీ కోసం నేను ఏది చేయను చెప్పు? నిప్పుల్లో దూకమన్నా దూకుతాను. ఇప్పుడే వెళ్ళి అడుగ మంటావా?' అంది.

'ఆఁ! కాదు కాదు. రాత్రికి అడుగుతాను. రేపు ఉదయం నీవు వారింటికి వెళ్ళవలసి ఉంటుంది. అదే నిన్నడిగి చేద్దా మని.' అన్నాడు.

'నన్నడగడ మేమిటి జయా? నీవు చేయమన్నది నే నేది కాదన్నాను?' అంది నందిని.

'అది సరేననుకో! ఆమె బావుంటుందికదూ?' అన్నాడు జయదేవుడు.

'బాగానే ఉంటుంది. సేనాపతి ఒప్పుకున్నాడా?' అనడిగింది నందిని.

'ఆఁ! అందువల్లనే చెపుతున్నాను. లేకుంటే యెందుకు చెపుతాను?' అన్నాడు.

'సరే. రేపు మంత్రిగారిని వెంటబెట్టుకొని వెళతాను,' అన్నది నందిని.

జయదేవుడు 'సరే'నని వెళ్ళిపోయాడు. ఆ రాత్రంతా నందినికి ఏదేదో పిచ్చిగా ఉంది. జయదేవుడు నాకు కావలసిన భర్త. నా బ్రతుకెంత వికృతంగా తయా

రయ్యింది! ఈనాడు నా చేతిమీదుగానే జయదేవునికి మరో పిల్లను నాఅంత నేనుగా యెంచి, పెళ్ళి చేయవలసి వచ్చింది. ఏమిటీ విపరీతం? అంతా ఏదోలా ఉంది. కానీ! జయదేవునితో అదేనా సుఖపడనీ! ప్రపంచంలో అన్నీ తన యిచ్ఛగా నడుపుకోడానికి ఎవరుమాత్రం సమర్థులు! ఎందరికి దొరుకుతుంది - తాము మనసిచ్చినవారితో మనువు నందుకోడం? జయదేవుడైనా సుఖపడినాడు. అదే చాలు. అసలు నా జీవితంలో చెడూ మంచీ ఏది ఎన్నినాళ్ళున్నది? రణవర్మకు చేసిన అన్యాయానికి తగిన శిక్ష- ఆ తర్వాత అతనికి చతురికనిచ్చి అవంతి నప్పగించాను. నమ్మిన వీరమల్లుకు, నమ్మకున్న మఘూలిక నాలిని చేశాను. అవంతి పెద్దలు నాకు చేసినదానికి అందరికీ అన్ని శిక్షలూ పూర్తి చేశాను. నేను చేసినదానికన్నా వారే చేసుకున్నారు. పోతే, ఒక్క జయదేవునిమాత్రం ఏమీ చేయలేదు. అతనికీ మేలు చేస్తే, పరిపూర్ణత సిద్ధిస్తుంది. అవంతి నాకెంత అన్యాయం చేసింది! దానికి తగినట్టు నేనూ చేశాను. అందర్నీ తుడిచిపెట్టి వచ్చాను. కానీ, నాకు ఒరిగినదేమిటి? మిగులూ తగులూలేని వ్యాపారంలా తయారయ్యింది నా బ్రతుకు- అనుకుంటూ ఎప్పటికో నిద్రపోయింది నందిని.

మరునాటి ఉదయం మంత్రిని వెంటబెట్టుకొని, సేనాపతి యింటికి వెళ్ళింది. యేలిక మాటను కాదనగలడా సేనాపతి? సరేనన్నాడు. మంచి ముహూర్తంకొరకు ఒక పక్షం ఆగవలసి వచ్చింది. ఆ పక్షంలో నందినికి చాలా విషయాలు తెలిశాయి.

మంత్రి కుమారుడు శ్రీవత్సుడు, సేనాపతి కూతురును చేసుకోవాలనుకున్నాడు. ఆ యిద్దరిమధ్య ఏవో రాగాలు కొన్ని జరిగాయి. ఆ తరువాత ఏ కారణంవల్లనో వారిద్దరూ

కలుసుకోడం మానారు. శ్రీదత్తుడు సుముఖాన్ని, విముఖాన్నీ చూపలేదు. మధుర మంత్రికిమాత్రం సేనాపతి కూతురు తన కోడలు కావాలన్న ఆశ ఉంది. కానీ, దానికి తన రాజే అడ్డు తగులుతుండడంవల్ల అతడు 'కాదూ-ఔనూ' అనలేకపోయినాడు.

ఈ విషయాలన్నీ తెలిశాక నందిని, తనలో అనుకుంది: నేను వచ్చాక సమస్యలు పుడుతున్నాయా? పుట్టిన సమస్యలు నావల్ల వెలికి వస్తున్నాయా? ఏది ఏమైనా ఈ మధుర రాజకీయాలతో, ప్రజలతో సన్నిహితం మనకనవసరం. నాకు ప్రశాంతం, మనశ్శాంతి కావాలి. దానికి తగిన ఏర్పాట్లు చేసుకోవాలి. ఈ రాజ్యాంగ లంపటంలో నాకు శాంతి లభించదు. ఇక్కడ నిలచి శాంతికోసం తపించడం అనవసరం. నేను తప్పుకోవడం మంచిది. ఇప్పుడు తప్పుకోవడం ఎలా? జయదేవుడు- నేను పెళ్ళి చేసుకోడం నీకు యిష్టంలేక వెళ్ళిపోతున్నావా? అంటాడు కాబోలు. ఎలా యిందులో దిగబడి ఉండడం? నన్ను అడగ్గానే వెళ్ళి మాటాడివచ్చానుగదా? ఇంకా నామీద అనుమానపడతాడా? సరేగానీ! ఏది ఎలా జరిగాలని ఉందో అలా జరిగి పోతుంది. నా ఔన్నత్యం ప్రమేయం ఏమిటి? ఈ విషయాల్లో కళ్ళు మూసుకొని ఉంటాను. తెలిసినా తెలియనట్లు, తెలియని వాటి జోలికి పోకుండా, తెలిసిన వాటిని పట్టించుకోకుండా ఉంటాను.

తగులబడి నాకు ముసలితనం రాదేం? ఆ ముసలితనం వచ్చినా, నాలుగిళ్లు అడుక్కొని హాయిగా బ్రతకవచ్చు ఎవరి అండా లేకుండా. ఈ అందం, ఈ యవ్వనం వల్లనే కదా నాకు-ఎవరిదో ఒకరి అండ కావలసి వస్తుంది. దీనికన్న మరణం చాలా హాయి అయింది. ఎందుకూ ఈ అందం? ధనాన్ని వదల్చుకో గలిగాను. అందాన్ని ఎలా వదల్చు

కోను! ఏదో ఒక వికృత కార్యం చేయవలసి వస్తుంది. చూచి తర్వాత ఆ నిర్ణయానికి వస్తాను. ఏదో ఒకటి చేయాలి. ఇలాగైతే మిగిలిన జీవనాన్ని సౌఖ్యంగా గడపలేను. ఏదో మార్పు రావాలి. రావాలంటే తెచ్చుకోవాలి. ఏకన్నో ఏకాలో మాన్తూ, చూస్తూ ఎలా పోగొట్టుకుందేది?

ఎడతెరిపిలేని ఆలోచనలతో నందిని గడుపుతూంది. రేయింబవళ్ళు ఇదే ఆలోచన. ఆమె అవంతిలో సౌఖ్యంగా, శాంతంగా ఉండలేనని మథురకు చేరింది. అవంతిలో తను గతంలో చేసినవన్నీ ప్రతి జాగాలో తలపులో మెదిలి నిల్వలేననుకుంది. ఇక్కడా అదే జరుగుతూంది! ఏమిటో, ఈ చిత్రం! ఒకోరి జీవితాలు ఎప్పుడూ సమస్యలతో, నిరంతరం పోరాటంతో, ఏదో ఆరాటంలో జరిగిపోవాలనుంటుందేమో!

ఆ రేయి ఆమె తన మందిరంలోని ఒక గదిలో నిద్రపోతూకూడా కల్లోల మనస్సుతో, కలవరంతో, ఏదో కలలతో గడిపింది. సరిగా నిద్రలేదు. ఆ నిద్రలేని కారణంతో ఏ తెల్లవారు జామునో కన్నుకూరి నిద్రకు గురైంది. లోకం వెలుగురేకలు విప్పుకుంది. కారులోకం చీకునుండి తేరుకుంది. నగరులో కల్లోలం బయలు దేరింది.

రాత్రి యెవరో సేనాపతి కూతురును- కాదోయే మథుర పట్టమహిషిని హత్య చేశారు. ఎవరు చేశారు. ఎందుకు చేశారన్నది ఎవరికీ అంతు చిక్కలేదు. నగరంతా కల్లోలమైంది. జయదేవునికూ్కడా ఈ వార్త అందింది. హత్య చేసినవారిని పట్టుకోడానికి ప్రయత్నాలు జరిపారు, తిరిగి రేయి ప్రవేశిస్తూంది. నందిని ఆలోచనల కంతే లేదు. ఎలా పాక్కిందో పాక్కిపోయింది. నందిని మీదకు నెపం వేశారు. దానికి కారణాలు వారనుకుంటున్నవి-

'అంతకుముందు నందిని జయదేవుని వలచి ఉంది. ఈ హత్య చేసే అవసరం ఆమెకు తప్ప మరొకరికి లేదు.'

'ఆమె మధురకు రాణీ కావాలనుకొనే అవంతినుండి వచ్చింది. లేకుంటే అవంతిలోనే ఉండేది. ఈ యాదాది పాటు ఊరుకుని అంతా తెలుసుకుంది. అంతలో జయదేవ ప్రభువు సేనాపతి కుమార్తె వివాహ మాడ నెంచాడు. ఆమె ఈమెకు అడ్డనుకుంది. తొలగించుకుంది.'

'అసలు మధురలో ఇంతవరకూ హత్యలు జరుగలేదు. హత్యల సంగతి మధురకు తెలియదు. ఆమె వచ్చాకనే ఈ హత్య మొదలైంది.'

'ఆమె తప్ప మరొకరీ హత్య చేసివుండరు. ఈ హత్య ఆమెకు తప్ప మరొకరికి లాభం చేకూర్చదు. అందులో ఆమె అవంతిలో చేసినవన్నీ అందరకూ తెలిసినవే. క్రొత్త గాదా మెకు హత్యలు చేయించడం, చేయడం—'

ఇలా కారణాలు సృష్టి జరిగాయి. ఎవరీ కారణాలు సృష్టించారో ఎవరికీ తెలియదు. ఆ నోట ఆ నోటబడి మధుర యేలికకు అందాయి. ఏలిక వెంటనే తనా,మనా అనే భేదం చూపకండా, ఆమెను బంధించాలని కూడా అన్నారు.

బంధించడం కాదు. ఆమె బంధనలో ఉన్నా, హత్యలు జరుగుతాయి- వెంటనే రేపు ఉదయానికి ఆమెను ఉరి వేయాలి. ఆమె శరీరం ఉదయానికంతా ఉరికంబంమీద వ్రేళ్ళాడ వలసిందే-అన్నారు.

ఎవరో నందిని యింటిని శోధించారు. నందిని గదిలో ఒక బాకు నెత్తురంటబడి దొరికిందన్నారు. దానికి సేనాపతి యింట్లోని చీరెముక్క చుట్టబడి ఉందన్నారు. మిగిలిన చీర సేనాపతి యింటనే ఉందన్నారు.

జయదేవుడు ఆలోచించడానికి వీలు చిక్క లేదు. ఒక ప్రక్క మంత్రి, మరొక ప్రక్క సేనాపతి, మరో వంక ఎవరో తెలియని ప్రజలు ఒకే అల్లరి, ఒకే గోల - జయ

దేవుడు పిచ్చెత్తిపోయినాడు. సంధ్యకంతా ప్రాడ్వివాకులను ప్రవేశ పరచాడు. న్యాయ సభను సమావేశపరచాడు. వారేక గ్రీవంగా, నందిని హత్య చేసో చేయించో ఉంటుందని నమ్ముతున్నట్టు నికరంగా తేల్చి వేశారు కుండ బద్దలు కొట్టినట్టు.

జయదేవుడు నందినిని ఉరివేయమని అనుజ్ఞా పత్రమ్మీద ముద్ర వేయడమే తరువాయి. ఆ ముద్ర పడడం,అటు నందినిని ఉరివేయడం జరిగిపోతుంది. జయదేవుడు 'మీ మాటలు నమ్ముతున్నాను. ఆమెను బంధించి కారాగారంలో ఉంచండి. రేపు నేరస్తురాలికి శిక్ష చెప్పడం జరుగుతుంది.' అన్నారు. సభ చాలించారు. దానికి చాలామంది చాలా విధాలుగా అనుకున్నారు. నందిని ఆయన ప్రేయసి అన్నారు.

నందినిని కారాగారంలో బంధించారు. బాగా ప్రొద్దు పోయింది. అంతా చీకటిగా ఉంది. జయదేవుడు కారాగారానికి వెళ్ళి నందినిని కలుసుకున్నాడు.

నందిని-జయదేవుని చూచి, ఏడుస్తుంది. బామాలుతుంది. ఈ హత్య నేను చేయలేదని గోలగోలగా కారాగారమంతా గగ్గోలెత్తిస్తుంది-అనుకున్నాడు. కానీ, నందిని జయదేవుడు రాగానే- 'రా జయా! రా! కూర్చో,' అంది.

జయదేవు డాశ్చర్యపోయాడు-ఆ తొణకని తనానికి.

'నమ్మావుకదా! శిక్ష చెప్పకపోయినావా?' అంది నందిని జయదేవుడు మాటాడకండా ఉండడం గమనించి.

'నా కేమీ తోచడం ము నందా! ఏమిటీ మాయ?' అన్నాడు.

'మాయేమున్నది? నీవు విన్నది నీవు నమ్మడం లేదా?' నడిగింది.

'ఎలా నమ్మను? నమ్మడమెలా? నీవు యిల్లు కదలడం

లేదని నాకు తెలుసుకదా? నీవు నీ యింట ఉండి మధురలో యింత కార్యం చేశావంటే ఎలా నమ్మను? నా కేమీ పాలు పోవడం లేదు! నన్ను ఏం చేయమంటావు?' అన్నాడు.

'జగూ! ఏం చేయమని నేరసురాలిని నన్నడుగుతావేం? అంతా సిద్ధం చేసి నీ ముందుంచిన పత్రాలున్నాయి కదా? ఊరక రాజముద్ర ముద్రించు, చాలు. అంతా అదే చేస్తుంది,' అన్నది నందిని.

'ఇదంతా కుట్ర. ఎవరో కానివారు చేసి నీ మీదకు నెట్టారు. లేకుంటే ఇంత త్వరగా, ప్రొద్దు తిరక్కుండా, ఇంత నేరం, ఇంత విచారణ, ఇంత త్వరితంగా తేలిపోయి నీమీద - నీ వేనని కచ్చితంగా ఋజూ కాదు. దానికేదో కారణ మున్నది. ఇక్కడ కూడా నీకు విరోధులెవరో ఉన్నారు.' అన్నాడు.

'పోనీ అలా అనుకున్నా, వారినైనా తృప్తి పరచు. లోకంలో నాకూ విరోధులున్నందుకు నాకు గర్వంగానూ చింతగానూ ఉంది. ఎందుకంటే లోకంలో అంతా విరోధులైతే హాయిగా బ్రతకవచ్చు. అందరూ నేస్తాలైనా అంతే. కానీ కొందరే ఉండడం వల్ల చిక్కులు వస్తాయి. ఆ కొందరూ తృప్తి పడడానికి ఆ ముద్రను పత్రమ్మీద ముద్దించు!'

'నేను చేతగాని వానిలా ఉండి పోవలసి వస్తూంది.'

'చేతగాని వాడవు రాజ్యపాలన ఏకసత్తాకగా ఎందుకు నెత్తి నేసుకున్నావయ్యా?'

'నందినీ!'

'ఆఁ! రానీ ఆవేశం! చేయవలసింది చేయి. వెళ్ళిపో! నీవూ నీ రాజ్యాంగం-పాము పడగ నీడలో కప్పలా కూర్చుని నా మీద గాండ్రిస్తావేం? నీ తల దన్నిన అవంతి వాసులనే

లెక్క చేయకుండా గడిపాను. నీవు అరిస్తే దడుస్తానన కుంటున్నావు. కోసలేశుడు కోరలు తీసిన పాములా తల కొట్టుకొని పారిపోయాడు. ఆ చర్యలన్నీ నీకు తెలి యవా, జయా? అరుస్తావేం?' అంది.

'ఐతే హత్య చేశానంటావ్?' అన్నాడు.

'ఆ మాట నన్నడుగుతావేం? నీ ప్రాడ్వివాకులు నిర్ణ యించారుగా!'

'అంతేనా?'

'అంతకాక ఇంకేంత?'

'సరే అనుభవించు.' అని వెళ్ళిపోయాడు. అసలే జయ దేవుడు పిచ్చెక్కి వచ్చాడు. నందిని ఇంకా అతన్ని పిచ్చె క్కించి రెచ్చిపోయే మాటలు తూలింది. దానితో అగని కున్న ఆలోచనలన్నీ పటాపంచలయ్యాయి. ఏ ఆలోచనా తోచక ఆవేశంతో వెళ్ళిపోయాడు.

వెళ్ళి పోయాక నందిని విచారించింది. పాపం, జయ దేవుడు చేతగానివాడై పోయాడు. అనవసరంగా అతనికి ఆవేశం కలిగించాను. పోనీ! నిజం కోసం వచ్చాడు. నిజం తెలియ పరచినా నన్ను రక్షించి, అతడు రాజరికంలో అరా జకం రేపుకుంటాడు. నన్నింత కష్టపెట్టకు దించినవారు అతన్ని బ్రతకనిస్తారా? నేను బలైపోతే పోతుంది - అను కున్నది నందిని.

నడిరేయికింకా పొద్దు జాముందన్నది. తనను బంధించిన కారాగారంలో పైభాగాన గాలి, వెలుతురు కోసం ఒక గూడులాటిదుంది. దానికి లోహపు కమ్మీలున్నాయి. నందినికి నిద్ర లేదు. రాత్రి తిన్నె మీద పడుకొని ఆ కిటికీ లాటి గూడు వంకకు చూచింది. ఎందుకో హఠాత్తుగా ఎవ రైనా అందులోనుండి వచ్చి, నన్ను రక్షిస్తే బావుండును అనుకుంది. తిరిగి తన ఆలోచనకు తానే నవ్వుకుంది. ఏమిటీ,

లేదని నాకు తెలుసుకదా? నీవు నీ యింట ఉండి మధురలో యింత కార్యం చేశావంటే ఎలా నమ్మను? నా కేమీ పాలు పోవడం లేదు! నన్ను ఏం చేయమంటావు?' అన్నాడు.

'జగూ! ఏం చేయమని నేరసురాలిని నన్నడుగుతావేం? అంతా సిద్ధంచేసి నీ ముందుంచిన పత్రాలున్నాయి కదా? ఊరక రాజముద్ర ముద్రించు, చాలు. అంతా అదే చేస్తుంది,' అన్నది నందిని.

'ఇదంతా కుట్ర. ఎవరో కానివారు చేసి నీ మీదకు నెట్టారు. లేకుంటే ఇంత త్వరగా, ప్రొద్దు తిరక్కుండా, ఇంత నేరం, ఇంత విచారణ, ఇంత త్వరితంగా తేలిపోయి నీమీద - నీవేనని కచ్చితంగా ఋజూ కాదు. దానికేదో కారణ మున్నది. ఇక్కడ కూడా నీకు విరోధులెవరో ఉన్నారు.' అన్నాడు.

'పోనీ అలా అనుకున్నా, వారినైనా తృప్తి పరచు. లోకంలో నాకూ విరోధులున్నందుకు నాకు గర్వంగానూ చింతగానూ ఉంది. ఎందుకంటే లోకంలో అంతా విరోధులైతే హాయిగా బ్రతకవచ్చు. అందరూ నేస్తాలైనా అంతే. కానీ కొందరే ఉండడం వల్ల చిక్కులు వస్తాయి. ఆ కొందరూ తృప్తి పడడానికి ఆ ముద్రను పత్రమ్మీద ముద్దిపంపు!'

'నేను చేతగాని వానిలా ఉండి పోవలసి వస్తూంది.'

'చేతగాని వాడవు రాజ్యపాలన ఏకసత్తాకగా ఎందుకు నెత్తినేసుకున్నావయ్యా?'

'నందినీ!'

'ఆఁ! రానీ ఆవేశం! చేయవలసింది చేయి. వెళ్ళిపో! నీవూ నీ రాజ్యాంగం-పాము పడగ నీడలో కప్పలా కూర్చుని నా మీద గాండ్రిస్తావేం? నీ తల దన్నిన అవంతి వాసులనే

శిక్ష చేయకుండా గడిపాను. నీవు అరిస్తే దడుస్తాననుకుంటున్నావు. కోసలేశుడు కోరలు తీసిన పాములా తల కొట్టుకొని పారిపోయాడు. ఆ చర్యలన్నీ నీకు తెలియవా, జయా? అరుస్తావేం?' అంది.

'ఐతే హత్య చేశానంటావ్?' అన్నాడు.

'ఆ మాట నన్నడుగుతావేం? నీ ప్రాడ్వివాకులు నిర్ణయించారుగా!'

'అంతేనా?'

'అంతకాక ఇంకెంత?'

'సరే అనుభవించు.' అని వెళ్ళిపోయాడు. అసలే జయదేవుడు పిచ్చెక్కి వచ్చాడు. నందిని ఇంకా అతన్ని పిచ్చెక్కించి రెచ్చిపోయే మాటలు తూలింది. దానితో అతని చిన్న ఆలోచనలన్నీ పటాపంచలయ్యాయి. ఏ ఆలోచనా తోచక ఆవేశంతో వెళ్ళిపోయాడు.

వెళ్ళి పోయాక నందిని విచారించింది. పాపం, జయదేవుడు చేతగానివాడై పోయాడు. అనవసరంగా అతనికి ఆవేశం కలిగించాను. పోనీ! నిజం కోసం వచ్చాడు. నిజం తెలియపరచినా నన్ను రక్షించి, అతడు రాజరికంలో అరాజకం రేపుకుంటాడు. నన్నింత కుట్రకు దించినవారు అతన్ని బ్రతకనిస్తారా? నేను బలైపోతే పోతుంది - అనుకున్నది నందిని.

నడిరేయికింకా పావు జామున్నది. తనను బంధించిన కారాగారంలో పైభాగాన గాలి, వెలుతురు కోసం ఒక గూడులాటిదుంది. దానికి లోహపు కమ్ములున్నాయి. నందినికి నిద్ర లేదు. రాత్రి తిన్నె మీద పడుకొని ఆ కిటికీలాటి గూడు వంకకు చూచింది. ఎందుకో హఠాత్తుగా ఎవరైనా అందులోనుండి వచ్చి, నన్ను రక్షిస్తే బావుండును అనుకుంది. తిరిగి తన ఆలోచనకు తానే నవ్వుకుంది. ఏమిటీ,

నా పిచ్చి? నేను వెలికి వెళ్ళి చేయగలిగిన దేముంది? అలా వెళ్ళాలనుకుంటే, నా ఊహ ప్రకారం కథ నడిపితే, అంతా చిక్కు దా? ఈ హత్య నా మీద నేనుగా వేసుకున్నదే కదా ? ఎందుకు రక్షణను కోరుతున్నాను ? ఇంకా నాలో ఏదో బ్రతకాలని ఆశ ఉంది. పిచ్చి మనస్సు ఎంత కాలం బ్రతికినా ఇంకా బ్రతకాలని, ఎంత అనుభవించినా ఇంకా అనుభవించాలని తృష్ణను సంపుకో లేదు. నా కేమిటి? ఎవరికైనా అంతే నేమో! లేకుంటే బుద్ధ భగవానుడు తృష్ణను గురించి అంతగా పట్టించుకొని, దాన్ని తెంచుకోమని ఆసేతు హిమాచల పర్యంతం ఎందుకు ప్రచారం చేస్తాడు? ఖండాంతర వాసులకు కూడా ఆ జ్ఞానం నూరిపోయడానికి శ్రమణ సంఘాన్ని, బౌద్ధ సంఘాన్ని ఎందుకు దేశ దేశాలకు పంపుతాడు?'

'ఫస్దనం చవలం చిత్తం
దురఖం దున్నివారయం
ఉజాం కరోతి మేధావి
ఉసుకారోవ తేజనం.'-దమ్మపధం చిత్తవగ్గు.

అని యెందుకంటాడు? నిజంగా అందులో ఎంత బాగా చెప్పారు! మనస్సు చంచలమైనది. దానిని నిరోధించడం చాలా కష్టం. ఐనా బుద్ధిమంతులు, తెలివిగలవారూ; మేదరి-వెనుయ బద్దను తన యిష్టం వచ్చిన రీతిగా వంచి, వింటి కనుగుణంగా ఎలా మార్చుకుంటాడో, బుద్ధిమంతుడు ఈ చిత్తాన్ని అలా లొంగకొట్టుకుంటాడు, అని.

ఇంకా నేనంత స్థితికి రాలేదు. కాబట్టే, మార్గం కనిపించగానే పారిపోవాలని ఊహ నాలోనికి వస్తూన్నది. ఎంత చపలను? అనుకుంది.

ఆమె అలాగే ఆ పైనున్న మార్గంవంక చూస్తూంది. అక్కడేం జరుగుతుందో తనకు తెలుస్తూనే ఉంది. తనకు భయం వేయలేదు. తనేం చేయాలన్నది తెలియలేదు. తనకేమీ తోచలేదు. ఏదో జరుగుతున్నది- తను చూస్తూన్నది, అంతే!

ఆ పైనున్న ఆ గూడులోని యినుప వూచలు ఎవరో చేతులతో వంచారు. దానికొక తాడు కట్టారు. సగం తాడు వెలికి ఉంది. సగం తాడు లోనికి వేశారు. తన ఖైదు గదిలో కాగడా వెలుగొడుతూనే ఉంది. ఆ తాడు పట్టుకొని ఏదో ఆకారం లోనికి దిగింది. సరాసరి తన దాపుకు వచ్చింది. ఎవరూ! నందిని ఆశ్చర్యపోయింది. అది కలకాదు గదా? నిజమా? నిజమెలాగవుతుంది-మధుర ఖైదులో తనకు? అనుకుంటూ ఉండగా 'అక్కా!' అన్నాడు వీరమల్లు.

'తమ్ముడూ!' అంది తనకు తెలియకుండా నందిని. వీరమల్లు నోరు మూసి మెల్లగా—

'మాటల కాలస్యం లేదు. లే, తర్వాత చెప్తాను,' అన్నాడు. తనేమీ మాటాడలేకపోయింది. మరో మాట లేకుండా తనను రెండు భుజాలూ పట్టుకొని లేపి తాడు దగ్గరకు తీసుకునిపోయి తాడు నడుముకు చుట్టి 'ఎక్కు' అని సైగ చేశాడు. తనేమీ మాటలాడలేదు. నోట మాట లేకుండా ఊరుకుంది. జర జర తాడు కట్టుకొని తను ప్రాకి, సదుకాకుండా నందినిని లాగాడు. ఆ గూడులోనుండి చేయందుకొని మెల్లగా వెలికి జార్చి, తనూ దిగి, చేయి పట్టుకొని నడిపించాడు. ఏం జరుగుతుందో తనకు తెలియదు! ఊరు దాటాక ఒక చెట్టుక్రింద ఒక గుఱ్ఱం ఉంది. దానిమీద కెక్కించి కూర్చోమని అతడూ ఎక్కాడు. ఇంక ఆ గుఱ్ఱం! ఎంత వేగంగా సాగిందో తనకు తెలియదు.

దాదాపు వీరమల్లుకూ తెలియదు. చెట్లూ పుట్టలూ గుట్టలూ దారీ డొంక అన్నది లేదు. గుఱ్ఱం పరుగు దీస్తూంది. తూరుపు రేఖలు విచ్చుతుండగా, వీరమల్లు అన్నాడు: 'ఇంక భయం లేదు. అసలు జరిగినది నిజం చెప్పక్కా!'

'అదిసరే తమ్ముడూ! చెపుతానుగాని నన్నెక్కడకు తీసుకొని పోతున్నావు? ఏం చేయాలని నీ ఉద్దేశం? అసలు నన్ను బంధించినట్లు నీకెలా తెలిసింది? ఏమిటిదంతా, మాయగా ఉంది చెప్పు' అంది నందిని.

'నిన్న రాత్రి నాకేదో పాడుకల. అదీ నీవు చచ్చి పోయినట్టుగా వచ్చింది. నాకక్కడ ఉండబుద్ధి వేయలేదు. పరాసరి గుఱ్ఱం తీసుకొని నావలో సిప్రాదాటి వచ్చేశాను. మాచావా, మామూలుగా సిప్రాదాటి తర్వాత అశ్వాన్ని తీసుకుంటాం. ఎందుకనో ఈ అశ్వమ్మీదే వెళ్ళాలనిపించి దీన్నికూడా తెచ్చాను. దాదాపు ప్రొద్దు వాలుతుండగా మధుర చేరాను. నా సంగతి నీకు తెలుసుగా! నాకు భయమనేదిలేదు. రాత్రినుండి ఒకటే ఆరాటం. నిల్వలేను, కూర్చోలేను. మధుర చేరాను. ఒకేగోల- అంతా నిన్ను గురించి చెప్పకుంటున్నారు. సేనాపతి కూతురు హత్య చేయబడిందని, దానికీ నీకూ సంబంధం ఉందని. ఇక వెలికి రాకండా అంతా రాబట్టాను సత్రంలో ఉండే. సాయంత్రానిక నిన్ను బంధించారని విన్నాను. ఆ తర్వాత సభలోనూ తతంగం విన్నాను. అంతా పసిగట్టి అన్నీ సిద్ధం చేసుకుని, ఆ తర్వాత నిన్నుంచిన జాగా అంతా వెదకి, దొంగ మార్గం వుండగా మళ్ళీ రాచమార్గాన చంపడం దేనికని, తాడు వేసి ఎక్కాను. ఆ తర్వాతనంతా నీకు తెలిసిందేగా?' అన్నాడు వీరమల్లు.

'ఇప్పుడు నన్నేం చేయాలని?'

'అదేమిటక్కా! అలాగడుగుతావు?' అన్నాడు.

'నిజంగా తమ్ముడూ! నాకు చాలా సంతోషంగా ఉంది ఈనాటికి నీవు ధైర్యంగా నన్ను అక్కా అనడం, నేను వినడం. కానీ! నన్ను బ్రతికించడంవల్ల, తప్పించడంవల్ల చాలా కలతలున్నాయి' అంది నందిని.

'అంత అవసరంవస్తే అవంతిలోని మగ, ఆడ అనే తేడాలేకుండా మధురమీదికి దండు నడుపుతాను. తెలుసా? నీకేం భయం. నాకు వీలుకాకపోతే ఈ ఉదయానికి సగం అవంతి అక్కడుండేది. సగం మధుర నాశనం చేసేవాణ్ణి తెలుసా? అర్థంపర్థంలేని నేరంమోపి నిన్ను ఉరిదీయ చూస్తారా, మధురవాళ్ళు?' అన్నాడు.

ఆశ్చర్యం నడుస్తూనే ఉంది. 'నన్నెక్కడికి చేరుస్తా విప్పుడు?' అంది నందిని.

'ఎక్కడికేమిటి? అవంతికి' అన్నాడు వీరమల్లు.

'వద్దు తమ్ముడూ!' అంది నందిని.

'పోతే నేను చస్తాను. నీవు రాకతప్పదు. నా సంగతి తెలుసుగా! నాకేదితోస్తే అది చేయాలసిందే' అన్నాడు వీరమల్లు పట్టుదలగా.

'నా మాట విను. కారణంలేనిదే నేనే కార్యం చేయనని నీకు తెలుసుగా! తర్వాత నెప్పుడన్నా అవంతికి వస్తాను. ఆశ్చర్యాన్ని మాళవానికి పట్టించు' అంది నందిని.

'ఆఁ! అదన్నావు బావుంది. ఆ గుడ్డి భిక్షువు ఇంటికేగా? పద! పోనీ, అక్కడ తోడుగా ఒకమ్మాయికూడా ఉంది' అన్నాడు వీరమల్లు.

'ఏనెప్పుడు వెళ్ళావు' అనడిగింది.

'ఈ మధ్య నొకసారి నేనూ, చతురికా, మఘా, రణవర్మా,

జయుడూ కలసి వెళ్ళాం! చాలా బావుంటుందా చోటు. సరే పద!' అన్నాడు అశ్వాన్ని మరో త్రోవ పట్టిస్తూ.

'అక్కడ అంధభిక్షువు బావున్నాడా?' అనడిగింది నందిని.

'ఆ! బాగానే ఉన్నాడు. అక్కడే ఉండి పోతావా నీవు?' అనడిగాడు.

'తిరిగి ఒకసారి వస్తాను,' అంది నందిని.

గుఱ్ఱం సాగిపోతూనే ఉంది.

* * *

నాల్గవనాటి ఉదయం రెండు జాముల ప్రొద్దు జరిగాక జయదేవుని పంచకళ్యాణి మాళవంలోని నర్మదానది ఒడ్డునున్న అంధభిక్షువు యింటిముందు ఆగింది. జయదేవుడు ఒడుపుగా అశ్వందిగి, పర్ణశాలలోనికి వెళ్ళాడు. అడుగుల సవ్వడివిని, అంధభిక్షువు 'ఎవరదీ!' అన్నాడు.

'నేను జయదేవుణ్ణి. నందిని యేదీ?' అన్నాడు జయదేవుడు.

'ఎవరూ! మహారేశ్వరులా! రండి బాబూ! రండి కూర్చొండి, అయ్యా! అంధుణ్ణి–నేను తమకు మర్యాదలు చేయలేని గతిలో ఉన్నాను. ఈ చాపమీద కూర్చోండి,' అన్నాడు అంధభిక్షువు చాలా నమ్రతగా.

'అడిగిన దానికి సమాధాన మీయకుండా ఏమిటీ నీ ప్రసంగం మార్పు!' అన్నాడు విసురుగా జయదేవుడు చురచుర లాడుతూ.

'మీ రాజులందర్నూ అంతేనయ్యా! త్వరపడి నిర్ణయించి, త్వరపడి కార్యాన్ని చెరచుకుంటారు. వచ్చావుకదా? కూర్చోరాదా! నందినీ! నందినీ! అంటావు. ఎక్కడికి పోతుంది? వస్తుంది కూర్చో! మీ తొందరవల్ల నిజం నిజంగా గ్రహించలేక పోతున్నారు,' అన్నాడు భిక్షువు చాలా శాంతంగా.

చాలా మర్యాదగాను. మాట నిదానమైనా అందులో భావం చాలా బాధించింది జయదేవుని.

'ఏయ్ గుడ్డీ! ఏమిటి నీ వాగుడు?' అన్నాడు జయదేవుడు కోపంతో.

'నా గుడ్డితనం పుట్టుకతో వచ్చింది. మీకు ఆవేశంతో వస్తుంది. హత్య జరిపినవారిని రాజ్యంలో మంత్రిగా ఉంచి కాపుంచి, అబల-అమాయిక-నమ్మి ఉన్నదాన్ని వెద కట్టంటూ మధురనుండి యిక్కడికి వచ్చావు పాపం! నన్ను గుడ్డన్నందుకు నాకు బాధలేదు,' అన్నాడు భిక్షువు తాపీగానే, బాగా మాటకు మాట తగిలించాలని.

'ఏమిటీ నీ వంటున్నది?'

'నా కంతా తెలుసు నాయనా! నీ వెందుకు వచ్చిందీ, ఏమిచేయ వచ్చిందీను. నందిని వస్తుంది. తీసుకొని వెళ్ళి ఉరి కంబం ఎక్కించు. కానీ, ఆమెను ఉరికంభం ఎక్కించే ముందు ఒకమాట విను. నీవు చేసుకుంటానన్న పిల్లను చూచింది. ఆ పిల్లను అంతకుముందే నీ మంత్రి కుమారుడు వలచి కొన్నాళ్ళు కలాపాలు మొదలుపెట్టి ఊరుకున్నాడు. ఆ తర్వాత నీ వామెను చేసుకోవాలనుకున్నావు. నందినినే పంపి మాటాడించావు. సేనాపతి ఒప్పుకున్నాడు. కానీ, మంత్రికిది కడుపులో ఉంది. ఈనాడైనా వారు పురి కొల్పారని నీవు దూకుడుగా వచ్చావు. నందిని బ్రతికి ఉంటే ఏనాటికైనా వారి బ్రతుకు బయట పడుతుందని వారి భయం. అంతేకాని, నందిని బలై పోతుందనిగాని నిన్ను నాశనం చేసే నీ మంత్రులకు నిన్నప్పగించదని వారికేం తెలుసు?' అన్నాడు.

'ఆనాడే ఎందుకు చెప్పలేదు అక్కడ?' అన్నాడు జయదేవుడు కొంచం శాంతంగా. జరిగినదంతా నందిని యీ ముసలికి చెప్పి ఉంటుందని, కనులు తెరిపిడి పడుతున్నాయి.

'నీవు మధురకు పేరుకు రాజువు. మిగిలిన కార్యాలన్నీ చూసేది మంత్రి. అతడు ఏ క్షణమైనా నిన్ను ఏదేనా చేయగలడు. అందుకని చెప్పలేను. తనే బలై పోవాలనుకుంది కానీ, వీరమల్లు ఆ రేయి ఆమె మాట వినకుండా తప్పించి యిక్కడకు చేర్చాడు. తలచుకుంటే వీరమల్లు చేత అవంతి సర్వసైన్యం తెప్పించి, నీ మంత్రిని, నీ రాజ్యాన్ని సర్వ నాశనం చేసి తప్పించుకుండేది. ఆమె సంగతి నీకు తెలియని దేముంది? అవంతి అధ్యక్షుల సంగతి, అవంతి సంగతీ అంతా నీకు తెలుసుకదా? ఆమె పశ్చాత్తాపంలో దగ్ధమై, ప్రశాంతంగా బ్రతకాలనుకుంటున్న ఆమెమీద నీ కసాయి కత్తులేం పని చేస్తాయి? క్షణం కూర్చో. వస్తుంది. ఉదయ మనగా వెళ్ళింది భిక్షకు. ఈ పాటికి వస్తూంటుంది క్షణాల్లో. ఆగు నాయినా,' అన్నాడు అంధభిక్షువు విచారంతో. అతనికి కళ్ళుంటే జయదేవుని ముఖంలోని మార్పులు తెలిసేవి.

'ఆమె నేరం లేదంటావా?' అన్నాడు జయదేవుడు.

'నేరా నేరాలెందుకయ్యా! ఆమె వస్తుంది. తీసుకొని వెళ్ళి ఆమెకు ముక్తి ప్రసాదించు. మనసారా ప్రేమించింది. హృదయమిచ్చి ఆరాధించింది. దైవమని నమ్మింది. నీమీద ఏమీ వాలకూడదనుకుంది. అలాంటి ఆమెకు కాక నీవు శిక్ష ఎవరికీయగలవ్? తీసుకొని వెళ్లు!' అన్నాడు.

జయదేవునికి దూరాన కాషాయాంబరాలతో, భిక్షా పాత్రతో వస్తూన్న నందినీ, రజనీ ఇద్దరూ కనిపించారు. అతడలాగే మ్రాన్పడిపోయాడు.

నందిని సరాసరి లోనికి వచ్చి భిక్షాపాత్రను అంధభిక్షువు చేతుల్లో బెట్టి—

'సేనా, సిబ్బందీ లేకుండా వచ్చావేం జయా! సంకెళ్ళు

ఉన్నాయా? వెయ్యి. తాడుకట్టి, గుఱ్ఱానిక్కట్టి లాక్కెళ్ళు!' అంది. ఆమెలో భయంగాని మరే యితరమైన హార్వ్యగానీ కనిపించలేదు.

'నందా!' అన్నాడు జయదేవుడు బాధగా, పశ్చాత్తాపంతో.

'రా జయా! వెళదాం! వస్తావని నాకు తెలుసు!' అంది నందిని.

జయదేవుడు పూర్తిగా మారిపోయాడామాటకు. కళ్ళ వెంట నీళ్ళు కారిపోతున్నాయి - 'నీ వెక్కడైనా ప్రశాంతంగా ఉండు. ఈ బిచ్చం దేనికి? నీ కెంత కావాలో అంత అందిస్తాను. బిచ్చమెత్తకు. యాచనతో బ్రతుకుతున్న నిన్ను చూడవలసి వస్తుందనుకోలేదు నందా! నిన్ను బంధించాలని వచ్చాను. నీవు బంధనాలన్నీ తెంచుకున్నావు. వస్తాను నందా! నిజాలు తెలిశాయి. అదే పదివేలు!' అన్నాడు.

'భోజనం వేళకు వచ్చావు, నీ వెందుకేనా రానీ- కానీ, యిది ఆహారం తినే వేళ. నా దగ్గర మంచి ఆహారం లేదు. ఏదో నాకున్నది పెడతాను. తిని వెళ్ళు,' అన్నది నందిని.

'సరేలే!' అన్నాడు జయదేవుడు.

భిక్షువు ముంగున్న పాత్రను ఆతని ముందుకు నెట్టింది.

'ఇదా!' అన్నాడు ఆశ్చర్యంగా జయదేవుడు భిక్షా పాత్రను చూస్తూ.

'శాశ్వతమైంది, నిర్మలమైనది, అందరకూ దొరకనిది.' నందిని అంటూండగా ఆతడు అశ్వాన్నధిరోహించాడు కళ్ళనీళ్ళు కారుస్తూ.



'నీకన్నా గొప్పవారు దేర్పరచినది-కపిలగోనిది- అశోకుడు, బింబిసారుడూ ఎందరో తిన్నారు,' అంది గుఱ్ఱం కదులుతుండగా నందిని. ఆమెపేరు ఈ నందిని.

ఓం

